సరస్వతీ గ్రంథమండలి :

# ఆంధ్ర వచన రచనా పరిణామము

తెలుగు భాషాసమితివారి బహుమతిపొందిన గ్రంథము

శ్రీ గొబ్బూరి వేంకటానంద రాఘవరావు

పబ్లిషర్సు : అడ్డేపల్లి అండ్ కో

సరస్వతీ పవర్ ప్రెస్

రాజమహేంద్రవరము

# ANDHRA VACHANA RACHANA PARINAMAM

(Evolution of TELUGU PROSE)

By

GOBBURI VENKATANANDA RAGHAVA RAO

First Edition - October 1961 - Price Rs. 5-00



Publishers: ADDEPALLY & CO.

SARASWATHI POWER PRESS

RAJAHMUNDRY (A. P.)

శ్రీ గొబ్బూరి వేంకటానందరాఘవరావుగారు బహుశ్రుతులు. ఖగోళశాస్త్రపరిశోధన వ్యాసరచయితగా వారికి మిక్కిలి ప్రఖ్యాతి కలదు. భారతీయమైన సంప్రదాయముపై వారికిఁ గలయభినివేశము చాల గొప్పది. ఖగోళవిషయమే కాక యాంధ్రవాఙ్మయముకూడ రాఘవ రావుగారిపరిశీలనమునకు రంగస్థలమైనది.

"నన్నయభట్టువిజ్ఞాననిరతి" అనుగ్రంథము శ్రీరావుగారిది సరస్వతీగ్రంథమండలి ప్రచురించినది. ఇప్పుడు ప్రచురించిన యీ రెండవ గ్రంథము "ఆంధ్రవచనరచనాపరిణామము."

నన్నయభట్టారకులు మొదలుగా నేఁటివఱకు వచనరచన యెట్టి పరిణామముగాంచి వచ్చుచున్నదో యీగ్రంథము చక్కఁగా వివరించుచున్నది. విశేష మేమనఁగా వచనరచననుగూర్చి చెప్పఁదగినది చెప్పుచు ననేకనూత్నవిషయము లిందుఁ బ్రసక్తములైనవి. దానితో గ్రంథము పెరిగినది. ఎంత పెంపుగా వ్రాసినను గొంతతరువాయి యుండె ననుట యేతాదృశ సమీక్షా గ్రంథముల యెడాటమునఁ దప్పనిది.

కవిత్రయ భారతములోని వచనమునుగూర్చి, విశేషించి నన్నయ భట్టారకుల వచనరచనావిధానమునుగూర్చి రాఘవరావుగారు సోదాహరణముగాఁ బ్రదర్శించినపట్టులు శ్లాఘనీయములు. ఆంధ్రభారతము లోని వచనోపక్రమమునుగుఱించి నాతలంపు పత్రికాముఖమున వెల్లడించినదే యయ్యును, ఈవంకఁ బెట్టుకొని మరల నీసందర్భమున నావిష్కరించుట సముచితము కాకపోదు.

ఆంధ్రమహాభారతము " అని సకలభువనరక్షణ ప్రభువులై యాద్యులైన హరిహరహిరణ్యగర్భపద్మోమావాణీపతుల స్తుతియించి తత్ప్రసాదసమాసాదిత నిత్యప్రవర్ధమాన మహామహీరాజ్యవి[illegible] నిజ భుజవిక్రమవిజితారాతిరాజనివహుండును నిఖిలజగ[illegible]యమా[illegible]నానా గుణరత్నరత్నాకరుండు నై పరగుచున్న రాజరాజ[illegible]రేంద్రుడు ..."

అనునట్టి వచనముతో నుపక్రమింపఁబడిన దనుట యిక్కడఁ జెప్పుకొని హర్షింపఁదగినవిషయము. ఈముఖ్యాంశమున కుపష్టంభకముగాఁ గొన్ని మాటలు :

నన్నయభట్టారకుఁడు శాస్త్రవేత్తయగుమహాకవి. ఆయన భారతావతారికలో రాజరాజుకొలువు నభివర్ణించుచు వ్రాయఁబడిన యొకవచనమున్నది. ఆకొలువునఁ గూర్చుండిన విద్వజ్జనులు అయిదుశ్రేణులుగా నున్నారు. ప్రథమశ్రేణి వైయాకరణులది. రెండవది భారతరామాయణాద్యనేక పురాణప్రవీణులైనపౌరాణికులశ్రేణి. మూఁడవ శ్రేణిలోఁ దీర్చియున్నవారు మహాకవులు. నాల్గవ యైదవ శ్రేణులకుఁ దార్కిక వైణిక గాయకాదులు వచ్చిరి. ఇది నన్నయభట్టారకులు ప్రత్యక్షముగాఁ జూచి వర్ణించిన రాజరాజనరేంద్రునిసభాభవనప్రాంగణములోని ఆసనశ్రేణీపరిష్కరణము. లోకజ్ఞుఁడు సద్వినుతావదాతచరిత్రుఁడు నగు నన్నయభట్టారకుఁడు రాజరాజుకొలువులో నేశ్రేణికిఁ జెందినపీఠమున నాసీనుఁ డయ్యె నని మనకు జిజ్ఞాస! ఆరాజరాజానురక్తుఁ డెక్కడఁగూర్చుండెఁ గాక? పురస్కారమున కేమికొదవ? ఇంతకును భట్టారకపీఠము అభివర్ణితశ్రేణులకు భిన్నమైనప్రత్యేకస్థానమున నుండవలయును.

ఈశ్రేణీకల్పనవిశేషమువలన మనముగుఱుతింపవలసినది నన్నయభట్టారకులహృదయము. ఆయనకుఁ బ్రథమాభిమానశాస్త్రము శాబ్దము. తరువాతఁ బురాణములు. తరువాతఁ గవిత్వము. తరువాతఁ దక్కినవి. ఈక్రమములోఁ బూర్వపూర్వ మాయనకు గాఢాభిమాన విషయములు. తాను విపుల శబ్దశాసనుఁడు. "ప్రథమే హి విద్వాంసో వైయాకరణాః" కనుక సభలో వైయాకరణశ్రేణి ముందుంచుటకుఁ దగినట్టిది. నన్నయ తాను బ్రహ్మాండాది నానా పురాణవిజ్ఞాననిరతుఁడు. రెండవశ్రేణిలోఁ బౌరాణికులను గూర్చుండఁబెట్టినది యావిజ్ఞాననిరతి. కాఁగా, భట్టారకుఁడు తాను మహాకవియగునుకదా! మహాకవిత్వమునకు మూఁడవస్థానము నేల యిచ్చుకొనెను?

"ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రం బని యధ్యాత్మవిదులు వేదాంత

మనియు నీతివిచక్షణుల్ నీతిశాస్త్రంబని కవివృషభులు మహాకావ్య మనియు" నిత్యాదిగా నున్న పద్యములో నొకానొక క్రమమును భట్టారకుఁడు మఱియు స్పష్టపఱిచి చెప్పియుండెను. ఇంతకంటె గొప్పగా "తనకులబ్రాహ్మణు ననురక్తు నవికళజపహోమతత్పరు .... "మున్నగు సీసములో నీక్రమమే సువ్యక్తమగుచున్నది. విపులశబ్దశాసనుఁడన్నది యిందలి ముందరివిశేషణము. తరువాతిది పురాణ విజ్ఞానమునుగుఱించి. తరువాతిది ఉభయభాషాకావ్యరచనమును గుఱించినది. ముమ్మాఱు బహుజాగరూకతతో శాస్త్ర-పురాణ-కవిత్వ కళలయొక్క క్రమత-పూర్వాపూర్వవిషయములపైఁ దనకుఁగల పరమతత్పరత—భట్టారకు లుద్ఘాటించిరి.

మనప్రాచీనశాస్త్రము లెటు లుపక్రమింపఁబడినవో గమనించుచున్నాము. మంగళార్థకమైన "అథ"అను నవ్యయముతో నారంభింపఁబడినవి. "అథాతో ధర్మజిజ్ఞాసా" "అథాతో బ్రహ్మజిజ్ఞాసా"—ఇట్లు పూర్వోత్తరమీమాంసారంభసూత్రములు ప్రవర్తిల్లినవి. "అథ శబ్దానుశాసనమ్. కేషాం శబ్దానామ్" ఇట్లు పాతంజలమహాభాష్యము. ఓంకారము—అథ శబ్దము ఈరెండును మంగళార్థకము లెట్లాయెనో యీశ్లోకము చెప్పినది.

> "ఓంకార శ్చాథశబ్దశ్చ ద్వావేతౌ బ్రహ్మణః పురా
> కంఠం భిత్త్వా వినిర్యాతౌ తస్మాన్మాంగళికా వుభౌ॥

తత్తచ్ఛాస్త్రాదిప్రయుక్తమైన యీ అథశబ్దము మంగళార్థకమే కాక యధికారద్యోతకముకూడ నగుచున్నది.

ఆంధ్రమహాభారతావతారికోపక్రమమునకు "అథ" శబ్దార్థవిచారమునకు నేమి సంబంధమందురు! అథశబ్దమునకు సరియైన తెనుఁగు "అని" యన్నది. దాని కిదే సరిపడిన తెనుఁగుఅవ్యయమనుట కెక్కువవివరణ మక్కఱలేదు. 'అథ' వర్ణద్వయాత్మకమైనది. "అని" యునట్టిదే. అందును నిందును అకారమే ముందున్నది. అథలోని రెండవవర్ణమైన 'థ' కారము తెనుఁగులో 'ని' వర్ణముగా దిగినది. ఇది తద్భవ మని

చెప్పనుగాని యీరెండుసంస్కృతాంధ్రావ్ఙ్మయములకు దైవికముగా నెంతోబలిష్ఠమైన బాంధవ మేర్పడినది.

నన్నయభట్టారకుల దేశభాషాకృతిరచనము దేవభాషాశాస్త్ర సంప్రదాయనిష్ఠమైనది. ఆంధ్రమహాభారతము "అని సకలభువనరక్షణ ప్రభువులై ........." ఇత్యాదవచనముతో నుపక్రమింపఁబడుట చూడఁగా నన్నయభట్టారకుఁడు దీనిని శాస్త్రమువలె భావించి అధశబ్ద సహోదరమైన "అని" శబ్దము మున్మొదటఁ బ్రయోగించె నని విజ్ఞులు తెలిసికొందురు.

ఆంధ్రమహాభారత మిటులు భట్టారకుల యుపక్రమముతో శాస్త్రమై తరువాతఁ గవివృషభులకు మహాకావ్య మైనది. మహాకావ్య మైనపుడు కావ్యప్రయోజనము సూచింపఁ బడవలయును. ఆశీర్నమస్క్రియా వస్తు నిర్దేశములలో నేయొకటియైన నుండవలయును. ఒకటి కాదు — ఈమూఁడింటికిని కూడలియగు గద్యము ఆద్యప్రయుక్త మైన దన్నచో నన్నయభట్టారకుల హృదయము నారాధించుట యగును. ఆరంభ గతమైన "అని సకలభువన రక్షణప్రభువులై యామ్యులైన......" ఇత్యాదిగద్యమును జూడుఁడు. ఈవచనమున హరి హర హిరణ్య గర్భులకు నమస్కారము చేయఁబడుట— "తత్ప్రసాద సమాసాదిత" యనుటవలన రాజనరేంద్రున కాశీఃప్రదానమును గోచర మగుచున్నవి. మఱి వస్తునిర్దేశము! అది యెక్కడనోకాక ఆదితఃప్రయుక్తమైన శబ్దములోనే — అవ్యయములోనే యున్న దని నామనవి. నన్నయ భట్టారకుఁడు తాను పాకశాసని. భారతఘోర రణమున నుద్యతుఁడై దుష్టశిక్షణ సాధులోక రక్షణములు జరుపవలసినవాఁడు. నారాయణ సహాయుఁ డైన నరునితో ధర్మము మహాభారతమునఁ బ్రతిష్ఠితమైనది. ధర్మస్థాపనమునకు, దుష్టనిగ్రహమునకు సంగ్రామము కావలసియున్నది. భారత సంగరము జరిగినచోటు కురుక్షేత్రము. నన్నయభట్టారకులు సంగ్రామార్థక మైన "అని" శబ్దము నాదిలో బ్రయోగించి వస్తు నిర్దేశము నెంత గుప్తముగా, సుందరముగాఁ గావించినారో యిప్పుడు స్పష్టపడుచున్నది. మంగళార్థకమైన "అధ" శబ్దము వంటిదేయగు

“ అని ” తో భారతారంభ మగుట — అదికాక, వస్తునిర్దేశ కరణోద్దేశమున ఆయోధనార్థకము నగు “ అని ” తో సమారంభ మగుట — చూడఁగా మహాభారతమును దెనుఁగువారికి శాస్త్రముగా మహాకావ్యముగా నందిచ్చుతలంపు నన్నయమహర్షి కుండె నని వేఱుగా జెప్ప నక్కఱలేదు.

ఇంతకును, ఆంధ్రమహాభారతమువంటి మహాగ్రంథము ఛందః పూతముగాని “ అని సకలభువన రక్ష ” ణేత్యాది వచనముతోనే యారంభింపఁబడెనా ? మఱి —

“ శ్రీవాణీ గిరిజాశ్చిరాయ దధతో వక్షోముఖాంగేషు యే.... ” మున్నగు మూర్తిత్రయ స్తుత్యాత్మకమగు సీశ్లోక మేమైనది ! యను ప్రశ్న రావచ్చును. ఇది ఆంధ్రపద్యము కాలేదు. ఆంధ్రమహాభారత మచ్చముగా నెచ్చటినుండి యుపక్రాంతమైన దనఁగా నాయొద్దనుండియే యని కొట్టవచ్చినట్లు గ్రంథారంభ సర్వసముదాచార గుంఫితమైన యీ తొలివచనమే చెప్పుచున్నది.

పంచమవేదము నాంధ్రీకరించునపుడు ఛందఃపురస్కారము విధిగా జరుగవలసియుండగా గద్యారంభము నన్నయభట్టారకుల శాస్త్రసంప్రదాయపక్వమైన మహాకావ్యహృదయమునకు కర్పూరనీరాజన మిచ్చుచున్నది. ఆయన గద్య పద్యములకు సమానప్రతిపత్తియిచ్చిన మహాకవి. అయత్న చ్ఛందస్సుందరమైన గద్యబంధమునకు నన్నయగారిది ఆద్య స్థానము. ఆయన గద్యములో అపూర్వమైనగణకల్పనము — యతి ప్రసాదికము పెక్కుచోట్ల నచింతితముగా సంతరింపఁబడి యుండును. అందుకే, ఆయన “ మృదుమధుర రసభావభాసుర నవార్థ వచనరచనా విశారదుఁడైనమహాకవి”. ఇక్కడి యీసమాసమును రెండువిధములుగా విఱిచి యర్థము చెప్పుకోవచ్చును. మృదుమధురము, రసభావభాసురము, నవార్థము నగువచనరచనయందు — అనఁగా గద్య రచనయందు విశారదుఁ డన్నది ప్రకృతోపయోగియగు నర్థము.

నన్నయగారి గద్యములోని ఛందోవైచిత్రి గమనింపుఁడు.

"నీవు బ్రాహ్మణుఁడవు నీవెద్దిసేసిన నీకచను
లోకహితుఁడ నయిననాకు శాపంబిచ్చి
లోకంబుల కెల్లఁ జెట్టసేసితి వదెట్లనిన..."

అనువచన మున్నది. దీనిలోని పూర్ణబిందువు లర్ధానుస్వారముగా మార్చి, మూఁడవ పాదములో యతి భంగమున కోర్చి, రెండవ చరణములో సూర్యగణ మొకటిచేర్చి నాల్గవపాదములో రెండక్షరములు తొలఁగించి చూచినచో అబ్బురముగా "ఆటవెలఁది" యై యందగించుచున్నది.

"నీవు బ్రాహ్మణుఁడవు నీవెద్దిచేసిన
నీక చనును (గాక !) లోకహితుఁడ
నయిన నాకు శాప మిచ్చి లోకంబుల
కెల్లఁ జెట్టచేసి తెట్టు లనిన"

ఇదియెందులకు జూపించితి ననఁగా, నియతికృత నియమరహితము హ్లాదైకమయమునగు గద్యనిర్మాణము భట్టారకుల సొమ్మనుటకు.

ఈవిధముగా నన్నయగారితో రసోజ్జ్వలారంభమైన ఆంధ్రవచన పరిణామమునుగూర్చి యీగ్రంథము సంతరింపఁబడినది. శ్రీరావుగారీ గ్రంథమున వ్రాసిన కొన్ని వాక్యము లుద్ధరించి జూపుచున్నాను:

"పెద్దనాదికవులు ప్రబంధాటవులలో అక్షరవేట తీవ్రముగా కొనసాగింపదొడగిరి. పర్యవసానము కావ్యములలోఁ బరిమళము బోఁద్రోలి గహనమైనశైలి ప్రవేశించినది. వాఙ్మయమునకుఁ జాల అపకారము సంభవించినది." (77 పుట)

"చెఱకు తినిననోటికి బెండన్నట్లు సోమనాథుని కావ్యము నెదుట శంభుదాసుని హరివంశము చప్పగాఁ దోఁచుట సహజము" (67 పుట)

"ఈ విషయమున మహాకవి కాళిదాసును ప్రబంధకవులును కూడ నింద్యులే. జగతః పితరౌ వందే పార్వతీపరమేశ్వరౌ" — విశ్వమునకు జననీజనకులగు పార్వతీపరమేశ్వరుల దాంపత్యమర్మములను లజ్జవిడచి

వర్ణించినకవిని గర్హించకతప్పదు. మన ప్రబంధ కవులు రతివర్ణన మనుపేర నసభ్యవ్రాతల వ్రాసిరి.” (37 పుట)

“క్షేమేంద్రుడను కాశ్మీరకవి ఈబృహత్కథను పైశాచీభాషనుండి సంస్కృతములోనికి పరివర్తనచేసి కథా సరిత్సాగర మని పేరిడెను.”
(135 పుట)

“సంస్కృతములో ‘నవలా’ శబ్ద మున్నది.” (190 పుట)

ఆయీవాక్యములు శ్రీరాఘవరావుగారు వ్రాసిరి. పెద్దనాదికవుల కావ్యములలోని వచనమువలన వాఙ్మయమునకుఁ జాల నపకారము సంభవించిన దనుట మంచిదికాదు. ప్రబంధములలోని గద్యమును పద్యమునువలెనే ప్రౌఢముగా వారు నడపించిరి. భారతకవుల వచనరీతి వేఱు. అది పురాణఫక్కి. ఇది ప్రబంధఫక్కి. ఇది యప కారకమనఁ గాదు. మనము వచనరీతులను జెప్పవలసిన వారమేగాని యంతకు మించి చెప్పఁ జూచుట తగవుకాదు.

సోమనాథుని యుత్తరహరివంశముముందు శంభుదాసుని హరి వంశము చెఱకుతినిననోటికి బెండువంటిదని వ్రాయఁబడినది. చాలఁ దేలికగా నిట్టియభిప్రాయ మిచ్చుట లెస్సకాదు. పోనీ, సోమనాథుని యాధిక్యమును బ్రకటించుటకు వీరిచ్చిన యుదాహరణములు కూడ బలిష్ఠములుకావు. వచనరచన ప్రసంగమునకు సంబంధపడని యీమాట వ్రాసియుండక పోవలసినది.

దాంపత్యమర్మములను లజ్జవిడిచి వర్ణించిన కాళిదాసు, ప్రబంధ కవులు నింద్యు లని వ్రాయఁబడినది. కాళిదాసు ప్రసిద్ధ ప్రబంధ కవులు అసభ్యశృంగారవర్ణనము చేసిరని వట్టిమాటలతో ననివైచుట దుర్బలచిత్తులను తప్పుదారిఁ బట్టించుట. ఈనడుమఁ బవిత్రమైన శృంగారశబ్దమును తప్పుగానర్థముచేసికొనుట జరుగుచున్నది. ప్రాక్తన మహాకవుల శృంగార వర్ణనము నర్థము చేసికొనుటకుఁ దగిన యుదాత్తనాగరకత విమర్శక చిత్తవీథులకు రావలయునని చెప్పుట

కంటె నిప్పుడేమియు వ్రాయఁదలంపలేదు. "శృంగారీ చేత్కవిః కావ్యే సర్వం రసమయం జగత్ "—

కథా సరిత్సాగరము సంస్కృతమున రచించినకవి సోమదేవభట్టారకుఁడు. క్షేమేంద్రుఁడు "బృహత్కథామంజరి" వ్రాసెను. క్షేమేంద్రుడు కథా సరిత్సాగరము వ్రాసె నని యీ గ్రంథమున వ్రాయఁ బడినది ప్రమాదాపతితము.

'నవలా' శబ్దము సంస్కృతములో నున్నదన్నది పొరపాటు. ఇది దేశ్యపదముకాని సంస్కృతము కాదు.

ఇది యిట్లుండె: శ్రీ రాఘవరావుగారు గొప్ప కృషిచేసి యీ గ్రంథము వ్రాసి తెలుఁగువారి కృతజ్ఞతకుఁ బాత్రులగుటయే కాక, తెలుగుభాషాసమితివారి బహుమానమును గూడఁ బడసినవారైరి.

రాజమండ్రి
25-9-61

మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి

# విషయసూచిక

# ఆంధ్ర వచన రచనా పరిణామము

## The Evolution of Telugu Prose

రసవంతములు, రమణీయార్థ ప్రతిపాదకములు, ప్రజారంజకములు నైన కావ్యములు, గణ, యతి, ప్రాసాది నియమముల పాటించుచు, ఛందోబద్ధమై పద్యరూపమున నుండవచ్చును; లేదా అట్లు నియమ బద్ధము కాక స్వేచ్ఛగా సాగు వచనరూపముననైన నుండవచ్చును. వచన రచనకు గద్యమనికూడ పేరుగలదు.

ప్రపంచ సారస్వతములో ముందు పద్యకావ్యములును పిమ్మట గద్యకావ్యములును వెలసినవి. దాంపత్య ధర్మమున క్రీడించుచున్న క్రౌంచ మిథునమును పొంచి చూచిన నిషాదుడొకడు వాడి బాణము నేసి నిర్దయుడై మగపక్షిని నేలగూల్చెను. ప్రియుని మరణమునకు - పెంటి - బహుదీనముగా వాపోవుచుండెను. బోయవాని దారుణ చర్య కతిక్రుద్ధుడైన వాల్మీకి నోటినుండి అప్రయత్నముగా వెడలిన శాపా క్షరములు - ఛందోబద్ధములై మితసమవర్ణ చతుష్పాద శ్లోకమైనది. ఆదికావ్య మనబఱగిన రామాయణ మహాకావ్యమునకు ఆశ్లోకమే మకుటమైనది. పాశ్చాత్య వాఙ్మయములలో నతిప్రాచీనమైన గ్రీకు వాఙ్మయమున వెలసిన తొలికావ్యము 'ఇలియడ్' - మన రామాయణ మును బోలిన పద్యకావ్యము. ప్రాచీన రోమక వాఙ్మయమున వెలసిన తొలికావ్యము కూడ పద్యకావ్యమే. బాబా ఆదాము అనునాతడు తన ప్రియపుత్రుడగు 'హాబీలు' చనిపోయినపుడు దుఃఖావేశమున పలికిన పలుకులు అప్రయత్నముగా ఛందోబద్ధములైన పద్యరూప మున వెడలి ఆరబిక్ వాఙ్మయమున కారంభములయ్యెను.

ఛందోబద్ధమైన పద్యకావ్యరచనలు - ప్రపంచకమున కవుల సమా జముల సభ్యులు, సాంప్రదాయముగా ధరించు వస్త్రభూషణాది బాహ్యాడంబర చిహ్నములు; గౌరవార్థము ధరించు నుడుపులు. అంతే! అంతమాత్రమే. పరిషత్ నిర్ణయించిన గౌను తొడగక పోయినంత మాత్రముచేత పట్టభద్రుల విద్యాసౌరభములకు భంగమురాదు.

పద్య వేషము ధరింపకపోయినను - రసవత్తర వాక్యరచన - కావ్యము కాకపోదు. ద్రాక్షపండ్లు హేమపాత్రమున నున్నను, రజితపాత్రలో పెట్టినను, ఆకులో పెట్టుకొని తినినను, వానిమాధుర్యమునకు లోపము రాదు. ఎందులో నుంచినను ఆపండ్లతీపి ఒక్క తీరుననే ఉండును; కాని మారదు; తగ్గదు. భోజనపాత్రయొక్క బాహ్యావైఖరికిని- అందుంచిన ఫలభక్ష్యాదుల రుచికిని సంబంధములేదు. వాని రూపు, రేఖలపై వీని రుచి రసములు ఆధారపడి యుండవు. సర్ ఫిలిప్ సిడ్నీ (Sir Philip Sydney) అను విమర్శకుడు ఈయర్థమును ఈక్రింది వాక్యములలో చక్కగా ఉపన్యసించినాడు :

Apologie for Poetry-Page 12 :- 'For indeed the greatest part of poets have *apparalled* their poetical inventions in that numbrous kind of writing which is called verse; indeed but *apparalled*, verse being but an ornament and no cause to Poetry, since there have been many most excellent poets that never versified and now swarm many versifiers that need not answer to the name of Poets ... It is not riming and versing that makes a Poet – no more than a long gown makes an advocate ... *Delightful teaching* must be the right describing note to know a Poet by. Although indeed the Senate of Poets have chosen verse as their raiment - meaning as in matter they passed all in all, so in manner to go beyond them – not speaking (table talk fashion or like men in a dream) words as they chanceably fall from mouth, but *paying attention to every syllable of each word by just proportion according to the dignity of the subject.*"

విశేషించి, వచనరచన, కవియొక్క ప్రతిభకు గీటురాయివంటిది. అందునెగ్గిన నిపుణులే ఉత్తమకవు లగుదురు. "గద్యం కవీనాం కషం వదంతి." కావ్యములు కొన్ని - ఋగ్వేదము, రామాయణము - వలె కేవల పద్యరూపమున నుండవచ్చును; లేదా- కాదంబరి, దశకుమార చరిత్రల వలె - సంపూర్ణముగా వచన రూపమున నుండవచ్చును. ఈ రెండువిధములనుగాక—భోజచంపువువలె – గద్యపద్యముల కలగలుపైన కావచ్చును.

ఆంధ్ర వాఙ్మయము — నన్నయభట్టారకుడు రచించిన మహాభారతము మొదలుకొని, 'పాకమునబడిన చేమకూర' అని ప్రశం

సింపబడిన విజయవిలాస కావ్యరచన పర్యంతము - ఆఱేడు శతాబ్దముల కాలము చంపూకావ్య మయమనియే చెప్పనగును. చిన్ననాడు తిక్కన రచించిన నిర్వచనోత్తర రామాయణ మొక్కటి మినహా యించిన పక్షమున ఆ తెనుగు సారస్వతములో కేవల పద్యకావ్య ములు కాని కేవల గద్యకావ్యములుగాని కానరావు. పిమ్మట నాయక భూపతుల ఆశ్రయము బడసి ఆంధ్రగద్య వాఙ్మయము, అఖండ వైభవముతో నతిశయింప సాగెను. కళువె వీరరాజకవి రచించిన ఆంధ్రవచన భారతరచనతో నీబంగారు వచనయుగము ఆరంభమయ్యెను.

## పద్యరచనకు క్షమాపణ

కవులలో చాలామంది తమ కావ్యములను గణప్రాసాదిఛందోలక్షణ బద్ధమైన పద్యరూపముననే వెలయించిరి. పద్యవైఖరి కేవల బాహ్యా చిహ్నము. చిత్రవస్తు ధారణమువంటిది - వట్టిబాహ్యావేషమే కావ్య మునకు పద్యరూపము భూషణమాత్రము; అలంకారప్రాయము. అంతే గాని కావ్యావతరణమునకు అయ్యది కారణముకాదు. పద్యరూప మొసగక చక్కని వచనరూపమున దివ్యకావ్యముల రచించిన మహాకవు లెందఱోకలరు. ఇక పద్యరూపమిచ్చి తట్టలుబుట్టలునల్లు మేదరులు కవినామముతో కావ్యములను పేరుతో కొన్నిపద్దెముల నల్లి తాటకబూటకములు చేయుచున్నారు. పాదములు - పద్దెములు- అంత్యప్రాస నియమములు లోనగు వేషములువేసి పద్దెములనల్లిన ప్రతివాడు కవి కాజాలడు; పొడుగుపాటి నల్లకోటుతొడిగి అజాగళస్తన ములవంటి తెల్లపట్టీలు మెడకుకట్టుకొన్న ప్రతివాడును ఏడ్వకేట్ కాజాలడు. మధురమై, రసవంతమై, సద్విషయముల బోధించి రంజింప జేయగల కవితమాత్రమే కావ్యమనదగును. అట్టికావ్యము రచింపగల వాడేకవి. రసవంతమైన చెఱుకుగడను చెఱుకన తగియుండును కాని వంట చెఱుకునుకూడ చెఱుకేయనజెల్లునా? ఛందోబద్ధమైన పద్యరూపమే కవులలాంఛనమని శిష్టసభలో కవివరుల నిర్ణయము. వారుధరించు వస్త్రములు పద్యరూపమున నుండవలెను. కవితాభావనలో వస్తు

విషయ వివరణాదులలో వారు అగ్రస్థానమలంకరించి సామాన్యుల నధఃకరించినట్లే, రచనావిధానములోగూడ-స్వప్నములోవలె, నోటికి వచ్చినట్లెల్ల ప్రలాపించు సామాన్య మానవులవలెగాక-ప్రతిమాటలో, మాత్రలో స్వల్పాక్షర సముదాయ విషయములలోగూడ శ్రద్ధతో పరికించి, ఒక్కొక్క అంశమునకు తగిన గౌరవమరియాదలను, పరస్పర సంబంధ సౌష్టవములను పాటించుచు, ప్రతివిషయమును తులం దూచి నట్లు పరిశీలించివ్రాసి కవులు పూజార్హులగుదురు.

నన్నయమొదలు చేమకూర వేంకటకవి వరకు కేవల పద్య గ్రంథములుకాని - కేవల గద్యప్రబంధములుకాని రచింపబడలేదు. తిక్కన మాత్రము నిర్వచన గ్రంథరచనకు పూనుకొనుటకు కారణము- అందుగల ఈక్రిందిపద్యము తెలుపుచున్నది :—

కం॥ "వచనములేకయె వర్ణన
రచియింపగ గొంతవచ్చు ప్రౌఢులకు, గథా
ప్రచయము పద్యములన పొం
దుచితంబుగ జెప్పుటార్యులొప్పిదమనరే॥"

కేవల పద్యకావ్యరచన కష్టమైనదనియు, అందుచేతనే అది అధిక గౌరవహేతువనియు, చిన్ననాడు తిక్కనభావించి నిర్వచనోత్తరరామా యణము రచించెను. కాని, పెద్దవాడై, సోమయాజియై, విశేషాను భవము గడించి, హరిహరనాథ ప్రేరితుడై -"ఆంధ్రావలి మోదముం బొరయున్నట్లు" భారత పంచమవేదమును తెనిగింప దీక్షబూని నపుడు "పద్యముల-గద్యములన్-రచియించెదన్ కృతుల్" అని ప్రవచించి, విరాటపర్వము మొదలు- స్వర్గారోహణ పర్వము తుదకు పదునైదు పర్వములు - తెనిగించెను. అందు మూడింట రెండుపాళ్ళు పద్యములు-మూడవపాలు వచనరచన - ఇట్లు ఆంధ్రమహాభారతమును తిక్కన చంపువుగానే రచించెను. భోజ చంపువును, వేంకటాధ్వరి విశ్వ గుణాదర్శమును, ఇట్టి చంపువులనే ఆమోదించు చున్నవి.

చూ॥ "గద్యానుబంధ పదమిశ్రిత పద్యసూక్తి

హృద్యాహి వాద్యకలయా కవితేవగీతిః
తస్మాదధాతు కవిమార్గజుషాంసుఖాయ
చంపూప్రబంధ రచనాం రసనామదీయా ”

విశ్వగుణాదర్శమున వేంకటాధ్వరియు :

శ్లో. అథ త్త్రేహితయోః ప్రయోగఉభయోరామోద భూమోదయం
సంగః కస్యహిన స్వదేతిమనసే మాధ్వీక మృద్వీకయోః ॥

అని-చంపూకావ్యమే పాఠకులకు ఎక్కువ హృదయంగమ మని విశదము చేసిరి. ఆంధ్రపాఠకులకు చంపువులే బాగుగా రుచించునను భావము తోనే-ఆంధ్రకవులు ఇంచుమించుగా ఏడుశతాబ్దముల వఱకు-చంపూ కావ్యములకే ప్రధాన్యతనిచ్చి - చంపువులనే రచించుచు వచ్చిరి; కాని అందలి వచనరచనా పరిమాణము మాత్రము - మొత్తము మీద - క్రమముగా క్షీణించుచు వచ్చినది. ఈదిగువ వ్రాయబడిన Graph - పటము పరిశీలించితిమేని - నన్నయభట్టారకుని భారత రచనలో - ఇంచుమించుగా సగబాలాక్రమించిన వచనరచన - “నానా టికి తీసికట్టు నాగం భట్టూ ” అను లోకోక్తి తెలుపునట్టు — క్రమ ముగా క్షీణించుచు వచ్చి — విజయవిలాస కావ్యమునాటికి - నూటికి నాలుగు పంక్తులు మాత్రము ప్రబంధములో వచనరచన సాగినది.

కృష్ణపక్షానంతరముగాని శుక్లపక్షము ప్రారంభము కాకుండుట ప్రకృతిసిద్ధము. తెనుగు కావ్యములలో వచన రచనలు - అంతరించి పేరులేకుండ పోవునేమో- అనునంతటి దురవస్థ ప్రాప్తించిన పిమ్మట గాని - తెనుగున - వచన రచనయొక్క దౌర్భాగ్యస్థితి మారిపోయి- సుదినములు ప్రాప్తించలేదు. పిమ్మట తెనుగు వచన రచనకు బంగారు యుగము అరంభమైనది.

ఆంధ్రభాషలో పద్యకవితకును, గద్యకవితకునుకూడ మార్గదర్శకమై సత్ సాంప్రదాయముల నేర్పరచి, ఆంధ్రసారస్వత ముఖద్వారమున— దివ్యజ్యోతియైనిల్చి, ఆవాఙ్మయ వికాసమునకు హేతువై, దాని పెక్కువిధముల పెంపొందించినది- ఆంధ్రమహాభారత కావ్యరత్నము.

అందు ఆదిపర్వము మొదలుకొని అరణ్యపర్వ మధ్యమువఱకు తెనిగించిన సిద్ధహస్తుడు - మహర్షి - నన్నయభట్టారకుడు. కవిబ్రహ్మతిక్కన, నన్నపార్యుని ఇట్లు ప్రశంసించి జోహారులర్పించినాడు: "అందాది దొడంగి మూడుకృతు లాంధ్రకవిత్వ విశారదుండు, విద్యోదయియుతుండొనర్చె మహితాత్ముడు నన్నయభట్టుదక్షతన్" అతనికి మన ప్రాజ్ఞకోటి యొసగిన "వాగనుశాసనుడ"ను బిరుదు, ఆమహనీయుని పట్ల సమస్తవిధముల చేతను సార్థకమైనది.

రాజరాజు సభలో- వేద, వేదాంగ, షట్‌దర్శనాదులలో నఖండ ప్రతిభగడించిన - శేముషీధురంధరులు - అష్టభాషాసుకవి రాజశేఖరు లనేకులుండిరి - పద్యకవులేగాక —"మృదు మధుర రసభావ, భాసుర నవార్థ వచనరచనా విశారదులు" గద్యకవులు ననేకులుండిరి. అందనేకులు - ఉభయభాషా కావ్యరచనాభిశోభితులు.

## భారతము ఆంధ్రీకరింపవలసిన ఆవశ్యకత

వేదములను, వేదధర్మములను, నిరాకరించిన - జైన - బౌద్ధాది మతముల ప్రాబల్యము అధికమై - వేదమతము క్షీణింపజొచ్చినది. చాళుక్యులు - వేదమార్గానుసారులు. అట్లని ఇతరమతములకు హాని చేయలేదు. అయినను, వేదధర్మములను, పునఃప్రతిష్ఠించుటయందు రాజరాజనరేంద్రునికి శ్రద్ధ అధికమయ్యెను.

రాజరాజు - శాలివాహనశకపు పదియవ శతాబ్దమధ్యమున - రాజమహేంద్రవరము రాజధానిగా వేంగిదేశమునేలిన చాళుక్య చక్రవర్తి. అతడు చంద్రవంశజుడని ఐతిహ్యము. అతని కాలములోనే భారతమును తెనిగించుటకు తొలిప్రయత్నము జరిగెను. అందుకు కారణము లనేకము కలవు. (1) మాననీయమగు వంశాభిమానము: రాజరాజు, చంద్రవంశ్యు డగుటచేత - చంద్రుడు, పూరుడు, భరతుడు, కురుప్రభుడు, పాండురాజు, మొదలగు మహామహులు వంశకర్తలని ప్రసిద్ధినొందిన వంశమున జనించి, కీర్తిఘనులైన పాండవోత్తముల చరిత్ర వినుటయందు రాజనరేంద్రునికి ప్రీతి అత్యధికము. (2) అదియును

గాక పంచమవేదమని జగత్ప్రసిద్ధి బడసిన భారతసంహిత వినుట యందు అతనికి ఆసక్తిమెండు. (3) భారతశ్రవణము అతిపుణ్యా కార్యమని రాజరాజు విశ్వాసము. ఎందరివలన ఎన్నిభాషలలో, ఎన్ని సార్లు భారతము వినిన, అంతపుణ్యము లభించగలదు. శాస్త్రోక్తముగా ఎన్నో యజ్ఞములు చేసినంతపుణ్యము భారతశ్రవణము మాత్రముచేత లభ్యము కాగలదు. (4) భారతార్థము సరిగా తెలిసికోలేక గాసట బీసటగాథలు త్రవ్వుకొనుచు, అజ్ఞానమున నల్లాడు తెనుగుప్రజకు, వ్యాసముని ప్రణీత పరమార్థము, తేటతెల్లము చేయుటకు వెంటనే ప్రయత్నము చేయకతప్పదు. అట్లుచేసినగాని ఆంధ్రప్రజకు వేద ధర్మము సరిగా అవగతము కానేరదు. ఉత్తమబ్రాహ్మణులకు ఉత్తమ గోదానఫలమును భారతశ్రవణమున పొందవచ్చును. అయితే - ఈ పంచమవేదము - ఈభారత సంహితను - సరిగా తెనిగించగల ప్రాజ్ఞు లెవరు ?

ఉన్నాడు కదా ? రాజరాజునాస్థానమున-విద్వత్సభకు మకుటాయ మానుడు - నన్నయభట్టు ! అతడేమి సామాన్యుడా ?

రాజరాజనరేంద్రుని కులబ్రాహ్మణుడు; తేనియందు మిక్కిలిఅనుర క్తుడు; సంహితాభ్యాసుడు; అవిరళ జప, హోమతత్పరుడు; ఆపస్తంబ సూత్రుడు; ఆమహర్షి వలెనే పవిత్రుడు, సత్ప్రతిభాభియోగ్యుడు; లోక జ్ఞుడు; బ్రహ్మాండాది నానాపురాణాది విజ్ఞాననిరతుడు; సత్యశీలుడు; బుద్ధి వికాసమున బృహస్పతి తుల్యుడు; ఉభయభాషా కావ్యరచనాభి శోభి తుడు. అన్ని విధములచేతను పంచమవేదమును తెనిగించుటకు అవసర మైనయోగ్యత, సామర్థ్యముగల మహనీయుడు - నన్నయభట్టారకుడే. తెనుగుజాతియొక్క సంస్కృతి వికసింపజేయగల విజ్ఞానాభివృద్ధి గావిం చుచు, వారియభిరుచుల లెస్సగాగ్రహించి, అన్నివిధముల తెనుగు ప్రజకు ఇంపగురీతిని, భారతము నాంధ్రీకరింపగల దక్షుడు - నన్నయ్య యొక్కడే. ఇంతదూరదృష్టి, విశాలహృదయము కలిగినవాడై, రాజ నరేంద్రుడు - ఒకశుభముహూర్తమున నన్నపార్యుజూచి ఇట్లుసెల విచ్చెను :

"జననుత ! కృష్ణద్వైపా
యన ముని వృషభాభిహితమహాభారత బ
ద్ధ నిరూపితార్థ మేర్పడ
తెనుగున రచియింపు మధిక ధీయుక్తి మెయిన్"

ఈసందర్భమున మనము చక్కగా గ్రహించి మనస్సున గట్టిగా నాటించుకోవలసిన విశేషమేమనగా: రాజరాజు అభిలషించినది - సంస్కృత భారతమునకు బానిస భాషాంతరీకరణ రూపమైన తెనుగు సేత - కాదు; భారతముయొక్క అర్థతాత్పర్యములు - ప్రాభవ సౌరభములు చెడకుండ, పోషించి పెంపుచేసి, తెనుగుపాఠకుల కింపు గూర్చుచు, వారిమనస్సుల స్థిరముగా నాటుకొనునట్లు తెనిగింపుమని రాజరాజునాజ్ఞ. ప్రభునభీష్టము నెరవేర్చుట అసాధ్యము. అయినను, ఓపినంతకష్టపడి అతనియభీష్టము నెరవేర్చుటకు యత్నింతునని మాట యిచ్చి, నన్నయ భారతాంధ్రీకరణ మహాకార్యమునకు గడంగెను.

నన్నపార్యుడు తెనుగుప్రజల మనస్తత్వమును, అభిరుచులను 'వాడి, వడబోసి' లెస్సగానెరిగినప్రోడ. నూటనాట - నొకరిద్దరు మాత్రము చుఱుకు - పట్టుదల - ఓపిక - శాంతముకలవారున్నను - తెనుగుప్రజకు సహజముగా ఓపిక, నిదానము, శాంతము చాలతక్కువ. పట్టిన పనియొక్కలోతు తెలిసికొని - దానినెట్లయిన సాధించి తీరవలెనను పట్టుదల - చాణక్యుని దృఢమనస్సంకల్పము - సాధారణముగా తక్కువ అని నిజము నక్కాణింతును. నూటికి 99 మంది ఉపరిభాగ ద్రష్టలై తృప్తిపడుదురు గాని - లోతుకనిపెట్టుటకు ప్రయాసపడ నొల్లరు. విశేషించి కష్టపడు తలంపుగాని, శాంత, నిధానములతో పనిచేయు నలవాట్లుగాని, సామాన్యముగా నాంధ్రులలో తక్కువ. ఆంధ్రులదైన — ఈలక్షణము బాగుగా కనిపెట్టి తెలిసికొనిన- నన్నపార్యుడు- వారికి ఇష్టమై - ఇంపుగూర్చుపద్ధతినే అవలంభించి - భారతము తెనిగించినాడు. సంస్కృత భారతపఠనము - పోతులబండి నెక్కి తీర్థయాత్రల సేవించుటవంటిది; పాఠకులకు మిక్కిలి విసుగు పుట్టించు వర్ణనలు, కథలు, కథానికలు వీటితో కూడుకొని - ఇసుకపాతర

లట్లు తరగక - ఓపిక లేనివారి కెంతేని చీకాకుకలిగించును. నన్నయ రచించిన తెనుగు భారతమన్ననో - నేటి "మెయిలు, ఎక్స్ప్రెస్" బండ్లమీద ప్రయాణమువలె సంగ్రహశీలమై, మిక్కిలి వడిగలిగి - జవగాంభీర్య విశిష్టమై సాగిపోవును. వావిళ్ళవారు - Great Primer సైపు తెనుగు అక్షరములతో - రాయల్ - సైజున ముద్రించిన సంస్కృత భారతములో నన్నయ తెనిగించిన భాగము - సుమారు వేయి పుటలకు వచ్చినది. అదేవిధముగా ముద్రితమైన ఆంధ్రభారతము - గద్యపద్యాత్మకముగా నన్నయ రచించిన ఆది సభాపర్వములు అరణ్యపర్వములో శరత్కాలవర్ణనమువఱకు - పూర్ణపంక్తులలో లెక్కించి చూడగా - నాలుగువందల పుటలకంటె ఎక్కువ రాదు. అనగా - నన్నయ సంస్కృత రచనలో - ఐదింట మూడు పాళ్ళు తగ్గించి - రెండుపాళ్ళ గ్రంథముమాత్రమే నిలిపి, రచించినాడు. ఇందుకు నన్నపార్యునికి మనమెంతో కృతజ్ఞులముగా నుండవలెను. అయినను, మనలో చాలమందికి అది చదువుటకూడ చీకాకు కలిగించుచున్నది - గ్రంథ బాహుళ్యము గల పొత్తమును "చేటభారతము" అని నిరసించుట, తెనుగునాట లోకోక్తియైనది - ఆంధ్రబద్ధకులకు ఆంధ్రమహాభారతము "చేటభారత" మైనా - దాని ప్రాశస్త్యమెఱిగిన పాఠకులకుమాత్రము - అది కావ్యామృతము అగుచున్నదనుటకు సందేహములేదు.

రెండవది - తెనుగు ప్రజకు శబ్దాలంకారభూషితములైన రచనలందు - ప్రీతి అత్యధికము. అట్టి యలంకారములుగల పద్యగద్యములే వారి నలరింపగలవు. తెనుగు దేశపు గాలిలో - నీటిలో నీశబ్దాలంకారప్రియత్వము సహజముగా కలదేమో! కాకున్న - ఐదారు ఏండ్లప్రాయముగల బాలురు ఆడుకొనుచుండగా - వారిమధ్యకు పురుడు పట్టిన బాలకుడొకడు వచ్చెను - వానిం జూచినంతనే తోడిబాలురు "పురిటిబుఱ్ఱ అరిటికాయ అమావాస్యనాడు అదే కూర" అని కేకలువేసి, చప్పట్లుగొట్టిరి. పద్యపాదములలో - శబ్దసామ్యము - యతిలేని రచనలు తెనుగులో లేనేలేవు. ఆంధ్ర వచన రచనలుగూడ

సాధారణముగా శబ్దాలంకారభూషితములు; శబ్దసామ్యము లేని రచనలు తెనుగులో అరుదు. ఇంగ్లీషు ప్రజ ఇష్టముగా చదువు Gray's Elegy అను కావ్యములో "The plughman homeward plods his weary way" అను పద్యపాదములో క్రింద గీతలు గీసిన రెండుమాటల మొదట 'p' అను అక్షరము వచ్చినందు కును, పిమ్మట మరిరెండు మాటలముందు అక్షరములు 'w' వచ్చి నందులకును, "Alliteration" అను శ్రుతి సామ్యశబ్దా లంకారము వచ్చినదని - ముదితులై చెప్పుకొందురు. నన్నయ రచించిన ప్రతిపద్యములో ప్రతిపాదములో యతిస్థానముకడ శబ్దసామ్యము కానవగును. నన్నయ వచన రచనలుకూడ - స్వల్ప మార్పులతో పద్యములుగా మార్చదగియున్న వే - భారత కావ్యారంభమున నన్నయ చేసికొన్న ప్రతిజ్ఞ ఈక్రింద చదువుదము.

"ఉ॥ సారమతిన్ కవీంద్రులు ప్రసన్నకథాకలితార్థయుక్తిలో
నారసి మేలునా - ఇతరు లక్షరరమ్యత నాదరింప - నా
నారుచిరార్థసూక్తినిధి - నన్నయభట్టు తెనుంగు నన్మహా
భారత సంహితారచన బంధురుడయ్యె జగద్ధితంబుగన్"

ఆది 1 - 25 నన్నయ రచనలందు కవీంద్రులు అనురక్తులై, అందు పరిస్ఫుటమగు "ప్రసన్న కథాకలితార్థయుక్తికిమెచ్చి శ్లాఘింపవలెను. ఇతరులు అందుగల అక్షరరమ్యతగ్రహించి ఆదరించి-సంతసింపవలెను. ఈపద్యములో 'అక్షరరమ్యత' అనుపదము బహుచమత్కారముగా ప్రయోగింప బడినది. అందు రెండర్థములుగలవు. (1) క్షరమనగా నశించునది; అక్షరమనగా నాశనములేనిది; తరుగనిది. ఎంతకాలము గడిచినను, భారతసౌరభమాధుర్యములు తరుగవు; క్షీణింపవు. ఎప్పటి కప్పుడే తాజా- (ever fresh) నిత్యము క్రొత్తవై ఆకర్షించుకొనును. (2) అక్షరమనగా- నిర్ణితశబ్దోచ్చారణకు సాధనమైన సంజ్ఞ అక్షర రమ్యత - అనగా - రమణీయమైన శబ్దలంకార విశిష్టత. నన్నయ్య ఎంతశబ్దాలంకార ప్రియుడో, తనశబ్దాలంకార దక్షతచే నాంధ్రులెంత

అలరించినాడో, సుప్రసిద్ధులైన తెనుగుకవులెందఱు నన్నయ మార్గ దర్శకుడై పెట్టిన - ఒరవడులనే అనుసరించి, దిద్ది, తమకావ్యములలో చేర్చుకొని, తెనుగుపాఠకులకు సంతోష మొడగూర్చిరో - ఈదిగువ చూడగలము. నన్నయ భారతము నాంధ్రీకరించుటలో - పద్యమున కెంత ప్రాధాన్యమునిచ్చెనో గద్యమునకును అదే ప్రాముఖ్యమిచ్చెను. చంపూ కావ్యరచనలలో - తులలో తూచినట్లు - గద్యపద్యభాగముల నింత సరిసమానముగా, నింత నేర్పుతో కూర్చిన తెనుగుకవి మరొకడు లేడు. నన్నయ రచనలో నూటికి - ఇంచుమించు నలుబదియారుపాళ్ళు - సగటుసుమారున కొంచెము తక్కువగా - సగము వచనరచనచేసి మెప్పుగనినాడు. కొంతకృషిచేసినచో ఈవచన భాగములను సులభముగా పద్యములక్రింద మార్చవచ్చును. గణములు - ప్రాస - యతి - మొదలైన ఛందోనియమములు బాహ్యాడంబర మాత్రములే - యదార్థకవితకు ఈవైఖరులతో నిమిత్తములేదని - తన రచనలవలన నన్నపార్యుడు సంస్థాపించినాడు.

నన్నయతరువాతి ఆంధ్రకవుల రచనలలో - గద్యము - ఊగులాడుచు మొత్తముమీద ఎట్లు క్షీణించుచు వచ్చెనో - ఇక్కడి (Graph) గ్రాఫ్‌పటము స్పష్టముగా - ప్రత్యక్షముగా చూపకలదు. శాలివాహనశకము - దశమశతాబ్దమధ్యమున రాజనరేంద్రుడు రాజ్యమునకువచ్చి నన్నయను భారతరచనకు పురికొల్పెను. నన్నయ భారతములో నూటికి 46 పంక్తులు వచనరచనలే. అతని యనంతరము - ఇంచుమించుగా అదేశతాబ్దములో కుమార సంభవము తెనుగున రచించిన - ఉంకణాదిత్యుడు - నన్నెచోడకవి రాజశిఖామణి - ఐదింటనొకపాలు - సుమారు - 22% వచనరచన కావించెను. శా. శ. పదునొకండవ శతాబ్దిలో - తిక్కనసోమయాజి పితామహుడు - మంత్రి భాస్కర రచితమైన రామాయణములో - అరణ్యకాండము మాత్రము లభ్యమైనది. అందు 21% మాత్రము వచన రచనకలదు.

నన్నయభట్టు కాలమునుండి ఆంధ్ర చంపూ ప్రబంధములలో వచన రచన మొత్తముమీద క్రమముగా ఎట్లు క్షీణించినదో ప్రత్యక్షముగా చూపగల పటము

తరువాత శాలివాహన - ద్వాదశశతాబ్ది చివరభాగములో - కవిబ్రహ్మ తిక్కనసోమయాజి - విరాటమొదలు స్వర్గారోహణాంతమువఱకు పదునైదుపర్వములు అద్భుతముగా ఆంధ్రీకరించెను. వచన రచనాబహిష్కారము తెనుగుకావ్యముల శోభ హెచ్చించి కవికెక్కువ గౌరవము చేకూర్చునని భ్రమపడి - చిన్ననాడు - నిర్వచనోత్తర రామాయణము రచించినను - పెద్దవాడు, లోకజ్ఞుడు, సోమయాజియై - భారతము నాంధ్రీకరింపపూనినపుడు - దాని చంపువుగానే - రచింప సంకల్పించి - మూడింట నొకపాలు వచనముగా రచించి కృతార్థుడయ్యెను. మరొకశతాబమునాటికి ఎఱ్ఱాప్రెగ్గడ - నన్నపార్యుడు విడిచిన అరణ్యపర్వశేషమును పూర్తిగా తెనిగించెను. అందు నూటికి నలభయిపాళ్లు వచనము రచింపబడ్డది.

సంస్కృతములో భారతమునకు హరివంశము అనుబంధమువంటిది. అరణ్యపర్వశేషము తెనిగించి - భారతము పూర్తిచేయగానే ఎఱ్ఱాప్రెగ్గడ హరివంశము తెనిగించెను. కాని ఆకావ్యమును అంతగా మెచ్చుకోక - సర్వజ్ఞుడు - నాచనసోమనాథుడు - ఉత్తరహరివంశము రచించెను. అందు నాల్గింట నొకపాలుకు తక్కువగా - నూటికి - 23 శాతములో వచనరచనను సాగించెను.

పిమ్మటికవులలో శ్రీనాథకవిసార్వభౌముడు - నిండుజవ్వనమున - శృంగారనైషధము రచించెను. అందు వచన రచన నాల్గింటికొకపాలునకు రవంత అధికముగా - 26 - శాతముగల వచనగ్రంథము రచించెను. శ్రీరామచంద్రుని ఆస్థానకవీశ్వరుడు - బమ్మెరపోతరాజు - ఆంధ్రభాగవతమును - తిక్కనకంటె ఎక్కువగా - నూటికి ముప్పదైదు వచనపంక్తులతో తెనింగించినాడు. ఆతరువాత - శ్రీకృష్ణదేవరాయలు - ఆముక్తమాల్యదలో - నన్నెచోడ - మంత్రిభాస్కరులవలె - ఐదింటనొకపాలు - సుమారు - నూటికి 22 పంక్తులు వచనమున రచించెను. పెద్దన్న అంతకుతక్కువగానే - నూటికి పదునెనిమిదిపాళ్లు మాత్రమే - మనుచరిత్రమున వచనరచన సాగించెను. అనంతరము కళాపూర్ణోదయకర్త - పింగళిసూరన్న - నన్నెచోడ - మంత్రిభాస్క

రుల ఫక్కీని - ఐదింటనొకపాలుకు సుమారు - నూటికి ఇరువదొక పంక్తులు వచనరచన కావించెను.

అటుపిమ్మట - వసుచరిత్రమునందు - రామరాజభూషణుడు - పదింటనొకపాలైన లేకుండ - నూటికి తొమ్మిదిపంక్తులమాత్రమే వచనము కూర్చెను - తుదకు విజయవిలాసమున - చేమకూర వేంకట కవి - నూటికి నాలుగుపంక్తులమాత్రముతో ప్రబంధరచన ముగించెను.

నన్నెచోడుడు మొదలుకొని - పింగళిసూరన్న వరకు - ఇంచుమించు - ఐదింటనొకపాలుమాత్రమే వచనముకూర్చినవారిని ప్రత్యేకముగా చూపుటకు - అసలు గ్రాఫ్‌గీతకు దిగువ - దానికి సుమారు సమాంతరముగా - నీలపురంగుగల అలుగుమొనలతో మరొక రేఖకూడ - వ్రాసిచూపితిని. ఈవిధముగా - నన్నయనాడు సగబాలురచనమాక్రమించిన వచనరచన ఆరుశతాబ్దములనాటికి - క్షీణించి - క్షీణించి - తుదకు అదృశ్యము కావలసిన "కర్మగతికి" లోనైనది.

నన్నయ నాటి వచనరచన కేవలము శాతపరిమాణములలోనే గాక - అన్వయప్రాతికూల్యవిషయమునందును అసహ్యాపరిస్థితికి దిగజారజొచ్చినది. తెనుగుప్రజ పంచమవేదమగు భారతమును - తెనుగులో చదువుకొని సంతోషించి ఆదరించవలెనను సద్భావముతో నన్నయ భట్టారకుడును, కవిబ్రహ్మ తిక్కనసోమయాజియు తీరుతీయములుగల తేలిక తెనుగులో - "తేనెసోక నోరుతియ్యన యగురీతి" - నని - మొల్లచక్కగా చెప్పినట్లు - మృదుమధురమగు ద్రాక్షాపాకమున నాంధ్రభారతము రచించి, కృతకృత్యులై, ఆంధ్రుల ధన్యవాదములకు పాత్రులైరి. అరణ్యపర్వ శేషమును - నన్నయతరువాత తద్రచనగా రచించి పూర్తిచేసిన ఎఱ్ఱాప్రెగ్గడ - నాతికఠినమై - "లోపల తీపిగల కదళీపాకమున రచించెను.

ఎఱ్ఱాప్రెగ్గడ తరువాత - తెనుగున వచనరచన - నారికేళ పాకము నతిక్రమించి - కఠినశిలా కంటకాదుల పారుష్యమునుమించి - చెదలు - క్రిమికీటకాదులచే కొఱకబడని - మహాపాషాణశైలిలో అవతరింప నారంభించినది. తెనుగుప్రబంధములలో వచనరచనలిట్లు అన్నివిధ

ములచేతను క్షీణించి, చెడి, నామరూపములు గోల్పోయి, కర్పూరమువలె హరించి - అదృశ్యమగునేమోయని - గద్య ప్రియులకు తహతహ జనించెను.

అమావాస్య చీకటులంతరించినగాని వెన్నెల వెలుగులు విజృంభింపజాలవు కదా? నన్నపార్యుని యనంతరము - ఆఱుశతాబ్దములు గతించువేళకు - తెనుగు వచనరచనమీద భగవంతుని కటాక్ష వీక్షణములు ప్రసరింప జొచ్చినవి. ఎట్లనగా:

శ్రీకృష్ణదేవరాయల కాలమునాటికి - ద్రవిడ - చోళ - పాండ్య - కేరళాది దాక్షిణాత్య దేశముల జయించి దిగ్విజయములు బడయుటకును, గెలిచిన రాజ్యములను దక్షతతో పరిపాలించుటకును - తెనుగు క్షత్రియ వీరులును, వెలమ, నాయక వీరులును - విజయనగర సామ్రాజ్యాధిపతులకు కుడిభుజములట్లు తోడుపడిరి. అందనేకులు యుద్ధరంగమునందు శౌర్య, ధైర్య, పరాక్రమములకు వన్నెకెక్కిన దానికంటె - శేముషీధురంధరులై, సంస్కృతమునగల భారత, రామాయణ భాగవత - విష్ణుపురాణాది యుద్గ్రంధములను - జనసామాన్యమునకు సుగమము, సుబోధకమునై - "మృదు, మధుర, రసభావ - భాసుర నవార్థ" విశిష్టమగుచు, చదువరులకు, శ్రోతలకుగూడ మిగుల నింపుగూర్చు శైలిలో కేవల వచనగ్రంథములు రచింపబూనిరి. ఈయుగమే తెనుగు వచనరచనకు 'బంగారు యుగమ' ని వాకొనిదగియున్నది. నన్నయ తిక్కనాదులు గూర్చిన మనోజ్ఞ వచనరచనలు పెక్కులు గలవు; కాని అవి చంపూ ప్రబంధములలో వచన భాగములని పించుకొనునేగాని కేవల వచనగ్రంథములు కావు. కాకపోయినను - అయ్యవి - నేడు పాశ్చాత్య భాషలలో వచనవాఙ్మయ మెన్నివిధముల పెంపొందినదో - అన్నివిధములైన మేటి వచనరచనలును నన్నయ తిక్కనల వచనరచనలలో కలవు. అవే, తరువాతి వచనరచయితలకు అన్నివిధములను మార్గదర్శకములైనవని ఈదిగువ నిరూపింపగలము.

తేజోమయమై, ధవళమై ప్రకాశించు సూర్యకాంతియందు నీలారుణహరితాది నానావర్ణ సమామ్నాయము అణగియున్నట్లు -

మూలభారతములోవలెనే - ఆంధ్రమహాభారతమునందును-ధర్మ, నీతి, విజ్ఞాన, వేదాంత, వ్యాకరణ లక్ష్యాదులు-అంతర్భాగములై అంతటను వ్యాపించియున్నవి. మననేత్రములతో - ఏవర్ణముగల సులోచనము లుంచి చూచిన - లోకమంతయు ఆవర్ణమయముగా కాన్పించుట సహజమేకదా ? ఎరుపుటద్దములతో చూచినపుడు లోకము ఎఱ్ఱగా కనబడును - నీలపుటద్దములతో చూచినపుడు లోకము నీలముగానే కనబడును. సారస్వతప్రియులు భారతమును ఏదృష్టితో తిలకించిన - వారికి గ్రంథమంతయు అట్టి విశేషములతోనే నిండియున్నట్లు కనబడి వింతగొలుపు. ఆంధ్ర వచన రచనా పరిణామ దృష్టితో మనమిపుడు భారతమును తఱచి చూడవలెను. నన్నయ వచన రచనలు తరువాతి కాలముల వచన రచయితలకు ఎట్లు మార్గదర్శకములై, పరిణామము చెంది భాషలో నవతరించినవో మన మీవ్యాసమున పరిశీలింపవలయును. ఇంచుమించు సగపాలు వచనరచనలుగల చంపూకావ్యముగా భారతము నిత డాంధ్రీకరించినాడు. చంపూ ప్రబంధరచనలో నన్నపార్యునంతవిరివిగా మరియే ప్రసిద్ధాంధ్రకవియు వచనమును ఉపయోగించలేదు. సంఖ్యయందును, పరిణామమునందును - ఉపయోగ విధానమునందును - మింటతులారాశివలె - పక్షపాతములేక - సరి సమానముగానే, ఇతని వలన పద్య గద్య భాగములు రచింపబడినవి. పద్య లాంఛనధారణమే కవిత్వకళకు జీవనమను వారి యభిప్రాయములను పూర్వపక్షముచేయుచు, రమణీయార్థప్రతిపాదకములై, పాఠకులను, శ్రోతలను, రంజింపగల గద్యరచనలు సహితము - కవితాసౌరభశ్రీవిలసితములేనని తన రచనా విధానములచేతనే ఈ కవిసింహుడు సిద్ధాంతముచేసి నిరూపించినాడు.

## కథా వివరణ రచనలు

పుట్టుగ్రుడ్డియగు ధృతరాష్ట్రుడు పాండవ కౌరవులమధ్య జరిగిన భారత యుద్ధమునుచూడ శక్తుడు కాకపోగా - ఆయుద్ధమును కనులార చూచి వర్ణించి ధృతరాష్ట్రునకు చెప్పుటకు, వ్యాసభగవానుడు,

సంజయుని నియమించెను. సంజయుడు ధృతరాష్ట్రునికి తెలియ జెప్పిన పాండవ విజయకథకే సంస్కృతమున జయమను నామము రూఢమైనది.

పిమ్మట, జనమేజయుడు "ఇట్టి గోత్ర కలహమేల పుట్టె?" అని పృచ్ఛచేయగా - భారత కథ చెప్పుమని తన శిష్యుడగు వైశంపాయనుని వ్యాసుడు నియమించెను. వైశంపాయనునిచే జనమేజయునకు చెప్పబడిన కథ - భారత మనబఱగుచున్నది.

అనంతరము శౌనకాదిమహామునులు సత్రయాగము తలపెట్టి - సూతుని పిలిపించి, పంచమవేదమనదగు భారతమును విన నభిలషించిరి. సూతుడు శౌనకాదులకు చెప్పిన కథ మహాభారతమన ప్రసిద్ధమైనది. ఇట్లు కథావివరణమే ప్రధానవిషయమగుటచేత - నన్నయకృత ఆంధ్ర భారతము - సంగ్రహశీలమై - కథా వివరణమే ముఖ్యాంశముగా రచింపబడినది. పైని వివరింపబడిన కారణములచేత నన్నయ రచించిన భారతమునందు - కథావివరణ (Narrative) ముఖ్యాంశముగా గల రచనలే మెండుకొనియున్నవి. మృదుత్వము నెన్నడు వీడకయే యీరచనలు మనోజ్ఞమగు పుష్టి, గాంభీర్యము కలిగి, అర్థసౌలభ్యము చెడకుండ, శయ్యాగౌరవము నతిశయింపజేయుచు - శీఘ్రగమనోత్సాహపూరితములైనను - ముఖ్యాంశముల విడువక చక్కగా తెలుపుచు మిక్కిలి మనోహరముగా నొప్పారుచుండును; ఈదురో మని యీడ్చుకొనుచు - కొట్టుకొనుచు - విసుగు పుట్టించి యెంతట దరిజేరుదుమో? దైవమా! అనిపింపవు; మదకుంజరయానమువలె, మహనీయగాంభీర్య గమనవైఖరిగలిగి, అఖండ గౌతమీ ప్రవాహము వలె మెచ్చుబుట్టించి మేలనిపించును.

శ్రీ దేవరకొండ వెంకటకృష్ణారెడ్డిగారు ఈమధ్య నిరూపించినట్లు - నన్నెచోడ టెంకణాదిత్యుడు, ఇంచుమించుగా నన్నయ్యతో సమకాలికుడు. కావేరీతీరమున నొరయూర - రాజ్యపాలనముగావించుచు - నీకవిరాజశిఖామణి ఆంధ్రకుమారసంభవ మహాప్రబంధము రచించెను. కేవలమేధాసంపత్తి, భావగాంభీర్యవిషయములలో నన్నెచోడుడు "భావాంబరవీథి విశ్రుత విహార విషయమున" - నన్నయకంటె -

తిక్కనకంటెకూడ మిన్నయనవలెను. (In matters of intellectual eminence and imagination - Nanne Choda is distinctly superior to Nannayya and Tikkana. But in matters of vigorous, stately march of style, nobody equals Nannayya) కాని మహనీయ గంభీర గమనవైఖరిలో నన్నయశైలి కెవ్వరును సాటిరారు. నన్నపార్యుని భావాంబరముకంటె - నన్నెచోడుని భావాంబరము - ఉన్నత తరమని వక్కాణింతును. ఇట్టి మహోన్నత భావప్రపంచమున స్వేచ్ఛా విహారమునల్పి - నన్నెచోడకవి - కవితాకల్పనముల నొక్కొకచోట - నన్నయకు మిన్న - యని శ్లాఘించతగిన ఉత్కృష్టపద్ధతిని - ఆంధ్ర కుమారసంభవము రచించి ధన్యుడైనాడు; కాని పదములకూర్పులో- శైలీగాంభీర్యవిషయములో, చోడుడు నన్నయకు చాల వెనుకబడెను. ద్రవిడ కర్ణాటపదముల ననవసరముగా చేర్చినందున నన్నెచోడుని రచన తెనుగుప్రజకు ఆకర్షణీయము గాలేదు. అతని పరిసరమున వసించు ప్రజలు అలవాటుచొప్పున వాడుకచేయుపదములు - చోడుని రచనలలో దొరలుట సహజము.

చోడుని రచనలో ఐదింట నొకపాలుమాత్రమే వచనరచనగలదు. మహనీయగమనవైఖరిలో - చోడుని వచనములు నన్నపార్యుని రచనలకు చాల తీసికట్టు. నన్నయరచన - అఖండగౌతమీప్రవాహము. నన్నెచోడుని రచన యన్ననో - రమ్యకావేరీస్రవంతి. గాంభీర్యవిశిష్టమయ్యు, మార్దవభూషితమైన శైలిలో రచన సాగించుట - నన్నపార్యుని లక్ష్యము. కాబట్టి, నన్నయరచనలలో సకుటున - రెండుపాళ్ళు సంస్కృతపదములును - ఒకపాలుమాత్రము అచ్చతెనుగుపదములును- నేర్పుగా పర్చికూర్చబడినవి. విశేషించి సంస్కృత పక్షపాతులగు సత్కవీంద్రుల మెప్పు నభిలషించి నన్నపార్యుడు సంస్కృత సాంప్రదాయములనే, తన రచనలలో నెక్కువగా చొప్పించెను. అవకాశము గల చోట్లలోకూడ నన్నయ తెనుగు పలుకుబళ్ళ దడవక, సంస్కృతమర్యాదలనే పాటించెను: (ఈవిషయమందు నన్నయకు, తిక్కనకు చాల భేదముగలదు). మచ్చునకొక్కరచన - ఆది 1-99

"అయ్యా! నీవతిథివి - మాయింట కృతభోజనుండవై పొమ్మని ఘణించిన - నోడంబడి యుదంకుండు గుడుచుచో - నన్నంబు కేశదుష్టంబైన - రోసి - కరంబలిగి, యిట్లపరీక్షితంబైన యశుద్ధాన్నంబువెట్టినవాడ వంధుండవగుమని శాపంబిచ్చిన - నల్పదోషంబునకు నాకు శాపంబిచ్చినవాడవు నీవనపత్యుండవు గమ్మని ప్రతిశాపంబిచ్చిన...ఇందు - క్రిందగీతలుంచిన పదములు పరికింపుడు - 'భోజనము చేసి వెళ్ళు' మని వ్రాయక 'కృతభోజనుడవై' అని సంస్కృత సాంప్రదాయము; 'అన్నములో తలవెంట్రుక వచ్చె' ననక - 'అన్నంబు కేశదుష్టంబైన' - అని మరొక సంస్కృతమర్యాద - సంతానము లేకపోవుననక - అనపత్యుండవుకమ్మని మరొకటి.

ఇట్టి విశేష విచిత్ర రచనల, నీక్రింద, విరివిగా, విలోకింతము. ముందుగా నన్నపార్య విరచితమగు "ఆంధ్రమహాభారత" కృతి ప్రారంభమున రచించిన మహత్తర శ్లోకమును, దాని ప్రాశస్త్యమును - తొలుత గమనించి పిమ్మట కొదువసంగతుల చర్చింతము.

సృష్టికర్త - బ్రహ్మ - తనసతిని - సరస్వతిని ముఖముల నిడుకొని ఆదరించినాడు; జగద్రక్షకుడు, - శ్రీమన్నారాయణుడు - తన హృదయమే, లక్ష్మీదేవికి ఇచ్చి, ఆమెను సన్మానించుకొన్నాడు; పార్వతికి - పరమేశ్వరుడు - శరీరార్ధము నిచ్చివేసి సంభావించుకొన్నాడు. ఇట్లే స్త్రీమూర్తులను గౌరవించుకొని - త్రిమూర్తులు, లోకపూజ్యులైరి; - అను నీయుత్తమ భావమును, నన్నయభట్టారకుడు తన కృత్యాది మంగళ శ్లోకములో ప్రకటించి లోకవంద్యుడైనాడు. ఇక, భారతకథలో కౌరవులన్ననో - అగ్నికుండసముద్భవ - అయోనిజ - అగు శ్రీమూర్తి - యాజ్ఞసేని - పాండవధర్మపత్ని - ద్రౌపది నవమానించి, సర్వనాశనము నొందిరను ధ్వని - తో స్త్రీల నవమానింపకూడదని - ఉత్తమనీతి మార్గబోధనతో, హితముపదేశించి హెచ్చరించి, తాను రచింప సంకల్పించిన ఆంధ్రమహాభారత కథాసారమును - ఆ కృత్యాదిని విశ్వ ప్రశస్త శ్లోకరత్నమును సాభి

ప్రాయముగా రచించి - నేర్పుగా నిలిపి కృత కృత్యుడై, నన్నపా ర్యుడు - జననుతుడయ్యెను.

నన్నయ రచనలకు "అక్షర రమ్యత" విశిష్టమైన లక్షణము. చెఱుకుతీపివంటి మాధుర్యము - తెనుగుగడ్డలో - తెనుగునీటిలో - తెనుగుగాలిలోనే కలదని తోచుచున్నది. తెనుగు తెలియని దాక్షిణాత్యులు - తమిళకర్ణాట భాషల మాటలాడువారు - త్యాగరాజు రచించిన తెనుగు కృతులను - అందున్న మాధుర్యములకు సొక్కి - విడువలేక - నేటికిని పాడుకొనుచుందురు. హిందీ, బంగాళీ మొదలగు భాషల మాటలాడు ఉత్తరాది ప్రజలేగాక - ఇంగ్లీషు - ఫ్రెంచి - జెర్మన్ మొదలగు భాషలు మాటాడు యూరపు - ఖండస్థులగు పండితులు కూడ తెనుగుబాసయొక్క శ్రావ్యతను - మాధుర్యమును, మెచ్చి పలువిధముల శ్లాఘింతురు. తేనెవలె - తియ్యటి భాషయగుటచేత ఐరోపావారు, తెనుగును "Italian of the East" "తూర్పున - నిటలీ భాష - యని ప్రశంసింతురు. మెకన్జీ - బ్రౌను మొదలగు మహామహులకు - తెనుగుభాషయందు కలిగిన - ఆదరాభిమానములు - అత్యద్భుతములు - మద్రాసు ఓరియంటల్ లైబ్రరీలోగల తెనుగు గ్రంథములలో సగమునకుపైగా, బ్రౌను దొరగారు సేకరించినవే. అంతకుముందే స్థానికచరిత్రలు - (Local Records)- అను పేరుతో - మెకన్జీదొరగారు సంగ్రహించిన - 62 సంపుటములలో - 48 సంపుటములు తెనుగు రచనలతో నిండియున్నవి. ఈసంపుటముల నన్నింటిని - ఈస్టిండియా కంపెనీవారు, మెకన్జీదొరగారి సతీమణినుండి, లక్షరూపాయీలు వెలయిచ్చి కొని ఓరియంటల్ లైబ్రరీలో భద్రపర్చిరి. బ్రౌనుదొరగారు, వానికి మెఱుగులు దిద్ది, ఎంతోసేవ చేసిరి. ఈ తెనుగు కొలువరుల ఋణమును - తెనుగుప్రజలు - తీర్చుకోలేరు. తెనుగుభాషలో సహజముగాగల మాధుర్యమే ఈసత్పురుషుల దృష్టినాకర్షించి ఇంతటిసేవ చేయించుకొన్నది.

విలాతి ఉద్యోగుల నిట్లు - ఆకర్షించిన తెనుగుతీపి - ఈ దేశమున పుట్టిపెరిగిన - నన్నయభట్టారకుని - ఆకర్షించుటలో - ఆశ్చర్యము

లేదు. తెనుగులోగల సహజమాధుర్యమును - ఇంకను విశేషముగా పెంపొందించుటే - నన్నయలక్ష్యము. అతడు నడచినదారినే నడచి అతని తరువాతి కవులు, చాలమంది, తెనుగుతీపిని వృద్ధిచేసిరి - మరి కొందరు శబ్దాలంకార రచనల నతిక్లిష్ట దీర్ఘ సమాసములతోనింపి - పాఠకులకు - విముఖత గల్గించిరి. అతితీపి - మొగము మొత్తి వెగటై - రోతకలిగింపగలదు. ఇట్టి వెగటురచనలు కొన్ని తలయెత్తినను - మొత్తముమీద తెనుగుబాస, సహజ మాధుర్యమును మాత్రము గోల్పోలేదు - "దేశ భాషలందు తెనుగులెస్స" అను వాక్యరత్నము తొలుత కవి సార్వభౌముడు - శ్రీనాథుడు - క్రీడాభిరామమున గూర్చినాడు. పిమ్మట కృష్ణదేవరాయలు ఆముక్తమాల్యద స్వప్న వృత్తాంతములో ఏర్చి కూర్చి, ఆవాక్యమునకు జగత్ప్రఖ్యాతి గలిగించినాడు. దాని యాదార్థ్యము నిరూపింపగల ఒక ముఖ్యాంశము నీక్రింద నుడువు చున్నాను.

భారత దేశపు తొలి స్వాతంత్ర్య పోరాటము - నూరేండ్లక్రిందట - 1857 సంవత్సరమున జరిగినది - అందు భారతీయులు పరాజితులైరి. ఈస్టిండియా కంపెనీవారి అధికార మంతరించినది - గ్రేటుబ్రిటను - ఐర్లండు దేశములను, ఇంగ్లీషు వలస రాజ్యములను, ఏలుచున్న విక్టోరియామహారాజ్ఞి భారత దేశపు చక్రవర్తినియై, సామ్రాజ్యము నేల దొడగినది - ఆమె పెద్దకుమారుడైన - ఎడ్వర్డు - Prince of Wales 'ప్రిన్సు ఆఫ్ వేల్సు' అనబడిన - యువరాజ హోదాలో నుండిన ఎడ్వర్డురాకుమారుడు - ఇప్పటికి 80 ఏండ్ల క్రిందట - ఈ దేశమంతటను పర్యటించెను. ఈ యువరాజుగారి భారత దేశ పర్యటన కథను - భారతీయ భాషలలో - దేనిలోనైనను హృద్యముగా వర్ణించిన ఉత్తమ గ్రంథమునకు నూరు బంగారు గిన్నికాసులు - అనగా - రెండు వేల రూపాయీలు బహుమానమిత్తుమని బ్రిటిష్ సామ్రాజ్యాభిమానులైన - Crown Perfumery Company వారు - ప్రకటించిరి. ఆపోటీకి - 25 భారతీయ భాషలలో రచింపబడిన - 150 గ్రంథములు వచ్చినవి. అందులో నాలుగు గ్రంథములు మాత్రము ఉత్తమము లనిపించు

కొన్నవి. పరీక్షకుల - రెండవ వడపోతలో - మూడుజారిపోగా అగ్ర తాంబూలార్హ్మమని ఒకే ఒక గ్రంథము ఏకగ్రీవముగా నిర్ణయింపబడి నది. ఆ గ్రంథకర్త ఎవరో - అతడు రచించిన గ్రంథమేదో తెలిసి కొనుట ఈసందర్భములో చాల ముఖ్యము. బహుమానము బడసిన గ్రంథకర్త - కొక్కొండ వేంకటరత్నశర్మగారు. వారు తెనుగులో రచించిన వచన గ్రంథము 'ప్రిన్సు ఆఫ్ వేల్సు' యాత్రా చరిత్ర.

జన్మచేతవారు మాధ్వపంతులుగారు. కేవల ఆంధ్రులు. మద్రాసు ప్రెసిడెన్సీ కాలేజిలో తెనుగు అధ్యాపకులు - ఆంధ్ర భాషా సంజీవనీ పత్రికాధిపతులు. వారిచే పోటీకి పంపబడిన ఆంధ్ర వచన గ్రంథము - భావగాంభీర్యమునందును, మృదు మధుర మనోహర శైలియందును, నిరుపమానమైనదని - బ్రిటిష్‌సామ్రాజ్యప్రఖ్యాతమైన London Times లండన్ టైమ్సు పత్రిక - దీనిని గురించి ప్రత్యేకసంపాదకీయము వ్రాసి ప్రాశస్త్యమునభివర్ణించి - ప్రపంచ ఖ్యాతి గూర్చినది. "దేశ భాష లందు తెనుగు లెస్స" అను శ్రీనాథుని నానుడి, అప్పటికి - ఇప్పటికి - ఎప్పటికిని సత్యమే - నని పంతులుగారు నిరూపించి - బ్రిటిష్‌సామ్రా జ్యమునందేగాక - తెనుగు తల్లికి ప్రపంచఖ్యాతి చేకూర్చి ధన్యులైరి. మరి ముప్పదేండ్లకు - 1907 లో - ఈ కేవల తెనుగు పండితునికి - మహామహోపాధ్యాయ బిరుద మిచ్చి, ఉద్దండ సంస్కృత పండితులతో సమానప్రతిపత్తి గౌరవము బొసంగి - తెనుగు భాషను, పంతులు గారిని అప్పటి ప్రభుత్వము సన్మానించినది. 'ఆంధ్ర భాషా మయం కావ్యం అయోమయవిభూషణ' మను నిందావమానములు తెనుగు తల్లికి తొలగినవి.

రచనలు మాధుర్య విశిష్టములు కావలెనన్నచో ఏమి చేయ వలెను? రచనలలో సరళ శబ్దోచ్చారణ పలుసార్లు విననగునట్లు - అక్షరములను నేర్పుగా ఎంచి, చక్కగా కూర్చి ఆంధ్రకవులు మాధు ర్యము నతిశయింపజేయుచు వచ్చిరి. నన్నయ వాక్యములకు అక్షర రమ్యత ప్రసాదించిన రచనా సామర్థ్యము - అతని తరువాతి కవుల చేతులలో ఎట్లుపరిణమించెనో ఇంచుక పరిశీలింతము:

నన్నయ: ఆది. 1-8. (అఖిలజలధి) వేలా వలయ వలయిత వసుమతీ వనితా విభూషణంబైన వేంగీదేశము.

నన్నెచోడ: విధివిహితవిధానము (I. 146). II. 948 విభూతి, విశేష రమణీయంబులం గని విస్మితులగుచు

తిక్కన: విరాట. 4-146 వారలకు వగవ వలవదు; విధివశంబున వనంబుల వసియించి...వచ్చి మనవీటనున్నవారు. వినుము వారి

నాచనసోమ: ఉత్తరహరివంశ. 3-144 వివిధాయుధ విహరణ విద్యుల్లతికా విలాసము

ఈ శ్రుతిసామ్యములు కేవలము - వకారయుక్తములేకావు; ఇతర హల్లుల కూర్పులును గలవు:—

శబ్దాలంకారములు - Alliteration- శ్రుతిసామ్యము.

ఆది. 2-219: సర్పసత్ర సదనంబునకుం జనుదెంచి, స్వదేహ కాంతి సభాంతరంబెల్ల వెలుంగుచుండ స్వస్తివచన పూర్వకంబుగా నిట్లని స్తుతియించె.

నాచన సోమనాథ ఉత్తరహరివంశము IV. 229.

సురనారీవీరస్వయంవర సమయంబున సకుంకుమాక్షతపాత్ర హస్తలై సువ్రతంబు సెప్పవచ్చిన సతులం దలపింప.

సోమనాథు డాశ్వాసాంత గద్యలో సహితము, శ్రుతిసామ్యము నెంతో చమత్కారముగా గూర్చినాడు - "సకల భాషాభూషణ, సాహిత్య రసపోషణ సంవిధాన చక్రవర్తి - సంపూర్ణకీర్తి - నవీన గుణసనాథ నాచన సోమనాథ.

శ్రుతిసామ్య చమత్కారముతో ఏకవర్ణ - బహువర్ణవృత్త్యను ప్రాసముల్గచేర్చి రచనలు కూర్చుటలో మన తెనుగుకవులకు ప్రీతి అధికము.

నన్నయ - ఆరణ్య. I. 286: స్నేహలాలస విలోలాపాంగ విలోకనంబులు 2-66: అప్పతుులం బట్టికొన సమకట్టి కట్టిన పుట్టంబు. నన్నెచోడుడు ఒక్క వృత్త్యనుప్రాసము కొఱకు ద్రావిడప్రాణాయామమునకైన, నోడబడును - తారకాసుర యుద్ధమున జంభాసురుని

కొల్చు యోధులు చచ్చిరని వ్రాయక - నన్నెచోడుడు (II. 841.) "నిజానంత సామంత సంతానంబంతయు నొక్కట కృతాంత నికేతనాంతర్గతులగుటగని" అని వ్రాసినాడు.

మంత్రి భాస్కరుడు (అరణ్య I. 205): "గదియు రథ యూథ గజవ్రజ హయచయ సైనిక నికర సూతవ్రాత భటపటల స్ఫుటచటుల నిశాట సేనానానంబు నఱుకం దొడంగిన"

తరువాతికవుల కావ్యములలో ఇంచుమించుగ ప్రతిపుటలోనిట్టి శబ్దాలంకార భూషితములైన రచనలు చూడగలము. నాచన సోమనాథుని హరివంశము (IV. 213) లో "జడనిధిలో నడయాడు చుండిన యోధులు" - వంటిరచనయే, బమ్మెరపోతరాజుగారు - భాగవతమున

కం॥ "అడిగెదనని కడువడి జను
నడిగిన తను మగుడనుడువడని నడయుడుగున్
వెడవెడ జిడిముడి తడబడ
నడుగిడు నడుగిడదు జెడిమ నడుగిడు నెడలన్ ॥"

అనునిటువంటి చమత్కార కంద రచనకు స్ఫోరక మయ్యేనేమో ?

## 2. అర్థానుసారమగు శబ్దరచన

కళాకుశలుడగు చిత్రకారుని చేతి లేఖినియు, కుంచెయు, రంగులు రేఖలతో సృష్టికి ప్రతిసృష్టి చేయగలిగినట్లే - మహాకవి పర్చికూర్చిన పదజాలముకూడ - అర్థానుసారులగు ధ్వనులతో ఎదుటివస్తువుల గతులను, గమన వైఖరులను ప్రతిధ్వనులతోసహా ప్రత్యక్షముగా చూపగలవు. రచనలో ఇట్టి చమత్కారమును - కవికిగల ఈవిశేష ప్రతిభను - ఇంగ్లీషు విమర్శకులు (Sound echoing Sense-) అర్థమును ప్రతిధ్వనితో ప్రదర్శింపగలశక్తి - యని ప్రశంసింతురు. తెనుగు కావ్యములం దీగుణము బహుళముగా కానవచ్చుచు వున సారస్వత

మునకు గొప్పప్రశస్తి చేకూర్చినది; ఇంకను చేకూర్చగలదు. కొలది ఉదాహరణముల పరికింతము.

సుభద్రార్జునుల ప్రణయము శ్రీ కృష్ణుడెఱిగి దోహదముచేయుచుండెను. బలరామునకాపెండ్లి ఇష్టముకాలేదు. యతివేషమున, నరుడు తీర్థయాత్రల సేవించి, ద్వారకకు చేరినపిమ్మట కొన్నిదినములకు, కార్యాంతర ప్రసక్తి కల్పించి-శ్రీకృష్ణుడు బలరాముని దూరముగా ముందు పంపివైచి - అప్పుడే - సుభద్రను తోడుకొనిపొమ్మని - అర్జునుని ప్రోత్సహించి - రథము నేర్పాటుచేసి - పిమ్మట తానును బలరాముని చేరబోయెను - సుభద్రయే రథమునడుప - అర్జునుడు రథికుడై - ద్వారకాపురవీధులను - బాహాటముగా గడచిపోజొచ్చెను. సభాపాలు డది కనిపెట్టి "ప్రబల జలధర ధ్వాన గంభీర భేరీధ్వని" వంటి మహాధ్వని చేసి, అర్జును పరాక్రమమెల్ల వారికి తెలియజేసెను. (ఆది. 8-203). ఏభాషలోనైనను - రేఫ - నకార లకారాదులు సరళములు - (Liquid Consonants)- ధ - ఢ - భ - ఫ - మొదలగునవి - పరుషములు - (Hard Consonants). కవి కూర్పులందీపరుషస్వరముల నేర్పుగా సంతరించి - మేఘగర్జనలు - ఢక్కా, భేరీ ధ్వనులవంటి - బెడిదంపు టులివుల నుత్పత్తిచేసి - వానికివి ప్రతిధ్వనులో అనునట్లు ప్రదర్శించవచ్చును.

పై కథా సందర్భములో ద్వారకాపురజనుల మాంద్యము నుడిపి - తక్షణమే వారు త్రుళ్ళిపడునంతటి దారుణపరుషధ్వని నుత్పత్తి చేయదలచి, కళాకోవిదుడగు నన్నయభట్టు - కథోచితముగా సుభద్రాహరణ వృత్తాంతమును "ప్రబల జలధర ధ్వాన గంభీర భేరీధ్వని" మూలముగా పౌరుల కెరింగించెనని చక్కగా రచించినాడు - నన్నయ ననుసరించిన తెనుగు కవులలో, శ్రీనాథునికి - ఈ "ప్రబల జలధర ధ్వాన గంభీరభేరీధ్వని "యను కూర్పునందు మిక్కిలి మక్కువకలదు; తన రచనలలో పలుసారులీ ప్రయోగము నతడు తడవియున్నాడు.

పరుషస్వరముల ప్రశంస చాలించి, నన్నపార్యుని చేతిలోను, అతని ననుసరించిన వారిచేతులలోను సరళరచన లెట్లు పెంపొంది,

తెనుగు సాహిత్యమునకు తీరుతీయములెట్లు సంతరింపగలిగినవో చూతము.

నన్నయ - ఆది 4-141 "అనిలాలోల కల్లోల మాలాస్ఫాలన."
ఇందు వాయు వ్యాపారముచే గంగానదిలో పుట్టి, చలించుచు, ముందునకు సాగుచు, పెరుగుచు, జతగూడుచు, ఉన్నతమగుచు - పెరిగి పెరిగి ఫెళ్లున విరిగి కూలు తరంగజాలము వర్ణింపబడినది. సరళ నదీ జల తరంగముల ట్లే - ఈకూర్పునందు సరళ లకారము, దీర్ఘమగుచు, హ్రస్వమగుచు, జమిలియై జోడించుచు, నున్నతమగుచు - పెక్కు విధముల చలించి ముందునకు బోయి బోయి పరుషమైన తీరసంసర్గము చేత - ఫెడీమని విరిగికూలునట్లే - "స్ఫ" అను పరుషాక్షర సంపర్కము బొంది, తత్ఫలితముగా, బంధమును - విఱిగి - కూలుచున్నది. ఇందున్న - అర్థానుగుణమైన శబ్దసంఘటన - రమణీయమైనది.

ఇట్లే - కుమారసంభవము - I. 116 లో నన్నెచోడుడును - ఒక కూర్పులో వర్ణించినాడు:-"అనేక జలచరకులా కులితాలోల కల్లోలా నూనఫేనాయమానము" ఇందు అలవిరిగినపుడు తీరమునందు విశేషముగా కానవచ్చు నురుగు - ఫేనమునుకూడ - చేర్చుట వర్ణనము నతిశయింప జేసినది,

నన్నయ. ఆరణ్య 1 - 364. ఊర్వశి యర్జుననితో ప్రస్తావించిన విహార వివరములు :— .. "మేరుశైలకందరంబులను, మందపవనంబులుగల నందనాది వనంబులయందును ... కనకారవింద సమధిక సౌరభసంవాసిత మహానంద కందంబులైన మందాకినీ తీరమందున్న మణిమయవేదికలు...చంద్రికాసుందరంబులైన సికతాతలంబులు ...

నన్నెచోడ: II - 324. పార్వతీపరమేశ్వర విహారములు ... "హిందోళాందోళితలతాం దోళంబులంబరిమళాక్రాంతానందలతాంతమంది రానంతరంబుల ...

## 3. అనుప్రాసరచనలవిజృంభణము

ఈక్రింది రచనలలో అనుప్రాస వైచిత్రి గమనార్హము :—

సభా 1 - 206. భీమజరాసంధుల మల్లయుద్ధము :—

"ఒండొరుల బట్టియు, గిట్టియు, నడచియుం బొడచియుం, దాచియు ద్రోచియు, మహాయుద్ధంబు సేసిరి." ఇందు - ఆయాపదముల మొదటి యక్షరముల మాత్రము మార్చి అనుప్రాసము సాగింపబడినది - ఇదే విధమున నన్నెచోడుడును అనుప్రాసముల గూర్చినాడు: చూ - దక్షునిభయము - I-216 "దక్షు డతిభయ భ్రాంతుడై, కన్న వారలకు, మొక్కుచు, స్రుక్కుచు, లోగుచు డాగుచు ...; పార్వ తిని తపోనిశ్చయమునుండి మరల్చుటకు I. 671 ప్రౌఢాంగనలు "తమ బలిమియు, గలిమియు మెఱయ నగజ భంగించుచు - నగ్గించుచు మంత్రిభాస్కరుడు: ఆరణ్య I. 205. "బాణంబులుఁ గృపాణంబులు, గరిదంతంబులు కుంతంబులు, శూలంబులు, ఫాలంబులు, గపోలంబులు- — అంకుశంబులు రాలియు, మావంతులు గూలియు; గుంభంబులు పగిలియు బొందులు నొగిలియు - -; ఆరణ్య II-133 - :- నూరియు యునఖంబుల జీరియు, గంఠంబుల నొగిల్చియు, శిరంబులబగిల్చియు" ఇట్టి రచనలు తిక్కనాది మహాకవుల కూర్పులందును - పెక్కులు గలవు. గ్రంథవిస్తర భీతిచే వానినెల్ల దిగవిడిచి - సాహిత్యరసపోషణ సంవిధాన చక్రవర్తి - నాచన సోమనాథుని వచనములలో కానవగు రమణీయానుప్రాస పరంపరలు - శాఖోపశాఖల చందమున నొకదా నిపై నొకటి మెగయుచు - దుప్పికొమ్ముల విధమునను కొమ్మ రెమ్మ లతో కూడుకొని - 'నూరువరాల' శాఖోపశాఖా సందోహముల చందమునను - బహుముఖముల వ్యాపించి, వింతగొలుపుచు, మెచ్చు పుట్టించును; కావున నందు గొన్నింటి శిల్పమును విమర్శించి - ఆనందింతము.

ఉత్తర హరివంశము: 3-80 :- "లావున నిక్కియు, బ్రేవుల జిక్కియు, మెడలు ప్రగ్గియు, దొడలు స్రగ్గియు, బ్రక్కలు నవిసియు, డొక్కలు నలిసియు, వీపులు వగిలియు, మూపులు నొగిలియు; ముక్కులు చదిసియు చెక్కులు చిదిసియు"

4 - 'తెగనటికి, దిగనుటికి' -

4 - 248 - "శంకింపక, సందీక, సరుకుగొనక -
వెనుకపెట్టక - వేగిరపడక -
చలచిపోక - చాలింపక, చలింపక, చాయదలగక" -

4 - 261 - "తల విదుర్చుచు, కోడలు గోలుకుచు, మిడిగ్రుడ్లు ద్రిప్పుచు, మీదులు సూచుచు, బారలు సాచుచు బారి సమరుచు, కడుపక్కళించుచు, గాలం జరుముచు, మెడ నిక్కించుచు, మేను వెంచుచు"

6 - 50 - "నడిదంబులు బెడిదంబులుగ గదలించియు, ముదలించియు"

6 - 54 - "వ్రేసియు, డాసియు, బాసియు, లాసియు, వాసిచెడక"

6 - 108 - "జానువు నానువున నదిమియు గదిమియు"

6 - 129 - "ప్రదరంబుల దరంబులు పుట్టించియు గరంబుల దట్టించియు రూపు మాపియు, నేపుజూపియు; కరంబుల ఖండించియు శిరంబుల తుండించి"

6 - 134 - అసురసేన మొనలకుం దలంగియు గలంగియు, తురువులలో దూరియు, బారియు, పోటువడి పొరలియు, కెరలియు వాటుపడి తెరలియు, మరలియు,

శబ్దాలంకార విశేషముల విమర్శ ఇంతటితో చాలించి, రమణీయములగు నర్థాలంకార విశేషముల గొన్నిటిందడవుదము.

## మా లో ప మ లు

ఉపమాలంకారము పరచనకైన ప్రాణతుల్యమైనది. చక్కని ఉపమానముల నతిహృద్యముగా రచించి, మహాకవి కాళిదాసు జగత్ప్రసిద్ధుడయ్యెను. నన్నయభట్టారకు డొక్క యుపమానముతో తృప్తి పడక మూడేసి ఉపమానములు గల మాలికల పెక్కింటినిగూర్చి భారతమును రమ్యతరము నొనరించినాడు. ఆంధ్రకవుల నేకు లాతని ఫక్కినే అవలంబించినారు. అందు గొన్నింటి నీదిగువ చూతము :

## ఉ ప మా న మా లి క లు

నన్నయ్య - ఆరణ్య 2-141: అరణ్యమున నిద్రించిన దమయంతిని నలుడు నిర్దయుడై విడిచి, వెడలిపోయిన పిమ్మట - ఆమె చేదిపుర మెట్లో చేరుకొని కాలక్షేపము చేయుచుండెను. ఎంత నిగూఢముగా నున్నను, ఆమె ప్రతిభ - (౧) "ధూమ జాల నిబద్ధమగు నగ్ని ప్రభ వలెను (౨) నీలాభ్ర సంవృతమైన చంద్రరేఖ తేజము వలెను (3) బహుపంక నిమగ్నమగు మృణాళ సౌరభము వలెను - ఏర్పడ కున్నను" - ఆమె భ్రూమధ్యస్థిత సూక్ష్మపద్మలక్షణముచేత నామెను పోల్చగలిగెను. (సుదేవుడు దమయంతిని పోల్చుకొనిన విధము) ఆరణ్య 2-326. లోపాముద్ర: జలంబులందు నలినియుంబోలె (2) వినీతునందు లక్ష్మియుంబోలె (3) ఉద్యుక్తునందు విద్యయు బోలె వర్ధిల్లెను.

నన్నెచోడుడు: II-574. ప్రస్థాన భేరీధ్వని వినిన దేవసేనలు "అమ్మహాధ్వనివిని, నవఘనాఘనధ్వనివిని విజృంభించు మయూర సంఘం బునుంబోలె చెలంగి కలగొనంబాఱు నమరకటకంబు - చంద్రోదయం బునం దనరి ప్రోయు మహాసముద్రంబునుంబోలె బెరిగి ఘూర్ణిల్లు చుండె." పార్వతి యౌవన ప్రాదుర్భావమును ఇట్లు వర్ణితము: 1-282. "మఱియుం గౌమారావంతరంబున - ౧ లేదీగకుం గవ్వంబెక్కు నట్లు ౨ పువ్వునకు దావివొందునట్లు 3 చిత్రరూపంబునకు మెఱుం గెక్కు విధంబున, నిఖిలలోకమనోభిరామంబగుచు, (284) అభినవ మధు సంగతిం దనరు ప్రద్యుమ్ను నుద్యానవనంబునుం బోని యౌవన మదాభ్యుదయమున"

మంత్రి భాస్కరుడు: ఆరణ్యకాండ - 1-205. ఖరుని సేనలతో పోరు శ్రీరాముడు: (i) ప్రళయకాలోద్దండ దండధరునందు బెలుచం గలుగు నుద్దండరేఖయు, (ii) గల్పావసాన సమయ సముదీర్ణ ప్రతాప దీపితుండగు తపనువలనం గలుగు వేడిమియును, (iii) సంవర్త వేళా

ప్రవర్తిత దారుణ సంహార విహారుండగు రుద్రునందలి రౌద్రంబును, దనయందు దోప, నతిఘోరాకారుండై ...

కవిబ్రహ్మ తిక్కన: కవితావేశమున నొకే విషయము వర్ణింప ఐదుపమానములగూడ కూర్చినాడు - శరతల్పగతుండగు భీష్ముండు, కర్ణుడు సందర్శించునపుడు - ఎట్లు పడియుండెనో చూడుడు : ద్రోణ - 1-39 : "శోషించిన సముద్రంబు చందంబున, (ii) విమానంబు విఱిగిపడిన దివ్యుని తెఱంగున, (iii) భూతల పతితుండగు పతంగుభంగిని (iv) భగ్న పక్షంబైన మైనాకంబుమాడ్కి ... (v) యమునానదీహ్రదస్థితంబును నిమీలితాక్షంబును నై శోభిల్లు శుండాలంబు ననుకరించుచు ..."

ఎఱ్ఱాప్రెగ్గడ ఉపమాన రచనలు అనుబంధమున నీయబడినవి.

భాస్కర రామాయణము పూర్తిచేసిన అయ్యలార్యుడు. యుద్ధ - 1542: రామరావణులు - ఘోరముగా పోరుచు - ద్వంద్వయుద్ధము గావించు వేళ, లక్ష్మణుడు, అన్నగారికి తోడ్పడు సందర్భము, నిట్లు వర్ణించెను :

అయ్యవసరంబున (1) గిరిగుహాకుహరంబు వెడలివచ్చు మృగేంద్రంబు ననుకరించుచు (2) నంభోధరమండలంబు పాసి జనుదెంచు దంభోళిం బోలి (3) సాగరంబు వెడలి యేతెంచు బడబానలంబు పోల్కి (4) పాతాళ వివరంబువలన నరుగుదెంచు మహానాగంబు పగిది - ప్లవంగబల మధ్యంబునుండి లక్ష్మణు డేగుదెంచి ఎడచొచ్చి ..."

Do ..Do... యుద్ధ 1655 :- శాండిల్యు శాపవశమున మకరియైన ధాన్యమాలిని, రాము పంపున సంజీవి దేబోవు హనుమంతుని బట్టి లటుక్కున మ్రింగివైచినపిదప, పడినయవస్థ : "పైపయిం బ్రవర్తిల్లు మూర్ఛనొందుచు (౧) దుశ్చికిత్సంబగు మహావ్యాధియుం బోలె - (౨) సముద్రోదరగతంబగు బడబానలంబు ననుకరించుచు (3) మందిరాంతర జాజ్వల్యమాన పావకుని విధంబున - (౪) పరిధానాంతర్లీన మహోరగంబు కైవడిని - గర్భకుహార వర్తియైన యతని విజృంభణమున కోర్వక తదీయ చరణ, నఖరప్రహార, ముష్టివిదారణ, వాల ఘట్టనంబులు - సైరింపంజాలక యొఱలుచు ..."

## శ్లేషోపమాన భూషితములగు వచనరచనలు

ప్రాజ్ఞుల మెప్పును, ఆంధ్రజన సామాన్యము యొక్క ఆదరమును, అభిలషించి - భారతము తెనుగున రచించిన నన్నయభట్టారకునికి - ఆంధ్రసాహిత్యాభివృద్ధి మీద నెక్కువ; అతడు వానిస భాషాంతరీకరణకర్త కాడు - మూలమందు తన కనవసరమని తోచిన పెక్కు విషయములను ముట్టక పరిత్యజించినాడు; ఆంధ్రాభ్యుదయమున కవసరమని తోచిన ముఖ్యాంశముల నెన్నిటినో - మూలమున లేకున్నను - ఔచిత్యమును పాటించి - స్వతంత్రించి, క్రొత్తగా చేర్చి, ఆంధ్రభారతమును - మూలమునకంటె - రమ్యతరము, రమణీయతరము, గావించినాడు. ప్రకృతాప్రకృత శ్లేష సౌరభ సంవాసితమైన యీ క్రింది రచన చూడదగును. ఇది మూలమునలేదు గాని - అనాటివారి అభిరుచులను, జ్యోతిర్విజ్ఞానమును, సంస్కృతిని, చక్కగా ప్రదర్శించుచు - శ్లాఘాపాత్రమైన వచనరచన యగుటచే నిందు ఉదహరింప బడినది. నన్నయ సముద్రవర్ణనము - ఆది. 2 - 27 : (1) ఉద్యానవనంబునుం బోలె బహువిద్రుమ లతాలంకృతంబైనదాని (2) నాటక ప్రయోగంబునుంబోలె ఘనరస పాత్రశోభితరంగ రమ్యంబైనదాని (3) దివంబునుంబోలె నహి మకర భరితంబైనదాని ''

ఇందు - ఉద్యానవనముల పెంచుటయందు ప్రీతి మానవుల కనాదినుండి కలదు - నందనవన - చైత్రరథాదులు పురాణ ప్రసిద్ధములు. రాజనరేంద్రుని యనంతరముకూడ దేశాధిపులు ఉద్యాన వనములను, కృత్రిమాచలములను నిర్మించి క్రీడించెడివారని ప్రబంధములు ఘోషించుచున్నవి. క్రైస్తవమతములో ఆదిమదంపతులైన 'ఆదాము - ఈవుల' విహారార్థము - భగవంతుడే తొలి తోటమాలియై "పేరడైజ్" (Paradise) అను నుద్యానమును నిర్మించెనని క్రైస్తవగాథ. ఉద్యాన వనములో పగడపుతీగవలెనే సముద్రములోను విద్రుమములు కలవు. (2) కాళిదాసుముందునుండి మన దేశములో నాటకములు - నాటకరంగములు * - పాత్రవేషధారులు - నవరస భావప్రకటనలు

* (ప్రతాపరుద్రుని ఓరుగంటిలో ఎనిమిదినాటకశాలలు ఉండెనని ప్రతాప చరిత్రమున గలదు.)

ఉన్నవి - సముద్రమున యానపాత్రలు - జలార్థములో రసములు - దృశ్యమానమగు రంగరమ్యత - అన్నియు కలవు. (3) సముద్రములో గొప్ప పాములు, మొసళ్లు, ఎన్నెని ఉంటున్నవి. ఆకాశమునందు నక్షత్రరూపమైన పాము - ఆశ్లేషాహి (Hydra) మొఱయుచుండును; అదేవిధముగా మకరమను మొసలికూడ కలదు. నక్షత్ర విద్యాకోవిదుడగు నన్నపార్యుడు సముద్ర వర్ణనలో జ్యోతిర్గణవర్ణన చమత్కారముగా మేళవించి శ్లేషించినాడు. అతని జ్యోతిర్విజ్ఞానము వేరొకచోట వివరింతును.

నన్నెచోడునికిని శ్లేషోపమల యందు లక్ష్యముకలదు. కుమార సంభవము II-383 లో శరవణ సరోవర్ణనము చూతము:

"అనిమిషాస్పదంబగుట నమృతాన్వితంబగుచు, ఖరదండ సహితం బగుటం గుముదాన్వితంబగుచు, ద్విజావాసంబగుట గుశాన్వితం బగుచు..."

తిక్కన - విరాట. 2-325. విరటుని నాట్యశాల: "చని - వివేక రహితు హృదయంబునుంబోలెఁ దమో దూషితంబును, విదగ్ధవనితా ప్రేమంబునుంబోలె దుర్నిరూప్యంబును, ఘోరాటవీభాగంబునుంబోలె నిర్మనుష్యంబును, గాపురుషలక్ష్మీవిలాసంబునుంబోలె ననుపయోగ్యంబును, నసభ్యస్త శాస్త్రంబునుం బోలె దుర్గమంబును - స్వప్నలబ్ధ పదార్థంబునుంబోలె - సదృష్టి గోచరంబును, విషమకావ్యంబునుం బోలె నస్పష్టాలంకారంబును, బాలిశు రాజ్యంబునుంబోలె జార చోర హృద్యంబును, నైన - యా నర్తనాగారంబు ముఖభాగస్థలంబుచేరి"

నాచన సోమనాథ - ఉత్తర హరివంశ 6-184. శివ - కేశవ - యుద్ధభూమి: నభోవీధియుంబోలె నక్షత్రమాలాలంకృతంబై, పారావారంబునుం బోలె మహాసత్త్వ సమగ్రంబై, త్యాగిగృహాంగణంబునుం బోలె దాన ధారా మనోహరంబై "... ఈవాక్యములలో నొకప్పుడు విషమ - వ్యతిరేకార్థములు ప్రతిపాదించు కూర్పులును గలవు - కైలాసనగరంబునుంబోలె నీశ్వరప్రియంబులయ్యును దుర్వర్ణ మంజులంబులై, మేరుగిరి నితంబంబును బోలె దేవమణి నివాసంబులయ్యును,

నసురా ధిష్ఠితంబులై, సాగరంబునుంబోలె ప్రకటిత నిఖిలావర్తంబు లయ్యును జడమయంబులై .

రామాయణము తెనిగించిన కవులలో హుళక్కి భాస్కర సత్కవి పుత్రుడు మల్లికార్జునభట్టు - బాలకాండమున - నయోధ్యాపురమును వర్ణించు పట్టున నిట్టి రచనల గావించియున్నాడు. 36 వ రచన...

"సదాశివుని దేహంబునుంబోలె దుర్గావరణభూషితంబయి, గగన తలంబునుంబోలె - నినసుత - బుధ - కవి, రాజ - మిత్ర, పరివృతం బయి, భానుమండలంబునుంబోలెఁ బ్రభా భాసురంబయి, అలకాపురం బునుం బోలె నిధాన ధనేశాశ్రితంబయి"...

ఆవచనములోనే - విచిత్ర వ్యతిరేకార్థ విశేషములు గల - ఈక్రింది వాక్యములు గమనార్హములు: "రత్నాకరంబయ్యు భంగ రహితంబయి - ఇనకుల పాలితంబయ్యును భీమ, విజయ ధర్మరాజ సుయోధన యువరాజ విరాజితంబయి, పద్మాకరంబయ్యును విమపంక వర్జితంబయి, సకలగుణాకరంబయి వెలయు ..."

సంస్కృతమున "బాణోచ్ఛిష్టమిదంజగత్" అని కీర్తి గడించు కొనిన కాదంబరికర్త - బాణుననుసరించి, నన్నయభట్టు, ఉపమాన మాలికల కూర్చినాడు. ఉభయుల రచనల ననుకరించి, నన్నెచోడా దులు, పైని తెలిపిన కూర్పులు గావించిరి. శ్రీరామచంద్రుని ఆస్థానకవియు, ఆంధ్ర భాగవత కర్తయునగు బమ్మెఱ పోతరాజు - నైమిశారణ్యవర్ణన, గంగావతరణాది పెక్కుఘట్టములలో నిట్టి చమ త్కార రచనలననేకము చేసియున్నాడు. నైమిశారణ్యము "రామా యణముంబోలె రామమహిషీ వంచక సహితము" అరణ్యపరముగా - దుప్పులు - బర్రెలు - నక్కలు మొదలగు వన్యమృగములతో కూడు కొన్నదని యర్థము - రామాయణపరముగా - రామమహిషి - సీతాదేవిని - మాయచేసి వంచించి రావణుడు తీసికొనిపోవుట తెలు పును - ఇట్టి వాక్యము లనేకములు పోతరాజు భాగవతమున గలవు.

ఈరచనలందు గల శబ్దార్థయుక్తి వైచిత్ర్య విశేషములబట్టి ఇయ్యవి హృద్యములై పాఠకుల నాకర్షించుచుండును. కావుననే -

" తేనెసోక నోరు తియ్యనయగు రీతి తోడ నర్థమెల్ల దోచునట్లు - మృదుమధుర కవితలో 'రాజును, దైవమైన రఘురాము నుతించి" ధన్యురాలయిన, భక్త కవయిత్రి, మొల్లకూడ - తన రామాయణ ములో - నిట్టివాక్యములకెడమిచ్చి కావ్యము సంతరించినది. చూ - ఇవి వచన రచనలు కావు. కాకున్న నేమి? రచయితల భావనా ప్రవాహము ఏమార్గము వెంటపడి పోవుచున్నది మనకు తెలియ నగును చూ. బాల. 28:

సీ॥ మహనీయగుణ సర్వమంగళావాసమై
పొగడొందు కైలాస నగమువోలె
లలితసంపచ్ఛాలి లక్ష్మీనివాసమై
యురవైన వైకుంఠ పురమువోలె"

బాల - 36:

సీ॥ తగ దాన విఖ్యాతి ధరకు బేరులుగాని
సతతాంగకుష్ఠ పీడితులుగారు
కమనీయ గాంభీర్య ఘనసముద్రులుగాని
యతులిత భంగ సంగతులుగారు
ప్రకట విభూతి సౌభాగ్యరుద్రులుగాని
వసుధపై రోషమానసులుగారు
భోగులేగాని పాములెప్పుడునుగారు
సరసులేగాని కొలకుల జాడగారు"

## వర్ణనాత్మకములైన రచనలు

### శ్రీనాథ:

మహాకావ్యములలో - వర్ణనాత్మకములైన రచనలు కొన్ని ఉండకతీరదు. అందు కొన్ని కేవల ప్రకృతి సంభవములైనపర్వత ములు - సముద్రములు - నదులు - ఖగోళ విషయములు - సూర్య,

చంద్ర, నక్షత్ర, ఋతువివరములుగల వర్ణనలు మరికొన్ని ప్రకృతిసాయ ముతో మానవు డొనరించుకొను ఋష్యాశ్రమ కుటీరాదులు. దుష్యం తుడు వేటలాడ వచ్చిన వనములలో కణ్వాశ్రమము వంటివి. మరి కొన్ని కేవల మానవకృతములైన నగరములు - ఇంద్రప్రస్థ - వారణా వతాదులు - కుమారాస్త్ర విద్యాసందర్శన రంగములవంటి రంగ ములు - వివాహవేదికలు - ప్రభువులు ప్రియురాండ్రతో విహరించు కృత్రిమాచల - జలప్రవాహ - సుందరోద్యాన వనాది శృంగార సీమలు - రాజసౌధములు - అంతఃపురములు - సభా భవనములు - మొదలగు విశేషములు - అట్లు నిర్మింపబడిన కట్టడములలో నివసించి మసలు నరనారీజనమును, వారు ధరించు వస్త్ర వాహనాదులను, రూప గుణాదులను వివరించి తెలుపు వర్ణనలు; సమరము, వేట, మొదలగు వారి జీవవ్యాపారములు, విహారములు, మంత్రాలోచనాది వర్ణనలు; వారి మనోవిషయ వర్ణనలు - వారివారిఅనుభవములు, మనస్స్పర్శ - మనోవికారాదుల వివరములు - నవరస విషయములు - ఇటువంటి వన్నియు వర్ణనాత్మక రచనలక్రిందకే వచ్చును. నన్నయ కూర్చిన వచనములలో - ఇట్టివి - అనేక లు గలవు. నన్నయ ననుసరించి, అనుకరించి తరువాతి ఆంధ్రకవులు తమ కావ్యములలో వర్ణనాత్మక రచనల సాగించిరి.

కథావివరణ, సంభాషణ, ధర్మోపదేశాది రచనలకును, ఈవర్ణ నలుగల కూర్పునకును ప్రత్యక్షముగా గొప్పభేదము కన్పట్టగలదు. తక్కిన వానికంటె ఈవర్ణనాత్మక రచనలు సాధారణముగా దీర్ఘ సమాస భూషితములు. క్షీరసాగర మథనమున నుద్భవించిన వస్తు వులం జేర్కొనుచు, నన్నయ (ఆది. 2-16) — "అమృతంబును, జ్యేష్ఠయు, చంద్రుండును, శ్రీదేవియు, నుచ్చైశ్రవంబును, కౌస్తుభంబు నాదిగా ననేకంబు లుద్భవిల్లిన నందు త్రిభువన వంద్యయైన శ్రీదేవియు నిజప్రభాపటల పర్యుదస్తప్రభాకరగభస్తి విస్తరంబైన కౌస్తుభంబును, నారాయణు వక్షస్థలంబున విలసిల్లె" నని కౌస్తుభ మాణిక్యము నొక దీర్ఘ సమాసమున వర్ణించినాడు.

సమాస పరిచయములేని పాఠకులకు - అవి సాధారణముగా నర్థముకాక - చికాకు కలిగించి, గ్రంథమునందు వెగటు పుట్టించుట సహజమే - కాని నేర్పుగా కూర్చబడిన పక్షమున - వానియందొక గొప్ప సుగుణమున్నది.

" It has a charm and verve of its own This artifice of crowding words in a compound minīmises the etymological difficulties of a syntactical language like Sanskrit " (Sri K. Kasturi Ranga Aiyanagar's introduction. Paged- to Subhannu's Vasavadatta)

సంస్కృతశబ్ద స్వభావ, భాషాతత్త్వములనుబట్టి, ఆభాషలో సమాస బహుళములైన రచనలు సంగ్రహ శీలములు, శ్రావ్యములు, మనోజ్ఞములునై యొప్పుచున్నవి - "సమాస భూయిష్ఠతయే రచనకు ఓజోగుణము ప్రసాదించును; గద్యకావ్యములకు జీవనమదియే" అని- దండి - మహాకవి నిర్వచించెను. "ఓజః సమాస భూయత్స్వమేత దద్గత్యస్య జీవితమ్" దండిమార్గము ననుసరించి తెనుగుకవులు సమాస బాహుళ్యముగల రచనలతోనే గద్యకావ్యములు రచించిరి. భాషా సాంప్రదాయవేత్త యగు నన్నపార్యుని వచనములలో సమాస రచన మెంతో మనోజ్ఞముగా నడచినది; కాని తరువాత రచింపబడిన కావ్యములలో - ఔచిత్యమువిడిచి - బోదకాళ్ళవంటి సమాస రచనల మూలముగా సారస్వత వికాసమును జెఱచిరి. ఇటీవలి - ప్రబంధ కవులరచనలలో ఈదోషము మిక్కిలి విజృంభించినది.

## ఔచిత్య - మాధుర్యములు

కేవల శబ్దసంబంధముగల - అక్షర మాధుర్యముకంటెను - రమణీయతరమైనది - ఔచిత్య - అర్థమాధుర్యము. ఉత్తమపాత్రల శీల గౌరవములను వర్ణించు పట్టున నౌచిత్యము పాటించుచు, అర్థగౌరవముల నతిశయింప చేయు పదముల నేర్చికూర్చుటచేత, కవికి, కావ్యమునకు, అందలి ఉత్తమ పాత్రల శీలౌచిత్యములకు, గౌరవభావములకును కూడ, మేలుగలుగును. ఈవిషయమున మహాకవి కాళిదాసును,

ప్రబంధ కవులును కూడ నిందార్హులే. "జగతః పితరౌ వందే పార్వతీ పరమేశ్వరౌ" విశ్వమునకు జననీజనకులగు పార్వతీ పరమేశ్వరుల దాంపత్యమర్మములను - లజ్జవిడిచి వర్ణించిన కవిని గర్హించకతప్పదు. మన ప్రబంధకవులును రతివర్ణనమనుపేర నసభ్యవ్రాతల వ్రాసిరి. శ్రీనాథునాక్షేపించుట పరిపాటి యైనది; కాని భక్తాగ్రేసరుడు - పోతరాజు - (పురూరవునిపై నాగ్రహించిన ఊర్వశినోట పలికించిన మాటలు చదువునపుడు) - బావగారికంటె ఏమితక్కువతినె ననిపించక మానదు.

కాని మహానుభావుడు - నన్నయభట్టారకుడు - ఏపట్టునను అట్టి యసందర్భములకు తావియ్యక, పాత్రల గౌరవించి, ఆత్మగౌరవము కాపాడుకొని మనకెంతేని వంద్యుడగుచున్నాడు. రెండుదాహరణము లిత్తును :

i. ఆరణ్య 1-366. ఈఘట్టమునందు ఊర్వశి - అర్జునుని పిశాచము వలె పట్టుకొని - పెడత్రోవ కీడ్వవలెనని ఎంతో ప్రయత్నించినది - కాని నిర్వికార ధైర్యధుర్యుడు - అర్జునుడు- అణుమాత్రమైనచలింపక- తన్ను పీడించు నూర్వశితో నిట్లనెను. "నేను కర్మభూమిం జనియించి కర్మఠుండనైతి. నాకు నిచ్చటి యాచారంబు ఉచితంబుగాదు. మదీయ వంశకర్తయైన పురూరవునకు పత్నివైన కారణంబునను, బురందరు నకు బరిచర్య యొనర్చుటను, నాకు జనని వగుటకు సందియంబులేదు." ఈరచనలో ఊర్వశి-ఇంద్రుని-అప్సరస-యను శృంగార భావము తోప నీయక-పరిచర్య యని నుడివిన అర్జునుని శీలము సర్వవిధముల నుచిత మును గౌరవార్హము ననుటకు సందేహము లేదు. సందర్భోచితముగా అక్కడ ఆ పదమును ఉపయోగించుట - లోకవంద్యుడగు నన్నయ భట్టారకునికే చెల్లినది.

ii. యయాతి - శర్మిష్ఠ. ఆది 3-172, 174 : అని విచారించు చున్న సమయంబున, దాని పుణ్యస్వరూపంబు సన్నిహితంబైన యట్లొక్కనాడు యయాతి - యశోక వనికాలోకన తత్పరుండై వచ్చువా - డేకతంబున నున్న శర్మిష్ఠంగనిన - నదియును సంభ్రమ

వినయావనత వదనయై, తనవలన నమ్మహీపతి ప్రసన్న చిత్తుండగుట యెరింగి, కరకమలంబులు మొగిచి...అద్దేవయానిం బరిగ్రహించి నప్పుడ తద్ధనంబనగుట నేనును భవత్పరిగ్రహంబ కావున నన్నుం గరుణించి నాకు ఋతుకాలోచితంబు బ్రసాదింపవలయునని" ఇందు శర్మిష్ఠ, యయాతివలన బుత్రలాభము నభిలషించిన విధము నిర్దోషముగ - సమార్దవముగ వర్ణించి అర్థగౌరవమును పోషించి మాధుర్యపూరితము గావించెను.

## కుఱుచవాక్యములు గల రచనలు

వర్ణితాంశముల గుణవిశేషములనుబట్టి వర్ణనాత్మకములైన వాక్యముల నెంతదీర్ఘములుగానైన రచింపవచ్చు; కాని మానవులు సంభాషించుకొనునప్పుడు మాత్రము - పెక్కు కుఱుచ వాక్యములు దొర్లుట సహజము. మనస్సు మిక్కిలి కలతజెంది, ఆందోళన బడుచున్నప్పుడు ఆ స్థితి ననుసరించి, రచనకూడ, లఘువాక్య యుక్తమే అగుట సహజము. రాజ సభలో దుష్యంతునిచే నిరాకరింపబడిన శకుంతల అవస్థను చూతము (మహాభా. ఆది. 4-77) "అనిన విని, వెలువెల్లనై, వెచ్చనూర్చి, నిశ్చేష్టితయై ... బాష్పకణంబులు దొరంగ ..."

(ii) పావురమును తఱుముకొని వచ్చిన డేగ, శిబిచక్రవర్తితో నెట్లువాదించినదో చూడనగును :—(ఆం. మహాభా. అరణ్యా. 3-229-233). డేగ : "సర్వభూతంబులు నాహారంబున జీవించి వర్ధిల్లు, నిది నాకు భక్ష్యంబుగానినాడు బుభుక్షావేదనంజేసి ప్రాణ వియోగంబగు, నట్లయిన నా పుత్రులు భార్యయు జీవింపనేరరు. ఒక్క కపోతంబు రక్షించి పెక్కుజీవంబులకు హింసచేయుట ధర్మవిరోధంబు. ఇక్కపోతంబు నాకు వేదవిహితంబైన ఆహారంబు : "శ్యేనాః కపోతాన్ ఖాదయంతి" యను వేదవచనము గలదు. కావున దీని నాకు ఆహారంబుగా నిమ్ము" అనిన దానికి శిబి యిట్లనియె : (233) "నీవు

పక్షివయ్యును ధర్మమెఱింగినట్లు పలికితివి; శరణాగత పరిత్యాగంబు సేయుటకంటె మిక్కిలి యధర్మం బొండెద్ది? నీ యాకలి దీననకాని యొంట నుపశమింపదే? నీ యత్నం బాహారార్థంబేని, యిప్పుడివ్వనంబున మృగ మహిష వరాహ ఖగ మాంసంబులు దీనికంటె మిక్కిలిగా బెట్టెద - నిక్కపోతంబువలని యాగ్రహంబుడుగుము."

ఈఘట్టములో నన్నపార్యుడు ముందు శ్యేన పక్షమునను - పిమ్మట కపోత పక్షమునను - న్యాయవాదియై - న్యాయపీఠమునెదుట యుక్తియుక్తముగాను, సప్రమాణముగాను, సలిపిన వాద ప్రతి వాదముల ప్రాశస్త్యము స్వయంవ్యక్తము. సుమారు ఏబదేండ్ల క్రిందట చరిత్రాత్మకముగా జరిగిన అరవింద ఘోషు - విచారణ కథ నీ రచన జ్ఞప్తికి తెచ్చుచున్నది - అరవిందులు దోషియని నార్టన్ దొరయును, నిర్దోషియని చిత్తరంజనదాసుయును - చేసిన వాద ప్రతివాదములు నాకీపట్టున స్ఫురణకు వచ్చుచున్నవి.

సంస్కృత మూలభారతమున గల శ్యేనకపోతీయ కథ చదివిన తరువాత - నన్నయ రచన చదివిన పక్షమున - ముఖ్యాంశముల విడువక, అతడెంతనేర్పుతో కథను సంగ్రహపరచి స్ఫుటీకరించెనో, ఎంత రమణీయముగ భారతము తెనిగించెనో విశదము కాగలదు. నన్నయ విరచితములగు సంభాషణలు, సంవాదములు, వాద ప్రతివాదములు, చర్చలు, భావోపన్యాసములు, ధర్మోపదేశ, కర్తవ్యోపదేశములు గల రచనలన్నియు నీవర్గముక్రిందకే రాగలవు.

## యాత్రా చరిత్రలు

ప్రకృతి సౌందర్య విశేషములచేతను, శోభాదీప్తులచేతను, నేత్రపర్వమొనర్చు దివ్యదృశ్యములు - పర్వతసానువులు, నదీప్రవాహములు, జలపాతములు గల రమణీయప్రదేశములలో, భగవద్విభూతి, విశేషముగా నుండునను విశ్వాసముచేత, నవి దివ్యస్థలములని ప్రసిద్ధి. ఆయా దేశములలో - ప్రజాజీవనపద్ధతులు - ఆచారవ్యవహారములు - దివ్యశిల్పములు మొదలగునవి సందర్శించుటే - ఒక విశిష్ట విద్యా

భ్యాసము. దేశాటనముచేసినగాని - విద్య పూర్తి కాదని బహుదేశముల్లలో ప్రాజ్ఞుల నిశ్చితాభిప్రాయము. స్వయముగా నొకడు దేశాటనము చేయజాలకున్నను, చేసివచ్చినవారివలన యాత్రావిశేషముల వినుటయు కొంతమేలె. ఈ మానవ స్వభావమును - ఆంధ్రకవితా పితామహుడు, అల్లసాని పెద్దన, మనుచరిత్ర కావ్యప్రారంభమున చక్కగా వర్ణించినాడు. ప్రవరుడు - (మను. 1-57). సీ॥ తీర్థసంవాసులేతెంచినారని విన్న నెదురుగా నేగు దవ్వంతయైన;...మృష్టాన్న సంతృప్తులజేసి, కూర్చున్నచో చేరవచ్చి, "ఇద్ధర గల్గు వసధి పర్వత సరిత్తీర్థ మాహాత్మ్యముల్ దెలియనడుగు"...Do. 68 - శా॥ "ఏయే దేశములన్ వసించితిరి? మీ రేయేగిరుల్ చూచినారు? ఏయేతీర్థములందు గ్రుంకిడితిరి? ఏయేద్వీపముల్ మెట్టినారు? ఏయేపుణ్యవనాళి ద్రిమ్మరితిరి? ఏయేతోయధుల్ డాసినారు? ఆయాచోటుల గల్గు వింతలు మహాత్మా! నాకెఱింగింపవే?" "పోయి సేవింపలేకున్నఁ బుణ్యతీర్థ మహిమ వినుటయు నఖిలకల్మషహరంబ! కానవేడెద"నని యర్థించినాడు.

భారతకథలో - తీర్థయాత్రకు ముందు దారితీసినవాడు - అర్జునుడు. తరువాత, వనవాసకాలములో ధర్మజ, భీమ, నకుల, సహదేవులు గూడ తీర్థయాత్రలు చేసిరి. కురుక్షేత్ర యుద్ధమున - బంధుజన పోరాటములో పాల్గొనుట కిష్టపడక - బలరాముడు తీర్థయాత్రలు సేవించి - భీమదుర్యోధను లతని శిష్యులగుట - వారి గదాయుద్ధవేళకు - యుద్ధభూమి కరుదెంచెను. అటుపిమ్మట యాదవక్షయము - తననోటితో చెప్పుటకు ఇష్టపడక, విదురుడును తీర్థయాత్ర సాగించెను.

భరతభూమి - ఐశ్వర్యమునకు ఈర్ష్యగలవారై - వాస్కోడాగామా, కొలంబస్ - అమెరిగో వెస్పుక్కి - కుక్కు - డ్రేకు మొదలగు సాహస చరిత్రులు క్రొత్తదేశముల కొఱకు వెదుకజొచ్చిరి. మంగోపార్కు, బేకరు, లివింగ్‌స్టన్ - స్టాన్లీ మొదలగు ధీరులు చీకటి కోణమువంటి ఆఫ్రికాఖండమును భేదించిరి; భూగోళపు ఉత్తరదక్షిణ ధ్రువములను అత్యంత ధైర్యసాహసములతో నిర్ణయించిరి. ఆ వివర

ముల నెఱిగించు కథలు, చరిత్రములు, పాశ్చాత్య వాఙ్మయములకు అమూల్యములైన అలంకారములు. యాత్రాచరిత్రలు ప్రతిదేశము యొక్క సారస్వతములో ముఖ్యస్థానము బడసి వన్నెకెక్కుచు, క్రొత్త సాహస 'విక్రమార్కుల' ను తయారుచేసి, ప్రపంచాభ్యుదయమునకు తోడ్పడుచున్నవి.

మానవజాతికి క్రొత్తప్రదేశముల కనిపెట్టవలెనని అభిలాష — భూగోళపరిశోధనతో తీరలేదు — తారాజువ్వలవలె మింటికెగయు సాధనములద్వారా చంద్రమండలమును చేరవలెననియు, భూపుత్రుడగు అంగారకగ్రహములో గల కాలువలఒడ్డున — గోదావరి, కోనసీమలోవలె, వలస లేర్పరచవలెనను భావమును — ప్రబలుచున్నవి. ప్రకృతిశాస్త్రములు, ఖగోళ విజ్ఞానమును, అభివృద్ధి చెందినకొలది, ఆసంబంధముగల వాఙ్మయమును వృద్ధినొందగలదు. యాత్రావివరణశీలములైన వచనగ్రంథములు తెనుగుబాసలోచాలగా పెంపొందినవి — వానింగూర్చి ముందొక ప్రకరణమున ప్రశంసించి తెలిసికొందము.

## ప్రకృతిశాస్త్ర విషయములైన వచన రచనలు

ప్రకృతిశాస్త్ర విషయములను బోధించు వచన రచనలు, నన్నపార్యుడు రచించిన ఆంధ్రభారతకృతిలో పలుతావుల గలవు. నూఱు సంవత్సరముల క్రిందట - మద్రాసు, బొంబయి, కలకత్తా యూనివర్సిటీలు ఏర్పడిన తరువాత, పడమటి ప్రకృతిశాస్త్రాధ్యాపకులు, తాము బోధించువఱకు, భారతీయులకు ప్రకృతిశాస్త్ర విజ్ఞానము "లేశమైన లేదను" నస్పృతవాక్యములు, నిత్యమును, చెవులు దిమ్మబట్టునట్లు, అదేపనిగా, చెవులలో నూరిపోసిరి. అవి నిజములని మనవారు భ్రమపడుచున్నారు. నన్నయ రచించిన తెనుగు వచన భాగములందు ప్రకృతిశాస్త్ర విశేషములు ఈక్రింద చూతము :—

(i) ఆరణ్య-1-39. "కమల బాంధవుడు ఉత్తరాయణ గతుండై యుర్వీరసంబు పరిగ్రహించి, దక్షిణాయనగతిం బర్జన్యభూతుండై, యోష

ధులం బడసి, రాత్రులందుఁ జంద్రకిరణామృతంబునంజేసి వానిం దడు పుచు, వర్ధించి, యం దన్నంబు పుట్టించి, ప్రజాప్రాణధారణంబు సేయుటం జేసి, అన్నం బాదిత్యమయంబని యెఱింగి... The Sun is the source of all food and energy in the world.

(ii) సూర్యకాంతి - ఏడురంగుల సంపుటి. ఏడురంగులును, ఏడు గుఱ్ఱములని, అవి తోబుట్టువులై సూర్యుని రథమును లాగుచున్నవని- కాబట్టి సూర్యుడు సప్తాశ్వుడని - వేదమును, పంచమవేద మగు భారతమును, ఘోషించుచున్నవి - గరుడుడు సప్తమారుతజవమున సప్తాశ్వ మండలముదాక నెగసెడివాడు. ఆది. 2-43.

(iii) సూర్యకాంతికి గల వేగము విశ్వములో మరి దేనికిని లేదని ఋగ్వేదము 1. 50-4 " తరణిర్ విశ్వదర్శతో " మంత్రముచాటిచెప్పు చున్నది. సంస్కృతమూలభారతములో లేకున్నను - " నానాపురాణ విజ్ఞాననిరతు " డగు నన్నపార్యుడు తపతి సంవరణోపాఖ్యానము - ఆది. 7-87 లో - " నిమిషార్ధములో సూర్యరథము రెండు వేల యోజ నము లరుగగలదని " ఖండించి తెలిపెను. ఈ యంశము చెన్నపట్టణ ములో ముద్రితమైన ఆంధ్ర భారత ప్రతులలో లేదు. జయపుర మహారాజు, శ్రీ విక్రమదేవవర్మ, " సాహిత్యసామ్రాట్ " వారును, " తెనుగు నలువ " - శ్రీ మారేపల్లి రామచంద్రశాస్త్రిగారును తాళ పత్ర ప్రతుల సాయముతో పరిష్కరించి ప్రకటించిన భారతములో మాత్రము ముద్రితము - ఈ వెలుగువేగమునే, తరువాత - కాశీ ఖండమున - సూర్యలోక వర్ణన సందర్భమున కవిసార్వభౌమ శ్రీనాథు డును, కిష్కింధాకాండము తెనిగించిన మల్లికార్జున భట్టును, నేడు " ఆదిత్యహృదయ " మును అర్థముతో ప్రకటించిన ప్రకాశకు లును, దేశవ్యాప్తముగా ప్రాకట్యమునకు తెచ్చిరి. పాశ్చాత్య పరి శోధకుల వెలుగు వేగ నిర్ణయమునకు ఈలెక్క సరిపోవుచున్నది. నన్నయ్యభట్టు తరువాత మూడుశతాబ్దముల నాడుండిన వేద వ్యాఖ్యాత - విద్యారణ్యులు - పై నిర్వాసిన వేదమంత్ర వివరణములో -

నిదే సంఖ్య నుదహరించుట ఆశ్చర్యకరము ; ఆంధ్రులు మిక్కిలి సంతోషించవలసిన విజ్ఞాన విషయము.

ఈవెలుగు - సూటిగా - ఋజురేఖా మార్గమునబోక - మెలికలు తిరుగుచు బోవుపామువలె - "ఊర్మయః" - కెరటములట్లు - అనగా (wave-motionతో) ముందుకు సాగునని వేదము ఘోషించుచున్నది - సూర్యుని రథమునకు రంగులగుఱ్ఱములు - పాములచే కట్టబడునవి గాని - పగ్గములచే కట్టబడలేదని - 'భుజగనమితా సప్తతురగాః' అని సాభిప్రాయముగా అలంకార భాషలో తెలుపబడినది.

(iv) Evoluti on-of Organic life : వృక్షాది జీవుల పరిణామ క్రమము - ఉత్పత్తిక్రమము :— ఆది 3 - 19. "మఱియు గర్భయోని యందు ఋతుపుష్పరససంయుక్తం బగుచు రేతంబు గాడ్పుచేతం బ్రేరితంబయి, కలసిన నందు బంచతన్మాత్రలు పొడవయి, క్రమంబున నవయవంబులేర్పడి, లబ్ధజీవులై యుద్భవిల్లి, శ్రోత్రంబుల శబ్దంబును, నేత్రంబుల రూపంబును, ఘ్రాణంబున గంధంబును, జిహ్వను రసంబును, త్వక్కున స్పర్శంబును మనంబున సర్వంబును నెఱుంగుచు."

(v) గర్భధారణవేళ పరిసరమును, తలిదండ్రుల దేహమనఃపరిస్థితులను శిశువుయొక్క దేహమనోలక్షణముల నేర్పఱించు విధ మీక్రింద సూచింపబడెను :— ఆది 4-252 : — "వ్యాసుని కపిలగడ్డము, కపిల జడలు కపిల కన్నులు, నల్లని దీర్ఘతనువును చూచి, భయపడి, అంబిక - కన్నుంగవ మొగిచి తెఱవక యుండె. ఆమెకు బలపరాక్రమ వంతుడు కొడుకు పుట్టినను, మాతృదోషమున, వాడు - (ధృతరాష్ట్రుడు) అంధుడయ్యెను... అంబాలికకా యమ్మునివికృత వేషమునకు వెఱచి వెల్ల నగుటచేత - కుమారుడు - పాండుదేహుడై - పాండురాజన బఱగెను

(vi) ఆరణ్య 102 - 20 మొ॥ 25 వఱకు సంస్కృత మూలమున లేకున్ననునన్నయ ఆంధ్రమహాభా - ఆరణ్య 3-13 రచనలో - ప్రాణి కోట్లు కొన్ని గ్రుడ్లనుండి పుట్టి పొదగబడుటయు, మానవులు తల్లిగర్భమున మావిలో పెరుగుట - నల్లులు - పేలు మొదలగుజీవులుచెమట

నుండి పుట్టుటయు, ఓషధులు, వృక్షజీవులు కూడ ప్రాణులేనని వివరించి నాడు - భారతీయవైజ్ఞానిక శిఖామణి - జగదీశచంద్రబోసు నిరూపించు దాక పడమటి శాస్త్రవేత్తలు ఈ రహస్యము నెఱుగరు. భారతీయు లనాదినుండి ఈ ప్రకృతి సత్యము నెఱుగుదురు.

ఆంగ్ల మానస పుత్రులగు మన పట్టభద్రులు - మనపూర్వ ఋషుల యందును - వారు రచించిన గ్రంథములందును - నిష్కారణముగా దురభిమాన పూరితులై వారిని నిందింప తగదు. జాగ్రత్తగా పరిశీలించిన పక్షమున నేటి పాశ్చాత్య వైజ్ఞానికులు నూతనముగా కనుగొనిరని భావించు కొనుచున్న ప్రకృతి సత్యములు, చాలవఱకు, rediscoveries - పునర్జ్ఞాతములుగాని - మానవ విజ్ఞాన చరిత్రలో తొలిసారిగా మొట్టమొదట తెలిసికొన్నవి (original) కావని - నిజము తేలగలదు. ఈ గ్రంథములో నిటు పై నొక ప్రకరణములో ఈవిజ్ఞాన శాఖకు చెందిన గ్రంథములెట్లు వ్యాప్తి చెందుచున్నవో పరిశీలింతము. ఈప్రస్తావనకు సంబంధించిన ఉపక్రమణ వాక్యములుగా మాత్రము మీాద కొంత వ్రాసితిని.

## నన్నయకృత భారతమునగల మరికొన్ని రచనావిశేషములు

(౧) సజాతీయపద - సాభిప్రాయ విశిష్టములైన వచన రచనలు నన్నయ కూర్పులో విశేషముగా గలవు. చూ. సభా. - 1-253: "శాస్త్రవిహిత దండంబు దండింప బోయిన"; ఆది 5-125: 'అంశుమంతు నంశము'; ఆది 6-300: 'సుర హాస్తి హస్తాను కారంబైన సవ్య హస్తము'; అరణ్య 3-311 'కమలంబు దెచ్చిన గాడ్పున కభిముఖుండై గాడ్పు పట్టి... ఆది- 6-170. 'వాయు నందనుండు వాయు వేగంబున' ... నన్నెచోడుని కుమారసంభవ మీా సజాతీయ పదరచనలకు పుట్టినిల్లనదగినంత విశేషముగా నాతని రచనలలో కానవచ్చునని సకార్ణింతును.

(౨) యమకాదులచే రమ్యములగు రచనలు :- సభా 1-192 "నిఖిల ప్రజాక్షయకారణంబగు రణంబగు :" ఆరణ్య 1-127 : "బదరీ వనంబు న పవనంబు". ఇటువలె రమ్యములగు రచనలతో మన కొలకు నన్నయ భట్టారకుడు భారతమును తెనిగించినాడు. "అఖిల సత్త్వశరణ్యంబైన యీ యరణ్యంబు" అని చిన్నయసూరి మిత్రభేద మున ననుకరించినాడు.

భారతము పంచమవేదమని జగత్ప్రశస్తి బడసినది. అందు దొర్లిన ప్రక్షిప్తాది దోషముల పరిహరించి, సంస్కరించి సరియైన పాఠము లతో భారతము ప్రకటించుటకు — పూనా (పుణ్యనగర) స్థిత - భాండార్కర్ సంస్థ - చిరకాలమునుండి మహాద్భుతపరిశ్రమ చేయుచు జగత్ప్రఖ్యాతి వడయుచున్నది. విద్యలందు నిజమైన అభిమానము గల అమెరికా సంస్థలుగూడ - ఆ సంస్థకు ఆర్థికముగా తోడ్పడి-చేయూత నొసగి కీర్తిగడించుకొనినవి. రష్యా-సోవిట్ ప్రభుత్వముకూడ వారి దేశభాషలోనికి భారతమును పరివర్తనము చేయింప కృషిచేయు చున్నది. సర్వకాలమును, సర్వత్ర పూజ్యములగు భావములందు ఉండుటచేతనే - భారతమిట్లు - లోకాదరమునొంది - సన్మానింప బడుచున్నది.

చతుర్విధ పురుషార్థ సిద్ధికి భారతము చక్కని సాధనమగుటయే గాక - భారతకావ్యరత్నము రాజనీతి బోధకమై - రాజనీతివేత్తలగు సమస్త దేశాధీశులకు శిరోధార్యమగుచున్నది.

యావత్ప్రపంచమును గెలిచివత్తునని భుజాస్ఫాలన చేయుచు బయలుదేరిన ( Alexander ) అలెగ్జాండరను వీరచూడామణి - ప్రసంగ వశమున - హోమరను యవనకవి రచించిన 'ఇల్లియడ్' కావ్యము "సమర విజ్ఞాన భాండాగారమ" ని ప్రశంసించెను. ఇల్లియడ్‌కంటె పలురెట్లు పెద్దదైన భారతకావ్యము, ఆ దృష్ట్యా పరిశీలించితిమేని - అంతకంటెను మిక్కిలి విజ్ఞాన ప్రదమైన రాజవిద్యా భాండాగారమను టకు సందేహములేదు. రాజనీతిమాట నటుంచి - నీతిదృష్ట్యా చూచి

నను - ఆకావ్యరత్నము - సమస్తపాపఘ్నమైన పుణ్యకథ ; ఆయుర్వృద్ధికరము ; ఐహికాముష్మిక శ్రేయోదాయకమైన దివ్యప్రబంధము ; ఆధ్యాత్మికముగా వేదవేదాంత సారమని వాకొనదగు మేటిగ్రంథము ; కావుననే దానిని ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రమనియు, వేదాంతులు వేదాంతమనియు, నీతిజ్ఞులత్యుత్తమ నీతిశాస్త్రమనియు, కవితల్లజులు మహాకావ్యమనియు, లక్షణవేత్తలు సర్వలక్ష్యసంగ్రహ మనియు ఇట్లు ప్రాజ్ఞులనేకులు అనేకవిధముల ప్రశంసించుచున్నారు.

ఆంధ్రపండిత పామరకోటి కొఱకు దానిని తెనిగింప సమకట్టిన నన్నయభట్టారక మహర్షి - మూలగ్రంథముయొక్క ప్రాశస్త్యమును ఎప్పుడు, ఎక్కడ, ఏవిధముగా అతిశయింప చేయవలెనో గుర్తెఱిగి - తనలక్ష్యము నేమఱక - శ్రద్ధాభక్తులతో పరిశ్రమించి పనిచేసినాడు. అతని వాక్యము లెక్కడ చూచినను - ఉదారభావ విభ్రాజితములను టకు రెండు ఉదాహరణముల చూతము :- 1. కణ్వాశ్రమము. ఆది - 4-21... "పుణ్యానదీ తీరంబున తద్దయు రమ్యంబైన నరనారాయణ స్థానంబునుం బోలె, జగత్పావనంబగుచున్న, కణ్వ మహామునీంద్రుని ఆశ్రమము" జగద్వంద్యులగు కృష్ణార్జునులు పూర్వమొకప్పుడు అనేకాయత వర్షములు తపస్సుచేసి పునీతముగావించిన తపోవనమువలెనే - కణ్వాశ్రమమును రమ్యము, పావనము ననివర్ణించుటచేత రచన ఔదార్య గుణ శోభితమైనది. (ii) ఆది 6-227 ; వేదవ్యాసుడు, తనకోడలు - కుంతీదేవి నూరార్చి, ఇట్లుపలికెను :-

నీ కొడుకులు ధర్మనిత్యులు. ఈయుధిష్ఠిరుండు నారాయణు భుజంబులం బోని తన నలువురు తమ్ముల బలంబున సర్వపార్థివుల శాసించి, సార్వభౌముండై రాజసూయ, అశ్వమేధాది క్రతువులుచేసి..." జగత్ప్రభువు, చతుర్బాహుడునగు నారాయణుడు తన నాలుగింటిలోను - ఒకచేత-గదను - మరొకచేతను - శార్ఙ్గమను ధనువును, ఒకచేత ఖడ్గమును ధరించినవాడు. ధర్మజు ననుజులలో - భీముడు గదను, అర్జునుడు గాండీవ ధనువును, కవలు ఖడ్గమును ధరించి - పరాజయములేని నారా

యణ భుజములట్లున్నారని - సాభిప్రాయముగా వర్ణించి - వాక్యము నకు ఔదార్యగుణము నలవర్చెను.

నన్నయభట్టారకుని రచనలో గోచరించు మేలిలక్షణములు మరి రెండింటిని గూర్చి ప్రశంసించవలసియున్నది. అతని కూర్పులలో అతిశయోక్తులు కానరావు. అతనిది - స్వభావోక్తులతో లలితమై, కాంతిచే చెన్నుమీరి, మనోజ్ఞమై అలరించగల - శైలి. క్లిష్టార్థ దూషితములైన రచనలపొంత బోక - మారుమూలపదముల నేర్చి కూర్చక - భాషలో సుప్రసిద్ధ పదములతో ఇంపుగ రచించిన వాక్య ములు ప్రసాదగుణముతో నొప్పుచుండును. ఆది 5-128. త్రిమూర్తుల వంటి కొడుకులు - మువ్వురు - ధర్మజ - భీమార్జునుల బడసి - పాండు రాజు - భువనత్రయరాజ్యంబు వడసినంత సంతోషించి సుఖించెనని ఇందులో చెప్పబడినది.

## ఉత్ప్రేక్ష

నన్నయ ఉత్ప్రేక్షగల వాక్యములు గూర్పకపోలేదు; గాని అవి స్వభావ విరుద్ధములగు నతిశయోక్తులుగావు. కవి వర్ణించు నగరములో మేడలు ఎత్తుగలవి; కాని అవి చంద్రుని మార్గమున కడ్డుతగిలి - చంద్రునిలోగల శశకమును ఆ మేడయజమానుల 'వంటయింటి కుందే లును' చేయబూనడు. తపతి సంవరణోపాఖ్యానమునగల ఈక్రింది వాక్యముల చూతము. ఆది 7-75 ("ఇట్టి లతాలలితాంగిఁజూచి యే నెఱుఁగ సురేంద్ర కన్యలును నిట్టిరె రూపవిలాస సంపదన్) - అని విత ర్కించుచు మదనకర్కశమార్గణ లక్షీభూత చేతస్కుండయి - (౧) తదీ యగుణమయ పాశబద్ధుండునుం బోలె గదలనేరక (౨) తన్నివేశిత మానసుండునుం బోలెఁ దన్నెఱుఁగక (౩) తద్రూపామృత పానంబున నిమిషత్వంబు వొందిన తన నయనంబులు దానియందె నిలిపి, సంవరణుం డక్కన్యక కిట్లనియె

ఈ వాక్యములలో - మహారాజకుమారుడు - ఒకయువకుడు - తనాకర్షించిన మిక్కిలి చక్కనియువతిని చూచినపు డతని చిత్త

వృత్తిని స్వభావసిద్ధముగా నన్నయ వర్ణించినాడు. ఈ రచనయొక్క ప్రాశస్త్యమును గ్రహించి - చిన్నయసూరి, మిత్రభేదములో ఆషాఢ భూతి - తనగురువు ఆర్జించిన యర్థమును, నిగూఢముగా దాచుకొనిన బొంత - మీఁదకన్ను వేసిన విధమును- శ్లేషోక్తులతో రమ్యముగాఁగూర్చి - నన్నయభట్టునకు జోహారు చేసెనని గ్రహింతము. చిన్నయసూరి వాక్యముల నీక్రింద వ్రాయుచున్నాను - "ఒక్క మాయావి యామ స్కరిధనంబు తస్కరింపఁగోరి... యాతండు వార్చుచ్చు ధర్మంబులు తదేకాగ్రహృదయుండుంబోలె నాలకించుచు, విలక్షుండుంబోలె దూరిత తారళ్య విస్తారిత నయనుఁడగుచు,...నిర్భరానంద వివశుండుం బోలె సబాష్పనిమీలిత లోచనుండగుచు ... నేనాషాఢభూతి యనువాఁడ; తమయందు గుప్తంబై యనన్యసాధ్యంబయిన యర్థంబు తమకు శుశ్రూష యొనరించి పడయం గోరినవాఁడ"

ఈవాక్యములను నన్నయ వాక్యములతో పోల్చి చూడవలయును; నన్నయ తీర్చిన ఒరువడి ననుసరించి, చిన్నయసూరి రచన సాగించెనని స్ఫురింపకమానదు.

తెనుగుభాష తీరుతీయములు గలదని ప్రశంసింపబడుటకు కారణము సంస్కృంత - ఆంధ్ర - పద గుంభనమేనని భాషావేత్తలు పలువురు అభి ప్రాయపడుచున్నారు. దీనినిట్లు తీర్చిదిద్దుటకు కృషిచేసిన మహనీయు లలో - నన్నయ భట్టారకుడే ప్రథముడు అతని వాక్యసరణి - అప్పుడే చిలికి యెత్తిన నవనీతమువలెనే మిక్కిలి హృద్యము - ఆస్వాద్యమ్మునై ముద్దులొలుకు చుండును. ఒక్కొక్క ఘట్టమున దీర్ఘసమాసమున కెడమిచ్చినను - అసమాసరచనకూడ - మృదువు, కోమలము, స్నిగ్ధము నై యొప్పారు చుండును. నిండుమనంబు నవ్యనవనీత సమానము. (ఆది 1-99) అనుటే పైవాక్యము యథార్థమని ఋజువు చేయఁగలదు. రససహకారమగు శబ్దలాలిత్యము నన్నయసొమ్ము. కావున నన్నయ వచనములు - మృదువులై, అర్థగౌరవ యుక్తములై, ద్రాక్షపండ్ల వలె మధురములై ఇంపుగులుకు చుండు.

నన్నయభట్టు సగబాలు వచన రచనగల చంపూః కావ్యముగా భారతము రచించి - యదార్థ కవితకు పద్య, గద్య, రచనా భేదము పాటింప నవసరము ఉండదని యాతడు సంస్థాపించినాడు; ఇటీవల నాంగ్ల ప్రముఖ పాశ్చాత్య వాఙ్మయములలో వచన రచనలెన్ని విధముల వ్యాపించి పెంపొందెనో - ఇంచు మించుగా నన్ని విధములలో వచనముల రచించి తెనుగు జాతికి మార్గ దర్శకుడై మనకు వంద్యుడగు చున్నాడు - నన్న పార్యుడు.

మనువులు పదునాల్గురిలో - ఏడవ వాడగు వైవస్వతుని నౌక- భావిసృష్టి కగత్యమగు సమస్త బీజవస్తు పరిపూరితమని పురాణ ప్రసిద్ధము. బైబిల్ గాథలలో కూడ - నోవా - నౌక (Noah's Ark) అదేవిధముగా భావిసృష్టికి అత్యవసరమగు బీజ ప్రపూర్ణమని తెలుప బడినది. మన ఆంధ్ర వాఙ్మయములో పలు శాఖలలో బహు ప్రకారముల, పెంపొందగల వచన రచనలు బీజప్రాయముగా నన్న పార్యుని భారతకృతిలో పొడ చూపుచున్నవి.

నన్నయ సంతరించిన మార్గములను చక్కగా ననుసరించి, ఇతని తరువాతి వారు ఈ వాఙ్మయ వికాసమునకు తోడుపడి ఎంతో వన్నె గూర్చిరి. ఆంధ్రభాషలో "మృదు మధుర రసభావ భాసుర నవార్థ వచన రచనా విశారదులైన మహా కవులలో" - నన్నయ భట్టార కుడే మొదటి వాడు. ఆంధ్రులకేగాక - ప్రపంచకవితా సమితిలో ఆ మహాకవికి — ఏవిధమున యోజించి చూచినను - మహోత్తమ స్థానము కలదు; కలదని - రెట్టించి- వక్కాణించి పలికి- ఉత్తరాంశ ముల చర్చింప నుపక్రమింతము.

## నన్నెచోడ కవిరాజ శిఖామణి

ఆంధ్ర వచన రచనా దశాపరిణామము పరిశీలించి విమర్శింప సమకట్టిన మనకు, నన్నయ భట్టారకుని తరువాత, ప్రశంసింప వలసిన ఆంధ్ర కవిరాజు, నన్నెచోడ టెంకణాదిత్యుడు. ఆంధ్రదేశపు క్షత్రియ కవులలో నీతడే మొదటివాడు.

నన్నె చోడుడు నన్నయకు పూర్వుడని కొందరును - కాదు-తరువాతి వాడని కొందరును- రెండు తెగలై తీవ్రముగా వాద ప్రతివాదములు సలిపిరి. కాని, ఇటీవల, శ్రీ దేవరకొండ వెంకట కృష్ణారెడ్డిగారు - గూఢార్థ విశిష్టములైన కుమార సంభవ కావ్య రచనలు సహా - నిష్పక్షపాతముగా విమర్శించి - నన్నయ నన్నెచోడు లిరువురును - సమకాలికులే యని నిరూపించిరి. హేమలంబి చైత్రమాస భారతి సంచికలో ప్రకటింపబడిన - దేగమూడి శాసనము వారి సిద్ధాంతమును పోషించు నట్లగపడు చున్నది. కాబట్టి నన్నెచోడుడు నన్నయకు సమకాలికుడను విశ్వాసముతోనే ఈ విమర్శనము సాగ గలదు.

నన్నెచోడుని వచన రచనల విమర్శించు పట్టున మనము మొట్ట మొదట చర్చింప వలసినది - గణేశుని గజవక్త్రమునకు కారణము. పిళ్ళారి - గజముఖు డగుటకు - అనేకులు అనేక హేతువుల నుడువు చున్నారు. నన్నెచోడుడీ కుమార సంభవ కావ్యమునందు వివరించిన కారణము - ప్రకృతి శాస్త్ర సమ్మతమై సహేతుకముగా గన్పట్టు చున్నది.

ఈశ్వరుడును, తొలి భార్యయగు సతీదేవియు, అన్యోన్యానురాగ పరవశులై హాయిగా నుండిరి. శివుడు దాక్షాయణి మనోహరాకార, నవయౌవన, హావ, భావ, విలాస, విభ్రమ, సౌందర్యాది గుణంబుల కంతకంత కనురక్తు డగుచుండెను. ఆ సతీపతులు అన్యోన్య రాగాతిరేకమున కామకేళీలాలసులై కైలాస పర్వతము మీదను, ఆ పర్వత పార్శ్వములందున్న మనోహర స్థలములందును హాయిగ విహరించు చుండిరి. ఆ ప్రాంతములందు మత్తేభము లనేకములు ఆహ్లాదముతో మదనాసక్తిం దగిలి పెనంగుచుండుటగని - దాక్షాయణి, సాభిప్రాయ ముగా పతివంక జూచెను; ఈశ్వరుడును అంగీకరించెను.

గీ॥ "ఆది మూర్తులు, శివశక్తు లచలమతులు
హరుడు సతియును సురతార్థమై విహీన

తరములగు మృగరూపముల్ దాల్చిరనిన
కాము మాయల నెవ్వార లేమిగారు ?"

అను నర్థాంతరన్యాస ప్రశ్నతో నత్యాశ్చర్యమును, కవి ప్రకటించి
నాడు. ఇట్లా సతిపతులు సామజ రూపధరులై కూడి క్రీడింప సద్యో
గర్భమున గజముఖు డుద్భవ మయ్యెను. గర్భధారణ కాలమందు
దంపతుల పరిసరములు, వారి మనో వికారములు - అందును స్త్రీ
మనమునందు నెలకొనిన రూప మనస్సందర్భము లేవియు నూరక
పోవు. గర్భస్థ శిశువుయొక్క భవిష్యద్రూప గుణాదులం దివి
యన్నియు తప్పక వ్యక్తములగుట సిద్ధము. ఈ శాస్త్రము Engenics
అను పేర ఇటీవల పడమటి దేశములలో పెంపొందు చున్నది.
సంపర్క సమయమున- అంబిక కనులుమూసి గ్రుడ్డివానిని - ధృత
రాష్ట్రుని గనెను; అంబాలిక వెలవెలబోయి - పాండురాజును గనెనని -
నన్నయ్య రచనలలో చదివితిమి. పూర్వకాలములో ఎవరేటువంటి
సంతానము నర్థించినను - అందు కనువగు విధమున ప్రవర్తించి,
తపస్సు, నీమములు - వ్రతములుచేసి సఫలమనోరథు లగుచుండిరని
పూర్వగ్రంథములలో చదువు చుందుము. మృత్యువును జయించిన
సావిత్రి, పాండవ ధర్మపత్ని ద్రౌపది, ద్రోణుం జంపబుట్టిన ఆమె
సోదరుడు ధృష్టద్యుమ్నుడు. పై వాక్యమునకు ఉదాహరణములు.

నన్నెచోడుని వచన రచనలు - సజాతీయ పదముల నేర్చి
కూర్చుటలోను, అనుప్రాసాత్మక వాక్య సంధానమునందును -
నన్నయతో సమానముగా సాగగలిగినను, ఔచిత్య విషయము
నందును, కొన్నిచోట్ల వాక్యరచనా విన్నాణము నందును - నన్నయ
భట్టారకునకు చాల వెనుకపడె ననక తప్పదు. పరికింపుడీ క్రింది
వాక్యములను :- (i) ప్రజాపతి నియోగంబునంద నియోగించి;
(ii) చతురానను చతురోక్తులు (iii) దక్షునకు త్ర్యక్షుండు ప్రత్య
క్షంబై ..."

## ఔ చి త్య చ ర్చ

చోడుని కుమారసంభవము, అష్టమాశ్వాసమున - సుమారొక నూరు పద్యగద్యల యనంతరము- హిమవంతుని యోషధీ ప్రస్థ పురమున రాత్రి చీకటి పడిన తరువాత - జారచోరాది గూఢచారుల చర్యలు - ఆ యాశ్వాసాంతము వఱకు వర్ణింపబడినవి. ఆ రచనలు కొన్ని అసహ్యము కలిగించి - రోత పుట్టించు చున్నవి. అందలి బోజెంగులు, లంజకాండ్రు, అత్తగంతులు, చిల్లతర్కములు, లోనగు నీచ విషయములకు ఉత్తమ కవుల మహా కావ్యములలో స్థానము ఉండరాదు; అసలు ప్రవేశమే ఇయ్యకూడదు. పార్వతీ పరమేశ్వరుల పవిత్ర వివాహానంతరము ఆ ప్రశంసలు అప్రస్తుతములు - గౌరవ భంగములు. చోడునినాటి శ్రీమంత జీవనముతో నాటి విట, విటీజన వృత్తి వివరములను చేర్చి యాగ్రంథకర్త వర్ణించినాడు. ఈ విష యములో నన్నయ మహర్షికిని, నన్నె చోడునికిని ఎంతటి వ్యత్యాస మున్నదో గమనింప వేడెదను.

తరువాత నవమాశ్వాసమందు - నూత్న దంపతులు - పార్వతీ పరమేశ్వరులు, కైలాస ప్రవేశము చేసిన పిమ్మట - శయనాగారమున వారి దాంపత్య ధర్మ మర్మములను- రతివర్ణన మిషచేత, కవి, మిక్కిలి అసహ్యముగా వర్ణించినాడు. సంస్కృతాలంకారికులు కావ్యమున రతివర్ణనము ఉండవలెనని శాసించిరి- రతి యనగా ప్రేమ శృంగార ములను, ఔచిత్యము పాటించి సగౌరవముగా వర్ణింపనగును. అంతే కాని - ఏకాంతము నభిలషించి, శయనాగారమునుజేరి, తలుపులు మూసికొనిన దంపతులపై దండెత్తి- నక్కి, పొంచి, అక్రమముగా గదిలో దూరి (Lurking nuptial room trespass) నేరము చేసి - రేయెల్ల రెప్ప వేయక కొఱతను దీసినట్లు గూరుచుండి, వారి దాంపత్య కర్మలను, రతి వర్ణనమను పేరుతో, వరుసగా వర్ణింప బూనుటకంటె పరమాసహ్యమైన రోత మరొకటి ఏముండును? వివేకలేశ మున్న వారెవరును- ఏ దంపతుల శయనాగారమునందును ఇట్లు జొరబడరు.

తన తల్లిదండ్రుల - దాంపత్య మర్మముల- నే కవినైన- లజ్జవిడిచి- వర్ణింప బూనునా ? అట్టి తలిదండ్రులకెల్ల తలిదండ్రులు- జగత్పితలని పూజింపఁ దగు గౌరీశంకరులు పండుకొను గదిలో దూరి, పొంచొని, వారి చేష్టల నభివర్ణించుట దైవద్రోహము; పాఠకులపట్ల అపరాధము - నని నొక్కి వక్కాణింతును. ఈ వాక్యములు నన్నెచోడుని కొక్కనికే కాదు. లోకమర్యాద నతిక్రమించి ఇట్టి వర్ణనల గావించిన ప్రతి ప్రబంధకవికి గూడ పై వాక్యము లన్వయించును.

దూష్యమైన రతివర్ణన విషయమునందే గాక- కొన్ని పట్టులలో నన్నెచోడుడు - కొన్ని వాక్యములు కూర్చునపుడు- ఈనాటి మధ్య తరగతుల తెనుగు బాలబాలికల కంటెను కనకష్టపు గొగ్గి రచనలు గావించెనని వ్రాయుటకు విచారమగుచున్నది. ప్రత్యక్ష పరోక్ష భాషణముల కూర్పులలో కంగారు; సాపు, మెఱుగులులేని చప్పిడి వాక్యముల గుదిగ్రుచ్చుట- ఇట్టి దోషములు - నన్నయ, తిక్కన, సోమనాదుల కవనములలో మచ్చునకైన కానరావుగదా ? I. 403 వఱకు ప్రత్యక్ష భాషణము; పిమ్మట పరోక్షము- చూ. 402 : మన్మథుడు: "పరమేశ్వరునైన నోర్తు; పెఱ సురా .... దులు నాకెదురే" ఇది ప్రత్యక్షము (Direct Speech); 403 : ఇంద్రుడు తారు తారకాసురు చేతం బరాజితులై పరమేష్ఠి మఱువు చొచ్చిన విధంబును...హితోపదేశంబు సేయుటయు" ఇంత వఱకు పరోక్ష భాషణము: 'తెలిపి' యను క్రియ వ్రాసి, అన్వయముగూర్చి, పిమ్మట మరల ప్రత్యక్షమునకు మరల్చి "హర గిరిజలు నైష్ఠికానుష్ఠానులై హిమవంతంబున నున్నవారు; వారికి సంగమంబు సేసి జగద్ధితంబు సేయుము." అనిన బాగుండెడిది - అట్లు వ్రాయక - చోడుడు - అజాగ్రత్తచే- సందర్భశుద్ధిలేని - కలగలుపు - వాక్యము రచించినాడు.

అంతకంటెను - ఈ దిగువ వాక్యము చూడనగును :- II. 481. కుమారుని పట్టాభిషేకము- పరమేశ్వరుండు శక్త్యాద్యనేక రాజచిహ్నంబులు దయసేసి (i) దివ్య శస్త్రాస్త్రంబులు, హస్త్యశ్వరథ పదాది చతుర్బలంబులు దయసేసి (ii) మఱియుం బార్వతి వజ్రమయవర్మ ...

అనేక రాజచిహ్నములు దయసేసె (iii) ఇందు 'దయసేయు' క్రియ ముమ్మారు అనవసరముగా కూర్చినాడు. కవికి వాక్యరచనయందు శ్రద్ధ, లక్ష్యము, ఏమైన ఉన్నవా? అని విమర్శకుని సవాలు. లక్ష్యమేమాత్రము ఉంచినను, వాక్యము సాపుదీరి మెఱుగు దేరి ఎంతో బాగుండ వలసినది - ఉన్నతీరునుబట్టి - ఈకూర్పు - గొగ్గిగా ఉన్న దనవలెను.

కాలవ్యత్యాస దోషము. (Anachroism) నన్నెచోడాదులు ఇటీవల రచింపబడిన 'బృహత్కథ' పఠించి యుండవచ్చును. కుమార సంభవము నాటికి రచింపబడని బృహత్కథా గ్రంథమును- కుమార స్వామి ఇతర గ్రంథములతోపాటు పఠించెననుట - చెల్లదు. ఈ వాక్యము - కాలవ్యత్యాస దోషదూషితమై, విపరీతముగా తోచుచున్నది; అసందర్భ మనిపించు చున్నది.

ఇవి అల్పదోషములు; వీటివలననన్నెచోడుని మేధాసంపత్తికిని- భావాంబర వీథీ విహార విశేషములకును భంగమురాదు. ఈ దొసగులు దొర్లకుండినచో -చోడుని కుమారసంభవ ప్రబంధము ఎంతో సాపుదీరి- నిగ్గుదేరి - మెఱుగుతో శోభించి, మెచ్చదగి యుండెడిది.

టేంకణాదిత్య నన్నెచోడుని యనంతరము, మనము - మంత్రి భాస్కరుని గూర్చి ఇంచుక ప్రశంసించ వలసి యున్నది. కవిబ్రహ్మ యని సుప్రసిద్ధుడైన తిక్కన సోమయాజి కితడు పితామహుడు. ఇతడు రామాయణము ఆరుకాండలు తెనిగించెననియు- తాత మంత్రి భాస్కరుడు రచింపక విడిచిన ఉత్తరరామాయణమును మాత్రము, తిక్కన నిర్వచన కావ్యముగా రచించి రామాయణము పూర్తిచేసి యుండగా - దురదృష్టవశాత్తు ఆ రామాయణములో అరణ్యకాండ మొకటి తప్ప తక్కినదంతయు ఖిలమైపోగా- హుళక్కి భాస్కర మహాకవి పుత్రుడగు మల్లికార్జునభట్టు బాలకాండ కిష్కింధాకాండములను, భాస్కరశిష్యుడు, కుమార రుద్ర దేవుడు, అయోధ్యాకాండమును, హుళక్కి భాస్కరుడు యుద్ధకాండమున సగమునకు పైగాను, శేషమును అయ్యలార్యుడును పూర్తిచేసిరి. కిష్కింధా కాండమును

కూడ మల్లికార్జునభట్టే రచించినాడు. నన్నయ భట్టారకుని వలెనే మల్లికార్జునభట్టు వెలుగు వేగసంఖ్య సరిగా నిర్వచించినాడని వ్రాయుట అవసరము. మంత్రి భాస్కరుని వచన రచనా విశేషములను పైని వ్రాసియున్నాను.

ఇక ముందు తిక్కన వర్గమున చేరిన గ్రంథకర్తలను గూర్చియు వారి వచన రచనల గూర్చియు ప్రశంసింపవలసి యున్నది.

## తిక్కన వర్గము (Tikkana's School of Poets)

భాస్కర రామాయణము నందలి అరణ్యకాండ రచించిన మంత్రి భాస్కరునికి – తిక్కన సోమయాజి పౌత్రుడు; కొమ్మన దండనాథుని పుత్రుడు. మనుమసిద్ధిరాజు మేలుకోరి ఓరుగంటి గణపతి ప్రభువుతో జయప్రదముగా – రాయబారము నడిపిన రాజకీయవేత్త. ఖడ్గతిక్కన ఇతని సన్నిహితజ్ఞాతి. ఈకుటుంబమందు స్త్రీ పురుషులందరి సాంప్రదాయము మిక్కిలి చేవగలది. పరాజితుడై ఇంటికి మరలి వచ్చిన ఖడ్గతిక్కనను – అతని తల్లియు భార్యయుగూడ – దారుణముగా నవమానించి – శౌర్యధైర్యముల నద్భుతముగా రేపి- యుద్ధమున కనిచిన కథ జగత్ప్రసిద్ధము. పరశురాముని వంశమువలె తిక్కన వంశముకూడ- "ఇదం బ్రాహ్మ్య మిదం క్షాత్ర" మనియు- 'శాపా దపి శరాదపి' యనియు- బ్రాహ్మ్య క్షాత్ర ధర్మముల రెంటిని ఆకళించి అలవర్చుకొన్నది. తిక్కన, కత్తి చేబట్టి, సమర రంగమున శత్రు భయంకరముగా పోరాడగల యోధ వీరాగ్రణి; వసిష్ఠ వ్యాసుల వలె ధర్మనిర్ణయము చేయగల శాస్త్రవేత్త. భీష్మునివలె బ్రహ్మచారి గాక- అతనివలెనే బ్రాహ్మ- క్షాత్రముల నతిశయింప జేసిన వీరమనీషి- కవిబ్రహ్మ, తిక్కన సోమయాజి.

తిక్కన ఇష్టదైవము- హరిహర నాథుడు. అందు హరి మహాభోగి హరుడన్ననో- అద్భుతత్యాగి. ఇట్టి త్యాగభోగ విరాజితమూర్తి హరిహరనాథుడు తిక్కనకు ఇష్టదైవ మగుట ఆంధ్రుల పుణ్యఫలము.

హరిహరనాథున కంకితము చేసి "ఆంధ్రావళి మోదముం బొరయు" నట్లు తిక్కన భారత శేషము తెనిగించుట- మన అదృష్ట విశేషమే. ఆంధ్రులలో మహా ప్రాజ్ఞులైన విద్వత్కవిసింహులున్నారు; మంచి సంస్కృతిగలవారు- ఇతరులనేకులున్నారు. జగద్ధితము సేయనెంచి అందరకు ఆనందము గూర్ప సంకల్పించుటచే- నన్నపార్యుని పవిత్రాదర్శమును తిక్కన పెంపుచేసి గౌరవించెను.

తిక్కనను విద్వత్కవి వర్గమొకటి పరివేష్టించి యుండెడిది. అందు ముఖ్యులు- మూవు రగపడుచున్నారు: (1) ఆంధ్ర దశకుమార చరిత్ర కర్త- అభినవదండి బిరుదాంకితుడు- మూలఘటిక కేతన. ఈతడు రచించిన ఆంధ్ర దశకుమార చరిత్ర కృతిని- కృతికర్త తిక్కన సోమయాజికే అంకితము చేసి ధన్యుడయినాడు. కవిబ్రహ్మ- కేతన కృతిని- మెచ్చి ఎంతో గౌరవించెను. తెనుగు సారస్వతములో ఒక కవి రచించిన కృతిని మరొక కవికి అంకిత మిచ్చుటకిదే తొలిసారి-యగుట గొప్ప విశేషము. (2) ఆంధ్ర మార్కండేయ పురాణకర్త- తిక్కన సోమయాజి ప్రసాదలబ్ధ సరస్వతీ పాత్రుడు నగు మారన. (3) భోజ రాజీయమనెడి చిత్రకథా గుళుచ్ఛకర్త- ముమ్మడి అనంతామాత్యుని ప్రపితామహుడును- కవిబ్రహ్మచే 'భవ్యభారతి' యని ప్రశంసింపబడిన విద్వత్కవి- ముమ్మడి బయ్యన- యనబడిన- భైరవామాత్యుడు. అనంతామాత్య కృత భోజరాజీయము యొక్క సూత్ర కథ- భోజరాజ చరిత్ర; మధ్యమధ్య ధర్మరీతులు, నీతులు చిత్రకథలై యొప్పార- వినుటకెంతో ఇంపుగా నుండును. ప్రజా సామాన్యము స్వేచ్ఛగా చదువుకొని మిక్కిలి ఆనందించుటకు పలువురు గ్రంథకర్తలు ఇందలి చమత్కార కథలను- వ్యావహారిక భాషలో రచించిరి. ఆ కథలు చెన్నపురి ఓరియంటల్ లైబ్రరీలో ఉండెను. అందు గోవ్యాఘ్ర చరిత్ర మిక్కిలి ప్రశంసింప తగినది. పులితో ఖరారు చేసిన ప్రకారము- ఆ గోవు- దూడకు పాలిచ్చి, బుద్ధులు చెప్పి, మాటదప్పక- పులినోట బడుటకు తిరిగి వచ్చెను. బలి హరిశ్చంద్ర, కర్ణదధీచులు పుట్టి, పునీతముచేసిన భరతభూమిలో పుట్టతగిన పుణ్యధేనువు. అశోకుని

నాటి ఋజు వర్తనులు భారతీయులవలె పరదేశీయుల పొగడ్త లందుకొని తగిన మేటియూవు. దాని సత్యప్రియత్వమును, తుదకు పులి యవలంబించిన అహింసా వ్రతమును- దేవతలుగూడ మెచ్చుకొని పుష్పవర్షము గురియించిరి. కణ్వాశ్రమమున నన్న పార్యుఁడును, బోధివృక్షముక్రింద బుద్ధదేవుఁడును భావించుకొనిన పుణ్యకాలము ఏటంబాంబు- హైడ్రోజను బాంబుల వేళ్లనిని దద్దిరిల్లి పోవుచున్న ఈనాటి లోకమునకు శాంతి ప్రబోధించి, స్వార్థచింతల రూపుమాపి, లోక కళ్యాణము చేకూర్పగల శాంతి సాధనములు - ఈ గోవ్యాఘ్రు చరిత్రలో బీజప్రాయముగా నున్నవి. వాటిని పెంపొందజేసి, లోకమున శాంతి ప్రతిష్ఠించుట - నీతిజ్ఞులైన మతసేవకుల కనీస ధర్మము. “ లోకాస్సమస్తాస్సుఖినో భవంతు. ”

తిక్కన సోమయాజి వచన రచనంగూర్చి- ఈదిగువ వివరింతము. ముందాతని మిత్రవర్గములో ముఖ్యుఁడు- అభినవ దండి - కేతన- వచన రచనలగూర్చి ముచ్చటింతము. అందును, కవిబ్రహ్మ జన్మవృత్తాంతమును విద్యా, రూప, ప్రతిభాముల ప్రశంసించిన ఈక్రింది వచనము శ్లేషోపమాన మాలాభూషితమై ఎంతయు నొప్పుచున్నది :- (1-88).

“ అన్నమాంబ గర్భలక్షణ లక్షితాంగియై, నవమాసంబులు పరిపూర్ణంబులైన శుభముహూర్తంబున, సుపుత్రుం బడసిన, నతఁడు జాతకర్మ ప్రముఖ సంస్కారానంతరంబున, వేదాది సమస్త విద్యాభ్యాస విభాసి యగుచు, ననుదిన ప్రవర్ధనంబు జెంది, తుహినభానుండునుం బోలె బహుకళా సంపన్నుండును, గార్తికేయునింబోలె నసాధారణ శక్తియుక్తుండును, నధరీకృత మయూరుండునునై, పరమేశ్వరుండునుంబోలె లీలా వినిర్జిత కుసుమ సాయకుండును, నకలంక విభూత్యలంకృతుండునునై, నారాయణుండునుంబోలె ననంతభోగ సంశ్లేష శోభిత గాత్రుండును శ్రీపరమ పురుషత్వ ప్రసిద్ధుండును లక్ష్మీ సమాలింగిత వక్షుండునునై వెలసె నా తిక్కనామాత్యు గుణవిశేషంబు. ... ”

కవిబ్రహ్మకు అంకిత మీయబడిన ఈ దశకుమార చరిత్రకు మూలము - ఆచార్యదండి సంస్కృతమున రచించిన దశకుమార చరిత్రము. మగధ రాజు పగతురకోడి వింధ్యాటవిలో నివాసము చేయుచుండెను. అక్కడనే అతనికి రాజవాహన కుమారు డుద్భవించెను. అతని కీడుజోడు నగువారలు- మరితొమ్మండ్రు కుమారులు అతనితోనే పెరిగి- విద్యాభ్యాసముచేసి, సాహసాంకులై - చెదరి- ఒక్కొక్క డొక్కొక్క దేశమున కరిగి, పెక్కుకష్టములకు, విచిత్రానుభవములకు బాల్పడి, తుదకు, రాజవాహనుని చేరవచ్చిరి. పిమ్మట రాజవాహను డవంతి సుందరిని పెండ్లాడి, పిత్రీయమైన రాజ్యమును గెల్చుకొని- భార్యతో పట్టాభిషిక్తుడై, బాల్యమిత్రులతో సుఖముగా రాజ్యమేల గల్గెను. దండి సంస్కృతములో లలితమైన పదములతో గద్యకావ్యముగా దశకుమార చరిత్రను రచించెను. రాజమహేంద్రవరమున నితిహాస పరిశోధక మండలివారు ప్రకటించిన కళింగ సంచికలో- దండి- ఆంధ్ర నాథుడగు జయసింహుని ఆస్థాన కవి యని వక్కాణింపబడెను. ఆ వ్రాత నిజమైతే- మనము గర్వింపదగిన విషయము. కాని అది నిజముకాదు. ఆంధ్ర విరోధులైన కాంచీపుర పల్లవులకడ నుండెనుగాని - ఆంధ్ర జయసింహుని ఆంధ్ర నగరిలో ఆంధ్రాస్థానమున దండి యుండెననుట శుద్ధతప్పు; కేవల నిరాధారమైన వ్రాత.

ఆంధ్రనగరి - వేంగీపురముకడ - కొల్లేరువద్దనుండెనని మహారాష్ట్ర పండితులు తలంచిరి. అదిగూడ తప్పే - జయసింహుని తామ్ర శాసనములు శ్రీ మల్లంపల్లివారు చూచినారు. ఆంధ్రనగరి సర్వసిద్ధియే కాని కొల్లేటికడ వేంగి - కా జాలదనిరి. విశేషించి శా. శ. 555 మొదలు 585 వఱకు రాజ్యమేలిన జయసింహుని పేర్కొనిన దండిని గూర్చి రమేశ చంద్రదత్తుగారు చేసిన కాలనిర్ణయము కూడ సరి కాదు. శా. శ. ఆఱవ శతాబ్దమువాడు కాని క్రైస్తు శకము ఆఱవ శతాబ్దమువాడు కాదు.

## ఆంధ్రుల ధైర్య సాహసములు

బృహత్కథా కాలమునాడు ఉప్పొంగి ప్రపంచమంతటను వెల్లి విరిసిన ఆంధ్రజాతి ఉత్సాహానందములు, భావసంపద, బలపరాక్రమ ములు, సౌందర్య గ్రహణ దక్షత్వము మొదలగు లక్షణము లన్నియు నీనాడు ఉప్పొంగినవి. సాహస ప్రతాపములు ప్రకటించి మహాకార్య ములు సాధించ వలెనను గాఢసంకల్పముతో ఆంధ్రజాతి పునర్జన్మము నొందినట్లు నవయౌవనము తోడను, ఉద్రిక్త భావసంపదతోను- అలరిన కాలమది. మతముపేర- చేదస్తములు అప్పటికి పెరుగలేదు. బ్రాహ్మణులలోకూడ అనులోమ విలోమ సంబంధములు, సంకర బ్రాహ్మణ్యము, విచ్చలవిడిగా వ్యాపించినవి. సముద్ర యానమునకును విదేశయాత్రలు సాగించుటకును ఎవరికి నెట్టి యడ్డంకులులేవు. దండి రచించిన దశకుమారుల సాహస యాత్రా చరిత్రలు తెనుగుప్రజలు చదువుకొని ఆనందించ వలసిన తరుణము వచ్చినది. వారి నౌకా యానములలో వారి కంటబడిన Magnetic rocks- చుంబక శిలలును, వాని నంటుకొని ఊడిరాని అయోరూపములను కేతన వర్ణించినాడు. నన్నపార్యుని రచనల అక్షర రమ్యత కేతనకంటినది. మచ్చునకు చూడుడీ శ్రుతి సామ్యసహితమైన సజాతీయ పదరచన 7-154: "పరిమితా లంకారాలంకృత పరిజన పరివృతుండు". కేవల శ్రుతి సామ్యములు. 6-156: "కన్నంబు వెట్టికొని కాంతకుండు కన్యాంతః పురంబు." 11-88: "సముచిత సంభాషణంబుల సంభావించి" 7-131: శ్రీకంఠ కంఠ ధూమ్రంబైన ధూమంబెగసె" 6-50 "అపాయంబగు నుపాయంబు" అపాయ ఉపాయములు నన్నయ, కేతన, శ్రీనాథాదులం దాటుకొని చిన్నయసూరిం గూడ బట్టుకొనినవి.

కేతనకవి- నన్నయ, తిక్కనలవలెనే ఔచిత్య గౌరవముల పాటించి కృతి రచించినాడు. కచ కుచాది వర్ణనలతో పచ్చిశృంగా రమునకు నన్నెచోడునివలె దిగజారలేదు; సభ్యతావరణము నతిక్ర మింపలేదు. నాటి సంఘ మున్నది యున్నట్లు తన రచనలలో ప్రతి

బింబింప జేయుచు- చోరవర్తనములను, ధాన్యపుదంపులను, జూదము, కోడిపందెములు, అభిసారికా కృత్యములను వర్ణించెను.

కేతన వచనరచన- తిక్కనకంటె తక్కువ; నూటికి 25%. అనగా నాల్గింట నొకపాలు వచనము. ఇతని రచనలలో నన్నయ కాఠిన్యము- సమాస జటిలత్వమును లేవు. నైసర్గికమైన ధారాశుద్ధి గలిగి మృదు కల్పనముతో పాఠకుల నలరింపగల శైలి ఇతనిది; కవిబ్రహ్మ ఆనందింప గలిగిన కూర్పుతో రంజిల్లు చున్నది. తిక్కనవలెనే అచ్చ తెనుగు పదము లనేక మీతడు కావ్యమున కూర్చినాడు.

## మారన - మార్కండేయ పురాణము

కేతన తరువాత, తిక్కన వర్గములోని వాడని మనము ప్రశంసింప వలసిన విద్వత్కవి- మారన; మార్కండేయ పురాణమును చంపువుగా తెనిగించిన మాన్యుడీ మారన. అల్లసాని పెద్దన రచించిన మను చరిత్ర ప్రబంధమునకు మూలకథ ఇందుకలదు. తిక్కన సోమయాజి ప్రసాదలబ్ధ సరస్వతీ పాత్రుడనని మారనకవి తెలుపుకొనినాడు. ఈకావ్యమునందు నూటికి ఇరువదినాలుగు పంక్తులు (24%) మాత్రము వచనము కూర్పబడినది. జగత్ప్రసిద్ధమైన హరిశ్చంద్రోపాఖ్యానమును ఇందుగలదు. హరిశ్చంద్ర చక్రవర్తి "సత్యోక్తి నిశ్చయంబున సమస్తంబు పరిత్యజించి- విశ్వామిత్రుని దోడ్కొని పురంబున కరిగి యపరిమిత కరి తురగ పదాతి బహుళంబును, మంత్రి పురోహిత దండనాథ, వారసీమంతినీ, వివిధవిభూతి విలసితంబును, నగణితమణి కనక కలధౌతాది సమస్త వస్తు పరిపూర్ణ భాండాగార సముదయాభిరామంబును నైన - సకల మహీరాజ్యలక్ష్మీ విభవం బంతయు సమర్పించినం బరిగ్రహించి." (1 - 210 - 214).

లోకములో ఎప్పుడు నెవ్వరు కని విని యెఱుగని కష్టములకు పాల్పడినను- రవంతయైన చలింపక, సత్య పదవీ ప్రమాణ తత్పరుడై నిలిచి, తుదకు తానొక్కడేగాక- తానేలిన అయోధ్యా పురవాసుల నందరిని స్వర్గమునకు కొనిపోయిన హరిశ్చంద్ర చక్రవర్తి చరిత్రము లోకోత్తరము.

## ప్రకృతిశాస్త్ర సంబంధముగల రచనలు

మార్కండేయ పురాణములో- ప్రకృతి విశేషముల బోధించు రచనలు పెక్కుగలవు. గర్భస్థ పిండము ఏవిధముగా పెరిగి పెంపొంది జన్మము కనునో, విశ్వోద్భవ ప్రకారమెట్టిదో- ఇందు బాగుగా తెలుప బడినవి- జీవశాస్త్రజ్ఞులకును జ్యోతిశ్వేత్తలకును ఇటీవల తెలియవచ్చిన "ద్విఖండన" విధానము ఇందు చక్కగా సూచింపబడినది. అంత కంటె ముఖ్యమైన కాలపరిగణన ప్రకారమిందు దివ్యముగా ప్రవచింప బడినది. బ్రౌన్ దొరగారి మాత్రమైన కాలజ్ఞానము కొఱకు పరిశ్రమిం పని- బహుజనపల్లి సీతారామాచార్యులు - నిమిషమనగా రెప్ప పాటని- హిమాలయ పర్వతమంత తప్పువ్రాత వ్రాసినాడు. 60 సెకెండ్లుకల మినిటుకు పర్యాయ పదముగా నిమిషమును వాడుచు- ఇప్పటి సైన్సు జనము- మన ప్రాచీన గ్రంథార్థముల గహనముచేసి- మహాపరాధము గావించుచున్నారు. సుమారు నూటయేబదేండ్లక్రిందట బ్రౌణ్య నిఘంటు తయారుచేసిన బ్రౌను దొరగారు- గంటలో 97, 200 నిమిషములు కలవని వ్రాసినారు. విశాలదృష్టిగల విజ్ఞులు శ్రీ సుర వరం ప్రతాపరెడ్డిగారు బ్రౌనుదొరగారి వాక్యమును త్రుంచి పార వేయ లేదు. భాగవత తృతీయ స్కంధమున కాలపరిమాణము విదుర మైత్రేయ సంవాదములో వివరింప బడినది. దానికి, మార్కండేయ పురాణాంశముల జోడించి తరచి చూచినచో మన పూర్వుల సూక్ష్మ కాల జ్ఞానము వ్యక్తమై- ప్రాచీనుల అద్భుత విజ్ఞానము తేటతెల్లము కాగలదు. ఈ విశాల విశ్వము క్రమ పరిమాణము పొందుచు ఇప్పు డున్నట్లున్నదే కాని- కాఫీహౌటేలు పద్ధతిని- "దేవుడు ఏదికావా లంటే అదల్లా ఎదటకు రాలేదు." ఆ పరిణామక్రమము ఈ పురాణ మున విశదము చేయబడినది.

## నివాస నిర్మాణ క్రమము (Construction of Houses Etc.)

ఈనాడు జనసంఖ్య హెచ్చుచున్నది. మనుష్యులకు, పశుగణము లకు, సదుపాయమైన నివాసములు దొరకక, ఎల్లవారును చాలాబాధ

పడుచున్నారు. ఈ సమస్యలనుగూర్చి మార్కండేయ పురాణమేమి చెప్పుచున్నదో పరిశీలింతము. 4-39: "ప్రజలు, శీతోష్ణాది దంద్వంబుల చేతం బీడితులై, తమకునికి పట్టులు విచారించి, సహజంబులగు గిరిదుర్గ, వనదుర్గ జలదుర్గంబులందు నివాసంబులు గావించి, చతుర్థంబగు [1] కృత్రిమ దుర్గంబు నవల శాస్త్రోక్త ప్రమాణ వృత్తాయత ప్రాకార పరిఖావృతంబులుగా [2]పుర [3]ఖేట, [4, 5] ద్రోణీ ముఖంబులు రచియించి, పెనుబయల మంత్రగుప్తముగా - శాఖానగరంబును, కృషీవల శూద్ర బహుళంబుగా గ్రామంబును, గోగణాకీర్ణ గోపాల జనోపేతంబుగా ఘోషంబును, [6]గడి భూమిం బరదేశ బాధక దుష్టజన ప్రాయంబుగా [7] దృశియునన నిట్లష్టవిధంబులై యుండ నిర్మించి యందు గృహంబులును శాలలుం గల్పించుకొని శీతాతపాది బాధల జయించి..."

## నీలలోహిత రుద్రుడు అను నీలకంఠుడు

మింట మెఱయు నక్షత్ర సహస్రములలో, మహోజ్జ్వలమైనది- మృగవ్యాధు డనబడు శ్వానము. చూచుటకు అదియొక చుక్కవలె కనబడును; గాని నిజమునకది జంటతార; ఒకటి ధవళోజ్జ్వలము; రెండవది శ్యామతార. ఈ జత ఒకదానిచుట్టు నొకటి తిరుగుచుండును. ఏకాదశ రుద్రులలో- మృగవ్యాధుడొకడు. అతడీ నల్లచుక్క చుట్టు తిరుగుచు, దానిం దనచుట్టు త్రిప్పుకొనుచుండుట విచిత్రము; జంట చుక్కల నీనడుమ 1861 లో పడమటివారు కనిపెట్టిరి. అంతకు పూర్వము- ఏనాడో మనవారీ జతను కనిపెట్టి, నీలలోహిత రుద్రు డనిరి. నీలకంఠుని ప్రశంస ఇందు 4-109 లో గలదు. మన వేద పురాణ ప్రసిద్ధులైన దేవతలందరును నక్షత్రముల నాశ్రయించి

---

1. సహజములు కాక మనుష్యులు నిర్మించినవి- కృత్రిమములు (artificial) 2. పుర=నగరములు, 3. ఖేట = పంటకాపు లుండెడి పల్లెలు 4. ఖర్వట = కొండక్రింద పల్లెలు. 5. ద్రోణీముఖము = కొండపల్లపు ముఖములు. 6. గడి భూమి. 7. దృశి.

యుందురని ఈ పురాణమున 4-179 లో గలదు: "నక్షత్రాణి రూపమ్" అని పురుష సూక్తము. 4-175 లో వైద్యుత కాంత శిలల (Electric and Magnetic rocks) ప్రశంస కలదు. లోక సంచారి యొకడు 4-219 లో "ధర జూచు వేడ్క హృదయమున బాయదు" అని తెలిపినాడు. సూర్యుడు లోకబాంధవుడగుటను, ఆరోగ్యము భాస్కరాధీన మగుట చేతను, సూర్యు నారాధించి, రాజ్య వర్ధనుడను రాజు పదివేల సంవత్సరములు తన ప్రజలతో సుఖించెను. సూర్యశక్తిని వశగతము చేసికొని, పంటలు పండించుకొని, వంటలు వండించుకొని యంత్రములు నడిపించుకొని, జీవనము సుఖతరము గావించుకొనుటకు-ఉపాయముల పన్నగల సమర్థులీమధ్య- అమెరికాలో సమావేశమై, సభలుచేసి, చర్చించిరి- ఇప్పటి వైజ్ఞానికులకు ఈసంకల్పము లిప్పుడు కలుగుచున్నవి; గాని ఇది భారతీయులు సాధించినవేగాని ఈసమస్యలు క్రొత్తలుగావు. అజ్ఞానముచేతను, అనాదరము చేతను, శత్రువుల ఘాతుక కృత్యముల చేతను, ఇవి మనకు దూరమైనవి. రవంత కృషి చేసిన పక్షమున మన కివి మరల వశగతము కాగలవు. సూర్యుని తేజస్సు అరుగదు; తరుగదు; విరుగదు. మనకెప్పుడు సన్నిహితమే... మార్కండేయ పురాణకర్త- మారనకవి- తనకు భాస్కరాదు లంది చ్చిన అనుప్రాస రచనల గైకొని, అట్టివి తానును రచించి, పిమ్మట ఉత్తర హరివంశకర్త కెట్లు అందిచ్చెనో ఇంచుకచూచి ఉత్తరాంశ మునకు పోవనగు.

మారన - మార్కండేయ పురాణము. 6- 206 :- "సంగరాంగ ణంబునం- గపాలంబులు పగిలియు ఫాలంబులునొగిలియు, గరంబులు ద్రెస్సియు నురంబులు వ్రస్సియు, మెడలుదునిసియు దొడలు మురి సియు, గండలు రాలియు, గుండెలు గూలియు, రూపు లడంగియు నేపులు మడంగియు."

ఉ. హ. వం :- "వీపులు వగిలియు, మూపులు నొగిలియు ముక్కులు చదిసియు, చెక్కులు చిదిసియు"... (3-80)

ఉ. హ. వం. 5 – 238. "నెత్తురులు గ్రక్కియు నిగుడలేక చిక్కియు, ... బడివాతఅలం దెళ్ళియు బలుకకుమని గిల్లియు"...

## అనంతామాత్యుని భోజరాజీయము ; మంచన - కేయూర బాహు చరిత్రము

ధారానగరము రాజధానిగా మాళవ దేశము నేలిన భోజమహారాజు, కవి ; పండిత పక్షపాతి – విద్వత్కవుల నాదరించి గౌరవించిన నెఱదాత ; తనను సందర్శించిన వారికి కవితోద్రేకము కలిగించి పెంపుచేయగల మహనీయమూర్తి. స్ఫురద్రూపి ; మహాభోగి ; కమనీయ కమనలు – మహారాణుల నలువుర దనిపి, అలరించిన శృంగార విలాస పురుషుడు.

రాజరాజ – భోజరాజులు – సమకాలికులు. మహాకవి – కాళిదాసు భోజుని యాస్థానమున నుండెనని గాథలల్లుకొని – తెనుగు ప్రజలు పుక్కిటి పురాణములు చెప్పుకొనుచుందురు. దేశచరిత్ర దష్ట్యా అవి నిజము కావు ; కాని, ఏ కాలపువారైనను, సంస్కృత సారస్వతమున సుప్రసిద్ధులైన మహాకవులందరు సమకాలికులై, భోజుని సభలోనే ఉండినట్లు, భావించుకొని – వినోదకథలు రచించుకొని – ఒండొరులతో చెప్పుకొని ఆనందించి, కవితారసము నాస్వాదించు చుందురు. విద్యారంభ దశలో నుండిన బాలబాలికలు – ఈ కథలువిని, ముదమొంది, లోకజ్ఞానము నభివృద్ధి చేసికొనుచుండుట ముదావహము. భాషాభిమానుల గృహములలో భోజకాళిదాసు కథల పుస్తకములు లేని ఇల్లు – సాధారణముగా నుండదు.

అనంతామాత్యుని భోజరాజీయములో కాళిదాసుని కవితా ప్రతిభ ప్రకటించు కథలులేవు ; అసలు, కాళిదాసు పేరే అందులో కానరాదు.

సాధారణావరణములు గల ఇండ్లు, వాకిండ్లు, తలుపులు, ద్వారబంధములు, దూలములు – వాసములు గల – గృహసౌధములను, నీచలోహములను – స్వర్ణమయములుగా చేయగల ధూమవేది – విద్య

తెలిసిన -'సర్పటి' యను యోగీశ్వరుడు భోజుని మేడనుబంగారుమయము చేసెను. పడమటి సైన్సు జనము - ఈవిద్యను మొదట గెలిచేసిరి; కాని దేనినైన బంగారముక్రింద మార్చుట అసాధ్యము కాదని ఇప్పుడు ఒప్పు కోకతీరినదికాదు! భోజునకును సర్పటికిని జరిగిన సంవాదములో ప్రసంగవశమున చెప్పబడిన పెక్కు కథలు - కథలలో కథలు, ఉపకథలు లోనగువాని సంపుటియే - ఈభోజరాజీయము.

కథలు కూర్చి, కావ్యములు రచించి చెప్పుటకు కవులకు కథకు లకును - శాంతియుతమైన వాతావరణము అవసరము. రాజనరేంద్రుని కాలము నాటినుండి, తెనుగుదేశము తురుష్కాక్రాంతమగు వఱకును ఈనాట శాంతి నిలచినది. విదేశములతో వర్తకవ్యాపారములు విరి విగా సాగి వృద్ధిపొందినవి. కావుననే నన్నయ, తిక్కన సోమయాజి, భారతమును కేతన దశకుమారచరిత్రమును, నెమ్మదిగా రచింప గలిగిరి. భారతకథవిను శ్రోతలకు కలిగిన సందేహముల వారించి, భారతప్రయోజనము పెంపుసేయగల మార్కండేయపురాణమును - మారన తెనిగించెను. విమర్శించి చూచువారికి - మార్కండేయము - భారతమునకు - అనుబంధమువంటిది. తీవ్రస్ఫురణతో మహనీయ ప్రయోజనముగల భారత మార్కండేయాది మహనీయ గ్రంథములు గాక - చిఱుతలు, తేలికలునై, వినోదము గూర్చుచు, త్యాగము, భగవద్భక్తి లోనగు సద్గుణముల ప్రేరేపింపగలవై, సత్ప్రయోజన సౌరభ సంవాసితములైన - సత్కథలు కావలసివచ్చినవి. భోజరాజీ యము అట్టికథల సంపుటి. శీఘ్రుకథావివరణమే ఇందలి ప్రధానాంశ మైనను - ధారానగరవర్ణన మొదలగు వర్ణనాత్మకరచనలు లేకపో లేదు. అవి దీర్ఘసమాసఘటితములుకావు. అర్థసౌలభ్యము, సందర్భ శుద్ధి గలిగి రమ్యముగా నున్నవి. ఇందలి కథలు విన నింపై, చదువ సొంపై - బహుమనోరంజకములై, మిక్కిలి ఆకర్షణీయముగా నుండుట చేత ఈకథలను పలువురు వ్యవహారిక ఆంధ్రమున రచించిరని పైన వ్రాసియుంటిని. ఇందు వచన రచన శాతము 13% మాత్రమే,

## కేయూర బాహుచరిత్రము

ఈచరిత్రముకూడ చక్కనికథల సంపుటియే. దీని రచించిన వాడు మంచనకవి. ఇందును - పంచతంత్ర కథలవలె - నీతిబోధకము లైన కథలు పెక్కు లున్నవి. ఎంతటి అల్పులైనను, ఉపాయముచేత ఎంతటి ప్రబలశత్రునైన జయింపగలరు. అల్పుడని నిర్లక్ష్యముచేసిన శత్రుడు తుద కజేయుడై ఆత్మహాని తెచ్చును. మఱ్ఱిపండ్లతిని కాకిరెట్ట వైచిన - నందలి వటబీజము మహావృక్షమై కొండలను మహాపాషాణమును భేదింపగలదు. ఇటువంటి సత్యము లెన్నో ఇందు చక్కగా కూర్చబడినవి. భోజరాజీయమునందులేని హాస్యరసమిందు వెల్లివిరిసినది.

## శంభుదాసుడను - ఎఱ్ఱాప్రెగ్గడ

భారతమును గద్యపద్యాత్మకమగు చంపూరూపమున మొదట తెనిగించిన కవులు ముగ్గురు. వారినే మనవాఙ్మయము కవిత్రయమని ప్రశంసించుచున్నది. అందు నన్నయ భట్టారక తిక్కయజ్వలను గూర్చి కొంతప్రశంసించి యుంటిమి; మూడవవాడు - ఈశంభుదాసు డనబడు ఎఱ్ఱాప్రెగ్గడ. నన్నభట్టారకుడు అసంపూర్తిగ విడిచిపెట్టిన అరణ్యపర్వ శేషమును పూర్తిచేయుటయేకాక ఇతడు హరివంశమును కూడ తెనిగించినాడు. నృసింహపురాణమును, ఒక రామాయణ మహాకావ్యమును కూడ రచించి నెగడినాడు. అందు హరివంశ నృసింహ పురాణములు లభ్యమగుచున్నవి; కాని రామాయణము మాత్రము - ఎక్కడను దొరకకున్నది. లభ్యమగునను నాశయు సన్నగిలుచున్నది. చంపూ కావ్యకర్తలలో నన్నయభట్టు తరువాత - నీశంభుదాసునంత విశేషముగా వచనరచన గావించినవారు మరొకరు కనబడరు. భారత మునం దితని రచనలలో - వచనములు-నూటికి నలుబదిపాళ్ళు - అనగా ఐదింట రెండుపాళ్ళు ఉన్నవి; కాని అవి నన్నయ, తిక్కనల రచనలంత మధురములుగాక - సరళ సౌకుమార్యములులేక - ఇంచుక కఠిన మే యనదగిన కదళీపాకమున గూర్చబడినవి. మచ్చునకు ఒక్కవచ

నము మాత్రము పరిశీలింతము :- ఆరణ్య 4—207: క్షత్రియప్రభావం బేమనవచ్చు! విరాట్సమ్రాడ్యధాజిత్స్వర్ణేత్వసహజిద్విభు సత్యయోని పురావిత్సత్యధర్మ ప్రవర్తకుండు నను భవ్య నామంబుల నాగమంబులు పార్థివుం గొనియాడు.''

సంస్కృతమున హరివంశము భారతమునకు అనుబంధమనియే వక్కాణింపనగును. కావుననే - భారతము పూర్తికాగానే శంభుదాసుడు హరివంశాంధ్రీకరణమునకు గడంగినాడు - పిమ్మట నృసింహపురాణము రచించినాడు. అందలి వచనరచన - బమ్మెరపోతరాజుగారు భాగవతమున, నైమిశారణ్య - గంగావతరణాది ఘట్టములలో కూర్చిన వచనములవలె - శ్లేషోపమ - విషయాలంకారదులతో శోభించుచుండు నని మాత్రము తెలిపెదను. ఆరణ్యపర్వములో శంభుదాసు రచించిన సంగ్రహ రామాయణముతో తృప్తిచెందక ఈకవి ప్రత్యేకముగా రామాయణమును విపులముగా కూర్చియుండును.

శంభుదాస కృతమైన హరివంశ గ్రంథము "సకల భాషాభూషణ సాహిత్యరసపోషణ సంవిధాన చక్రవర్తియు, సంపూర్ణకీర్తి - నవీనగుణసనాథుడు'' నగు నాచన సోమనాథునికి తృప్తికరముగా లేకపోయెను. అందుచేతనే - ఉత్తర హరివంశకథలలో - కొన్ని భాగములు మాత్రము - ఎంచిగైకొని, మనోహరముగపెంచి, యతడు తన ఉత్తర హరివంశము రచించినాడు. చెఱుకు తినిన నోటికి బెండన్నట్లు సోమనాథుని కావ్యము నెదుట - శంభుదాసుని హరివంశము చప్పగా తోచుట సహజము. సోముని కవితా ప్రాశస్త్యము నించుక - చవిచూతము :— రచనా ప్రాశస్త్యమునుబట్టి - పద్యభాగములును కొన్ని ఈదిగువవ్రాయ సాహసించెదను :— (1) 1—158. "చాపముగుడుసై పరివేషముగల చంద్రుని సరివేషముదాల్చె (సత్య) మొగము జగము నుతింపన్''

(2) 2—16 "సంపద లుబ్బనేసి। లేబరముగాదె బిడ్డలులేని బ్రతుకు''

(3) Do — 160 అన్నగంబు కన్నులకు నంపక మిన్నంది నాందీ కృత నాందీ సందానిత వందనమాలా....

(4) Do కుంకుమ పరాగ రాగచ్ఛవి చ్ఛురిత...రజిత రుచిరుచిరతో

(5) Do పురపురంధ్రీపునః పునరాగమన రాగమనఃప్రియ

(6) 3—48 కుమ్మరావమున రాగిముంతా ?

(7) 3—70 చముకు చల్లిన మంటల పయిం బ్రత్తి తాలిన వఘు పువ నిమ్మపండ్లు నలంచిన కయివడి - పాదరసంబు మర్దించు పంతంబున చోళంబు విఱుచు తెఱంగున.

(8) 3-123 కత్తిరించిన చందంబున - పందెంబు సఱచిన విధంబున - ప్రొక్కిన దీవించిన విధంబున...

(9) 4-54 వరగుతో డాగరయు నెండవలసినట్లు

(10) Do 62 - తెఱగుమాలి తవుడు తిని చచ్చువానికి విషము పెట్టువాడు వెఱ్ఱివాడు.

(11)—216 మంగలములోని ప్రేలాలు మాడ్కి-జుక్కలిక్కడక్కడవడె" ఈవాక్యమునందు ఉల్కలు (Meteors) రాలుట వర్ణింపబడినది.

(12) 6—28 పన్నగారి నగారి నగరిపౌరువు తెరువు.

(13) Do—109 "చెఱకుం జెఱకైనవంట జెఱకుంజెఱకే ?"

ఇట్లు జాతీయము - మధురము - ప్రాసాదగుణభూషితము నైన మేటి వచన రచనలతోను చక్కని పద్దెములతోను ఉత్తరహరివంశము రచించి నాచనసోమనాథుడు సాహిత్యరసపోషకుడను బిరుదు సార్థకము చేసికొని వంద్యుడైనాడు.

## శ్రీనాథ కవి సార్వభౌముడు

సోముని యనంతరము మనప్రశంసకు పాత్రుడైన ఆంధ్రసారస్వతసేవకుడు - కవిసార్వభౌముడు - శ్రీనాథుడు. అతడు రచించిన తెనుగు ప్రబంధములు పెక్కుగలవు. కొన్ని విశిష్టాంశములమాత్రమే ఇక్కడ సంగ్రహముగా ప్రశంసింప నవకాశముగలదు.

ఈవింత ప్రబంధము వినుకొండ వల్లభరాయుని పేరు మోసికొను చున్నను-శ్రీ బండారు తమ్మయ్యగారు వివేచించినట్లు - శ్రీనాథుని సిద్ధ హస్త మిందు బలుతావుల సువ్యక్తమై - అతని కవితాసౌరభముతో నీకావ్యము ఘుమఘుమలాడుచు - పరిమళించుచున్నదనుటకు సందే హములేదు. అందలి యైదవ పద్యమునందు "...శంకరజటావాటీ తటాంతర్నదత్ । స్వర్ణద్యుంబుతరంగ రింఖణ లసత్సాహిత్యసౌహి త్యమై" అను వాక్యము శ్రీనాథుని దివ్యహస్తమును ఋజువు చేయు చున్నది. 37 వ పద్యములో "దేశభాషలందు తెనుగులెస్స" అని ప్రవచింపగల తాహతు ఆకాలములో మన కవిసార్వభౌమునకు తప్ప మరొకనికిలేదు. ఆవాక్యరత్నము నల్లెగైకొని అద్దానికి జగత్ప్రఖ్యాతి చేకూర్పగల సౌభాగ్యసామర్థ్యములు శ్రీకృష్ణదేవరాయలకే గలవు.

ప్రజల కవశ్యజ్ఞేయమైన కాలగతి నిరూపించుటకు ఓరుగంటి కాకతిప్రభవు లానాడు ప్రతిష్ఠించిన గడియారమును చూడుడు :— 155

మ "ఉడువీథిన్ శిఖరావలంబియగు నంధ్రోర్వీశు మోసాలపై
గడియారంబున మ్రోసె రెండెనిమిదుల్ ఘంటాఘణాత్కా-
రముల్"

ఆనాటి సాంఘిక జీవనములో-సజీవద్యూతము- కోళ్ళపోరితము చూచుచు - నందలి వచన రచనా విధానమును గమనింతము :— 235
"నారికేళ, బక, జాతీయంబులై యా జగజెట్టి కోడిపుంజులు - మెడలు నిక్కించుచు, ఱెక్కలల్లార్చుచు 'గొక్కొక్కొ' యని కాల్దువ్వి - క్రొవ్వు మిగిలి - తరళ తారళతారకోద్వృత్త రక్తాంతలోచన మండలంబులై - యొండొంటిం గదిసి చుఱచుఱజూచి, యేచిన కోపాటోపంబున, గుప్పించి యుప్పరం బెగసి....వక్షస్థలంబులువుచ్చి వందరలాడియుం ద్రోసియు, లాసియు... విఱ్ఱగా గఱచియు బఱచియు గొఱ గొఱం గొఱకు ముఖంబున గురు గురుకు మనుచు ..పక్షవిక్షేపంబులం బడలువడ నడచియు నొడిచియు నడికి నడికి...కాళ్ళు క్రిందికి

దూరియు జీరియు...ముక్కలం జెక్కలం జిక్కగా నొక్కి యిట్ట ట్టనక బిట్టూనిపట్టి...వాలి సుగ్రీవుల విధంబున - సుందోప సుందుల చందంబున మురారి - చాణూరుల ప్రకారంబున...పాయ గిలంబడి - రొప్పు రుధిరంబుల దొప్పదోగి మూర్ఛల మునుంగుచున్నవి - 280- ద్రుణంబు చలించినం, జీమ చిటుకన్నను, జెవి ప్రాలంబెట్టి, యాలిం చుచు...కంఠీరవంబునుం బోలె మింటికి లఘించి, మయూఖ నఖరంబు లం దిమిర కుంభి కుంభంబులు వ్రచ్చి వందఅలాడి నభఃక్రోడంబున నుడు గణంబులను ముత్తియంబుల వెదజల్లె."

సింహము — వాడిగోళ్ళతో ఏనుగు కుంభస్థలము చీల్చగా ముత్యములు రాలుననుట - కవి సమయము. చిన్నయసూరి మిత్రభేద కావ్యములో దీనిం దడవినాడు. పిమ్మట విక్రమార్క చరిత్ర రచిం చిన భాగవతుల రామమూర్తిశాస్త్రిగారును ఈ యర్థముగల వాక్య మును గూర్చిరి. చూ - మిత్రభేదము. పుట 92 లో మృగరాజు పింగ ళకుడు: 'హస్తి మస్తక విదళన ఖరంబులగు మన్న ఖరంబులు.' విక్రమార్క చరిత్రము: "కంఠీరవ ఖరతరనఖర వినిర్భిద్యమాన మద కుంభి కుంభ సమాపతన్ముక్తాతతి సమలంకృతావనీతలంబు."

ఇట్టి యనుకరణ పరంపరలం గూర్చి ప్రస్తావించుటకు వ్యవధి చాలదు. దీర్ఘ సమాసఘటితము గాక - నలదమయంతుల పరస్పర ప్రేమకు కారణమైన - హంసను నిషధరాజు పట్టుకొని, జాలిపడి విడి చిన వృత్తాంతమును చక్కగా వివరించిన వచనము మాత్రము చదువుదము. శృం. నై. 1 - 110: - "వ. అక్కటకటా! దైవంబ! నీ కంటికిం బేలగింజయుం బెద్దదయ్యెనే? జననీ! ముదిసి ముప్పున సుతు శోకసాగరం బెబ్భంగి నీదగలదానవు? ప్రాణేశ్వరీ! యే చందం బున మద్విరహవేదనాదవానలంబునం దరికొనియెదవు? సఖులారా! యేప్రకారంబునం బుటపాక ప్రతీకాశంబైన కరుణ రసంబున బుర పురం బొక్కెదవు? బిడ్డలార! యేలాగున నతిక్షుత్పిపాసాకులంబులై కులాయకూలాంబులం గులకులం కూసెద" రని విలాపంబుసేయుచు, దృగ్గోళకంబుల వేడికన్నీరు వెడల, గోలు గోలున నేడ్చినం, గృపా

ఘుండై, యా భూపాలుండు హస్తపల్లవంబులు వదలి "రాజహంసంబ! పొమ్ము! సుఖం బుండుమని విడిచిపుచ్చె ననంతరంబ." ఇందుగల జాలి గమనింపదగును.

## బమ్మెఱ పోతరాజు

శ్రీనాథుని యనంతరము మనము ప్రశంసించవలసిన సుప్రసిద్ధ - ఆంధ్ర కవి - బమ్మెఱ పోతరాజు. అతడు శ్రీనాథుని భావమఱిది. ఉభయులకును మధ్య చాల భేదము లున్నవి. బాగుగా ధనమిచ్చి తనను గౌరవించిన శ్రీమంతులకును, దేశాధిపులకును ప్రబంధము లంకితమిచ్చి భోగభాగ్యము లనుభవించి - పెక్కు దేశములు తిరిగి - తుదకు బొడ్డుపల్లి గుత్తకు గొని - కృష్ణానది వరదలవలన పంట నష్టమై - యెడ్డెలగు నొడ్డెరాజులచే నవమానితుడై, దారుణ ప్రయాసములకు బాల్పడి ప్రాణము విడిచినాడు - శ్రీనాథుడు.

పోతరాజునకు ఐహిక భోగభాగ్యములు తృణప్రాయములు. అతడు మోక్షమే కోరినాడు; తాను తరించి, తోడిమానవుల తరింప చేయగల భాగవత పురాణరత్నము తెనిగించి ధన్యుడైన మహా మహుడు - భక్తశిఖామణి. తెనుగున భాగవత రచనకు పోతనను ప్రోత్సహించినవాడు - భగవంతుడు - శ్రీరాముడే. నన్నయ తిక్క-నాది కవులు ఇతర పురాణములు తెనింగించినను - పోతనగారి యదృష్ట విశేషముచేత - అంతవఱకు వారెవరును భాగవతము పొంతకు పోలేదు. పునర్జన్మ దుఃఖము లేకుండ - మోక్షసాధనమైన భాగవతమును అతడు తెనిగించి ధన్యుడైనాడు. ఈ క్రింది పద్యములీ సందర్భమున నవశ్యము పఠనీయములు :– (ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక - సంపుటము 6-288 :

ఉ॥ "మానితసత్కవిత్వ మహిమన్, నిను। రామ విభుండెమెచ్చెటుల్
పూనిక నాంధ్ర భాగవతముం దన కంకిత మాచరింపగా
దానె వచించె, నీయతుల ధన్యత యేమన । రామభూపు నా
స్థానకవీశ్వరా! యితర ధారుణీనాథుల నాశ్రయింతువే?"

కాబట్టి

"ఇమ్మనుజేశ్వరాధములకిచ్చి పురంబులు వాహనంబులున్
సొమ్ములు కొన్ని పుచ్చుకొని సొక్కి శరీరము వాసి కాలుచే
సమ్మెట ప్రేటులంబడక సమ్మతి శ్రీహరికిచ్చి చెప్పె నీ
బమ్మెరపోతరా జొకడు భాగవతంబు జగద్ధితంబుగన్."

"చ॥ నవమాధుర్యము నించి, భక్తిరసము న్నానాప్రకారంబులన్
చవులూరంగ రచించి । మోక్షపదవీసామ్రాజ్యముం బెంచి, మా
ధవు నాకారము ముందు నిల్పినటు లుద్యద్రీతి వర్ణింపగా
కవివో! భక్తిరసంపుముద్దవొగదా! కర్మోక్తి సంశీలనా!"

పోతరాజుగారికి ఐహికభోగభాగ్యములకొఱకు మానవమాత్రులం బొగ డుట పరమాసహ్యము. ప్రహ్లాద చరిత్రలో – "పొగడంజొత్తురు సత్కవీంద్రుల క్రియన్" అని శ్రీనాథుని మనస్సులో నుంచుకొనియే ఛలోక్తిగా పోతనగారు పలికినారు.

పోతరాజుగారు "అందర మెప్పింతు కృతుల" నని ప్రతిజ్ఞ చేసి భాగవతము తెనిగింపబూనుటచేత - భాగవతము శబ్దాలంకార బహుళము గాకతప్పదయ్యె. శబ్దాలంకారములలో ముక్తపదగ్రస్త శ్లేషోపమాన భూషితములైన కొలది వచనములం జూతము. సప్తమ- 285 :– ముక్తపదగ్రస్తముగల వచనములు : "వక్త్ర నాసికా వివరుం డును, నాసికా వివర నిస్సరన్నిబిడ...లోచనుండును, లోచనాంచీల సముత్కీర్యమాణ...సటాజాలుండును, సటాజాలసంచాలన సంజాత... గంగావతరణము అనుబంధముగా నీయబడినది.

6–228 : శ్లేషోపమలు :– కుబేర భాండాగారంబుఁబోలె పద్మ, మహాపద్మ, శంఖ, మకర, కచ్ఛప, ముకుంద, కుంత, నీలవర సమ గ్రంబై, విష్ణు కరకమలంబునుం బోలె సుదర్శనావర్త ప్రగల్భంబై... యింద్ర వైభవంబునుం బోలె కల్పవృక్ష, కామధేను చింతామణి జనిత విశేషంబై, ..శంకర జటాజూటంబునుం బోలె గంగాతరంగిణీ సమా శ్రయంబై, బ్రహ్మలోకంబునుం బోలె బరమహంసకుల సేవ్యంబై... యొప్పుచున్న దుగ్ధవారాశి డాసి, శ్వేతద్వీపంబున వసించి... దేవ దేవు నాశ్రయించి యిట్లని స్తుతించిరి.

సూర్యాది గ్రహ నక్షత్రంబులకు దక్షిణోత్తరగతి రూపంబయిన సంవత్సర సంధియందు, నహోరాత్ర మధ్యంబున, వృత్రశిరంబు పర్వతశిఖరంబునుం బోలె ద్రుంచి కూలంద్రోచె నప్పుడు...

ఇంతవఱకు శాలివాహన శకము - 14 వ శతాబ్దివఱకు రచింపబడిన తెనుగు చంపువులలో వచన రచనా విశేషముల జూచితిమి. ఇక రాయల యుగ విషయముల చర్చింతము.

## రాయల యుగము

ఇహలోకమునందు మానవుని జీవితము అస్థిరము, అశాశ్వతమనియు, శాశ్వతమైనది మోక్షసంపాదనయేననియు, దాని సాధించుటకే మానవులు యావజ్జీవము త్రికరణశుద్ధిగా పాటుపడవలసినదేయనియు, హిందూమత ధర్మములయొక్క మూల సిద్ధాంతములు. వానినెల్ల వారికి బోధించుటకే వేదఋషులును, ముముక్షువులగు పురాణకర్తలును, ధర్మోపన్యాసకులును, అపారకృషిచేసిరి. ఈ ప్రయోజనమును కాంక్షించియే - రామాయణ, భారత, హరివంశ, మార్కండేయ, భాగవతాది పురాణములను ఆంధ్రకవులు తెనిగించిరి. అక్షరమగు నాముష్మికమును సాధించుటే — ఇహమున మానవజీవిత లక్ష్యము. వివేకలేశముగలవారి కెవరికైన — జీవితములో వేరొక కర్తవ్యము కనబడదు. పరము సాధించుటకే ఇహము వినియోగింపవలయునని భారత భాగవతాదులు చెప్పకపోలేదు; కాని ముక్కుమీఁద గ్రుద్ది సూటిగా తెలియజెప్పినట్లు ఆ విధి ఆంధ్ర ప్రజకు ప్రత్యక్షముగా ప్రవచింపబడలేదు. ఆ సందేశము నెల్లవారికి చాటించి — చెప్పిన సుకృతము — శ్రీకృష్ణరాయలకే దక్కినది. ఆముక్తమాల్యదయగు — శ్రీ గోదాదేవి — వారి పెంపుడుతండ్రి — విష్ణుచిత్తుడు నివసించుచుండిన — శ్రీ విల్లుపుత్తూరునేలు నేలికయగు — పాండ్యమహారాజు — వల్లభదేవుడు — మారువేషములో పురసంచారము

చేయుచుండెను. దేశాటనము చేయుచు వచ్చిన పరదేశ బ్రాహ్మణు డొకడు, అక్కడి పండితులతో గోష్ఠి ప్రసంగములు చేయుచుండ రాజు విని, ఆగి, ఆ పండితుని పలుకరించి, ఇట్లడిగెను. "దేశాటనం పణ్డిత మిత్రతాచ" అన్నారు, పెద్దలు; తమరు పెక్కుదేశములు చూచి విశేష జ్ఞానమును సంపాదించిన ప్రాజ్ఞులు. మీకు తెలిసిన దానిలో సారవత్తరమైన విశేషము నా చెవినివేయు" డని సవినయముగా ప్రార్థించెను; "సరే వినుమ"ని, ఆ జ్ఞాని యీ శ్లోకమును చదివెను :

శ్లో॥ వర్షార్థమష్టౌ ప్రయతేతమాసా । న్నిశార్థమర్థం నివసంయతేత ।
వార్థిక్యహేతోర్వ్యయసానవేన । పరత్రహేతో రిహ జన్మనాచ."

ఈ శ్లోకార్థమిట్లు తెనింగింపబడినది :

సీ॥ రాత్రులకొనరు నర్థములెన్ని యన్నియు
ఘటియింపవలయు బగళ్లయంద
వానకాలమునకు వలసిన యవియెల్ల
నార్జింపవలయు మాసాష్టకమున
అపర వయోయోగ్యమగు వస్తుజాలంబు
సాధింపవలయును జవ్వనమున
పరలోకమునకు సంపాద్యమెయ్యది యది
గడియింపవలయు నీయొడలి యంద.''

రాత్రుల కవసరమైన పదార్థములు పగలే తెచ్చుకోవలెను; వానకారున కవశ్యమైనదంతయు తక్కిన ఎనిమిదిమాసములలో కూర్చుకోవలెను; వార్ధక్యమున కగత్యమైన వస్తువులు యౌవనమందే సంపాదించుకోవలెను; పరలోకమున నుపయుక్తమైనది — ఇహమందే గడింపవలెను." 'వెలుగు ఉండగానే సమస్తము చక్కబెట్టుకోవలెను.' అను నీయర్థము విని రాజు నివ్వెరపోయెను. బంగారువంటి బ్రదికెడి కాలము నిష్కారణముగా వ్యర్థముచేసికొని — "చేయిగాలిన తరువాత ఆకులు" — "నీరు వంచుకొనిపోయినతరువాత చెరువుకు కట్ట."

అన్నట్టు — విలువగల కాలము చెఱచుకొంటిని — బుద్బుదప్రాయ మైన శరీరమును — మెఱుపుంవంటి శరీరసౌఖ్యముల నమ్మి, మోక్షపు యత్నము చేయనైతిని. నౌకమీది జనము, ఉన్నట్లే ఉండి, రేవు జేర్చి, "దిగండి, దిగండని నౌకాధికారులు దింపివేయునట్లు — కాల పురుషుడు మానవుల వయస్సు నపహరించి మోసపుచ్చును. షట్ చక్రవర్తులును, షోడశ మహారాజులును — వారందరు కూడ కాల పురుషునిచే భంగపడినవారే. నేనొక లెక్కా?... సరే—అయిన దేమో అయినది. ఇక పరలోకానందమునకై యత్న మాపాదింతు నని నిశ్చ యించి, వెంటనే వివిధ మతముల మహాసభ గూర్చెను.[1] ఆ సభలో విష్ణుచిత్తుని ఉపన్యాసము సర్వోత్తమమని నిర్ణయమై — అఖిలామ్నా యైక వేద్యుడు శ్రీహరియేనని సంస్థాపింపబడినది. శ్రేష్ఠమైన ఉపన్యా సమునకు ఈయవలసిన బహుమానము విష్ణుచిత్తునకే లభించినది.

కృష్ణరాయలకు పూర్వమున నుండిన ఆంధ్ర కవులు పరమార్థ దృష్టితోనే — కావ్యరచన గావించుచుండిరి. శ్రీనాథాదులు కొందరు తమ కాశ్రయమిచ్చి పోషించి గౌరవించిన రాజులకు — రాజ మంత్రు లకు — భగవద్భక్తులగు శ్రీమంతులకు, నంకితముగా, కావ్యములు రచించుచుండిరి. రాయలకాలమునాటికి బహమనీ సుల్తానుల ఒత్తిడి కొంతతగ్గి దేశమున శాంతి నిలిచినది. రాయలకు పూర్వులైన ఆంధ్ర కవులు పరమార్థ దృష్టితోనే కావ్యరచన గావించుచుండిరి. శ్రీనాథా దులు కొందఱు తమ కాశ్రయమిచ్చి, పోషించి గౌరవించిన రాజులకు, మంత్రులకు, శ్రీమంతులకు అంకితమిచ్చి కావ్యము లొనరించిరి.

---

1. ఇట్టి సభలను పరమటివారు Parliament of Religions అందురు. అమెరికా—షికాగో పట్టణములో 1893 సంవత్సరములో జగత్ప్రసిద్ధమైన సభ యొకటి జరిగినది. అందులో హిందూమతమును గూర్చి శ్రీరామకృష్ణ పరమహంస గారి శిష్యరత్నము — వివేకానందులు — ఉపన్యసించి ప్రపంచ ఖ్యాతి బడసెను.

ఆంధ్ర వచన రచన దశా పరిణామమును దెలుపు నీ వ్యాసములో — ఇటుపై చర్చింపతగిన మతగ్రంథశాఖా వివరములకు భూమికగా నుండునను భావముతో పైవాక్యములు కూర్పబడినవి. వ్యాసముతో సంబంధములేని "అప్రస్తుత" ప్రశంసగా ఈ భూమిక పరిగణింపబడరాదు — అని వ్యాసకర్త విన్నపము.

శ్రీనాథుడు నైషధము, కాశీఖండము, భీమేశ్వరపురాణము, హర విలాసము, శివరాత్రి మాహాత్మ్యము మొదలగు పెక్కు ప్రబంధములు రచించినను — అందొక్కటియైన పరమేశ్వరున కంకితముచేయకపోవుట చేత — కవిసార్వభౌమునికి ఐహికము ప్రాముఖ్యమైనట్లు — ఆముష్మిక చింత లేకపోయెనేమో! శ్రీనాథ పోతరాజులకు గల తేడా - ఇదే.

రాయలనాటికి బహమనీ సుల్తానుల ప్రభ మందగించి దేశమున శాంతి నిలచినది. శ్రీనాథుని నాడే ఆంధ్ర వణిక్కులు దేశాంతర, ఖండాంతరవాసులతో, విరివిగా వ్యాపారము సాగించిరి. ఈమధ్య నాగార్జునకొండ త్రవ్వుచుండ — రోమనులనాటి బంగారు నాణెములు బయల్పడినవి. విదేశ వ్యాపార మూలముగా ధన సమృద్ధి యగుచుండెను. శ్రీనాథునివలన హరవిలాస మంకితము పొందిన అవచి తిప్పయ్య యనబడిన — త్రిపురాంతక శ్రేష్ఠి "ద్వీపాంతర మండలికా భూపాలక మాననీయ పురుషార్థుడు." అతడును, తమ్ములును — పంజాబు నుండి కర్పూర పాదపములను, జలనోగి బంగారు మొలకలను (?), సింహళద్వీపపు గంధ సింధురములను, హురుమంజి (Ormuz) తేజి హరులను, గోవ (Goa) సంశుద్ధిమత్ద్రవములను, ఆపగ నాణి[illegible]వ్యము లను, చోటంగి (?) కస్తూరి కాటంకములను, చీనానుండి చీనాంబరము లను, తరుణ (?) తవాయి (Tavoy), రమణ (? Lerant ?), పండువా, రాఢాపురి ప్రముఖ స్థలములనుండి — ప్రసిద్ధమైన సామాన్లు విరివిగా తెప్పించి వ్యాపారము చేయుచుండెను. వ్యాపారమువలన ధనము, దానధర్మములు - కవితా గౌరవము — సారస్వతాభివృద్ధి జరుగుట సహజము.

శ్రీకృష్ణదేవరాయలు విద్వత్కవి. సరసుడు. సంస్కృత, ఆంధ్ర, కర్ణాటభాషలలో కవిత్వము చెప్పి గ్రంథములు రచించినాడు. విశిష్టాద్వైత సిద్ధాంతముల మెచ్చి, అనుసరించి, విష్ణుసర్వోత్తమత్వము నంగీకరించిన వైష్ణవుడు — అయినను విశాలదృష్టితో సర్వమతముల గౌరవించిన ధీశాలిగాని పరమత ద్వేషముగల విరసుడు గాడు ; నీరసుడునుగాడు.

అయినను, రాయలు జన్మతః క్షత్రియు డగుటచేత, అతనికి వేట యందు ఆసక్తి మెండగుట సహజము. ఆతని కింపుగూర్చుటకే — అతని యాస్థాన స్థులు — పెద్దనాది మహాకవులు — తమ ప్రబంధము లలో వేటకు ప్రాధాన్యము నిచ్చి — వేటవర్ణన ప్రబంధమున కొక ముఖ్యాంగమును జేసి వర్ణింపదొడగిరి. మృగయాసక్తులగు క్షత్రియ కవులు — అడవిలో మృగములనే గాక — కావ్యములలో నక్షర రమ్య తను కూర్చు కొఱకు — వాక్యములలో చేర్చుటకు — అక్షరములను సహితము తరిమి తరిమి వేటలాడి—ఏర్చి—కూర్ప జొచ్చిరి. నన్నయాది మహాకవుల రచనలలో మధురముగా పెరిగి, రమ్యముగా పెంపొంది, పాఠకుల నలంకరించిన అక్షర రమ్యత — హద్దుమీరి, తీయము గోల్పోయి, వెగటు పుట్టింప జొచ్చినది. దేనినైనను మితిమీర నివ్వ రాదు. 'అతి సర్వత్ర వర్జయేత్'నుట సాదోగ్యము, అనుసరణీయము నైన సూరి సూక్తి. ఇంపైన ఆహారముకూడ — మితిమీరి నపుడు అజీర్ణమునకు దారితీసి అరుచి పుట్టింపక మానదు. రాయల నాటినుండి చంపూ ప్రబంధములలో వచన రచనలు — మితిమీరిన శబ్ద ప్రయో గముచేత — తొంటి అక్షర రమ్యత గోల్పోయి — మొగము లెత్తి నట్లు — అరుచి గల్గించి వెగటుపుట్టింప జొచ్చినవి. "యథా రాజా తథా ప్రజా." రాజాశ్రితులైన ప్రజలు రాజు ననుకరించి యతనికి ప్రీతిగలిగింప నెంచుట సహజము, పెద్దనాదికవులు బ్రాహ్మణు లగుట కారణముగా — రాజులవలె వేటలాడలేక పోయినను — ప్రబంధాటవు లలో నక్షర వేట తీవ్రముగా కొనసాగింప దొడగిరి. పర్యవసానము — కావ్యములో పరిమళముం బోద్రోలి, గహనమైన శైలి ప్రవేశించినది. వాఙ్మయమునకు చాల అపకారము సంభవించినది.

కొలది యుదాహరణములు :

రాయలు. ఆముక్తమాల్యద 3-89 : "ప్రక్షీణంబులు గా క్షోణీ తలం బేలుచుండెం గావున ముముక్షున కుపాశ్రయణీయుండధోక్ష జుండు. పాండ్యక్షితీశా...అయ్యధోక్షజుండు గాండీవి కుపదేశించిన.

Do. 4—35 : పట్టి పవిత్ర భగవత్ప్రసాద తీర్థంబులుపాయనం

బులుగా ప్రణామంబు లాచరించి లేచి ప్రాంజలులై ధర్మ పరికర్మ వర్మితంబగు బ్రహ్మరథంబున నబ్భాగవత వతంసంబు నునిచికొని పోవు సమయంబున బరస్పర సమేతంబులగు పౌర జానపద జనంబులు.

Do. Do. గుట్టిన డోలుటుల్లాసు లుల్లసిల్ల బల్లించిన పల్లంబులపై జల్లు త్రైలంబు.

4—35 వీక్షించి, కుక్షింభరత్వమున క్షుత్క్షాములై తిరిగితిరిగి... గోపాల భిక్షు భిక్షించి భక్షింప దీరక్షోణి నిలిపిన—.

అల్లసాని పెద్దన్న. మనుచరిత్ర : 4—37. ఇట్లమ్మహారణ్యంబు సొచ్చి విచ్చలవిడి నచ్చటన్ బచ్చిక బయళ్ళ మచ్చిక లచ్చుపడన్ దటిచ్చటిలంబులగు లోచనంబులు...

౬—19. ఈ క్రింది రచనములో వెదకి వెదకి 'టకారము నెట్లు వేటాడిరో చూడదగును :- "జటిలుండు గిటగిటం బంక్తు గొఱికి 'హుమ్మని కటంబు లదుర ముకుబుటంబులు నటింప గట గటా! కుటిలాత్మ! యటమటమ్మున విద్యగొనుటయుం గాక - గురుపుత్రోనా? గుటగుటలని కటకటంబడి ..."

ముక్కుతిమ్మనార్యు ముద్దుపలుకులలో గూడ — ఈ చుక్షర వేట ప్రత్యక్షమగుచున్నది. చూ — పారిజాతాపహరణము 2-53. 'పెచ్చుపెరుగు మచ్చరంబుల నొకరొకరి మెచ్చక పచ్చవిలుతుండు విచ్చలవిడిం...'

Do. Do. గ్రిక్కిరిసిన మక్కువల నిక్కువలగమియుం జిక్కుల చెయ్యులద్రొక్కుడు వడి

Do. Do. నొయ్యనొయ్యనం గదలు తూగుటుయ్యెలలం గన్ను మొగిచి...నయ్యెడ నయ్యదువల్లభుండు.

Do. 87 : — వెండియు నప్పసిండి కొండ గండశిలా మండలంబున నుద్దండ వేదండంబు లొండొండ గండతలంబు లొరసికొననిండిన ..

4—67 : అష్ట దిక్పాలకులు — మకార ప్రారంభ నామములు.

"మరుదధిప, మలినపథ, మహిమరథ, మాంసాశన, మకరాక్షేశ, మాతరిశ్వ, మనుష్యధర్మ, మహేశ్వరులకు మానవుం డీడగునే?

ఇందలి ద్వితీయాశ్వాసమునందలి మేరుపర్వత వర్ణనము శ్లేషో పమ విషమాలంకార విభాసితము :— "జలనిధియునుంబోలె నీలనల పనస కీలిత తుంగసేతు సహితంబును, వల్లకియునుంబోలె లలిత ప్రవాళ బహుళంబును. భారతంబునుంబోలె శతపర్వచమత్కృతం బును, శబ్దశాస్త్రంబునుంబోలె ధాతుగణ విద్యోదితంబును ....గవయ స్థానంబయ్యును నగవయస్థానంబై...

రాయల యుగమునాటి మేటికవులు మువ్వురనుమాత్రమే తీసి కొని వారి రచనలలో వచనమెట్లు పరిణమించెనో — సూక్ష్మముగా చూచితిమి. నన్నయ, తిక్కన, సోమనాథాదులనాటి సరళ, సౌకు మార్య, ప్రాసాద, మాధుర్యాది గుణములు దిగజారినవి. వన్యమృగ ములను విడువక, వెంటాడి తరిమికొట్టినట్లే — శబ్దాలంకార బాహు ళ్యము నాశించి, నాటి కవులు ఒక్కొక్క శబ్దముకొఱకు ఒక్కొక్క యక్ష రమును పట్టుదలతో వెనుకొని వేటలాడి, విసుగుపుట్టించి వెగటు దోపించిరి. మన గ్రంథకర్తలను ఈ లక్షణము గబ్బిలమువలె పట్టు కొని విడువలేకున్నది. ఆమధ్య బళ్లారిలో చిత్రనలీయ నాటకము రచించి, అద్భుతముగా నటించి జగత్ప్రఖ్యాతివడసిన ధర్మవరం రామ కృష్ణమాచార్యులుగారు — హరిశ్చంద్ర మహారాజునకును, అతని వేటకాండ్రకును మధ్య జరిగిన సల్లాపమును — కవి యెట్లు కూర్చెనో చిత్తగింపవలయును :— "ఎకిమీడా! తుళ్ళిపడుచు గేళ్లురుకు లేళ్ళ గమి కాళ్ళువట్టి, వ్రేళ్ళు వెతికి — త్రాళ్ళ గట్టియున్నాను." హరిశ్చంద్రునితో నిట్లు మాటలాడిన వేటకాడు, అడవిలో లేళ్ళను కంటె, ద్విత్వసహితళకారము — 'ళ్ల' అను నక్షరమును వేటాటి ఈ వాక్యములో కూర్చుటకు ఎక్కువ తంటాలుపడెననుట నిజము. విశే షించి, ఈ మృగయుడు శుద్ధ గ్రాంథికాంధ్రమునే మాటలాడ దీక్ష నైకొనిన మహామహోపాధ్యాయుడుగాని సామాన్యుడు గాడనుట స్పష్టము.

ఈవిధముగా రాయల యుగమునాటి వచన రచనలు–నన్నయ తిక్కనలనాటి జీవరసముల గోల్పోయి, ముచ్చబొమ్మల విధమున,

కృత్రిమ కల్పనలతోకూడి, నీరసములైనవో, మచ్చుచూచుటకు, అప్పటి ముఖ్యకవులు ముగ్వుర రచనల మాత్రము విమర్శింపగలిగితిమి. ఆ కాలపు ఇతరకవులు గూడ అనేకమంది, బహుకావ్యముల గూర్చిరి. అందు వారు, పై ఫక్కీలనే అవలంబించి, వారు కూర్చినట్లే వచనముల కూర్చిరి. వానినెల్ల ఇట ఉదహరించుట అసాధ్యపు పని — మనకు వ్యవధి చాలదు; అవకాశములేమికి చింతిల్లెదము.

" బూచి "

ఆంధ్ర ప్రజకు, ఓపిక చాలతక్కువ అనియు, ఏవిషయమును గూర్చియైన వారిలో నధిక సంఖ్యాకులు, పైపైని దడవి తృప్తిపడు స్వభావముగల వారనియు, వారి పరిశ్రమకు, లోతు చాల తక్కువయనియు తెలిసినది. నైజముచేత తెనుగులు, అవిమృశ్యకారులు. ఎవరేమి చెప్పినను చులకగా నమ్మి తలయూచి, భావ ప్రపంచములో తేలిపోయి, నింగికి నేలకు సూత్రములు పన్నుకొని ప్రమాదములకు పాల్పడుదురు. "గానట బీసట చదివి గాథలు త్రవ్వుకొను" తెనుగు జాతికి నన్నయభట్టు వ్యాసముని ప్రణీత పరమార్థము తెల్లము చేసినాడు. ఎవరికొఱకు తాను భారతము తెనిగించుచున్నాడో, ఆ యాంధ్రప్రజ లక్షణము నిమ్ముగా నెఱిగి, మూడుపాళ్లు తగ్గించి, ఐదింట రెండుపాళ్ళు మాత్రమే మిగిల్చి తెనుగు భారతము రచించెను. అదైన ఓపికగా చదువువారు అరుదగుచున్నారు. మనలో పెద్దలనుకొను వారి అవిమృశ్యకారిత్వమునకు ఒక్క ఉదాహరణ మీ సందర్భమున నిచ్చుట అత్యవసరమని తోచి ఈ క్రింది వాక్యముల వ్రాయుచున్నాను.

తెనుగునాట బాలకులు — పెద్దల మాటలు వినక, లొంగక, కొంటె చేష్టలు చేయుసపుడు, వారికి వెఱపుగొల్పి, జడిపించి లొంగదీయుటకు 'బూచి' వాని బిల్చుట సర్వసామాన్యము. యశోద వంటి తల్లికూడ కొంటె కృష్ణుని జడిపించుటకు "బూచివాని పిలువ నంపనా? గోపాలబాల! అని ముద్దుగ పాటపాడెనని ఐతిహ్యము.

అయినను, గుంటూరులో, ప్రసిద్ధ నాట్యవాదులై, స్వరాజ్య పోరాటము లోనికి ఉఱికి, వృత్తి విసర్జించి, మన మహానాయకులలో నొకరనిపించుకొని, సుప్రసిద్ధులైన, కొండ వెంకటప్పయ్య పంతులుగారు స్వయముగా వ్రాసికొనిన వారి జీవితచరిత్ర 4 పుటలో, తెనుగు 'బూచి' ఫ్రెంచి 'బుస్సీ' శబ్దభవ మనిరి. ఇట్లు వ్రాయుట అన్యాయము ; సత్యదూరము.

క్షత్రియ పద్మినివలెనే, వెలమ మల్లమదేవి — జోహార్ చేసి, సమస్త పరివారముతో అగ్ని కాహుతియైనది. బొబ్బిలికోట ముట్టడించిన ప్రచండ ఫ్రెంచిసేనాని, బుస్సీకి, ఆ స్మశానమే వశగతమైనది. బుస్సీ పుట్టుటకు ముందు — రెండువందలు యేండ్లకు పూర్వమే మన ఆంధ్రకవితాపితామహుడు — అల్లసాని పెద్దన్న, మనుచరిత్ర 4 వ ఆశ్వాసము 60 వ పద్యములో, మనోరమ పొందిన విచిత్రానుభవము వర్ణించినాడు. భీముని చేతిలో కీచకుని 'గంధర్వగోళము' విధముగా — కనులు, చెవులు, మొదలగు నవయవము లేర్పరింపరాక — ఒక ముని 'బూచి' వలె నగపడగా, బాల్యచాపల్యము చేత ఆ బాలిక ఆ తపసిని పట్టుకొనెను.

అదియునుం గాక, మరొకసంగతి — స్వరోచివేటకు వెడలినపుడు అతనితోకూడ, అడవికి, తీసుకొని వెళ్ళిన వేటకుక్కల పేళ్ళపట్టీలో— 4 — 32: " పులియుడు — బూచిగాడు — అసురపోతులు గాడు — అనుమంతిగాడు" అను పద్యపాదము ఉన్నది ఇందు — పులి – బూచి — మూడ భయంకరమైనవాని పేర్లు. కేతన దశకుమారచరిత్ర 8—9లో బూచిపట్టి అని కలదు – ఎఱ్ఱాప్రెగ్గడ హరివంశమునకూడ బూచి కలదు. ఇట్లు ప్రాచీన కాలమునుండి 'బూచి' అచ్చ తెనుగు పదముగా భాషలో చిరకాలమునుంచి వాడుకలో నుండగా — మన ప్రసిద్ధ ప్రబంధములనైన సరిగా చదువక — విమర్శించక — అది ఫ్రెంచి పదమనుట — అవిమృశ్యకారతకుఫలితము — సాహసము.

విమర్శలోపము ఆంధ్ర జీవితమున కొక ప్రధాన లక్షణమై మనల

ననేక విధముల చెఱుపుట కారణముగా — నిట విపుల విమర్శతో నొక్కి చెప్పవలసి వచ్చినది.

అట్టిదే మరొకవిషయము. ఆముక్తమాల్యద — పెద్దన రచించి కృష్ణరాయలు రచించినట్లు వెల్లడి చేసెనని అవిమర్శకులందురు — అది యసందర్భమని నా విన్నపము. అందుకు రెండు కారణములు మనవి చేసెదను.

(1) అల్లసాని పెద్దన్న పవిత్రుడైన బ్రాహ్మణుడు — అతనికి మత్స్యమాంసములు వండు పద్ధతులుగాని, వాని రుచులుగాని తెలియవు. ఆ ప్రసక్తిగల పద్యములు రాయలు తప్ప — బ్రాహ్మణుడు — పెద్దన్న వ్రాయలేడు.

(2) రాయలు మహామంత్రి తిమ్మరుసును 'అప్పాజీ' అని పిలిచి గౌరవించినను — అతని — పలుకుబడికి ఈర్ష్య వహించి, మనస్సులో మరుగుచుండెను. అందుకు ప్రబల నిదర్శనము — యామునాచార్యుడు తన కుమారునికి రాజ్య మప్పచెప్పుటకు ముందు బోధించిన రాజనీతిలో — మంత్రి నెవరి నెంచుకోవలెనో ఇట్లు బోధించినాడు :— ఆ. ము. మా — 4 — 213 :— "మంత్రియంచుం — గుణాతీతుం — గుమ్మడికాయ యంత ముత్తెంబై మనం బేర్చు నశ్లే తా నాతని చేతిలో బ్రదుకు వాడేయా జుమీ మీదటన్" రాయలకు మంత్రి తిమ్మరుసు అమాత్యత్వము — గుమ్మడికాయంతటి ముత్యమట్లు దుర్భరముగా తోచి — లోపలగూండ్రించు చుండెను. ఈ 'తంబళ్ళ' యనుమానమే — తుదకు తిమ్మర్సు కనులు తీయించి— చంపించినది. ఈపద్యము — ఇట్టి యంతర్గత తాపముచే, లోలోన బాధపడుచున్న రాయలు తప్ప — పెద్దన్న రచింపలేడు. గుమ్మడికాయంత ముత్యమును సాభిప్రాయపదము రాయలలేఖిని నుండే కాని — పెద్దన్న లేఖినినుండి జారలేదు.

## రాయలువర్ణించిన ప్రకృతిశాస్త్రవిశేషములు

(i) Magnetism అయస్కాంతాకర్షణ విశేషములు:— ఆకర్షక గుణముగల అయస్కాంతము — Magnet ను రాయలు "ఆకర్షకము"

అని వర్ణించెను. ఆయస్కాంతాకర్షణ, సృష్టి విచిత్రములలో నొకటి ఈ శక్తిగల వస్తువులు ఏ రూపమున నున్నను — దూరపు లోహముల నాకర్షింపక మానవు. సూదులను గాని — ఇనుప బీడును గాని కాంతశిలకు కొంతదూరమున నుంచిన పక్షమున వాని నది గమ్మున లాగుకొనుట వింతగా దోపకమానదు. అందుచేతనే జనులా రాళ్ళను 'సూదంటు రాళ్ళు' అందురు. ఆముక్తమాల్యద 3—74 లో వీని ప్రశంసగలదు. "ఆకర్షకములు వికార్యశ్మసారము దార్చునట్లు" అని ఉటంకింపబడినది. ఇనుము నాకర్షింపగల కాంత శైలములు సముద్ర గర్భములందును గలవు. అట్టి శైలముల జేరవచ్చిన నౌకలలో—లోహము ఎక్కడ ఏరూపమున నేమాత్ర మున్ననూ — పట్లూడి పరుగున — లేచిపోయి — యా పర్వతమును డీకొని అంటుకొనిపోవును. పడవల బల్లలను ఇనుపమేకులు — బందులు — నెమ్ములతో నతికిన పక్షమున నిట్టి ఘోర ప్రమాదములకు పాల్పడవలసి వచ్చునని యెరిగి ప్రాచీనకాలపు వడ్లవారు — నౌకలు నిర్మించునపుడు లోహబంధముల నేమాత్రము వాడకూడదు — కూడదని నిషేధించినారు.

అభినవదండి — కేతన దశకుమార చరిత్ర 5—33 లో "చుంబక శిలాప్రతిమం దగులు నయోరూపంబునుం బోలె' — అని యీ చుంబక శక్తిని ప్రశంసించినాడు. రాయలు — ఈ ప్రకృతి రహస్యముల నెరిగిన ప్రోడ — కావున నాముక్త మాల్యదలో నక్కడక్కడ ఈ శక్తిని ఉటంకించినాడు. చూ. 4-80: "పిడుగు ఉక్కు జాత్యపుటయస్కాంతంబు నత్తున్కలోపల జూపన్మహిమిది లోహ రజముం బైబర్వైనాలేచె"

ఈపద్యములో మెఱుపు విద్యుత్తును — కాంతజ విద్యుత్తును సజాతీయములని రాయలు తెలిపినారు. అమెరికా వైజ్ఞానికుడు — బెంజమిన్ ఫ్రాన్క్లిన్ నిరూపించునంతకు పడమట వారి కిది తెలియదు. 4—151 లోగూడ ఇట్టి విశేషములు తెలుపబడినవి.

శ్రీకృష్ణదేవరాయలు వారు క్రీ॥ శ॥ 1530 లో పరమపదప్రాప్తులైరి. తరువాత మరికొంత కాలమునకు ఎలిజబెత్ మహారాణి

ఇంగ్లండు దేశము నేలదొడగెను. ఆమెకు వైద్యుడుగా నుండిన — డాక్టరు గిల్బర్టు — లోహచుంబక శక్తిని గూర్చి పెక్కు పరిశోధనల జేసెను. అసలీ భూమండలమే ఒక ఆకర్షక మనియు — దాని ధ్రువములే ఉత్తర దక్షిణ ధ్రువములు — (North and South Poles-of terres trialglob e) అనియు నతడు ఋజువు చేసెను.

విశేషించి హేమాంబరమట్లు చూడ — పచ్చనైన 'ఏంబరు' (Amber) ను పీతమణిని వస్త్రముతో మథించినపుడు — అయ్యది తృణాది తేలికపదార్థముల నాకర్షింపగలదని నిరూపించినాడు — గ్రీకుభాషలో ఏంబరును ఎలెక్ట్రాన్ అందురు. దానికి గల విశిష్ట ఆకర్షణ శక్తికే ఎలెక్ట్రిసిటీ అని అతడు పేరు పెట్టెను. ఆశక్తి నేడు బ్రహ్మాండ వ్యాప్తి గల మహాశక్తిగా విజృంభించినది.

ఏంబరు నామకమగు పీతమణికే గాక — ఇంద్రనీలమణికి గూడ ఈశక్తికలదు; కలదని మన పూర్వ గ్రంథములలో గలదు. మథింపబడిన ఇంద్రనీలము తృణము గ్రహింప గల్గుటచే దానికి 'తృణగ్రాహి' యను పేరు రూఢమైనది. రాయలవారికి 'కృష్ణరాయవిజయము' అనబడు కృతిని అంకిత మిచ్చిన ధూర్జటికవి — తానొక తృణము — గడ్డిపరకవంటి అల్పుడననియు — అటువంటి తనను చేపట్టుట చేత — రాయలు రాజరత్నమనిపించుకొనుట సార్థకమగు ననియు చమత్కరించి సాభిప్రాయముగా రచించినాడు. తృణగ్రాహిత్వము రత్నములకు సహజ గుణము; వాని నాకర్షించుట చేతనే మణిత్వము స్థిరపడును; లేనిచో నవి — మణులు కానేకావు. రాయలుగూడ ఆముక్తమాల్యదలో రెండుచోట్ల నీ తృణగ్రాహి ప్రశంసచేసెను. చూ — 4. 132: కాకులగుంపులు గూండ్ల కట్టుకొనుటకు ముక్కున గఱచి తెచ్చుకొనిన గడ్డి పరకలమూలముగా — వానికి తృణగ్రాహిత్వము సిద్ధించె నన్నట్లున్నది; 4 — 164:— శరదృతువున నాకాశమునకు తృణగ్రాహిత్వము సిద్ధించినట్లు స్ఫురించుచున్నది. ఏమనగా వరిపంటలు బాగుగా పండినవి; నూర్చిన పిమ్మట మేట్లుగావైచిన గడ్డి మిన్నంటు కొండలవలె

చున్నవి. నీలమైన ఆకసము ఈ గడ్డివాముల నంటు చుండుటచేత — మింటికి తృణగ్రాహిత్వము సిద్ధించినది.

రాయల తరువాత నించుమించు చోక శతాబ్దము పిమ్మట నుండిన గిల్బర్టు పేరు జగత్ప్రఖ్యాత మైనది. 1565 లో తాళికోటలో ఆంధ్రు లోడిపోయి — వారి సామ్రాజ్య మంతరించిన తరువాత — ఆంధ్ర ప్రతిభ అన్నింటను క్షీణించెను— తెనుగుజాతి అన్నింటను పేదవడి దీనస్థితికి దిగజారెను.

## రామరాజ భూషణుడు — వసుచరిత్ర

సంస్కృత మహాకవులలో మిక్కిలి ప్రసిద్ధులైన కాళిదాసు దండి భవభూతి, బాణుడు మొదలగువారు భోజుని, యాస్థానమున సమకాలికులై యుండిరనునట్లే — అల్లసాని పెద్దన్న — ముక్కుతిమ్మన్న రామరాజభూషణుడు, తెనాలిరామకృష్ణుడు మొదలగు నాంధ్ర కవు లెనమండుగురును — రాయలతో సమకాలికులై, ఆతని యాస్థానమున 'అష్టదిగ్గజములై' యుండిరని యొక పుక్కిటి పురాణము బయలు దేరినది. రామరాజభూషణ కృతమైన వసుచరిత్ర — తిరుమలరాయ ప్రభునికిని — తెనాలిరామకృష్ణ విరచితమైన పాండురంగమహాత్మ్యము విరూరి వేదాద్రి మంత్రికిని అంకిత మొనర్పబడినవి. కాబట్టి తెనాలి కవి వసుచరిత్రకవి — రాయలతో సమకాలికులై అతని యాస్థానమున నుండిరనుట నిజము కాజాలదని శంక పొడముచున్నది.

వసుచరిత్ర కావ్యముయొక్క మహనీయ భావగాంభీర్యమును బట్టియు, నిరుపమాన శ్లేషాదిమాధుర్యమును బట్టి చూడగా — ఇట్టి యుత్తమ ప్రబంధము ఇతర భాషలలో నెందైన కలదా యని సంశయింప తగియున్నది. ఇది సంస్కృతములోని కనువదింప బడుటచేత దీని ప్రాశస్త్యము వెల్లడియగుచున్నది. రామరాజభూషణుడు ఆంధ్ర భాషకు యజమానియైనట్లు ప్రబంధము గూర్చెనుగాని సేవకుడైనట్లు రచింపలేదు. కేవల కల్పిత కథలు కృత్రిమ రత్నములు; ఆద్యసత్కథలు పుట్టుకచేతనే రత్నములు; సత్కవి కల్పనా చాతుర్యముతో

రాజు తురుష్కుల నోడించి కల్యాణ దుర్గమును సాధించెనను చరిత్రాత్మక విషయమును నిరూపించుటలో ఈ వసుచరిత్ర పద్యము — "లక్ష రూపాయిలు విలువచేయగల సాయము చేసెనని" — కీ॥ శే॥ సుప్రసిద్ధ చరిత్రకారులు, కొమఱ్ఱాజు లక్ష్మణరావు పంతులు గారు, మహమ్మదీయ మహాయుగమను చరిత్ర గ్రంథములో — హర్షాన్వితస్వాంతులై వక్కాణించి వ్రాసిరి. మన వాఙ్మయ మంతయు నిశితమైన చరిత్ర దృష్టితో విమర్శింపవలసిన అవసర మెంతో కలదు. అట్లే ప్రకృతి శాస్త్ర విషయ పరిశోధనలును, అత్యావశ్యకమే నని విన్నవింతును. మన పూర్వకవులును, గ్రంథకర్తలును, ఈనాటి పట్టభద్రులు, ఆంగ్ల మానసపుత్రు లనుకొనునంతటి అవివేకులు కారు — కారని రెట్టించి పల్కెదను. ఆయాదృష్టులతో వానిం బఠించుట అత్యవసరమని విన్నపము.

## సంగీత ప్రాశస్త్యము

వసు చరిత్ర కర్త. సంగీతవిద్యా విశారదుడు. అతని పద్యములు రాగ — తాళ వరుసలతో సంగీత సభలలో గానము చేయు నర్హములై యుండుట — ఆకృతికి — అనన్య సామాన్య గౌరవప్రాశస్త్యములు చేకూర్చుచున్నవి. జయపుర సంస్థానాధీశ్వరులై శ్రీ విక్రమ దేవవర్మ — సాహిత్య సామ్రాట్ — వారిసభలో — ఆంధ్ర హరికథా పితామహుడును — ఆటపాటల మేటియు నగు — అజ్జడాదిభట్లనారాయణ దాసుగారు వసుచరిత్రను రాగవరుసను పాడి సభికుల నానంద రసాబ్ధి నోలలాడించిరి. ఇట్టి విశిష్టరచనా విశేషములతో విలసిల్లు వసుచరిత్ర గర్భితమైన సంగీత ప్రాశస్త్యమును ఆంధ్రు లెంతేని పెంపు జేసుకోవలసిన అవకాశము లున్నవి; జాతి సంస్కృతికి అట్టి ప్రయత్నము అత్యవసరము.

ఇట్టి సంగీత కళాసిధి రచించిన ప్రబంధములో చెవుల కింపు గూర్చు వాక్యములుకొన్ని యుండక పోవు — చూడుడీ వాక్యమును: 2 — 86 — ఇందు అనుస్వార సహితమైన సరళజకార — అను ప్రాసము ఎంత రమణీయముగా నడచినదో !

## అనుప్రాస చమత్కారములు

"ఆకంజనయన యనుంగు చెలులలో సమంజస వచన చాతురీ రంజితయగు మంజువాణి యంజలి పట్టి యతికుంజరునితో నిట్లనియె." ఆలాపంబు లాలాపించి (3. 62) ఇత్యాది సజాతీయ పద రచనలును రచనా ప్రాశస్త్యమును పెంపు చేయగలవు.

అయినను గట్టురాయడు — హిమవంతుని పుత్రుడగు కోలాహలుడు నైసర్గికముగా పారుష్యము కలవాడగుటచేత — అతని యవస్థ విశదము చేయుటకు — పరుషద్విరుక్తటకారము నేర్పుగా గూర్పబడినది — చూ. 2-140 "నెట్టన నాగట్టు దొరపట్టి యొట్టకేలకు మట్టుమీరి గుట్టునం బట్టరాని తమకంబునం దట్టువడి కట్టలుకం గట్టలు వడనేయు కట్టిడి మరుని యంపసెల కట్టి యల బెట్టునం బుట్టు బెట్టిదపు నొప్పిదట్టి దట్టంపు నిట్టూరుపు...

గద్దరి కోలాహలుడు — ముద్దరాలు శుక్తిమతిని — పెద్దయుం బ్రొద్దు నిరోధించి — కఠిన నైజమును ప్రదర్శించుకొనెనని నిరూపించుటకు అనురూపముగా ద్విరుక్త పరుష టకారమును పదునెనిమిది సార్లు కూర్చినగాని కవికి తృప్తి కాలేదు. అట్లే షోడశ కళా పరిపూర్ణుడగు చంద్రుని రేయెండ వర్ణించు పట్టున — బిందుపూర్వక డకారమును పదునారు తడవలకు తక్కువకూర్చుట కూడ కవికి ఇష్టము కాలేదు— చూ. 4-16-" వెండియు నఖండశశిమండల కుండలిత కుసుమకోదండ కాండాసన హిండిత కరకుముద కాండ ప్రకాండ తాండవిత పాండుర పరాగ మండలంబుం మెండుకొనుచు నిండారవిరసిన బొండు మల్లియల తండంబులం బొదలు"...

మఱియు కొన్ని తావులలో — కవి "తుమ్ముకొని తానే చిరంజీవి యని దీవించుకొన్నట్లు — ముందొక విరోధ వాక్యమును, వెంబడినే పరిహార వాక్యమును గూర్చుటయు గలదు. చూ 2-11:— "నవరతామోదసిద్ధ మహిళాకులంబయ్యు — ననవరతామోద సిద్ధ మహిళాకులంబై —; నిశాకరకాంత రాజీవ రాగచ్ఛాయం బయ్యు

ననిశాకర కాంత రాజీవ రాగచ్ఛాయుంబై — మేరు భూరిప్రభాభాస మానంబయ్యు — నమేరు భూరిప్రభాభాసమానంబై — వెలయుచున్న యది ”

రామరాజభూషణ రచితమైన హరిశ్చంద్ర నలోపాఖ్యానమును శ్లేష ప్రధానమైన కావ్యము. గ్రంథమెక్కడ పట్టిచూచినను ద్వ్యర్థిముఖమై — ఒకనోట సత్యహరిశ్చంద్ర చరిత్రమును — రెండవనోట నల చరిత్రమును — ఏకకాలమున నుద్ఘాటించు రమ్య ప్రబంధము. శ్లేష రచనా కౌశల్యము ఈ కవికి ఉగ్గుపాలతో కల్గిన దనిపించక మానదు. సంస్కృతమున ప్రత్యక్షర శ్లేషభూషితమైన వాసవదత్తలో కంటెను శ్లేషకవిత రామరాజభూషణుని చేతిలో పెంపొంది విలసిల్లినది. ఇతని ననుకరించి పింగళి సూరన్న రాఘవపాండవీయమును, మంత్రిప్రగడ సూర్యప్రకాశ కవి కృష్ణార్జున చరిత్రయు రచించిరి. ఈ ప్రబంధము లలో వచనరచలు కూడ పద్యముల వలెనే చక్కని శ్లేషలతో నుల్ల సిల్లుట విశేషము.

దశకంఠ రామాయణమునకు ప్రతిగా — శతకంఠ రామాయణ మును, ఈ రెంటిని మించి సహస్రకంఠ రామాయణము బయల్వెడలి నట్లే — పైని వివరింపబడిన శ్లేషకావ్యముల కంటె ఘనమైన — త్ర్యర్థి కావ్యము రచించి కవితా సామ్రాజ్య పట్టాభిషేకము గట్టుకొనెంచి నట్లు — నెల్లూరి వీరరాఘవ కవి — యాదవరాఘవపాండవీయమును రచించెను. ఇందు రామాయణ, భారత, హరివంశ కథలు ఏక కాల మున త్రిముఖముల బల్కించినట్లు కూర్చ — కవి సాహసించెను. ఎల కూచి బాలసరస్వతియు నిట్టి త్ర్యర్థి కావ్యము రచించి నట్లు కనబడు చున్నది.

ద్వ్యర్థి కావ్య రచన భారతముతోనే ఆరంభించినట్లు స్ఫురించు చున్నది. భారత కథ చరిత్రాత్మకముగానే గాక — నక్షత్రాక్షరము లతో జ్యోతిర్లోకములందు వివరములతో కూర్చబడినట్లు స్పష్ట మగు చున్నది. ఆ ప్రశంసా వివరము లిచ్చుట అప్రస్తుతములు.

వసుచరిత్రానంతరము మనము ప్రస్తావింప వలసినది — తెనాలి

వారి పాండురంగ మహాత్మ్యము. వాల్మీకి — 'రామాయణ కోకిల' — యైనట్లే, తెనాలి రామకృష్ణుడు — "ప్రథమశాఖా కోకిల"నని చెప్పు కొన్నాడు. బ్రాహ్మణ శాఖలలో మహామేధాశాలి యైన — యాజ్ఞ వల్క్య మునీంద్రుని శాఖకు — ప్రథమ శాఖ యని ప్రసిద్ధి కలదు. పాండురంగ మాహాత్మ్య — కావ్యమునందు తెనాలి రామలింగకవి కూజితములే గాక, పద గుంభనమును చాల ప్రశస్తి కనినవి. పాండురంగ మాహాత్మ్య కథలలో విమర్శకులను మిక్కిలి ఆకర్షించిన పాత్ర — నిగమ శర్మ. శ్రీనాథ కవిసార్వభౌముని శ్రీ శివరాత్రి మాహాత్మ్యములో విప్రకుమారుడు — గుణనిధి — వలెనే నిగమశర్మ కూడ, పరమ నీచుడు. పీఠికాపుర నివాసియైన యొక యుత్తమ బ్రాహ్మణుని భార్య — ఉత్తమురాలు — ఈ నిగమశర్మ అక్క. ఆమెకు సోదరుని యందు అపారమైన. ఆదరాభిమానము లుండెను. అటువంటి ఇల్లాలును — తన తోబుట్టువును, ఈ పతితుడు వంచించి, ఆమె బంగారమును దొంగి లించి పలాయనము చిత్తగించెను.

పాండురంగవిఠల దేవర తన భక్తులతో ఆటలాడి వినోదించు లీలావిలాస పరుడు. విఠల దేవుని భక్త పరతంత్రకును — రామకృష్ణుని పదగుంభనకును — కావ్యములో నెక్కడ చూచినను నిదర్శనములును, దృష్టాంతములును కావలసినన్ని కనబడును.

పింగళ సూరనార్యుడు — ప్రభావతీ ప్రద్యుమ్నుల ప్రేమ గాథతో రమణీయ మగు శృగార ప్రబంధమును, రాఘవ పాండవీయ మనెడి ద్వ్యర్థి కావ్యమును, కళాపూర్ణోదయ మనెడి చిత్ర ప్రబంధమును, రచించినాడు. చంపువుగా వెలసిన యీ కళాపూర్ణోదయమే తెనుగు భాషలో మొదటి నవల యనదగి యున్నది. ఇందలి కథాగమనిక, పాత్రౌచిత్యము — రసపోషణ — ఇవన్నియు మిక్కిలి ప్రశంసనీయములు. కట్టమంచి రామలింగారెడ్డిగారు కవిత్వ తత్త్వ విచార విమర్శలో — తిక్కన, వేమన, సూరన్న అను నీ ముగ్గురే తెనుగు భాషలో కవు లనదగిన వారని ఉగ్గడించిరి. ఇందు, వేమన కేవల పద్దెముల

కూర్పరి. తిక్కన సూరన్నల వచన రచనా విశేష ములను — అనుబంధ ములో విమర్శింతము.

కవుల చరిత్ర కెక్కని తెనుగు కవులు కొన్ని వేలమంది ఉన్నా రని విమర్శకులు నుడువుచున్నారు. తెనుగున కబ్బములు కూర్చిన కవులు — కొన్ని వేలమంది కాకున్న — కొన్ని వందలమంది యైన ఉందు రనుటకు సంశయము లేదు; ఈ సంఖ్యలో చాలమంది అనుసరణ శీలురు. ఒక కవి "చేసెను" అని యొక పద్యము రచించిన — తరు వాత మరొక కవి, ఆ పదము తీసివైచి, సమానార్థక మైన 'ఒనరిం చెను' అను పద ప్రయోగముతో క్రొత్త పద్యమును గూర్చును. అట్టి వారు "మార్పులు" గాని — కవిత కూర్పరు లనజనదు.

అందును వచనరచనలను గూర్చి గమనించ వలసిన విశేషములుకూడ కొన్ని గలవు. అతి కుఱుచలైన "అంత" "అప్పుడు" "అందును." తదనంతరంబ మొదలగునవి — ముందు వాక్యమునకు ఆవెనుక వచ్చే పద్యముతో సంబంధము కలుపు టంకపుపోడులుమాత్రమే. మరికొన్ని చిన్న వచనములు — "పూర్వాంశ సంగ్రహప్రశంస" లు; ఒకసారి చెప్పబడిన కథాంశములను సూక్ష్మముగాను సంగ్రహముగాను సంస్మరించి ఉత్తర కథాంశములతో చేర్చి చెప్పుటకు అనుకూలించును. మరికొన్ని కేవల పట్టికలు — Lists — దుర్యోధనుని తమ్ములు తొంబది తొమ్మండుగురు పేర్లను "గురువు లఘువుచేసి కుద్దించి కుద్దించి । లఘువు గురువుచేసి లాగి లాగి" ఎన్ని తంటాలు పడినను, ఆ పేళ్ల పట్టిక — పద్యములలో నిముడ్చుట కష్టము. కద్రువ సంతానము — నాగుల పట్టిక కూడ అట్టిదే — గజేంద్ర మోక్షణ కథలో త్రికూట పర్వతారణ్యసీమలలో పెరిగిన వృక్షముల పట్టిక — "అది మఱియును మాతులుంగ — లవంగ లుంగ చూత కేతకీ......" ఇటువంటి వన పాదప వర్గమును పద్యములలో నిఱికించుట — అసాధ్యము. ఇటువంటి ప్రయోజనములను బట్టి ఈ వచనములకు గ్రంథములో ప్రవేశము లభించినది గాని వాని కవితా సౌరభమును బట్టి కాదు. అట్టి వచనము లను మనమీ వ్యాసమున దడవ పనిలేదు. ఆ శ్వాసాంతగద్యము కూడ అట్టిదే.

## వచన రచనలందు నిరసన భావము

మానవులు పుట్టినది మొదలు* — కాదు — మాటలాడ నేర్చినది మొదలు — దేహము చాలించు వఱకును — వచనములోనే మాటలాడుదురు. అయినను, అదేమి కర్మమోగాని, విద్వాంసులు మాత్రము వచనమును అతి చుల్కనచేసి మాటలాడు చుందురు. ఇంగ్లీషులో వచన రచనలను 'Prose' అను చుందురు. దీని విశేషణరూపము 'Prosaic' ఆ మాటకు 'చప్పిడి', 'నిస్సారము'నని అర్థము రూఢమైనది. వచనము లేకుండి పద్యములు రచించుటలోనే ఉన్నది. కవితా ప్రాగల్భ్య మను భావము — ప్రాగ్దేశములందే గాక — ప్రతీచీదేశముల విద్వాంసులందును ప్రబలినది.

తాను కూర్చిన కావ్యములో వచన రచనకు ఎడ మియ్యనని భీష్మించి, ఆంధ్రభాషలో ప్రథమ నిర్వచన గ్రంథము రచించినవాడు కవి తిక్కన. తాత భాస్కరుడు రామాయణము షట్కాండలు మాత్రము తెనిగించి విడిచి నందును — ఏడవది — ఉత్తరకాండ నిర్వచనముగా కూర్ప సంకల్పించి — అందిట్లు వక్కాణించెను :— "కంస వచనము లేకయ వర్ణన రచియింపగ గొంతవచ్చు బ్రౌఢులకు గథా ప్రచయము బద్యములన పొందుచితముగా జెప్పు టార్యులొప్పిదమన రే- కేవల పద్యకావ్యరచన కష్టము, అందు చేతనే నిర్వచన గ్రంథ రచన కవి కెక్కువ గౌరవము చేకూర్చునను భావముతోనే తిక్కన నిర్వచనోత్తర రామాయణము రచించెను. తిక్కన నిర్వచనోత్తర రామాయణములో కొంతకథ మిగిలి పోయినది; దాని నేకాశ్వాసముగా పూర్తిచేసిన — జయంతి రామభట్టకవి నిర్వచనముగానే రచించెను. కంకంటి పాపరాజు కూడ ఉత్తరరామాయణమును రచించెను గాని నిర్వచనముగా గాక — చంపువుగా కూర్చి — నమస్కార బాణముతో క్షమాపణ వేడుకొన్నాడు :— మ॥ వరుసం దిక్కన యజ్వ నిర్వచన

---

* చేటలో బడినది మొదలు కాటిలో బడువరకు" అజన్మాంతము ననుటకు పామరుల నోట వినవచ్చు లోకోక్తి.

కావ్యంబై తగంజేసె నుత్తరరామాయణ మందు నున్మరి ప్రబంధంబూని నిర్మించుటే సరసత్వంబని ప్రాజ్ఞులార నిరసింప బోకుడీ! రాఘువేశ్వరు చారిత్రము లెందరెన్ని గతులన్ వర్ణించినం గ్రాలవే!" అని పండితులకు నిర్వచన కావ్యములందు గౌరవము — పక్షపాతము నెక్కువయనియు, చంపువులయం దాదరము తక్కువ యనియు విశదముచేసినాడు.

పర్లాకిమిడి వాస్తవ్యుడు మచ్చ వెంకటకవి యనునాతడు — శుద్ధాంధ్రనిరోష్ఠ్య నిర్వచన కుశచరిత్ర రచించెను దీనిని ముద్రించి ప్రకటించిన పూండ్ల రామకృష్ణయ్యగారు - తమ అముద్రిత గ్రంథ చింతామణిలో నిట్లు వ్రాసిరి :— నిర్వచనగ్రంథము — అనగా వచనములేక కేవల పద్య భూయిష్ఠమైన గ్రంథము. ఇట్టి కృతు లన్నియు నిర్వచన నియమము లోనివి — ఈ నియమమునకు మార్గదర్శి — బుధారాధన విరాజియగు తిక్కన సోమయాజి. ఇట్టి నిర్వచనగ్రంథము లనేకము లిలవెలయు చున్నవి. వానినెల్ల నిచట బేర్కొనుట యనావశ్యకము. అయిన వీనిలోనెల్ల — బ్రహ్మశ్రీ కొక్కొండ వేంకట రత్నము పంతులుగారి "శ్రీబిల్వేశ్వరీయము" నిర్వచన గ్రంథములలో దల కట్టనదగియున్నది. ఇందు దాదాపుగా 3000 పద్యములు గలవు.

## వీరేశలింగముగారి శుద్ధాంధ్ర నిరోష్ఠ్యనిర్వచన నైషధము

ఈ నైషధ కావ్యమును తాము రచింప బూనుటకు కారణమును వారిట్లు ప్రకటించిరి. చూ. స్వీయచరిత్ర, 2 భాగము. పుట 126 :— 'ఈవర కెవ్వరును త్రొక్కని క్రొత్తత్రోవ త్రొక్కవలెనని నా మనస్సునకు తోచినది. అచ్చ తెనుగు గ్రంథములు — పొన్నగంటి తెలగనార్యుడు, కూచిమంచి తిమ్మకవియు మాత్రమే రచించిరి. నిర్వచన గ్రంథము నొక్క తిక్కన సోమయాజి మాత్రమే రచించెను. నిరోష్ఠ్య గ్రంథముల నిద్దరు కవులు మాత్రమే చేసిరి. ఈ మూడు విధములైన ప్రయాసములు సమీకరింపజేసి యొకగ్రంథమునం దిమిడ్చి రచించుట యెక్కువ ప్రశంసనీయమని తలచి 'శుద్ధాంధ్ర నిరోష్ఠ్య నిర్వచన నైషధమును రచింప నారంభించితిని."

నిజముగా నిర్భయముగా పలికిన — ఆనాటి కవులకు మతులు పోయినవని చెప్పవలెను. ఎల్లవారికి తేటతెల్లముగా తెలియునట్లు ధారాళమైన శైలిలో గ్రంథ రచనమాని — బంధకవిత్వ — గర్భకవిత్వాది వికార రచనముల గూర్చి కృషిచేయ జొచ్చిరి. భగవంతుడిచ్చిన కాలు చేతులతో పనిచేసి అందరివలె నడచి పోవుద మను బుద్ధి పోయినది. వీధులలో బడి చమత్కారముగా దొర్లుచు పోవుట — గారడి వాండ్రు సర్కసుపని వాండ్రవలె — వింతగాదోచు వికారపు మొగ్గలు వేయుచు బోవ సమకట్టినట్లు నిర్జీవములు, నిర్వీర్యములైన రచనలకు దిగజారిరి. ఒకకవి — 7 పంక్తులు నిడవిగలపేరుతో - బంధకవిత్వ గర్భకవిత్వములు గల పద్యము రచింపగా ఆకవిమీద పోటీకి మరొక కవి 13 పంక్తులు నిడివిగల — పేరుతో చిత్రకవిత్వ - గర్భకవిత్వ బంధకవిత్వముతో పద్యముగూర్చినాడు సహస్రకంఠ రామాయణముతో— కంఠ రామాయణమువలె ఈ గారడి కవిత్వము ఇంతటితో ఆగినది. వచన రచనలకు దాపరించిన దుర్దినములును అంతటితో అణగినవి.

## దాక్షిణాత్యసీమలలో తెనుగువచన కావ్యముల విజృంభణము

శ్రీకృష్ణదేవరాయుల కాలము నాడు ఆంధ్ర సామ్రాజ్యము—కృష్ణ మొదలు కన్యాకుమారి వఱకు వ్యాపించెను. కళింగ దేశ విజిగీషామనీషతో పూర్వ దిగ్విజయయాత్ర సాగించి — ఉదయగిరి మొదలగు దుర్గముల నుండి — కసావా పాత్రుడు మొదలగు నోడ్ర సేనానులను, దుర్గాధిపతులను ఓడించి గెంటుచు, ఆ ప్రాంతములను రాయలు తన సామ్రాజ్యములో చేర్చుకొనుచు వచ్చెను. తుదకు కటకనాథుడు గజపతి నోడించెను. ఆతని పుత్రికను వివాహమాడి, రాజ్య రక్షణకు ఏర్పాట్లు గావించి — జయస్తంభముల ప్రతిష్ఠించెను. ఇట్లు తూర్పు తీరమున గల సమస్త దుర్గముల నుంచి ఉత్కళుల బోదోలి యాత్రాంతముల నిష్కంటకము గావించెను.

అంతకు పూర్వమే దక్షిణాపథమున గల ద్రవిళ — కర్ణాట చోళ తమిళ—పాండ్య, కేరళములు రాయలకు వశమై యుండెను. రాయలు

ఏర్పఱచిన రాజప్రతినిధులు ఆయాన స్థానే ఆయప్రాంతముల నేలుచు ఆదాయము రాయల భాండారమునకు పంపుచు వచ్చిరి.

రాయలు శా. శ 1452 = 1530 క్రైస్తవాబ్దముల నాడు పరమ పదము చెందెను. అనంతరము రాయలవారి అల్లుడు అళియ రామ రాజు — రాయలసామ్రాజ్యము నేల దొడగెను. ఆప్రభువునకు దూర దృష్టి వివేకము తక్కువే అనవలెను. తురకలతో చీలి కయ్యముల తెచ్చి — తురకల నతిక్రూరముగా హింసింప దొడగెను. ముసల్మానుల పై కత్తి సాగించుటలో — దక్షిణాంధ్ర సంస్థానములపై మెలకువ మందమైనది. సందు దొరికిన చాలుగదా ? దక్షిణదేశముల నేలుచు వచ్చిన నాయకులును, క్షత్రియులును విజయనగర సామ్రాట్టుల కొదిగి వారి సామంత రాజులుగా నుండుటకు అంగీకరించ లేదు. రాయలు చనిపోయిన ముప్పదేండ్లకే మధుర నేలుచుండిన విశ్వనాథ నాయకుడు స్వతంత్రుడయ్యెను. మధురలో ఆంధ్రనాయక రాజ్యస్థాపనము — శాశ 1486 =1564 AD మరి సంవత్సములోనే తాళికోట ప్రళయము వచ్చినది. అళియరామరాజు అవివేకము వలన తురుష్కులను మితి మీరి హింసించగా అది సహించక బహమనీ సుల్తానులు గోల్కొండ బీజపూర్ — అహమ్మదు నగర్ — బేరార్ బేదరుల నేలుచుండిన సుల్తాను లైదుగురు నేకమై అళియరామరాజుపై దండెత్తి — అతనిని చంపి ఆంధ్రసామ్రాజ్యమును కూలద్రోసిరి — ఆ వివరములు మన కిపుడు అప్రస్తుతము.

ప్రస్తుతాంశమే మనగా — నాయక రాజులు ఆంధ్ర వచన రచనల నెట్లు పోషించి గౌరవించిరో ఆ క్రమమును తెలిసికొని సంగ్రహముగా వివరించుట మన కర్తవ్యము.

## ఆపదల కోర్చి సంపద లనుభవించు.

మనుష్య జాతియొక్క అనుభవములు—విజ్ఞానము—అన్నియు—రెండు మాటలలో స్ఫటికీ కరణము నొందినవని — అనుభవశాలి, ఒక విజ్ఞుడు వక్కాణించియున్నాడు. ఆ రెండుమాటలు, ఏవి ? Wait and Hope

ధైర్యము - నిదానము ననునవి. వాల్మీకి జీవన్భద్రాణి పశ్యతి అనియు వ్యాసభగవానులు తిక్కననోట పల్కించిన వాక్యరత్నము: "ఆపదల కోర్చి సంపద లనుభవించు" అనునదే మానవకోటి కిచ్చిన సందేశము. ఆంధ్రప్రౌఢ కవుల నిషేధ నిష్ఠురములకు పాల్పడినను, తెనుగు వచన రచన, శాంతము, నిదానము నవలంబించి, తోటివారిలో స్వతంత్ర జీవనము చేయ నారంభించినది.

## "పరోక్షప్రియాదేవా"

"దేవతలు పరోక్ష ప్రియులు" – అనగా చెప్పవలసిన సంగతులు సూటిగా, తేటతెల్లముగా తెలియచెప్పుటకు ఇష్టపడరు. భావము లెంత గుప్తముగా నున్న నంత మేలని కొందఱు తలంచు చుందురు. పిడికిలి మూసినట్లు - విద్య గుప్తముగా నుండ వలెననియు, అది తేట తెల్లము కారాదనియు కొందరి అభిప్రాయము. మరికొందరు అందు కంగీకరించక, అందరకును తెలియునట్లు సులభ శైలిని తేటమాటలతో గ్రంథరచన సాగింపవలెనని కొందరి మతము. నన్నెచోడుడు తారకుని రాక్షస సైనికులు చచ్చిరని వ్రాయక – కృతాంత నికేతనాంతర్గతు లైరని వ్రాయుట మనము గమనించితిమి. తెనాలి రామకృష్ణుడు – కప్పను 'వరుణ దంతావళ' మనెను, సూర్యుని "పెనుమినుకులబరణి" యని వర్ణించినాడు. ప్రపంచ మంతటను–గ్రంథకర్తలు రెండువిధము లుగా నున్నారు. ఒకతెగ పరోక్షప్రియులు. రెండవతెగ – చెప్పవల సినదేదియో – సూటిగ ప్రత్యక్షముగా చెప్పుదురు. మనమిటుపై తెనుగు వచన రచనల కాశ్రయమిచ్చి, పెంచి పోషించిన దాక్షిణాత్య ప్రభువులు—దక్షిణ మధుర, తంజావూరు ప్రాంతముల నేలిన, క్షత్రియ నాయక ప్రభువుల రచనలకూర్చి ప్రశంసింపవలసి యున్నది. దాక్షిణాత్య ఆంధ్ర విద్వాంసులు పరోక్షప్రియులు గారని వక్కాణింప ముదావహ మగుచున్నది. సంస్కృత భాషలో నున్న కావ్య పురాణాదులు జనసామాన్యమునకు తెలియరాని సంస్కృతములో నున్నవి. ఆ గ్రంథములందు గల జ్ఞాన విజ్ఞాన విషయములు జనసామాన్యము

నకు తేట పఱుపవలెనని, పరమార్థచింతతో నన్నయ తిక్కనాదులు పంచమవేదమును తెనిగించిరి. ప్రజాసామాన్యమునకు అసలు తెలియని సంస్కృతములో నుండగా, దానిని తెనుగు సేయునపుడు తేట పదములు గాక, మారుమూల పదములతో డొంకతిరుగుడు కూర్పులు కూర్చిన నేమి ప్రయోజనము? అనునట్టి వివేకము దక్షిణాంధ్ర వీర కవుల హృదయములలో నుదయించి పెంపుకనినది.

## వచన కావ్యములే రచింపవలెనను సంకల్పము

ఆంధ్ర కవులు స్వకీయ ప్రతిభను తమ కావ్యములలో ప్రదర్శించుకొనుటకు, వచన రచనలు అడ్డుపడి ఆటంకముల గూర్చుచున్నవను భావమునకు తొలుత గుఱియైనవాడు — బుధారాధన వీరాజి — తిక్కన సోమయాజి. యౌవనోత్సాహముచేత, నిర్వచన గ్రంథ రచన మూలముగా కవితా సామ్రాజ్య పట్టాభిషిక్తుడు కావలెనని తిక్కన అభిలషించెను.

కాని లోకానుభవము గడించి, సోమయాజియై, లోకజ్ఞుడై, సాత్యవతేయ సంస్మృతి శ్రీ విభవాస్పదంబైన చిత్తముతో, మహాకవిత్వ దీక్షావిధినొంది, ఆంధ్రావలి మోదముం బొయురనట్లు, పంచమవేదము నాంధ్రీకరింప బూనునప్పుడు మాత్రము, వచన బహిష్కరణ విధానమును చాలించి, నిషేధమును తొలగించి, "పద్యముల గద్యములన్ రచియించెదన్ కృతుల్" — అని చంపువుగానే రచింతునని ప్రతిజ్ఞచేసి, కవిబ్రహ్మ, భారతాంధ్రీకరణమునకు బూనుకొన్నాడు; అందు మూడింట నొకపాలు వచనమునే గూర్చినాడు; చాలవరకు నన్నయ మార్గముననే నడిచినాడు.

తిక్కన తరువాతి కవులలో శంభుదాసు డొక్కడు మాత్రము తిక్కనకంటె వచన రచన నధికముగా సాగించినాడు. నూటికి నలుబది పంక్తులు - ఐదింట రెండుపాళ్లు వచనము రచించినాడు. శంభుదాసు ననంతరము వెలసిన తెనుగు కృతులలో, ప్రాశస్త్యము నందును పరిమాణము నందును గూడ వచన రచనలు చాల క్షీణింప జొచ్చినవి.

ఆనాటి కవులకు వచన రచన యనగా "మనసురాని మనువు" అను లోకోక్తి ననుసరించి నడిచినది. నాటి వచనములు మోయరాని కఠిన సమాసభారమును విధిలేక, మోసి మోసి, అలసి సొలసి, కడుబడలి, డస్సి, డంబు చెడి, కృంగి కృశింపజొచ్చినది. తిక్కన రచించిన "వచనము లేకయ వర్ణన రచియింపగ గొంతవచ్చు — ప్రౌఢులకు" అను వాక్యమే తరువాతి కవుల గుండెలకు హత్తుకొని పోయినది. అనుభవముచేత — కావ్యములో వచనమును బహిష్కరింప కూడదని తిక్కన అభిప్రాయము మార్చుకొనెనను సత్యమును వారు గ్రహించ లేదు. కవితా ప్రౌఢికి — వచన నిరాకరణయే చక్కని దోహదమను తప్పు టభిప్రాయము వారిని పీడించినది. చేతబడి చేసినట్లు, క్షయరోగ ప్రదానము చేసిన విధమున పైపద్యము తెనుగు వచన రచనలను బట్టి పీల్చి పిప్పి—జేసి, నామమాత్రావశిష్టము గావించి విడిచినది. కాని మరి ఎత్తిరిల్ల నీయలేదు. ఖర్జూరమువలె దిగబెరిగి — తుదకు కర్పూరము వలె హరించి పోజొచ్చినది — మన తెనుగు వచన రచన.

ఈ సందర్భములో నా స్ఫురణకు వచ్చిన మూడు సంగతుల నిట వ్రాసెదను. అందు మొదటిది — ఈసపు వృత్తాంతము. జన్మచేత ఈసపు బహు కురూపి ; సంతలో పశువునువలె ఒక గ్రీకు శ్రీమంతునికి బానిసీడుగా అమ్మివేయ బడినాడు. బానిసీడై యుండియు నాతడు మేధా భేద్యములైన చిక్కు సమస్యల పెక్కింటిని సాధించి, మంచి తెలివి దేటలు కలవాడని ప్రసిద్ధి వడసెను. ఉపజ్ఞచేతనే దాస్యవిముక్తుడై స్వేచ్ఛ వడసి, తన దేశము శత్రురాజుల బారిబడకుండ రక్షింపగల్గినాడు. అతడు రచించిన నీతి కథలు ఏ భాషలో నైన చదువనివారు ఉండరు. స్వకీయమైన ప్రతిభ చేతనే అతడు స్వతంత్రుడై, స్వదేశమును సేవించి, శత్రురాజుల వశము గాకుండ రక్షింప గలిగెను. అదేవిధముగా తెనుగు వచన రచనలును, "ప్రౌఢుల" హత్తుపిడి, దాక్షిణాత్య ప్రభువుల పజ్జంజేరి స్వతంత్రమై యుల్లసిల్ల జొచ్చినది.

రెండవది — అరబ్బీనైట్సు కథలలో నలుబది దొంగలకును, అల్లీ బాబా కుటుంబస్థులకును మధ్య నడచిన చిత్రకథ : అల్లీబాబా ఇంటి

దాసి — మార్జియానా బహు ఇంగితజ్ఞురాలు. చోరనాయకుని కుట్రలను, కుటిలోపాయములను ఏనాటి కానాడు— ఎక్కడ కక్కడే త్రుంచి దొంగల త్రుళ్ళడచి, నిశ్శేషముగా తుదముట్టించి యజమాని కుటుంబమును కంటికి రెప్పవలె కాపాడినది. విపత్పరంపరనుండి తప్పించి రక్షించుచువచ్చిన ఆ కన్యకామణియొక్క తెలివి తేటలను, సమయోచిత చాతుర్యమును మెచ్చుకొని అల్లీబాబా ఆమెను దాస్యమునుండి విముక్తిచేసి, స్వతంత్ర మిచ్చి, కోడలిగా గైకొని కొడుకునకు వివాహము గావించెను. ఇట్లామెను తన తనయుని గృహలక్ష్మిగా గావించి, గృహయజమాన్యము నామెకే అప్పగించి అల్లీబాబా సుఖించెను.

మూడవది — హిందూ సంఘములో ఉత్తమస్త్రీ జీవనము. భారతభూమిలో నేప్రాంతమున చూచినను అత్తకోడండ్రపు బాధలను, అవివేకపు భర్త ప్రసాధించిన కఠిన ప్రయాసములను, భూదేవివలె ఓర్పుతో భరించి — శాంతముతో సహించి — ఆ ఆపదల కోర్చి సంపద లనుభవించిన ఉత్తమ ఇల్లాండ్రు — సతీసక్కుబాయివంటి సద్గుణ రాసులు ఎందరో ఉన్నారు. ఆ పతిదేవతలవలెనే — ఆంధ్రమున వచన రచన గూడ బహు బాధలకును పెక్కు ప్రయాసములకును, ఓర్చి, నిలబడి ఎట్టకేలకు స్వతంత్రురాలై ఆంధ్రసారస్వతమునందు, తుదకు, స్వతంత్ర జీవనము బడసి వర్ధిల్లు చున్నది.

## తొలి దాక్షిణాత్య వచన గ్రంథము

ఆంధ్రసారస్వత సముఖమున నన్నయ కృత ఆంధ్ర చంపువు రూపమున భారతము నిలిచినట్లే — దాక్షిణాత్య ఆంధ్రసారస్వతముకూడ వచనరూపమున — భారతముతోనే ప్రారంభమగుట మిగుల ముదావహము — దానిని రచించినకవి కళువెపిరరా జను క్షత్రియ కుల భూషణుడు. ఆతడు మైసూరుప్రభువగు చిక్కదేవరాయల దళవాయి. ఇతడును, ఇతరవచన కావ్య కర్తలును రచించిన కావ్యములకు గల సామాన్య లక్షణములను సంగ్రహముగా ప్రశంసింప తగియున్నవి.

ఈ దాక్షిణాత్య కవులందరును మానవ శ్రేయోభిలాషులు.

కేవల గర్భకవిత్వ, బంధకవిత్వ, చిత్రకవిత్వాది గారడి విద్యలు ప్రదర్శించి మెప్పులు బడయ గోరిన డాంబికులు గారు. పదాడంబర సమాస ఘటితమైన రచనలు నిజముగా ప్రయోజన శూన్యము లనియు, ప్రజా హృదయముల స్పృశించి వారిని సత్కార్యోన్ముఖులను, భగవద్భక్తులను, సౌశీల్య శోభితులుగను చేయగోరి, అందు కనుకూలములైన గ్రంథములు రచించుటకే వారు పూనుకొనిరి. ఆ కారణముచేత, వారు చెప్పదలచిన దేదో తేలికగా బోధపడు మాటలతో సూటిగా సులభ శైలిలో తెలుపుటే వారి పద్ధతి.

అట్లయ్యును వారి రచన నిర్జీవమై నీరస మనిపించదు. "ఇది కడ తేరుటెపుడు దైవమా!' యని ఈదురో మనిపించదు. శైలి పుష్టి కలిగి, మధురమై, పాఠకులకు తుష్టి గల్గింపజాలి యుండును. వర్ణితాంశములు చదువరుల కన్నులకు కట్టినట్లు — ఎట్టయెదుట — ప్రత్యక్షమగుచున్నట్లు — మాటలతో చిత్రించి రచింపగల శక్తిగల వారు. జన సామాన్యము ఇంటివద్దకూడ చదువుకొని ఆనందింపగల సులభశైలిలో, తెనుగుభాషా సాంప్రదాయానుసారముగా, స్వచ్ఛముగా నుండి, పాఠకుల నలరించి, వారి మనస్సులకు మరుపురానట్లు కూర్చగలిగిరి. కాని ఈ రచనలు నన్నయ రచనలంత శ్రావ్యములు, గంభీరములు గావని యనిపించును.

ఈ ప్రభువులు జనకుని వంటి జ్ఞానులు; ముముక్షువులు; వారి దృఢ సంకల్పములకు, భగవద్భక్తికి మెచ్చి శ్రీరంగనాథుడును — ఆయన రాణి రంగనాయకీదేవియు, స్వయముగా తోడ్పడినట్లు, ఐతిహ్యములు గలవు. వానిం గూర్చి త్వరలో ప్రస్తావింప గలము. వాని సొగసు, సౌందర్య సంవాసన, చెవుల కింపుగూర్చు మాధుర్యము ప్రశంసనీయములు. ఈ గ్రంథములు సాధారణముగా మతవిశ్వాస, ఆవేశ సంశోభితములు, ఉత్సాహపూరితములు; చారిత్రాత్మకములు, దేశాభిమాన విశిష్టములు నగుట వానికొక ప్రత్యేకత నొడగూర్చ గలదు.

వచన భారత గ్రంథకర్త కళువె వీరరాజు — ఇతని తండ్రి దొడ్డ రాజు — మైసూరు చిక్కదేవరాయలచే శ్రీరంగపట్టణమున రాజ

ప్రతినిధిగా నియమింపబడెను. దొడ్డరాజు — మహారాష్ట్రయోధులగు — జస్వంతరాయ, నిమోజీ, దాదోజీ ప్రముఖులను జయించెను. దొడ్డ గొప్ప ప్రతాపశాలి. వీరరాజు కూడ అసదృశ వీరుడై యుండి వచన భారతము కొంతవఱకు రచించెను. అతడు మహావిద్వాంసుఁడును కవియే గాక, గొప్ప దాతయని కూడ ప్రసిద్ధి గనినవాడు. వీర భూపాలీయమను లక్షణ గ్రంథము అతనికి అంకిత మీయబడినది. అప్పకవీయము వీనిని పోలియున్నది. వీరరాజు పండిత కుటుంబమునకు చెందినవాఁడు. ఇతని కుమారుఁడును, మధుర నేలిన ప్రభుఁడు నగు— నంజరాజు, 'హాలాస్య మాహాత్మ్య' మనబడు వచనగ్రంథమును రచించెను. అది డెబ్బదిరెం డశ్వాసములు గల గ్రంథము; అందు దక్షిణ మధురాపురి చరిత్రముతో కూడ మాహాత్మ్య మభివర్ణింప బడినది. అతఁడు రచించిన ఇతర గ్రంథములు: 1. విష్ణుభక్తి విలాసము, 2. హరభక్తివిలాసము 3. కాశీమహిమార్థదర్పణము.

## కళువె వీరరాజకృత — 'భారతసంగ్రహము' వచన కావ్యము.

ఇది రచింపబడిన కాలము. శా. శ. 1580 ప్రాంతము: ఇందునుండి మచ్చునకు కొన్ని ఉదాహరణములు :—

83 అధ్యాయము దుష్యంతుఁడు — "అంత నమ్మహీరమణుండు నిజామాత్య పురోహితుల నందయునిచి తా నొక్కరుండె కాశ్యపు మునీంద్రునకు నమస్కరించు తలంపున నయ్యాశ్రమంబు ప్రవేశించి యచట నత్తపోధ నాగ్రణింగానక పెద్దెలుంగున నియ్యాశ్రమంబున నున్నవారెవరని హెచ్చరించిన నయ్యెలుంగువిని మేఘమండలంబు వెడలి వచ్చు మెఱుపు తీంగ్గె చంద్దంబున, సాక్షాత్కరించిన మహాలక్ష్మి పోలిక, రూపయావ్వన సంపన్నయగు నొక్కకన్నియ — పణన్శాలాంత్తరంబు వెడలి వచ్చి, యభ్యాగతుండగు నమ్మహారాజుం గనుంగ్గొని, విస్మయంబు జెంద్దుచు। కమల పత్రంబులం ద్దెగడు నతని నేత్రంబులును, విశాలంబగు వక్షస్థలంబును, సింహాస్కంధ సదృశ్యంబులగు భుజశిఖరంబులును, ఆజానుదీర్ఘంబులగు భుజంబు

లును, యితర దులన్ భంబ్బులగు మహారాజ లక్షణంబ్బులును, రెప్ప వేయక కనుంగ్గొని, మృదుమధుర భాషంబ్బుల నతని కుశలం బ్బడిగి। సముచితంబ్బగు పీఠంబ్బున నునిచి। యర్ఘ్యంబ్బును. పాద్యంబ్బును, నాచమనంబ్బు నొసంగ్గి। లజ్జావనత వదన యగుచు, సముచిత ప్రకారంబునం బ్రవేశించ్చి యున్న యతనిం బ్బ్యాజించి,। నెమ్మొగంబున మంద్దస్మితంబుని గూడ। నోమహానుభావ! నీవెవ్వండ్డ? వేమి నిమిత్తంబున నియ్యాశ్రమంబునకు వచ్చితి? వేము సేయందగిన కొయ్యంబ్బెయ్యది? యింతయు మాకెరిగింప్పు మనిన ..."

పై రచన నోపికతో బరిశీలించితిమేని- యీ క్రింది విశేషముల తెలియగలము —

1. అర్ధానుస్వార వాడుకలేదు; మనము అర్ధానుస్వార వాడు చోట పూర్ణబిందువే వాడబడినది.

2. బిందువు వెనుకవచ్చునక్షరము విధిగా ద్విత్వము ఉత్తరాంధ్రమున నిట్టి వాడుకలేదు.

3. అక్షరమునకు వెలుపల గిలకరించుటేగాని—ర—క్రింద అక్షరము వ్రాయు పద్ధతి లేదు.

4. మదీయ అనుటకు బదులు "మదియ్య" అనుట సర్వసామాన్యము. సంధి స్వేచ్ఛావశము

దుష్యంతుడు తన వృత్తాంతము నెరిగించిన యనంతరము — శకుంతల "సకల రాజపూజితుండగు నీకు మేమేమి యుపచరించగల వారము ?" అనెను. ఈ ప్రశ్న ఆఉభయులకు ఎంత గౌరవప్రదము ?

దుష్యం — "ఏను రాజర్షి యగు పూరునివంశంబునం జనించినవాండ నామనంబు రాజకన్య యడంగాని తగుల నొల్ల; దట్ల యున్నను నీయంద యిపుండు లగ్నంబై యున్న యది. ఋషుల కన్యలయందును నితర కన్నెల యందును తవులనొల్లని నాహృదయంబు నీయెడ దవులుటం జేసి, నీ వవశ్యంబును క్షత్రియ కన్య గావలయు"

జగత్ప్ర సిద్ధమగు కాళిదాసుని శాకుంతల నాటకమునకు ఆస్పదమైన శృంగార కథ — ఇది. "ప్రమాణ మంతఃకరణ ప్రవృత్తయః"

అని — ఆ మహాకవి అద్భుతముగా నుడివిన ఘట్టమిది. ఈ రచన యొక్క సారస్యము — అర్థగౌరవ, మాధుర్యములు, ప్రశంసనీయములు.

కద్రూ వినతలతో సముద్రమును సందర్శించి వీరరాజకవి సముద్రము నెట్లు వర్ణించెనో చూతము :—ఇది సంగ్రహ వచన భారతము నందుగల — ఆదిపర్వమునందలి — పదునెనిమిదవ అధ్యాయమునుండి ఎత్తివ్రాయబడినది. "మహోత్తరంబగు జలధారంబ్బును, మహాఘోషణ భీషణంబును, తిమి తిమింగిల ప్రముఖ సలిల జంతుసంతాన సంకీర్ణంబును, అఖిల రత్నంబుల కాకరంబ్బును, వరుణునకు నాలయంబును... అప్రమేయంబ్బ నచింత్యంబును — అద్భుత జలప్రపూర్ణంబును, ఆవర్త శతసమాకీర్ణంబునునై, మహానిల సంక్షోభంబునం బొడము తరంగహస్తంబుల నృత్యంబు చేయు చందంబునం దురంగలించుచు, కుముద బాంధవుని వృద్ధక్షయంబులు కారణంబుగ తానును వృద్ధిక్షయంబులు గనుచు...మహావరాహ రూపధరుండగు గోవిందుండు భూదేవి నుద్ధరించు సమయంబున నతని వివిధ విహారంబుల వలనం గలంగిన జలంబులం గనుపట్టుచు, ననేక కాలంబు నిజాంత నిర్దేశంబున తపంబు చేయుచున్న అత్రియను మహర్షి కేనియు దురవగాహంబగు నిలుకడం దనరుచు [1] పరస్పర స్పర్థన్నుం బలె మహాపుణ్యావాహిను లనేక విధంబుల నిజప్రవాహంబులం బూరింప పెంపుగనుచు ... నాకాశంబునుం బోలె నపారమహత్వంబున వెలయుచున్న యంబో నిధానంబుచే రంజని "

ఇందు [1] అంకెకు ముందును వెనుకనుగల వాక్యములం జదివినపుడు — ఆంగ్లసారస్వతముతో పరిచయము గలవారికి— Byron మహాకవి సముద్రమును గూర్చి రచించిన Roll-on! thou dark blue ocean! Roll! మొదలగు వాక్యములు స్ఫురణకు రాగలవు; నదుల 'పరస్పర స్పర్థన్' — చెవిన బడినపుడు — 'As if vying with each other' అను వాక్యమును జ్ఞప్తికి రాకమానదు. ఈ రచన యథామూలముగాదు ; కవిత్రయ భారతదండాన్వయముకాదు; ఒకవిధమైన స్వతంత్ర రచన.

ఆశ్వాసాంతమునందు పద్యములు కొన్ని గలవు ; తుదను గద్యమును గలదు. ఆ గద్యమూలముగా గ్రంథకర్త పూర్వులును గ్రంథకర్తయు పొందిన శత్రువిజయములును; వారి వితరణాది గుణములును తెలియ నగుచున్నవి.

కళువె వీరరాజొక్కడే ఈ వచన భారతము రచింపలేదు. చంద్ర గిరి కృష్ణభూపాల తనూజుడు — తుపాకుల అనంత భూపాలుడు - నారాయణయ్య మొదలగువారు తోడుపడిరి. ఆంధ్ర భారతము కవిత్రయకృతము; భాస్కర రామాయణమును ఐదుగురు కవులు పూర్తిచేసిరి. అదేవిధముగా నీ సంగ్రహ వచనభారతమును బహు కవి విరచితము. ఎవరు రచించిన భాగమైనను, తేనె తేటవలె మధు రమై, ధారాశుద్ధి గలిగి, చదువ నింపగుచున్నది. తుపాకుల అనంత భూపాలాదులను గూర్చి యీ దిగువ చదువుదము. కళువె వీర రాజకవి, తెలుగు వచన రచనా కుమారిని, ప్రౌఢకవుల నిర్బంధ ముల నుండి విడిపించి, సంకెళ్ళను విడగొట్టించి, దాస్య విముక్తి గావించి, స్వేచ్ఛ నొసంగి, రాణింజేసి, తోడివారిలో సగౌరవముగా తలయెత్తుకొని స్వతంత్రముగా మసలగల, హోదాను ప్రసాదించి, పుణ్యము గట్టుకొనినాడు.

అతని కుమారుడగు నంజరాజు హాలాస్యమహాత్మ్యమను (దక్షిణ) మధురాపురీ మహాత్మ్యమును రచించిన ధన్యుడు; అదిగాక మరి మూడు గ్రంథముల రచించిన సంగతి పైని తెలిసికొంటిమి.

నంజరాజు మైసూరు మహారాజునకు పెద్ద మంత్రిగా నుండి మిక్కిలి ఎన్నికగన్నవాడు. దాక్షిణాత్య ప్రాంతములలో కూడ ఉద్దండ పండితులు — అభినవ కాళిదాసులు, భవభూతులు లోనగువారుండిరి. ఆలూరి తిరుమలకవికి 'అభినవ భవభూతి' బిరుదు ఉండెను. అతని సుహృదుడు, నృసింహ కవి 'అభినవ కాళిదాసు'. అతడు నంజరాజ యశోభూషణ మను కృతి రచించి ఇతనికి అంకితము చేసెను. హాలాస్య మహాత్మ్యము, స్కాందపురాణాంతర్గత హాలాస్య ఖండము నకు తెనుగు. సంగ్రహభారత వచనమునకు కొంత వెనుకబడినను

తెనుగు వచన హాలాస్య మహాత్మ్యము ప్రౌఢ రచనతో చక్కగనే యున్నది. మచ్చునకు కొలది పంక్తులు:— సద్గుణ వంతుడగు పుత్రుం గరుణింపుమనిన — సిద్ధ వేషధరుండును, సచ్చిదానంద స్వరూపుడును, భగవంతుడు, నగు హాలాస్యనాథుండు "ఓయీ! పాండ్య భూపాలక! నీ కత్యంతైశ్వర్య సమేతుండగు పుత్రుండును, గీర్తియు, దీర్ఘాయుష్యంబును, గడపట శాశ్వతంబగు ముక్తియు గలుగుంగాక" యని వచించెను.

తంజావూరు, మధుర ప్రాంతముల వెలసిన యీ వచన వాఙ్మయ మంతయు నించుమించుగా పురాణములును తదుపాఖ్యానములు గనే కన్పట్టుచున్నవి. పైని వ్రాసిన ఉదాహరణల పరీక్షించి చూచిన పక్షమున, నవి ఈ దాక్షిణాత్య వచన కావ్యములు, చంపూ ప్రబంధములవలె క్లిష్టాన్వయ భూయిష్ఠములుగాక, అంతును బొంతును లేని కూర్పులతో నసహ్యము గలిగించు నట్టివియును గాక, విన నింపై, చదువ సొంపై, ధారాశుద్ధి గలిగిన రచనలనియు, అవి పండిత పామర రంజకము లనియు విశదమై యుండును.

## తుపాకుల అనంతభూపాలుడు

దాక్షిణాత్య ఆంధ్రకవులలో వచనకావ్య రచనల యభివృద్ధికి గట్టిగా కృషిచేసిన దిట్టలలో నీ యనంతభూపాలుని మొట్ట మొదట ప్రశంసింప వలసియున్నది. కళువె వీరరాజకవి ప్రారంభించిన సంగ్రహ భారతరచనలో నాతనికి చేదోడువాదోడు నయి ఆదిపర్వములో కొంత భాగమేగాక — భీష్మపర్వము అందులో భగవద్గీత — చక్కని వచన గ్రంథముగా రచించి ఖ్యాతిచేకొన్న విద్వద్వంద్యుడు. ఇతని భగవద్గీత ఎనుబదేండ్ల క్రిందట నొకసారి ముద్రింప బడినది. ఇటీవల ఆంధ్రావళీ సమాజమువారు ఈ గీత రెండువేల ప్రతులు ముద్రించి, ఉచితముగా పంచిపెట్టి, మహాత్మగాంధి, ఆంధ్రభీష్మ న్యాపతి సుబ్బారావు పంతులుగారు మొదలగు మహామహుల యాశీస్సులు, ప్రశంసలు గైకొని, ధన్యులైరి. భాషాభిమానులును గీ భిమానులు నైన

మహనీయులీ యుద్యమమునకు ప్రోత్సాహ మిచ్చి, యావదాంధ్ర లోకమునకు గీతా సందేశమును — క్రైస్తవులు బైబిల్ వలెనే — ఉచిత ముగా నందివ్వవలసిన మేటి గ్రంథము. దీని వ్రాతప్రతులు తంజా పురి సరస్వతీ మహాలులోనే గాక, ఉత్తరాంధ్రమున గుంటూరు ప్రాంతములలో గూడ దొరకినవి. అందువలన, యావదాంధ్ర దేశము నందును చక్కని వ్యాప్తిగనిన సద్గ్రంథములలో నిది యొకటని వక్కాణింప నగును. వచన భగవద్గీతలోని కొలది వాక్యములు :—

"భూరి కరుణావిలాస శ్రీరాజిత సుగుణజాల శ్రీగోపాలా! అవధ రింపుము! భవదీయ చరిత్రాతిశయంబైన శ్రీమహాభారతంబునందు కౌరవ శ్రేష్ఠుడైన ధృతరాష్ట్రుండు వ్యాస వరప్రసాదలబ్ధ దివ్యజ్ఞాన సంపన్నుండగు సంజయు వలన భూగోళ విస్తారంబును, జంబూమండ వినిర్మాణంబును ఛప్పన దేశ ప్రవర్తనంబులును విని, కురుక్షేత్రంబు నందు యుద్ధ సన్నద్ధులై యున్న మనవారును పాండవులును ఏమి గావించిరని యడిగిన ధృతరాష్ట్రుం జూచి సంజయుం డిట్లనియె — వ్యూహాకారంబుగా నిలిచియున్న పాండవ బలంబు నిరీక్షించి దుర్యోధనుండు ద్రోణాచార్యు సమీపంబునకుం జని యతనితో నిట్లనియె: "నీ శిష్యుండైన ధృష్టద్యుమ్నునిచే వ్యూహాకారంబుగా నిర్మింతంబై సమృద్ధంబైన పాండవ బలంబు గనుంగొనుము. ఆ సేనయందు భీమార్జునులకు సమానులు శూరులగు మేటి విలు కాండ్రు ఎవ్వరెవరంటేని, యుధామన్యుండు నుత్తమోజుండును అభి మన్యుండు ప్రతివింధ్యాది ద్రౌపదేయ ప్రముఖ మహారథులున్న వారు. ద్విజోత్తమా!" మన భగవద్గీతవలెనే విశ్వవిఖ్యాతమైనది — శ్రీకృష్ణుని వేణుగానము. శ్రీకృష్ణుని వేణుగానమునుగూర్చి ముచ్చ టించుచు, మన భారత రిపబ్లిక్ వైస్ప్రెసిడెంటుగారైన శ్రీ సర్వేపల్లి రాధాకృష్ణన్‌గారు, వేణువు యొక్క అంతరార్థమును బహు చక్కగా విశదము చేసియున్నారు. శ్రీకృష్ణుని వేణువనగా, కేవ లము ఆ పరమాత్ముని యాహ్వాన చిహ్నము. శ్రీకృష్ణపరమాత్మకు సమస్త జీవులయందు అపార ప్రేమగలదు. అట్లు ప్రేమించుటే గాక,

పరమాత్మ, సమస్త ప్రాణులయొక్క ప్రేమను ఆకాంక్షించు చున్నాడు. "యథేచ్ఛసి తథాకురు" నీ యిష్టము వచ్చినట్లే చేసికో వచ్చును. స్వేచ్ఛ స్వతంత్రములతో సహా, కర్తవ్యనిర్ణయబాధ్యత, జీవుని దే. ఇట్లే చేయకతప్పదని యెట్టి నిర్బంధము లేదు; లేదు కాని, తననే ప్రేమించవలసినదని పరమాత్మ అభిలషించుచు కోరుచున్నాడు, ఆ కోరికకు గుఱుతు, ఆ ప్రేమపూర్వకమైన యాహ్వానమునకు చిహ్నము. శ్రీకృష్ణ ప్రభుని హస్తగతమైన మురళియే యని, ప్రాజ్ఞ కోటి మెచ్చి, తలయూపునట్లు, తమ భావము నుపన్యసించినారు - మన వేదాంతి - సర్ రాధాకృష్ణ పండితులు.

తుపాకుల అనంత భూపాలుడు రచించిన విష్ణుపురాణ వచనము నుండి ఈ వేణుగానమహిమను వర్ణించు భాగమును ఈ క్రింద ఎత్తి వ్రాయుచున్నాను. ఆశ్వాసము 5 అధ్యాయము పదుమూడు :—

"అంత శ్రీకృష్ణుండు విమలతర చంద్రికా సాంద్రంబును, హృదయానందకరంబునై, వికసిత నీలోత్పల కుముద సౌరభంబులచే దిగంతంబుల బరిమళింప జేయునట్టి శరత్కాలంబున, నుత్ఫుల్ల కుసుమ వాసనా సక్తంబులై, ఝుంకారంబునొనర్చునట్టి తుమ్మెదల మొత్తంబుచే నలంకృతంబును విహార యోగ్యంబును నగు బృందావనంబుం గనుంగొని, యచ్చట గోపవనితానికరంబుల తోడం గూడి, వారల మనోరథంబులు నెఱవేర్పందలంచి, యొక్కనాటి రాత్రియందు దానొక్కరుండ నవరత్నఖచిత దివ్యాభరణ భూషితుండును, దివ్య చందన చర్చిత గాత్రుండును, మనోజ్ఞకుసుమ మాలికా ధరుండునునై, వనంబునకుం జని జగన్మోహనంబును, నవ్యక్త మధురంబును, అమృతోపమానంబును, మాత్రాలయ సమన్వితంబును నగు, వేణుగానం బొనర్చుటయు, సర్వభూత సమ్మోహనంబైన యమ్మురళీ నాదం బాలకించి గోపాంగనలు మదన బాణ విదళిత హృదయులై యవ్వసుదేవనందను సమీపంబున కరుదెంచిరి..."

విష్ణుపురాణముకూడ భగవద్గీత భారతములవలెనే శ్రీకృష్ణునికే అంకితము చేయబడినది. అనంతభూపాలుని వచన రచనలో

నలో ధారాశుద్ధి చక్కగానున్నది — రచన ప్రౌఢము. సంగ్రహ భారతమునందుకంటె విష్ణుపురాణమునందు సంస్కృత సమాసములు కొంచె మధికముగా గన్పడుచున్నవి.

వచన విష్ణుపురాణము ఆరాశ్వాసముల గ్రంథము. వెన్నెల కంటి సూరన్న రచించిన చంపువు, విష్ణుపురాణముకంటె, తుపాకులవారి విష్ణుపురాణము విపులమై సంస్కృతమూలమును చక్కగా అనుసరించుచున్నది. ఇట్లు ప్రజాసేవకు, దైవసేవకు తమజీవితమును ధారవోసి, అనంతభూపాలాదులు ధన్యులైనారు.

## విజయరంగ చొక్క భూనాథుడు

దేశాధీశులై ప్రజాపరిపాలనము గావించుటేగాక మహావిద్వాంసులు, దివ్యకార్యకర్తలునై పండితులకు కవులకు నాశ్రయమిచ్చి, పోషించి, కవితాసామ్రాజ్యమునకు కూడ పట్టాభిషిక్తులైన మహామహులు ధన్యజీవులై కీర్తిచేకొన్న మహనీయు లెందరో కలరు. సంస్కృత సారస్వతములో భోజమహారాజట్టివాడు. మన ఆంధ్రవాఙ్మయములో శ్రీకృష్ణదేవరాయలు, ఆంధ్రభోజుడన ప్రసిద్ధిగనినవాడు. రాజకీయముగా కళింగమును దక్షిణాంధ్రమును ఏకచ్ఛత్రముగ పాలించుటె గాక సాహిత్యసామ్రాజ్యమున నష్టదిగ్గజములతో, భువన విజయము నేలిన విద్వత్కవి. తెనుగుకవితకు అపూర్వాలంకారమైన, ఆముక్త మాల్యద రచించుటేగాక పెక్కండ్రు కవులచే బహుకావ్యములకు కృతిపతియైన సాహిత్యపోషకుడు రాయలు యనంతరము దక్షిణాంధ్ర రాజ్యస్థాపనతోకూడ కవితా రాజ్యమును సాగినది. దక్షిణాంధ్ర వాఙ్మయములో గూడ రాయలవారివలెనే కృతికర్తలై కావ్యములు రచించి, పండితకవుల కనేకులకు ఆశ్రయమిచ్చి సాహిత్యమును పోషించి ధన్యులైన మహనీయులలో విజయరంగ చొక్కనాథుడు మనకిచ్చట ప్రశంసాపాత్రుడు.

నాయకరాజ్య స్థాపకుడైన విశ్వనాథనాయకుని వంశములలో మిక్కిలి ప్రసిద్ధుడు తిరుమలనాయకుడు. ఆతని సౌధము మధురలో చూడ

గలము. చూచువారలకు దిగ్భ్రమ గొలుపు దివ్యసౌధమది. అందులో నిపుడు మధుర జిల్లాకోర్టును నాలుగు సబ్ కోర్టులు నున్నవి. తిరుమలనాయకుడు శా. శ. 1545 మొదలు 1581 వఱకు - ముప్పదారేండ్లు మధుర నేలెను. విజయనగర చొక్కనాథుడు అతని మనుమని మనుమడు. అతడు స్వయముగా శ్రీరంగ మాహాత్మ్యము మాఘమాహాత్మ్యము వైశాఖమాహాత్మ్యము మొదలగు వచనకావ్యముల రచించెను. వానిని గూర్చి యీతిగువ చదువగలము. విజయరంగ చొక్కనాథుడు శా. శ. 1626 మొదలు 1653 వఱకు - ఇరువదేడేండ్లు రాజ్యమును పరిపాలించెను. విజయరంగని బాల్యము నందు అతని పితామహియగు మంగమ్మాదేవి అతని సంరక్షించి పెంచెను. 1611—1626 వఱకు - 15 సం. ఆమె యీబాలుని తరఫు మధుర రాజ్యము నేలెను.

తిరుమలనాయకుని మంత్రి సముఖము మీనాక్షినాయకు డను నాతడు. ఆతనిభార్య అలుమేలు అనబడు అలమేలు అక్క. చిన్ననాడీమెను పైని పేర్కొన్న విజయరంగ చొక్కనాథుని పితామహి మంగమ్మాదేవియే పెంచి సంరక్షించెను. ఆకారణముచేత అలమేలక్క "మంగమ్మ సాకుడుకూతురు" అను ప్రతీతి కలిగినది. అలమేలక్క సముఖ మీనాక్షినాయక దంపతులకు కుమారుడు సముఖము వేంకటకృష్ణప్పనాయకుడు.

జైమిని భారతమను నాంధ్రవచన కావ్య కృతికర్త యీ వేంకటకృష్ణప్పనాయకుడే; కృతిభర్త శ్రీ విజయరంగ చొక్కభూనాథుడే.

శృంగారశాకుంతలాది కృతులు రచించిన పిల్లలమఱ్ఱి పినవీరభద్రకవి జైమినిభారత మను పాండవాశ్వమేధకథను చంపువుగా రచించి యుండెను. ఆ చంపువునే యీ వేంకటకృష్ణప్ప వచన కావ్యముగా కూర్చెను. వచనకావ్యపు వ్రాతప్రతులు రెండు ఆంధ్ర సాహిత్య పరిషత్తువారికి లభించినవి. వాని నాధారముగా గైకొని పరిషత్తువారీ గ్రంథమును ముద్రించి, నలుబదేండ్లక్రిందట ప్రకటించి, ఆంధ్ర భాషకు మహోపకారము చేసిరి. పరిషత్ వారు సేకరించిన అమూల్య వచన

గ్రంథము లెన్నో చదువువారు లేక చూచువారైన లేక కాకినాడ పరిషత్ గ్రంథ భాండాగారములో పడియున్నవి. పిఠాపుర మహారాజావారి ఉద్యోగులు వీనిని చెడకుండ కాపాడుచున్నారు. అట్లే చాల వచనకావ్యములు ఓరియంటల్ లైబ్రరీలోను, తంజావూరు సౌధ భాండాగారములోను భద్రపఱుపఁబడి యున్నవి. వాని నిట సంగ్రహముగా పేర్కొనుట దప్ప ఇక్కడ మనమేమిచేయుగలము? ఆంధ్రప్రదేశములో మూడు యూనివర్సిటీ లున్నవి. ఆంధ్రప్రదేశ ప్రభుత్వమున్నది. అయినను ఈ వచన వాఙ్మయమును ముద్రించి ప్రకటించుటకు వారెవరును సంకల్పించలేదు. ఏ సంస్థ ఖర్చులకు కావలసిన డబ్బు ఆ సంస్థవద్ద లేదు. అందుచేత వారెవరు ఈ పనికి పూనుకోలేదు; పూనుకొందురను నాశయు కనబడదు. ఈ యముద్రిత గ్రంథము లెప్పటికైన అచ్చుపడి జనసామాన్యమునకు అందునో లేక కాలక్రమమున నశించిపోవునో? ఎవరు చెప్పగలరు?

వచన జైమిని భారతము రచించిన సముఖము వేంకట కృష్ణప్ప నాయకుడు సారంగధర చరిత్ర మను మూడాశ్వాసముల వచన గ్రంథమును, అహల్యా సంక్రందన మను మూడాశ్వాసముల చంపూ ప్రబంధమును, రాధికా సాంత్వన మను ఏకాశ్వాస ప్రబంధమును రచించెను. అహల్యా సంక్రందన, రాధికాసాంత్వనములు శృంగార ప్రధానములు. ఇవన్నియు శ్రీరంగనాధునికే అంకితము చేయబడినవి.

సముఖము వెంకట కృష్ణప్పనాయనికి సమీప బంధువులైన శ్రీ దొడ్డప నాయకన్నారు జమీందారువారి ఉదార ధనసాహాయ్యము చేత పరిషత్ వారీ గ్రంథమును ముద్రించి ప్రకటించిరి. ఇందలి కథ మిక్కిలి పవిత్రమైనది. శ్రీకృష్ణపరమాత్మ స్వయముగా ధర్మరాజు నశ్వమేధమునకు సంరక్షకుడై, ఆ యాగమునకు కలిగిన యాటంకములనన్నిటిని నివృత్తిచేసి, పూర్తి చేయించినాడు. పెక్కండ్రు పుణ్యపురుషుల జీవితము లిందు ఉదహరింపబడినవి. భగవద్భక్తి, బ్రహ్మజ్ఞానము, వైరాగ్యము వీనిని బోధించు ననేకవిషయము లిందు వర్ణితములు. శైలి సర్వజనులకు సులభముగా బోధపడు నట్టిది. కాబట్టి

భాషాభిమానము గల ఆంధ్ర జనులందరును ఈ గ్రంథము పఠింప
దగినది. కావున నీ వచనగ్రంథమును కొంత విపులముగా విమర్శింప
నెంతును.

దుర్యోధనాది జ్ఞాతి సంబంధ బాంధవుల నధించుటచే గలిగిన
పాప, మనస్తాప పరిహారార్థము ధర్మరాజు అశ్వమేధయాగము చేయ
నెంచెను; కాని అందుకు వలయు ధనమేదీ? కురుక్షేత్రమునందు
రాజులందరు మడిసిరి. ఆ దోషమునకు తోడు ప్రజలం బీడించి
ధనంబు గొనుట గోరుచుట్టుపై రోకటిపోటగును. కాబట్టి ప్రజలవలన
గాక వేరొకవిధమున తేరగా ధనము లభించినగాని యజ్ఞము
తలపెట్ట వలనుపడదు. ప్రజలను పీడించి ధనముగొని యజ్ఞము
చేయుట జాతి తెప్పపై నెక్కి సముద్రము తరింప సంకల్పించుట.
వ్యాసుడు ప్రజల బీడింపక ధనముగూర్చు నుపాయము తెలిపెను. కాని
అశ్వమేధమునకు ఏ గుఱ్ఱమైన పనికిరాదు. చంద్ర చందన కుంద
కుసుమ సవర్ణమైన ధవళాశ్వము గావలె; దాని చెవి ఇంద్రనీల మట్లు
నీలముగా నుండవలె; తోక బంగారు వన్నెతో పచ్చగా మెఱయు
చుండవలె; అది నిరాఘాట ధాటీ పాటవంబైన యశ్వ రత్నము
గావలె. అట్టి హయరత్నము యౌవనాశ్వపురమున నున్నది. దాని
తెచ్చుటకు భీమసేనునితో కర్ణ పుత్రుడగు వృషకేతుండును, ఘటో
త్కచ కుమారుడు మేఘవర్ణుడును వెడలిరి. త్రేతాగ్నుల చందంబునం
దేజరిల్లిన మువ్వురం జూచి వీరల కసాధ్యంబు లేదని లోక ముత్స
హించెను. మేఘవర్ణుడు జలము త్రావ వెడలిన యజ్ఞాశ్వము పట్టి
తెచ్చిన విధము కన్నులకు కట్టినట్లు ప్రత్యక్షముగా వర్ణింపబడియె...
"సేనల నెల్లం జీకాకుపఱచి, పొట్టేటిపిల్లం బట్టిన తెఱంగున నశ్వంబు
నాలుగు కాళ్ళుంబట్టి, మూపునం బెట్టుకొని, గగనమార్గంబున కెగ
సిన, వియచ్చరు లచ్చెరువొంది - యదె యదె దానవుండు హయం
బుంబట్టి కొనిపోయె-బోయె" నని యెడు నెలుంగులు నింగిముట్ట ప్రశం
సించి కృపాయత్తచిత్తులై మేఘవర్ణుని పయిం బుష్పవర్షంబులు వర్షిం
చిరి. భీముడు శ్రీకృష్ణుని జేరనరిగి "హేగోపాలబాలా! పంకనిర్మగ్నం

వైన ధేనువును గోపాలకు చందమున శోకమగ్నులమైన మమ్ము నీవుద్ధరింపుము" అని గోపాలకృష్ణుని ప్రార్థించెను. కంటికి ఱెప్పవలె శ్రీకృష్ణుడు తోడై అశ్వమేధయాగమును నిర్వహింపజేసెను.

## హాస్య రచనలు

"పరిహాస ప్రసంగములేని వాక్యములు" శ్రోతలను, పాఠకులను రంజింప జాలవు. భారత భాగవతాదులు తీక్ష్ణములు తీవ్రములు గంభీరములు నైన గ్రంథములు. అందు హాస్యమునకు తావులేదు. అయినను జైమినిభారత వచన గ్రంథకర్త అక్కడక్కడ సమయోచితముగా హాస్యప్రసంగములు చేర్చి మనకృతజ్ఞతకు పాత్రుడగుచున్నాడు. బావమరుదులగు శ్రీకృష్ణభీమసేనుల సల్లాపములు వినోదపుస్తకములు - చూ. పుట 59 : "మున్నుగ బుద్ధిమత్కృత్యంబగు భోజనంబు నా కంఠపరిపూర్తిగ గావింపుము...నీకరణి బహుభక్షకు లగస్త్య కుంభకర్ణాదులు కొందఱు గలరు. నీవేమిటికి సిగ్గుపడెదవు ?" అనుటయు భీముండు మందస్మితుండై "కడుపారం దల్లిపాలు ద్రావి, తృప్తిలేక, పూతన చనుపాలును త్రావి, దానిని సంహరించితివి. జనని పెట్టిన యుగ్గుతో తృప్తిపడక వ్రేపల్లెలో వెన్నలు పాలు నిచ్చ నిచ్చలు ముచ్చిలించితివి. యశోదమ్మ పొత్తున భుజించియు నాకలి యడంగమి, నింద్ర యాగ విఘాతంబు సల్పి, యతనికై యుంచిన యన్నరాసులన్నియు నీవే భక్షించితివి. మాతయొసంగు నేతి కజ్జాయంబులు చాలక కుచేలుని చేతి యడుకులు నాచికొని మెసవితివి. నీ యుదరంబులో బ్రహ్మాండకోటులుఁ గూరుకొని యుండిన నరకొఱతయగాని తృప్తిలేదు. మెండైన దీపనంబుగల నీపొత్తున నాకుం భుజింప పొసంగునె ?"

## వృద్ధ వారకాంతలతో సమాగమము

(61) "జనుపనారలంబోలు తలవెండ్రుకలు గాలి కల్లాడ, వెలిచిన చెవ్వాకులు కర్ణంబులవీడ, రొంటిమీద కట్టిన ముదుక చేలంబు

లూడ, నాడాడ నల్లుండ్ర జూచి బలకరించి పిలచు వృద్ధ వారకాంతలం గని, నవ్వుచు, "బావా! వీరి పొట్టలు నీపొట్టకు సమానంబై జూపట్టు స్థూలాకారంబుల నీకు సమానులైన యీ వృద్ధవేశ్యల పరిగ్రహింపుము" అని శ్రీకృష్ణుడు పరిహాసింప, భీముండు ఫక్కున నవ్వి, "మున్ను మధురాపురంబున ముప్వంక గూనిదాని నొక్కతెం జక్కబెట్టితివి; నీపాదపద్మపరాగంబుచే పాషాణంబును యోషారత్నముం జేసితివి; ఇట్టి కొఱమాలిన జంతువుల నెల్ల దిద్దికొనుట నీ భారంబుకాని మాకుం దరంబౌనె?" అని మాఱు పల్కెను.

గొల్లలు పాలు, పెరుగు, వెన్న, నెయ్యి... కావిళ్ళతో వచ్చి శ్రీకృష్ణునికిచ్చి యతనిం బలుకరించిన విధమును నవ్వుబుట్టించు చూ. – "ఓరి కిసనా! నీ యప్పటి కంబళి యేడ నేసితివి? కొండ గోగుపూచాయ కంబళి యెవరిచ్చిరి? చుక్కలందెచ్చి గుచ్చినట్లున్న యీ తెల్ల గురిగింజపేర లేడ సంపాదించితివి? చంద్రునిప్పులవలె నొప్పులు గులుకు నీ గాజుపూస లేడ దెచ్చుకొంటివి?"

భోజనప్రియుడగు భీముడు, యాగము చూడవచ్చిన జనులకు పిండివంటలు వడ్డించుచు, నక్కడివారికి వాని వివరము లిట్లు తెలియబలికెను:– (324) "ఇవి ఖండశర్కరామయంబులైన మండెగలు – చింపినార చీర లనుకొని పొరబడవద్దు. ఇవి వింతలైన గోధుమ పూజంతికెలు – తెగిన జందెంబులనుకొని భ్రమపడవలదు. ఇవి మేలి పూర్ణపు కుడుములు. నమలి చూడుడు. ఉమ్మెత్తకాయలనుకొని పారవేయవలదు. అవి రుచిరంబులైన పేణియలు. ఏవో తెల్ల నురుగులని తప్పుగా చూడజనదు" అని యొడంబడ చెప్పుచుండెను.

## స్వాహాదేవి

అగ్నిదేవుని ప్రేమించి అతని వివాహమాడ నిశ్చయించిన స్వాహా రాకుమారితో ఆమె చెలికత్తెలు సోపాలంభనముగా పలికిన పరిహాసోక్తులు వినోదమునకు చదువదగియున్నవి. చూ (85) "ఏమని కోరితివమ్మా! రాజుచుండెడి మొగంబేమి! నిప్పులు కుప్పళించు

నడకలేమి ? సర్వభక్షకత్వంబేమి ? మెచ్చుటకు నచ్చినను గాల్చుట యేమి ? పోయిన మార్గంబెల్ల మలినంబగుటేమి ? ఇట్టివానిం బెండ్లాడు నాడువారుం గలరె ? అదియునుంగాక రెండు తలలతోడి మూడుకాళ్ళ ముదుసలిని వరియింప దగవగునే ?

## పార్వతి పరమేశ్వరునితో పరిహాసోక్తు లాడుట

"మీకు అత్యంత వికారంబులైన యంగంబులం గనుపట్టు భృంగి పరమ భృత్యుండు. పిశాచంబులు సఖులు. మంచంబుకోడు కైదువు. ఇంటింట బిచ్చంబె కూడు. పునుకలేపేరు హారంబు. ముది యెద్దు పడి వాగె తేజి. ఇన్ని మంగళంబులు గల మీకు సంగర జయంబబ్బుట కేమి యాశ్చర్యంబు."

బుద్ధిహీనుల తెలివితక్కువ చేష్టలును పరిహాస కారణములగు. చూ. (83) "పాల సముద్రంబు దొరకినను, పాలకై మేకం బితుకు బుద్ధిమంతుని చందమున, సూర్యకిరణంబుల గాదని మిణుంగురు పురువుల కాసపడు నపస్మారి వితంబున పరిహాస పాత్రుండగు."

## లోకోక్తులు

"వెన్న బారవైచి వేలునాకిన విధ" మని ఉత్తరాంధ్రములో వాడుక ఆ యర్థమునే యిచ్చు నీ లోకోక్తి ఈ కావ్యమున వాడబడి నది. "దివ్య మణి బారవైచి గవ్వ చేకొన్నట్లు" – (9). తగరు – పర్వతము (89) – పర్వతంబుపై సన్నపడిన తగరుశిరంబు నొచ్చుటే గాని పర్వతంబునకు గొఱంతయేమి ? (90) పూసగ్రుచ్చిన విధంబున తెలియబలుకుట. (91) పుట్టిన జగడంబు తోడుత నడపవలయు. ఏండ్లు పూండ్లు చెల్లిన నేమి ప్రయోజనము ? చెఱపన చేట మాయింట నుండ దగదు. పాఱెడు బండ్లకు పాదంబులు సాచుమనియెదు ; పిడిగుపడినవానిం గొఱవి చూచిన తెఱంగున – (తిక్కన – నాచన సోమనాథు లీ లోకోక్తి పలుసారులు తడవియున్నారు) (92) ఉప్పు రాయివలె కడపట నొక్కండు మిగిలె. (95) వేపచెట్టునకు పాలు

పోసి, చక్కెర యెరువు వేసి పెంచినను చేదుగాక మాధుర్యము గలుగ నేర్చునా? (96) బ్రహ్మచారియు గృహస్థుండు గాక రెంటికిని చెడ్డ రేవడయ్యె. ఉత్తరాంధ్ర దేశమున పిచ్చుక మీద బ్రహ్మాస్త్ర మను లోకోక్తి యర్థమునే ప్రకటించు మరిరెండు లోకోక్తులను జైమిని వచన భారతకర్త చక్కగా ప్రకటించినాడు :- 1. పుడిసెడు నీళ్లు చల్లిన నడగిపోయెడి ధూళికి కాలమేఘము వర్షింపవలెనే? 2. తెప్ప వేసిన బడిపోవు దోమల మీదకు గరుత్మంతు డెత్తిరావలయునా? (126) రేగుపండ్ల నిమిత్తము ముత్యములు వేలము వేయుట. దాశరథీ శతక కర్త "మసగొని రేగుపండ్లకును మౌక్తికముల్ వెలవోసి నట్లు" అని చక్కగా వ్రాసినాడు.

"స్త్రీ బుద్ధిః ప్రళయాంతకః" అను సంస్కృత లోకోక్తి గూడ 89 - పుటలో దడవబడినది.

## అర్థానుసారమగు శబ్దము

ఈ క్రింది రచనలు అర్థానుకారులగు శబ్దములతో కూర్పబడినవి. చూ. (21) కాలరుద్ర ఢక్కా ఢమఢమాత్కారంబుల ధిక్కరించు వాద్యఘోషములు. (41) భేరులు ఢమామాలు ఢక్కలు హుడుక్కలు దమ్మటలు గుమ్మెటలు మురజంబులు నరగజంబులు. (60) కల్పాంతకాల తంతన్యమాన ధారాధర గర్జితానుకారియైన ప్రయాణభేరీ (71) ప్రళయకాల రుద్ర ఢక్కాఢమాత్కార ఘోరంబుగా (107) బెటాలునం బెటిలి యించించుక చిద్రుపలై మొగసి చుట్టునున్న జనంబుల పయిబడిన బొబ్బలెగసి బొబ్బరించుచు బరువులెత్తిరి (136) ధగధగలు ధళధళలు ఈలెల నిగ నిగలు (306) పార్థుని మొల గోలుమూకల కలకలము.

## శబ్దాలంకారములు

వెంకటకృష్ణప్ప నాయని వచనరచనల శబ్దాలంకార విశేషములు నన్నయ, నాచనసోమనాథుల రచనల తలపునకు తేగలవు; కాని వారి

రచనలలోని జవ, గాంభీర్యములు, స్నిగ్ధత, వన్నె ఇతని రచనలలో కనబడవు.

శ్రుతి సామ్యము (Alliteration) :— (11) వేదవ్యాసుడు: వివిధ విద్యావిలాసుండును, జ్ఞానకలావాసుండును, బ్రహ్మజ్ఞాన మహోల్లాసుండునైన వేదవ్యాసుండు. (93) క్రముకంబులు, కదంబంబులు, కరవీరంబులు, అర్జునంబులు, కుటజంబులు, కురంటకంబులు, ఆమలకంబులగురులు, సాలంబులు, రసాలంబులు... (100) వేగరులు వేగంబచని...అశ్వమేధాశ్వంబువచ్చెనట! విశ్వచ్చుండును తోడనే వచ్చుచున్నాడట!

ముక్తపద గ్రస్తములు. (61) సింధురంబులును, సింధురంబులం జూచి కెరవి రాహుత్తులు తత్తరం బంద దాటు తురంగంబులును, తురంగహేషారవంబులకు జెదరి గోనెలు దిగవైచి పాఱు వృషభంబులును, వృషభమ్ముల సందడి దండడిగొని...

అనుప్రాసరచనలు :- (14) అచ్యుతుండిచ్చటికర్ధరాత్రంబున వచ్చెనని యచ్చెరువందనేల? భక్తు లెచ్చట నెచ్చట నుపద్రవంబునొందుదు రచ్చటికివచ్చి రక్షించుట యద్దేవునకు సహజగుణంబు (28) పెద్ద నిట్టతాటిచెట్టు; యౌవనాశ్వుండు దన యిచ్చలో మచ్చరంబు నచ్చెరువు విచ్చలవిడిం బెచ్చుపెరుగ...ఒక్కండు...గుఱ్ఱంబు నెత్తుకొని పోవుట వేయొక్కండు లెక్కకు మిక్కుటంబైన సైన్యంబు నుక్కడంచుట! (40) కర్ణనందనా! నందనందనుండు నరవింద సంభవుండు నీరవిందసంభవుండు నిందుశేఖరుండు 80. మిణుంగురు 'బూచులు' (Not derived from Bussy.) (88) అంపఱల పరంపరలు వెంపరలాడ (99) కొండారణ్యంబున గుండురాయివై పడియుండు (114) తెట్టువలు గట్టు నట్టలతోడంగూడ గట్టు పొరలినట్టు మట్టుమీఱి...(122) మంటికి మింటికి మంటలెగయ, మిణుంగురుల కుప్పల గుప్పు గుప్పున గుప్పుచు (143) నొక్క చక్కి చక్కెర బొమ్మలు చక్కెర యుక్కెరల కన్న మిక్కుటంబై

228. అర్జును మరణవార్త వినిన చిత్రాంగద — కలకంఠి కంఠీరవ రవంబు వినిన గజరాజ కన్యకంబోలె, కఠోర మేఘ గర్జనంబు వినిన కలహంసి తెఱంగున, బోయవాని వింటినారి ధ్వని వినిన చిన్నారి లేడి వితంబున, బిడాల నిర్ఘోషంబు వినిన బాల మూషికంబు విధంబున హృదయంబు వ్రక్కలై.

## సందర్భములబట్టి శైలి ఉద్వేగవంత మగుట

ద్రోణవధానంతరము అశ్వత్థామ నారాయణాస్త్రము పాండవ బలముపై ప్రయోగింపగా "ధరణీ చక్రము దిర్దిరం దిరిగె" నని తిక్కన వర్ణించియుండెను. అర్జునుడు అగ్నిదేవునిపై నారాయణాస్త్రము నేయదొడగినంతనే:- 82. సూర్యచంద్రాంగారకాది గ్రహ తారకా గణంబులు గతులు దప్పె; దిగ్గజంబులు మ్రొగ్గె; పంచ భూతములు హాహాకారంబు లొనర్చె? వేదంబు మఱచి మోదంబు మాని చతుర్ముఖుండు తమ్మిగద్దియ విడిచి దిగ్గన లేచె; సప్త సముద్రంబులు గలంగె; కుల పర్వతంబులు వణంకె; భూమి పెట పెటం బగిలె. బ్రహ్మాండ భాండంబు దిగబడియె; ఇంద్రాదులు...దిక్కా మొకంబులై పాఱంజొచ్చిరి." ఇట్టి కుఱుచవాక్యములు ఒకదాని వెంట నొకటి వేవేగ వచ్చునట్లు కూర్పు సాగించుటచే - పరిసరమున గల ఉద్వేగము ఈ కూర్పులో ప్రతిఫలితమైనట్లు శైలికూడ ఉద్వేగ వంతమైనట్లు స్ఫురించును. అట్టిదే మరొక ఘట్టము. 158. తన పాద ములకు పితృభక్తితో నమస్కరించుచున్న బభ్రువాహనుని శిరస్సుపై మెఱయు కిరీటమును అర్జునుడు కాలితో తన్నినప్పటి సంరంభము: "అక్కడి రాజులు హాహాకారములు చేసిరి; సాత్యకి తనయుని కృపజూడుమనె; కర్ణనందను డింతకోపం బేమిటికనె: హంసకేతను డింత గర్వం బేమిటికనె; నీలధ్వజు డింకనైన మన్నింపుమనె; ప్రద్యుమ్ను డిదేమి రిత్తగొడవ యనియె; కృతవర్మ తగవు గాదిది యపకీర్తి యనియె; అనుసాల్వు డయుక్తంబనె; యౌవనాశ్వు డనర్హ మనె. తక్కిన రాజులు వేనవేల విధంబుల నుపశమింప యత్నించిరి.

అర్జును డీ ఘట్టములో బభ్రువాహనుడు కోమటి బిడ్డగాని క్షత్రి యుడు గాడనుట అనుచితము; అగౌరవ హేతువై కావ్య మాధుర్య మును క్షయింప జేయుచున్నదని యనక తప్పదు.

కార్యసాధకుడైనవాని నానాటి ప్రజలు "మేలు - హైసరి - మాయన్న - హేయిరే" యని హెచ్చరించి ప్రశంసించుచుండిరి. ప్రభువులను "పరాకు, హెచ్చరిక, జతను సావధానత" అని హెచ్చ రిక వాక్కు లుచ్చరించుచుండిరి.

బభ్రువాహను చేత నర్జునుడు బడినట్లే కుశలవులచే రాము డోడి పడెనని ప్రసంగ వశమున రాగా ఉత్తర రామాయణ కథకీ పాండ వాశ్వమేధ కథలో సందర్భము కుదిరినది. ఇందు (215) వర్ణితమైన సీతాదేవి దుఃఖ దైన్యమూర్తియై మిక్కిలి జాలిగొల్పుచున్నది :- తపఃకృశ శరీర - వికీర్ణ వేణికాభార - బాష్పాకులిత నేత్రయు నైన జనకపుత్రి నోటనుండి వెడలిన యీ వాక్యము - "నన్ను బ్రహ్మదేవుడు శోకమునకై సృజించెనా?" అని చెవిని బడినపుడు - టెన్నిసన్ అను నాంగ్లకవి - స్వరద్రూపులు నారీమణులం గూర్చి వ్రాసిన వాక్యము ఆ కావ్య పాఠకులకు చప్పున జ్ఞప్తికి రాకపోదు - "Beauty and anguish always go hand in hand' సౌందర్యవతులకీ దుర్భరక్లేశము లెందుకొఱకు? వీరందరి నిట్లు కారించుటలో పరమేశ్వరుని సంకల్ప మేమి? యని హృదయములు కలతపడక మానవు.

సంస్కృత సారస్వత పఠనమున కలవాటుపడిన తెనుగు కవులకు "కృతభోజనుండవై" మొదలగు సంస్కృతోక్తులు వ్రాయకుండ ఉండజాలరు. చూ. 189. "సజ్జీకృతకార్ముకుడు, సంధీకృత బాణుండు, సంభృత కవచుండు, సమర సన్నద్ధుండునై సరభసంబుగా వచ్చు"

రస సంపర్కము తగిలినంతనే మేల్మి బంగరు సువర్ణచ్ఛాయ దొలగి వెల వెలబారినట్లు, హిందువులంత సత్యవంతులు, సచ్ఛీలురు, సత్పురుషులు మరెక్కడను లేరని కీర్తివడసిన భారతీయులు పాశ్చాత్య నాగరిక సంపర్కముచేత నన్నింటను చెడినారు. ఇట్లు చెడుదురని సూచించుటకో యన నాగరాజులు "మర్త్యు లసత్యవాదులు కృత

ఘ్నులు; వారియెడ నే క్రియలు ఫలింపవు" అని 236 లో నపకీర్తి ఘటించిరి. నవనాగరకతా దోష మంటిన ఈనాటి భారతీయులకు ఈ వాక్యములు సార్థకము లగుచున్నవి.

సముఖము వెంకట కృష్ణప్ప నాయకుడు రచించిన మరొక వచన కావ్యము సారంగధర చరిత్ర. రాజరాజు తన కొడుకు వివాహాము నిమిత్తమని తెచ్చిన చిత్రాంగిని కోడలిగా గాక రాణిగా చేకొనుట దురంతము. ఆ కథలోగూడ శబ్దాలంకారములు, లోకోక్తులు చాలగా గలవు. ఒక్క శబ్దాలంకారమును, ఒక్క లోకోక్తిని మాత్రము ఇచట నుదాహరించి అతని కావ్య విమర్శ చాలింతును.

"కాన నీ యాన - నా ప్రతిన - నే మాన." లోకోక్తి : "ఆడుది బొంకిన గోడకట్టినట్లుండు మగవాడు బొంకిన దడికట్టినట్లుండు." సారంగధర చరిత్ర శ్రీరంగేశ్వరునకును, జైమిని భారతము విజయ రంగ చొక్కనాథునికిని అంకిత మీయబడినట్లు పైని తెలిసికొంటిమి. ఆనాటి విద్వత్కవుల బెక్కండ్ర నాదరించి పోషించుటయేగాక, విజయరంగ చొక్కనాథుడు స్వయముగా శ్రీరంగ మాహాత్మ్యము మాఘమాహాత్మ్యము నను పెద్ద వచన కావ్యముల రచించెను. భైరవ కవి శ్రీరంగ మహాత్మ్యమును పద్యగద్యాత్మకమైన చంపువుగా రచించెను. విజయరంగ చొక్క భూనాథుడు కేవల వచన కావ్యమునే రచించెను. వైశాఖ మహాత్మ్యము కూడ అతడే వ్రాసె నని నాకు దోచుచున్నది.

ఈ నాయకరాజు లందఱును విష్ణుభక్తులు. శ్రీరంగనాథునే పర దేవతయని సేవించినవారు. రంగనాథుడును ఈభక్తులయెడ ప్రీతుడై ప్రసన్నుడగుచుండెను. చెన్నప్పనాయనికాలములో నొక విచిత్రము జరిగెనని గ్రంథ నిదర్శనము కనబడుచున్నది. వేయిమంది బ్రాహ్మణులు షడ్రసోపేతముగా భుజించి లేచినతరువాత గాని చెన్నప్ప నాయుడు భోజనముచేసెడివాడు గాడట! ఒక సంవత్సరము జడివానలు గురిసి వంటచెఱుకు లభింపకపోగా వానలు వెలిసి వంటచెఱుకు పుష్కలముగా దొరకుదాక బ్రాహ్మణభోజన మెడపెట్టవలెనని వంట

బ్రాహ్మణులు ప్రభువుతో విన్నవించిరి, "అట్లే యెడబెట్టవచ్చు. మా భోజనమునకు మాత్రము తొందరయేమి వచ్చె? అదికూడ ఎడబెట్టు దము" అని తన యభీష్టము తెలిపెను. గృహస్థులు తమ యిండ్ల లోగల అటకలు మొదలగునవి తీసిపెచ్చి ఆ కలప వంట కందిచ్చిరి. మరొకనాడు కట్టెలేక పాతగుడ్డలు, నేయి చమురుతో వంట చేయజూచిరి. పొగకు నిలువలేక వంటవాండ్రందఱును సాలవిడిచి వచ్చి చమురుపొగకు మండుచు, ఎఱ్ఱబడి, నీరుగారు కన్నులతో బయటనిలబడిరి. భక్తవత్సలుడైన రంగనాథుడు దేవిరంగనాయకమ్మను వంట పూర్తిచేయుమని పంపెను! మానవశరీరముతో వంటింట ప్రవే శించిన రంగనాయకిదేవిగారికిని ముక్కువెంటను, కనుల వెంటను నీళ్ళురాగా గంజిగుంటలకడ ఆమెముక్కు చీదుకొనెను. అప్పుడామె ముక్కెర పట్టూడి గంజిగుంట ప్రక్క బడిపోయెను. ఆలయములో అమ్మవారి విగ్రహమునకు ముక్కెర కనబడకపోగా రాజభటులు పూజారుల బాధింపజొచ్చిరి. అందుకోర్వక అమ్మవారు అంతఃపుర మునసుండిన యొకవృద్ధ సువాసిని నావేశించి "అమ్మవారు ముక్కు చీదిన గంజిగుంటకడ వెతికించినచో ముక్కెర దొరకు" నని పలికించెను. ఆ ప్రకారము వెతికించి చూడగా సువాసిని చెప్పినట్లే ముక్కెర దొరికినది. శ్రీరంగనాథునకును, అమ్మవారికిని రాజకుటుంబముపై గల అనుగ్రహమునకు ఈ ముచ్చట తార్కాణమై, ప్రజల రాజభ క్తిని పదిరెట్లు వృద్ధి చేసినది. ఇట్లు భగవత్కటాక్ష పాత్రులైన నాయక రాజులకు విష్ణువు ప్రత్యక్షదైవమగుట కాశ్చర్యపడ నక్కరలేదు. ఇంకొక్క విశేషమేమనగా జ్యోతిశ్చక్రములో విశాఖ నక్షత్రము రాధా నక్షత్రమని వేదప్రమాణము కలదు. 'రాధోవిశాఖే' యని శ్రుతి. విశాఖరాధ ఆవెంటనే వచ్చు మిత్రతార అనూరాధ. వైశాఖ మునకు రాధామాసమని పేరున్నట్లు నిఘంటువులు తెలియ చెప్పు చున్నవి. రాధ మహాభక్తురాలు. నక్షత్రరూపమున రాధ విష్ణుదేవుని ప్రక్కనుండు రాత్రులుగల మాసము రాధామాసము. కావున విష్ణుని కత్యంత ప్రియకరమైన వైశాఖ మహాత్మ్యముకూడ విజయరంగ

చొక్కనాథుడే రచించెనని నా దృఢవిశ్వాసము. వైశాఖమహాత్మ్య, మాఘమహాత్మ్యములనుండి మచ్చులిచ్చుచున్నాను.

## విజయరంగ చొక్కభూపాల విరచితమగు వచన మాఘ మాహాత్మ్యము - 13వ అధ్యాయము

అక్కుమారులంజూచి (బలరామకృష్ణులనుచూచి) సాంద్రీపని సంతసించి నాల్గువేదంబులు ఆరుశాస్త్రంబులు ఉపనిషత్తులు రహస్యంబులు, లక్షణంబులు, ధనుర్వేదంబును, ధర్మశాస్త్రంబులు, నీతిశాస్త్రంబులు తర్క విద్య, దండనీతి మొదలైన అరువది నాలుగు విద్యలు అరువది నాలుగు దినంబులలో చెప్పిన వార లొక్కొక్క సారి జెప్పిన మాత్రానినే గ్రహించుటయు; సాందీపని ఆశ్చర్యంబు నొందె; నంత సకల విద్యాధీశ్వరులైన శ్రీకృష్ణ బలభద్రులు సాందీపనిం జూచి "మహాత్మా? గురుదక్షిణ యొసంగెదెము. మీ యభీష్టం బేమి? యనిన నవ్విప్రుండు భార్యతో నాలోచనంబుజేసి "మీరు మహాప్రభావసంపన్నులు గావున ప్రభాస తీర్థంబున మరణంబు నొందిన మా కుమారునిం బ్రతికించి తేవలయునని" నియోగించిన మహారథులైన యా యన్నదమ్ము లిరువురు రథంబెక్కి సముద్రంబు చేరబోవ సముద్రుండు వారలస్వరూపం బెరింగి అర్ఘ్యపాద్యాది విధానంబులం బూజించి, కృతాంజలియై నిలిచినం జూచి, భగవంతుడు "నదీరమణ! నీలోన మరణంబు నొందిన మా గురుకుమారుని మగుడ నిమ్ము" అనుటయు, సముద్రుండు వినయంబునం దలవంచుకొని "దేవా! నాలోన శంఖరూపధరుండై పంచజనుండను అసురుండు సంచరింపు చున్నవాడు. మీ గురుకుమారుని వాడుమ్రింగె ననుటయు, జనార్దనుండు ఆ యసురుని సంహరించి, వాని యుదరంబున గురుకుమారునిం గానక వాని శరీరంబు పాంచజన్యంబను శంఖంబుగా గైకొని యమపట్టణంబున కరిగి యతని పూజ లందుకొని కృష్ణునాజ్ఞానుసారము ఎప్పటి రూపముతో నతడు తెచ్చియిచ్చిన గురుపుత్రునితో

వెడలి గురుపుత్రునకు సమర్పించిన నతండు పరమానందంబున ముకుంద భలభద్రులను వీడుకొలిపె. ”

## వైశాఖ మాహాత్యంబు

శ్రీహిత గుణ విశాలుండైన అంబరీష మహీపాలుండు పరమేష్ఠి యగు చతుర్ముఖునకు తనూభవుండును మేధాసాంద్రుండు నగు నారద మహామునీంద్రు నుద్దేశించి వైశాఖ మాహాత్మ్యంబు వెండియు విశదంబుగా నెరుంగం గోరి యిట్లని ప్రశ్నంబొనర్చె: “బ్రహ్మర్షిపుంగవా! మీవలన సకలమాస మహాత్మ్యంబులును తేటపడ నెరింగితి. వాటియందెల్ల వైశాఖ మాసంబు అతిశ్రేష్ఠంబని యానతిచ్చితిరి గావున నమ్మహాత్మ్యంబు సవిస్తరంబుగా నాకర్ణింపంగోరి మనంబునం గౌతూహలంబు మిక్కుటంబగుచున్నయది. వైశాఖ మాసంబు విష్ణుదేవుని కతిప్రియం బేమిటికయ్యె? వైశాఖమాసమందు విష్ణుప్రియకరంబులైన ధర్మంబుల నెవ్వి యాచరింపవలయు? యే యే దానంబులు సేయవలయు? నందువలననేమి ఫలంబు గలుగు? యే ద్రవ్యంబులచే మాధవు నారాధింపవలయు? విశ్వాస పూర్వకంబుగా వినంగోరెద. ఇత్తెఱంగంతయు సవిస్తరంబుగా ఆనతియ్యవలె”

## గోవు చరిత్ర

ఇది వ్రాసినవారెవరో తెలియరాలేదు. దీని భాష వ్యాకరణ యుక్తమును, నిర్దుష్టమును కాదు. అయినను ఇటీవల నలుబదేండ్ల క్రిందట మనదేశములో గ్రామ్య గ్రాంధిక భాషా వివాదము పొడచూపకముందే కొన్ని శతాబ్దముక్రిందట దక్షిణాంధ్రములో స్వభావికమైన వ్యావహారిక భాషలో ప్రజారంజకములైన కథలు రచింపబడుచు వచ్చిన క్రమమిట్టిదని తెలుపుటకు ఇచ్చట ఉదాహరించుచున్నాను. జనసామాన్యమునకు చక్కగా బోధపడి వారి విజ్ఞాన తృష్ణను, కథాశ్రవణాశక్తిరూపమైన క్షుత్తును పోగొట్టగల రమ్యకథలు నీతి, త్యాగము, పరోపకారబుద్ధి పెంపుచేయగల కథల నిట్టి వానిని రచించి ప్రజకు హితమొనరించిన ధన్యులు వంద్యులు.

"గంగా నదికి వుత్తర భాగమందు గోకన్నె యనేటి పుణ్య స్తలంబున వక అగ్రహారంబు కలదు. ఆ అగ్రహారంబున పుణ్యాత్ముం డనే బ్రాహ్మణుండు గలడు. ఆ బ్రాహ్మణుని యింట వుండె ఆవుల లోను - కామాక్షి, మీనాక్షి, పేరిందేవి, విశాలాక్షి, కపిల, అన్న పూర్ణ, కపిల అనే కామదేనువలు చాల కలవు. ఆయొక్క ఆవుల గాశేటందుకు, గోపాలకృష్ణుడనే గొల్లబోయిడు గలడు. ఒకనాడు కామధేనువుని పులి పట్టుకున్నది. బిడ్డకు పాలిచ్చి, బుద్ధులు చెప్పి వస్తానని నమ్మించి కామధేనువు ఇంటికివచ్చి దూడకు పాలిచ్చి బుద్ధులు చెప్పినది "ప్రమాణంచేసి వచ్చినాను. సత్యం తప్పక పోవలెను. నీవు బుద్ధిగలిగి దూడలతో కూడ అన్యోన్యంచాత వుండు దువు గాని కలతలు శాయవద్దు; యిదిగాక యింకా బుద్ధిమాట - పయిరు మెయ్యక, యెండబోసిన ధాన్యం తినక, పశువులతో గూడా తిరగబోక, పలుపు తెంచుకోక, అదాశి అనగానే పారిపోక, యెవరిని పొడవక యీ ప్రకారం వుండుమని కామధేనువు అన్న కొమారునికి తెలియజెప్పితేను ఆ కొమారుండు 'అమ్మా' యని యేడ్చి - "నిన్ను దినే పులి నన్ను దినుగాని నిన్ను విడిచి నేను అరక్షణం వుండేది లేదు. నన్ను తల్లిలేని బిడ్డ అని అంతా కొట్టిపోదురు; పొడుతురు; నీతోకూడా నేను వస్తాను." అనగా తోటి గోవులు "బెబ్బులిచేత తప్పించుకొని వస్తివి; యిఘు నీవు నీ కొమారుడు కలుసుక వూరికే వుండడమ్మా అని అడ్డగించుక వస్తె అందుకు కామధేనువు చెప్పిన వివరం "నేను సత్య ప్రమాణం తప్పి యంన్నాళ్లు బ్రతుకబోతాను. వ్యాఘ్రరాజు క్షుధ నిమిత్తం నమ్మించిపోయెను. ఇంకా రాకపోయె నని నామీద యంత 'ధూము' చేస్తూ వున్నాడో..." అని తర్లెను. దూడతో "అయ్యా నీవు రావద్దు. నాకు ముందర గతులు గల్పించే టందుకు, మన వంశం వర్ధిల్లేటందుకు వుండవలెను." అని తోడి గోవు లతో "నా కొమారుడు గాడు - మీరు సాదుకుంటె మీ కుమారుడు" అని వప్పగించి, "ముందరికి వస్తే పొడవకుండా, వెనుకకువస్తే తన్న కుండా పక్కకువస్తే తొయ్యకుండా, తల్లిలేని బిడ్డ యని 'చిన్ని

చూపులు చూడకుండా', చిన్నదనము గాకుండా ముందుకు తీసుకు రండమ్మా'' అని కామధేనువు తెలియచెప్పి, వారికి తన కుమారునిచేత దండప్రమాణము చేయించి వారిచేత నమ్మిక పుచ్చుకొని, కామధేనువు పోగాను, ఆవులంతా కామధేనువను తిరిగి తిరిగి చూచుచు మొరలు బెట్టుతూ...''

## ఇద్దరు మూర్ఖులు

ఈ గోవు చరిత్ర భారత సార మనదగు 'భారత సావిత్రిని', తెనుగు ప్రజలు అందును పూజ్యపాదులైన స్త్రీ రత్నములు ప్రతిదినము పారాయణ చేసినగాని భుజింప నొల్లకుండిరి. గోవుచరిత్ర వచనము ఎవ రెప్పుడు రచించిరో తెలియదు; కాని భారతసావిత్రి మాత్రము 'ఎల్లకర నృసింహ కవి' రచించినట్లు తెలియనైనది. కాలమెప్పుడో తెలియరాలేదు గాని కృష్ణదేవరాయల కాలములోనే భక్తులీ భారత సావిత్రిని ప్రతిదినము పఠించెడివారని స్థానాపతి రచించిన రాయ వాచకములో తెలుపబడినది. కాబట్టి భారత సావిత్రి సుమారు ఐదువందల యేండ్ల క్రిందట రచింపబడి యుండవచ్చునని తోచుచున్నది. ఆస్తికులగు భారతీయులు అనుదినము పఠింపదగిన సద్గ్రంథము ఈ భారత సావిత్రి యనుటకు సందేహము లేదు. స్థాలీపులాకన్యాయముగా ఒక వాక్యము మాత్ర మందునుండి ఎత్తి వ్రాయుచున్నాను.

"అశోక వనంబు విరిచి, అక్షయకుమారునిం జంపి, లంకా నగరంబు దహించి, హనుమంతుండు జయంబు చేకొనుట యెఱింగియు, తిరిగి రామునితో కయ్యముసేయ నెంచిన రావణుం డొకడును, ఉత్తర గోగ్రహణమున దలపాగలు దోచనిచ్చి, పరాజయంబు నొందియు మరల యుద్ధమునకు బూనిన దుర్యోధనుడొకడు – ఈ యిరువురును లోకంబున మూర్ఖులనంబఱగుదురు.'' భారతయుద్ధము మార్గశిర శుద్ధ త్రయోదశి భరణీ నక్షత్రముతో నారంభమయ్యెనని ఇందు స్పష్టముగా తెలుపబడినది.

అముద్రిత తాళపత్ర గ్రంథములు మద్రాసు ఓరియంటలు లైబ్రరిలోను, కాకినాడ ఆంధ్ర సాహిత్య పరిషత్ లైబ్రరీలోను, తంజావూరు

సౌధ, లైబ్రరీ సరస్వతీ మహాల్ గ్రంథాలయములోను ఉన్నవి. ముద్రితములైన అపూర్వగ్రంథములు పుస్తకముల రిజిస్ట్రారు వారి ఆఫీసులోని గ్రంథాలయములో ఉన్నవి. అందలి వివరము లీదిగువ నిచ్చుచున్నాను.

ఉభయకావేరీ మధ్యమున, శ్రీరంగ దివ్యక్షేత్రములో వేంచేసి యున్న శ్రీరంగేశుడు - రంగానాయకి - దేవీసహితుడై - పిలిచిన పలుకుచు, భక్తుల యోగక్షేమముల నారయుచు, ప్రజల పాలించు చున్నాడను విశ్వాసము దాక్షిణాత్య ప్రజానీకములో దృఢపడి వ్యాపించుచుండెను. ఆకాలపు ప్రజానీకపు యోచనా ప్రవాహము మోక్షాపేక్ష ననుసరించి యురువడించుచుండెను. ధ్యానము దైవాయత్తము, చింతనలు దైవచింతనలు. వెలసిన వాఙ్మయమును మత ప్రాధాన్యమునే సూచించుచుండెను.

అనగా తెనుగు సీమను నివాసము చేయుచుండిన ప్రజలందఱును విష్ణుభక్తి పరాయణులైన వైష్ణవుల మతము నవలంబించిరని భావింప రాదు. శంకర భగవత్పాదులు అద్వైత మతము స్థాపించిననాటినుండి, ఆ మహనీయుని శిష్యకోటి, ఆ మతవ్యాప్తికొఱకు విడువక కృషిచేయు చున్నారు. భగవద్రామానుజులు విశిష్టాద్వైతము స్థాపించి విష్ణు సర్వోత్తమత్వము నిరూపించి అందుకొఱకపారకృషిని చేసెను. ఆయన శిష్య ప్రశిష్యులు ఆ మత వ్యాప్తికొఱకు పాటుపడుచున్నారు. అనాది నుండి తెనుగుజాతిలో ననేకులకు ఆశ్రయమైనది శైవమతము.

త్రివేణీ సంగమ విశిష్టమగు ప్రయాగ దివ్యక్షేత్రమువలెనే, తెనుగు నాడును త్రిమత వ్యాప్త విశిష్టమై భక్తి ప్రపత్తులతో వెల్లివిరియు చుండెను. ఏ మతమును బోధించు వాఙ్మయము ఆ మతభాషలలో పెంపొందుచు వచ్చెను. తెనుగు వచన గ్రంథరూపమున ప్రవహించిన ఆనాటి వాఙ్మయమును పైని విమర్శించిన మూడు వర్గములక్రింద విభజించుకొని, ఆ కాలపు వాఙ్మయ పరిణామ క్రమము పరిశీలింతము :

## 1. మతగ్రంథ శాఖ

### ఓరియంటల్ లైబ్రరీలో నున్న గ్రంథములు :

**అద్వైత మతగ్రంథములు.**

1. సాత్త్విక బ్రహ్మవిద్యావిలాసము (దీనిప్రతి సాహిత్యపరిషద్గ్రంథాలయములో గూడకలదు.)
2. అజ్ఞానధ్వాంత చండభాస్కరము
   కర్త : కంఠంపాటి అమరేశ్వరశాస్త్రి
3. వేదాంత సారసంగ్రహము
   కర్త. వెలగపూడి కృష్ణకవి
4. తత్త్వవిషయము
5. పంచీకరణము
6. మంత్రసారార్థదీపిక
7. మహాకావ్య వివేకము

**విశిష్టాద్వైత మతగ్రంథములు**

1. వేంకటేశ్వర వచనాలు
2. శ్రీకటేశ్వర మహాత్మ్యము
3. శఠకోప విన్నపములు,
   ఈగ్రంథమొకసారి ముద్రింపబడినది.
   కర్త : సాకలపాటి రామానుజయ్య
   ఆం. సా. ప. భాండాగారమునందును దీని ప్రతులు గలవు.
4. వచన విచిత్ర రామాయణము,
   కర్త : డొంకాడ సుగోపినాథకవి, మనుష్యులు కోతులైనకథ.
5. కృష్ణమాచార్య కీర్తనలు
6. విరక్తి మునుల చరిత్ర
7. అర్చరాది వర్ణనము

**శైవమత గ్రంథములు**

1. హాలాస్య మహాత్మ్యము
   కర్త : సంజరాజు
2. శైవ చూర్ణిక
3. భవానీ మనోహర వచనాలనే శంకర వచనాలు.
4. కమసాలి మతము
5. కేదారేశ్వర వ్రతకథ
6. శ్రీశైల స్థల రహస్య వివరణము
7. పాల్కురికి సోమనారాధ్యులు జైష్ణవుల జయించినకథ.
8. వివేక చింతామణి

## ఆంధ్ర సాహిత్య పరిషద్గ్రంథాలయమునగల వచనగ్రంథములు :

### అద్వైత మతగ్రంథములు

1. రాజయోగము
2. రాజయోగలక్షణము - కర్త : ఫణిభట్టు
3. రాజయోగ ప్రకాశిక
4. పంచపద మహావాక్యం
5. మం. తార్థము
6. వేదాంతవాక్యార్థము
7. వాసుదేవమననము
8. మహావాక్యలక్షణము
9. వివేకసారము (దీని ప్రతి తంజావూరు సరస్వతీ మహలులో గూడ కలదు.)
10. జీవ ప్రబోధము
11. వేదాంత వార్తికము
12. వివేక చింతామణి
13. బ్రహ్మవిద్యాసుధార్ణవము కర్త : పరమానంద తీర్థులు.

### వైష్ణవ మతగ్రంథములు

1. వైష్ణవ చూర్ణిక
2. ఎంబెరుమానారుల వార్తలు 82
3. ఉత్తర గోపురవచనం
4. వెంకటేశ్వర విన్నపములు
5. వైష్ణవ మతగద్య
6. గద్యత్రయం
7. శ్రీరంగ మహాత్మ్యం
8. మాఘమహాత్మ్యం
9. తిరుపతి చరిత్ర
10. నవగ్రహప్రశ్న
11. మోక్షశాస్త్రము
12. శ్యామరాయకవి రామాయణము
13. కావేరీ మధ్యజ్ఞానభూమి
14. గజారణ్యమహాత్మ్యం
15. సభాపతి వచనం_లక్షణము
16. తిరునామములు
17. వ్యాఘ్రకేశదాసు విన్నపములు

### ప్రకీర్ణ గ్రంథములు

1. ఉపదేశక్రమము-కర్త : పరమానందయతి
2. బ్రహ్మవిద్యాసుధార్ణవము
3. బ్రహ్మాండ వచనము
4. చంద్రహాసోపాఖ్యానము
5. విష్ణుపురాణము
6. శ్రీరంగ మహాత్మ్యము
7. భారత సావిత్రి
8. ముప్పదినాలుగు విన్నపములు
9. ఆరూఢభావనానాడి
10. ప్రశ్నశాస్త్రము
11. ఇల్వల వాతాపుల వృత్తాంతము
12. రత్నగిరీశ్వరుల మహిమ
13. జంగమ కాలజ్ఞానం
14. జగన్నాథస్థల మహాత్మ్యము
15. షట్స్థల సంబోధతత్త్వ రహస్యము
16. జ్యోతిషవచనం
17. వైద్యవచనం

తంజాపురి రాజసౌధస్థమగు సరస్వతీ మహలులో గల వచన గ్రంథములు - (1) ధేను మాహాత్మ్యము కర్త: త్రికామకవి (2) ఆచార్యవిజయము: కర్త: త్రికామకవి (3) బలభద్ర విజయము కర్త: సోమకవి. (4) సర్వలక్షణసార సంగ్రహము కర్త: చిత్రకవి పెద్దన్న (హరిశ్చంద్ర నలోపాఖ్యాన వ్యాఖ్యానకర్త.) (5) తాళ్ళపాక తిరువెంగడనాథుని అమరకోశవ్యాఖ్యానము.

ఇందుకొన్ని గ్రంథములలో సంస్కారశూన్యమైన వ్యావహారిక ఆంధ్రమునే వాడిరి. గ్రామ్య గ్రాంధిక తగాదా రాకముందే ఇట్టిగ్రంథములు దక్షిణ దేశములలో ఉద్భవించినవి ఆకాలములో ముఖ్యముగా రచింపబడినవి మనకావ్య త్రయము - రామాయణ - భారత - భాగవతములు.

| రామాయణము | భారతము | భాగవతము |
|---|---|---|
| 1. గోపినాథ రామాయణం<br>2. రామపట్టాభిషేకము | కుందుర్తి వేంకటాచలకవి - కావ్యత్రయము రచించినాడు. | |
| సంక్షేప రామాయణము | సంక్షేప భారతము | సంక్షేప భాగవతము |
| 3. తుపాకుల అనంత భూపాలుడు రామాయణముకూడ రచించెను. (ఆం. సా. ప. లో కలదు)<br>4. కవి వెంకటసుబ్బయ్య కృతవచన రామాయణము | భారత సభాపర్వము<br>కవి వెంకట సుబ్బయ్య కృతవచన భారతము. | కవి వెంకటసుబ్బయ్య వచనభాగవతము<br>పుష్పగిరి తిమ్మన వచన భాగవతము వ్రాసెను. |

ఎఱుక: పుష్పగిరి తిమ్మన్న రచించిన భాగవతమును - ఎవళూర్ యమ్మావాద్యర్ శిన్నయ్య తమిళభాష లోనికి పరివర్తించినాడు.

పైడిపాటి పాపయ్య ఒక రామాయణ సంగ్రహ వచనము రచించెను. వావిళ్ళ రామస్వామి శాస్త్రులుగారు 1875లో ఒక వచనరామాయణము రచించిరి; వచన మైరావణ చరిత్రకూడ అతడు రచించినదే.

పుస్తకముల రిజిస్ట్రారు వారి ఆఫీసులో ఈదిగువ వ్రాసినప్రకారము ముద్రిత గ్రంథములు కనబడుచున్నవి:—

(1) గరుడపురాణము. కర్త: ఎన్. వేంకటరామశర్మగారు

(2) మద్రాసులో క్రొత్తగా నెలకొల్పబడిన - సదర్ అదాలత్ కోర్టువారి ఉపయోగనిమిత్తము పరవస్తు చిన్నయసూరిగారు "హిందూ ధర్మశాస్త్ర సంగ్రహము" రచించిరి.

(3) గంగాసేతు యాత్రా ప్రకరణము అను యాత్రా చరిత్ర ఒకటి వెంకటేశ్వరయ్యగారు రచించిరి.

ఇవిగాక

(4) రావిపాటి గురుమూర్తిశాస్త్రిగారు పంచతంత్రము-వచనమును,

(5) భద్రాచల తిరుమల శ్రీ కాకుళాచార్యులవారు పరిషత్పాదుషా కథలును,

(6) కొమాండూరు అనంతాచార్యులుగారు నలుగురు మంత్రుల కథలును,

(7) చదలవాడ సుందర రామశాస్త్రిగారు సమాసములు విడగొట్టి సంస్కృత నాటకకథలును వ్రాసిరి.

## కథలు

చీమలు - ఈగలు లోనగు చిఱుత ప్రాణులకే గాక మర్కట భల్లూకాది మృగజాతులకును - తేనె మిక్కిలి ఇష్టమైనట్లే - కథాశ్రవణము మానవజాతికి మిక్కిలి ఇష్టమగు వినోదమగుచున్నది. మారాముపెట్టి మానక యేడ్చు మూడేండ్ల చిన్న పిల్లలు సహితము కథామాధుర్యమునకు సొక్కి, కట్టుబడినట్లు లొంగి, యేడుపు మాని, ఊఁకొట్టుచు, కథలు విని మైమఱచి నిద్రపోవుదురు. ఏ వయస్సులో వారైనను, కథాసక్తులుగానివారు మానవులలో లేరు; ఉండరు. నైమిశారణ్యములో, సూత కథకుడు, శౌనకాది మహా మునులకు భారత భాగవత రామాయణాదిగా పదునెనిమిది పురాణ ఉపపురాణముల

కథలు పండ్రెండేళ్లు చెప్పెను. ఆఫ్రికా, అరేబియా దేశముల ఇసుక యెడారులలో బిడారు వర్తకము సాగించు నొంటె వ్యాపారులగు వణిక్కులు తాము మకాము చేసిన డేరాల యెదుట వెన్నెలలో సుఖాసీనులై కథలు చెప్పుకొని ఆనందించుచుండిరి. స్త్రీజాతి యందు విశ్వాసములేక చండశాసనుడగు ముష్కర తురుష్క ప్రభువు ఒకరాత్రి తన పడకగది నలంకరించిన సౌందర్యవతిని మరునాడుదయము శిరశ్ఛేదము చేయించునంతటి దారుణ క్రౌర్యమును మాన్పి కథాశక్తి యను పాశముచే కట్టి పడవైచి వేయి రాత్రులు గడపి తుదకా దుష్కర వ్రతము మాన్పించిన యువతీమణి చమత్కారమును, తెలివి తేటలను మెచ్చుకోని వారుండరు. ఆ కథల గుచ్ఛమే Arabian Nights అనుపేర జగద్వ్యాప్తిగనినవి; ప్రాక్పశ్చిమ దేశములలో ఎన్నోశతాబ్దముల నుండి శ్రోతలను, పాఠకులను అలరించుచున్నవి. అనేక నవలలు, నాటకములు, సినీమా ప్రదర్శనములకు నాస్పదములై యా కథలు నేడుగూడ మనతరమువారికిని అనిర్వాచ్యమైన ఆనందము నొడగూర్చుచున్నవి.

## కథాసరిత్సాగరము

అనాదికాలమునుండి ఆంధ్రులు శివపూజా ధురంధరులైన పరమ శైవులు. లింగరూపియని శివుని వార లతిభక్తితో నర్చించుచుండిరి. కొందరు వేదఋషులకీ లింగార్చన చాల అసహ్య మనిపించెను. వారలీ పరమశైవులను "శిశ్నదేవులని" ఋగ్వేదములో పలుతావుల హేళన చేసి మంత్రములలో చేర్చిరి. పరమశివుని కొన్ని పిశాచములు సేవించుట ప్రసిద్ధము. కావున నీ శైవ జనులను పిశాచులని నిందించి, వారిభాషను పైశాచీ భాషయని మిగుల గర్హించు చుండిరి. జాతిభేద మాత్సర్య ప్రేరితులై నీచబుద్ధితో వారట్టి తుచ్ఛనామము పెట్టినను పైశాచీ భాష చాలా నాగరికత స్థితికి వచ్చి ఉత్తమ వాఙ్మయరచనకు స్థానమైన దనుటకు బృహత్కథా రచన యొక్కటి చాలును. పార్వతీపరమేశ్వరుల పుత్రుడు – షణ్ముఖుడు– కుమారస్వామి

కూడా విద్యాభ్యాసవేళ విధిగా పఠించిన పాఠ్యగ్రంథము 'బృహత్కథ' యని నన్నెచోడాది మహాకవులు ఉద్ఘాటించి యుండుటచేత దీని ప్రాశస్త్యము వెల్లడి యగుచున్నది. నిజము తెలిసికొనినచో ప్రాచీనాంధ్ర నాగరకతకు, చరిత్రకు సంబంధించిన మేలుకథల సంపుటియే యీ బృహత్కథయను సత్యము గ్రహింపనగును. ఇది పైశాచిభాషలో రచింపబడిన అపూర్వ గ్రంథము. ప్రసిద్ధ సంస్కృత కవులందరునూ 'కాన్తయో కూన్తయో' బృహత్కథాకారునకు ఋణపడియున్నారు. కాళిదాసు మేఘసందేశమునందును, సుబంధుడు వాసవదత్తలోను, శ్రీహర్షుడు రత్నావళీ, ప్రియదర్శికా, నాగానంద నాటకములలోను, భవభూతి మాలతీ మాధవములోను, విశాఖదత్తుడు ముద్రారాక్షసమునందును బృహత్కథను దడవియున్నారు. బాణకవి కాదంబరీలో కూడ బృహత్కథ సాయము గొనినాడు.

బృహత్కథలో మహిమ ప్రధానమైన చరిత్రలెన్నియేని గలవు. ఇందు చిన్నకథలు, పెద్దకథలు, ధూర్తుల కథలు, మూర్ఖుల కథలు లోనగునవి లెక్కకు మీరినన్ని వున్నవి. వేయేల? బృహత్కథా కర్త సర్వజ్ఞుడు. పంచతంత్రకథలు, భేతాళకథలు. ప్రేమకథలు అన్నిటికిని మూలమైన సాగరమిది. ప్రపంచములో ఎప్పుడెక్కడ ఎవరు ఎట్టి కథ వ్రాసినను, వ్రాయగల్గినను, దానికి మూలమో, దాని మాదిరి కథయో బృహత్కథలో కలదని నిస్సందేహముగా ప్రవచింతును. ఆఖరుకు ఆ కథ సారమైన నిందు ఉండితీరునని పంతముతో చెప్ప వచ్చును.

నన్నయ్యభట్టారకుడు భారతము నాంధ్రీకరించునపుడు "పాయక పాకశాసనికి భారత ఘోర రణంబునందు నారాయణునట్ల—" నారాయణభట్టు నన్నయకు తోడయి ఆ కార్యము నిర్వహింపచేసినాడు. ఈ నారాయణ భట్టునకు రాజరాజు అనుగ్రహించి అగ్రహారమొసగుచు వ్రాయించిన దాన శాసనములో నారాయణభట్టు "సంస్కృతాంధ్ర కర్ణాట 'పైశాచీ' ...అష్టభాషా సుకవి రాజశేఖర" అని ప్రశంసింపబడినాడు. మరొక శతాబ్దమునాటికి శా.శ. పదకొండవ శతాబ్దిలో

క్షేమేంద్రుడను కాశ్మీరకవి ఈ బృహత్కథను పైశాచీ భాషనుండి సంస్కృతము లోనికి పరివర్తనచేసి, కథాసరిత్సాగర మని పేరిడెను.

మన ఆంధ్రజాతి నాలుగు కోట్ల జనములో నే ఒకరికైన నిజమైన జాతి అభిమానము, ఆంధ్రచరిత్రాభిమానము, భారత చరిత్రాభిమానము నున్నపక్షమున అట్టివారు ఈ కథాసరిత్సాగరము నాధారము చేసికొని ప్రాచీనాంధ్రుల చరిత్రను, ప్రాచీన భారత చరిత్రను స్వతంత్రముగా రచింపవలసియున్నది. పాశ్చాత్యుల భావనలు ఇందు కేమాత్రమును పనికిరావు. పైని తెలిపిన రచనలు మాటలతో జరుగు పనులుకావు. వానికి విశేషపరిశ్రమ అత్యవసరము.

మరొకటికూడా మనవిచేయుట ముఖ్యము. సంస్కృతములో పుట్టి పెరిగి, సంస్కృతముతో దేహమును పెంచి, ఎక్కడ జూచిన సంస్కృత రక్త, సంస్కృత మాంస, సంస్కృత కండరములే గల వేదము వెంకటరాయశాస్త్రి వంటి సంస్కృత పండితులుగాక తెనుగు భాషా జాతీయ జీవనములకు భంగములేని తేటతెనుగుజీవద్భాషలో ధారాళముగా, తెనుగు ప్రజలకింపగు రీతిని ఈ కథా సరిత్సాగర కథలను తెనిగించి వ్రాయుట అత్యావశ్యకము. వెంకట రాయశాస్త్రిగారు ఈ గ్రంథరాజమును తెనిగింప బూని ఎంత భ్రష్టుచేసిరో, ఏ విధముగా భగ్నము పాడుపాడు గావించిరో స్పష్టముగా చూపుటకు వారి కథాసరిత్సాగరము "తెనుగు" నుండి ఒక్క వాక్యము మాత్రము ఎత్తి వ్రాసెదను :

"క్షామ పాండుధూసర యా బ్రాహ్మణి మానముచేతనుం బలె శిథిలమైన వస్త్రముచేత చాలావఱకు వదలబడినదై"

కర్మార్థక రచనలు సంస్కృతములోను, ఇంగ్లీషులోను రాణింప గలవు కాని తెనుగులో అట్లు రాణింపవు. ఇట్టి దుర్గతిలోనున్న స్త్రీని గూర్చి ప్రసంగించ వలసినప్పుడు తెనుగుప్రజలు "ఆవిడకు కట్టు కొనుటకు బట్టలులేవు. చింకిగుడ్డలు జీర్ణవస్త్రములతో కుచేలునట్లున్నది" అందురు గాని మరొకలాగున అనరు. పై వాక్యము తెనుగనజనదు. "హద్దుమీరి నడుచువారిని దండించబడును" (Trespassers will

be procsecuted). "ఇందువల్ల అడుగుకోవడ మేమనగా- జనులు ఈ కట్టడములో ఫూయగూడదు" చెన్నపట్టణపు వెధవ శ్రీయైన సుబ్బులక్ష్మి అమ్మాళ్ - (The Public are requested not to spit in this Building : Subbulakshmi Ammal, late widow, of Madras.) ఇటువంటి ప్రకటనలు అధికార రీత్యా ప్రదర్శింపబడుచున్నవి. ఆంధ్ర ప్రదేశమను నామముతో ప్రత్యేకరాష్ట్రమబ్బినది కాని ఆంధ్ర భాషకు విజాతి సాంప్రదాయ పీడ వదలు మార్గ మగపడకున్నది. మనవారిప్రదర్శనముల నిరసించి భాషాసాంప్రదాయములను జీవ సౌష్టవములను కాపాడుకోవలెను. ఇంగ్లీషులో పట్టభద్రులైన తెనుగు యువకులు ఇంగ్లీషులో ఆలోచించి వాక్యములు వ్రాసి వానిని తెనుగుచేయ గడంగుచున్నారు. ప్రకటన కర్తలు వాని నట్లే ముద్రించి ప్రకటించుచున్నారు. పాఠ్యగ్రంథనిర్ణాయకులీ వర్గమునకు చెందినవారే యగుట వీనికంగీకారముద్ర యొసంగుచున్నారు. అందు చేత నీ యరాజకము ప్రబలుచున్నది. చూడండి: Here is a cow; it has four legs. అనునది తెనుగులో - "ఇక్కడ నొక ఆవు వున్నది. అది నాలుగు కాళ్లు కలిగియున్నది." కలిగితే పిల్లల కళ్లు కలుగుతవి గాని ఆవుల కాళ్లు కలుగునా? ఇది జాతీయమా? అని నా సవాలు.

ఓరియంటల్ లైబ్రరీలోను సాహిత్యపరిషత్ వారి లైబ్రరీలోనుగల కథలపుస్తకములను గ్రాంధిక గ్రామ్య భాషా భేదములను బట్టి రెండు వర్గములుగా విభజింపవలసి వచ్చినది.

## ఓరియంటల్ లైబ్రరీలో కథలు :

గ్రాంథిక భాషలో

1. హంస వింశతి కథలు. 2. మదన కామరాజు కథలు

వ్యావహారిక భాషలో

1. భోజరాజీయము. 2. గోవ్యాఘ్రము చరిత్రము. 3. కాంభోజరాజు కథలు. 4. తోతీనామా కథలు 5. దిలారామ్ కథలు

6. "కీర్ బహాత్తర్" 7. పలుకని పద్మాక్షి కథలు = మౌనధారిణి కథలు కర్త: కొమాండూరు అనంతాచార్యులు. 8. కూన పాణ్డ్య రాయని కథ 9. వినోదకథ లను తాతాచార్యుల కథలు (బ్రౌన్ దొరగారి ప్రోత్సాహమున రచింపబడినవి.)

## సాహిత్య పరిషత్ లైబ్రరీలో కథలు

గ్రాంధిక భాషలో

1. చిలుక చెప్పిన కథలు 2. హంస వింశతి కథలు, అయ్యల రాజు నారాయణ రచించిన పద్యకావ్యమును కలదు. 3. ద్వాత్రింశత్సాల భంజికలకథలు, కర్త: కోఅవి గోపరాజు 4. తెనాలి రామునికథలు 5. భేతాళ పంచవింశతి.

వ్యావహారిక భాషలో

1. విక్రమార్క చరిత్ర, కర్త: యాదవాచార్య (బాపయ్య కుమారుడు.) 2. గోవు చరిత్ర 3. పంచతంత్రము 4. సాలభంజికల కథలు 5. భట్టి విక్రమార్క కథలు.

## చరిత్రాత్మకములైన యీక్రింది గ్రంథములు ఓరియంటల్ లైబ్రరీలో ఉన్నవి

1. అరువది రెండు సంపుటములు స్థానిక చరిత్రలు. కొలొనల్ కాలిన్సు మెకన్జీదొర 1800 – 1805 లో ప్రోగుచేసినవి. ఆయన భార్యకు లక్షరూపాయలిచ్చి ఈస్టిండియా కంపెని కొన్నది. 2. కాకతీయ రాజవంశావళి (ప్రతాప చరిత్ర.) 3. తంజావూరి రాజుల చరిత్ర 4. సింహాళ విజయము 5. కళ్ళజాతి చరిత్ర 6. వేమారెడ్ల చరిత్ర 7. హైదరు చరిత్ర 8. సాహిత్య పరిషత్ లైబ్రరిలో రాయవాచకము 9. రాయవాచకమువంటి వాచకము.

యాత్రాచరిత్రలు

1. కాశీయాత్రా చరిత్ర కర్త: ఏనుగుల వీరాసామయ్య. ఈ గ్రంథ మిటీవల దిగవల్లి శివరావు పంతులుగారు B. A. B. L. గారిచే

ముద్రించి ప్రకటింపబడియె. 2. నీలగిరి యాత్రాచరిత్ర కర్త: కోలా శేషాచలకవి. 3. పురుషోత్తమ చరిత్ర కర్త: అల్లూరి లక్ష్మీనరసింహం 4. యాత్రా చరిత్ర గంగా సేతు యాత్రాప్రకరణ, కర్త: వెంకటేశ్వరయ్య, 5. (బొబ్బిలి రాజావారితో) మండపాక పార్వతీశ్వరశాస్త్రి గారు దక్షిణ యాత్రలకు వెడలి సేవించిన దక్షిణయాత్రలు.

ఆ కాలపు ప్రజలకు స్థలమహాత్మ్యములం దెట్టి విశ్వాస ముండెనో - చక్కగా విశదము చేయగలదియని గజారణ్య మహాత్మ్యము నుండి కొన్ని భాగములిట వ్రాయుచున్నాను. ఇది పద్మపురాణాంతర్గత మధ్యమ ఖండమునకు తెనుగుచేత, ఉమామహేశ్వర సంవాదమునకు ఆంధ్రీకరణము (ఆం. సా. ప. లైబ్రరీ)

"పర్వత రాజనందనా! నందియు నీవు నడిగిన ప్రశ్నకు సదుత్తరంబుగా నొక పుణ్యస్థల వైభవంబు నెరింగించెద వినుము... సకల పాప హారంబైన కావేరికి మధ్యభాగంబున, నిజసందర్శన మాత్రంబున ఋషులకు కైవల్యంబును కరస్థంబుగా సేయంజాలి జ్ఞానభూమియన నామంబున ప్రసిద్ధంబగు గజారణ్యనామకంబగు నొక్క మహాస్థలంబు గలదు... సకల పుణ్యతీర్థములు నీ గజారణ్యంబున తపంబొనరించు చున్నవి. జంబు మునియు నిట తపంబు జేసె. మహావాహినియైన కావేరి గజారణ్యమున ప్రవహించు. అమ్మహానదీ మధ్యంబున నుత్తమంబైన జంబూవనంబు ప్రకాశించు; నదియును నిరంతరంబును గెంపుమీరు చిగురు జొంపంబుల నెండకన్నెఱుంగక మెఱుంగులు దేరుచు, నుదారంబులైన రోలంబంబుల కాకలీస్వనంబుల నానందకరంబును, గొప్పవైన నారికేళంబుల నుండి కుప్పించి దాటు కపి నికరంబుల చేత గప్పితంబులైన తరునికరంబుల నొప్పు మీరుచు, కపురంపుటనంటుల, పొన్నలు, పొగడలు, కుందమందార మకరందంబులు ...జాజులు విరుజాజులు...వికసిత కుసుమవాసనా సమాగత మత్తమధుకర ఝుంకార సంకులంబు లగుచు, మించిన మంచు వలన ఫలించిన దాడిమలు లోనగు తరు విశేషంబులుంగలిగి, పెంటి యేనుంగుల సంగమంబునకు గమకించు మదపుటేనుంగు మొత్తంబులకు క్రీడాస్థానంబును, ఫలించి తమకు తామె విరిసిన రసదాడి యనంటిపండ్ల

వలనంజారు తేనియల కాలువలతోడ గూడి పెచ్చుపెరిగిన స్వచ్ఛసలి లంబుల మనోహరంబులగు సరోవరంబులును, చల్లని నీడల వేడుకలు సేయు పువ్వుపొదరిండ్లును..."

## వచనము లనబడు శతక - వచన రచనలు

ఒకే వరుసగల నూరేసి పద్యముల గుచ్ఛము లనదగు శతక రచనలు తెనుగు సారస్వతమునకు ముఖ్యాంగములై యున్నవి. కృష్ణా యను మకుటముతో కృష్ణశతకము, సుమతీయను మకుటముతో సుమతీ శతకము, దాశరధీ శతకము, భాస్కరశతకము ఈ మొదలైన పద్యశతకము లెన్నియైన మన వాఙ్మయములో నున్నవి. అట్లే ఒకటే మకుటము ఒకేవైఖరిని రచింపబడిన వచన గుచ్ఛములును మన సాహిత్యములో కొలదిగా పొడసూపినవి. అయ్యవి భక్తి జ్ఞాన వైరాగ్య విషయప్రసంగములతో నిండి — లోకజ్ఞులైన ముముక్షువుల వలన రచింపబడిన భగవన్నుతులు. తాము తరించి వానిం జదువువారిని కూడ తరింపచేయగల భక్తిప్రపత్తులతో పొంగిపొరలుచుండును.

అందు కొన్ని శివపదములు. శంకరా! అనికాని, భవానీ మనో హరా! అని కాని సంబోధనతో ముగియునవి. వైష్ణవ పరములైన వెంకటేశ్వర వచనములు, హృషీకేశ వచనములు, శఠకోప విన్న పములు కూడ కలవు. సందర్భానుసారముగా పురాణ సాంప్రదాయ ములును కుప్పతెప్పలుగా నీ వచన రచనలందు చొప్పింపబడినవి.

## భవానీ మనోహర వచనములు

1 "శ్రీకంఠా! నీవు సమస్త లోకోపకారార్థము సంపాదించిన సాధనంబులు నాకు దొరకుటంజేసి నిర్భయస్వాంతుండ నైతిని. ఎట్లం టేని బ్రహ్మహత్య, సురాపాన, గురుతల్పగమన, స్వర్ణస్తేయ, తత్సంగతు లను పాతకంబులైదింటిని గెల్వనైదక్షరంబుల మంత్రం బొకటి నా నాలుకం గీలుకొనియె. పరేత రాట్కింకర పిశాచంబులు నన్నుచూడకుండా ఫాలంబున భసిత త్రిపుండ్రాంకంబు వహించితి.

అనేక క్షుద్రపాపంబులం దరిమి, సర్వోపద్రవశాంతియొనర్చు రుద్రాక్ష నామేనం బూనితి. శాశ్వతానందంబై, అఖిల భద్రగుణగణాలంకారంబై, మహాతారకంబై యొప్పు నోంకారంబు నాహృదయంబున గుదురమ్యె; ఇంక నిత్యంబు శివాయ – శంకరాయ – మహేశ్వరాయ – మహారుద్రాయ – మహాదేవాయ యనుచు నాజేయు నమస్కృతులు నీమీాదనప్పయి యుండకుండంగ రక్షించి సుగతి యొసంగి రక్షింపవే భవానీ మనోహరా! (27) నిరంతరపూర్ణానందా! ఇంద్రోపేంద్ర ద్రుహిణాది దేవతా దుర్లభుండవైన మహానుభావ! నిన్ను బ్రస్తుతించను, సమంచిత జ్ఞానభక్త్యారాధన నిష్ఠాగరిష్ఠుండనై నిన్ను భావంబునందు వరపను పరాయత్తుండనైన నా యట్టి కష్టమానవునకుం దరమే? నీవు అకారణ సుకృతివైన అనాథ నాథుండవు. సహార్ద్ర హృదయుండవై నన్నాదరింప దలచితివేని నా విజ్ఞాపనం బవధరింప వలయు నెట్లందువేని అనకల్పకల్పద్రుమ నవకోమలారుణ కిసలయ సదృశంబైన భవదీయ జటాజూటాంతర్వర్తియగు పుణ్యతరంగ్గిణి రగంత్తుంగ భంగభంగా నికరంబు లుప్పొంగి చలంగు మున్నాఖండల తనూభవ దోర్దండమండిత ప్రచండ మహోద్దండ కోదండ తాడనంబున నొక్కింత నొక్కువడిన జడలనడుమ సుడివడి బుడబుడరవంబు వెడలెడు పెన్నీటి నిడజాలు మోవఁజాళిం గీలుకొల్పిన నీ కళంక శశాంక రేఖ నొరసి స్రవించు తుహినసుధారస బిందు సందోహంబులు బొందుపడగ విసవిస దృగంతంబులకు డిగ్గి యచ్చటం గటాక్ష వీక్షణామృత ధారా పరంపరలం బెనగొని, భవచ్చరణారుణాంభోరుహ ఘటిత లలాటుండనైన మదీయ మూర్ధంబున ననర్గళంబై ప్రవహించి, విరించి మున్ను ఫాల ఫలకంబున లిఖించిన దుర్లక్షణంబుల నన్నిటిం బ్రక్షాళనం బొనర్చి, యమ్మహావాహిని సర్వాంగ ప్రతిరోమకూపంబుల ప్రపూరంబై ఘుమ ఘుమాధ్వానంబైన పెనువరద వడిదలయై పార, నపారంబై నన్నుం బరివేష్టించి యున్న మహాపాతక ఉపపాతక దుఃఖోపద్రవ దారిద్ర చింతా మనఃఖేద వ్యృగంబు లెథాయథలై

భయభ్రాంతి గలంగి తొలంగి పారునట్లుగా యీ రీతి నన్నుం గటాక్షించి రక్షింపవే - భవానీ మనోహరా!

ఇందలి కథా వివరణ సామర్థ్యమును, ప్రత్యక్షములా యనిపించు వర్ణనలను, పాపపరిహారము గావించి పరమేశ్వరుడు భక్తుడగు తన్ను తప్పక కటాక్షించి కైవల్యము జేర్చునను విశ్వాసమును మెచ్చ తగినవి.

ఇక వైష్ణవ పరమైన వచన తావళములను పట్టిచూతము.

## శఠకోప విన్నపములు

ఈ విన్నపములను ఉత్తర శ్రీకాకుళ వాస్తవ్యులైన పాకలపాటి రామానుజ సూరిగారు రచించిరని నా మిత్రులు - కీ॥ శే॥ పెరివెల జగన్నాథయ్యగారు తెలిపినారు. మచ్చున కొకటి రెండు :-

1. శ్రీనివాస గురు పదాంబుజ ధ్యాన మానసా! అనంతకోటి బ్రహ్మాండంబులు నౌదుంబరఫలప్రాయంబున రోమకూపంబునం గల వారు స్వరాట్టులు అట్టి స్వరాట్టువు లనంతకోటు లొక్కొక్క రోమకూపంబున వ్రేలువారు పరమ స్వారాట్టులు. ఇట్టి యజాండం బులను, స్వారాట్టులను పరమ స్వారాట్టులను సంకల్ప మాత్రంబున నేకకాలమందే ఉత్పత్తి స్థితి లయంబులం జేసి స్వేచ్ఛా విహారంబుల జరుపుచో పునరుత్పత్తి యేకకాలమందే చేసి... ధ్యానారూఢుండవై పరమాత్మ నానందింపజేయుచున్నావు. అంత ఘటనా ఘటనా సమర్థుం డవే నమో నమో శఠకోపదేశికోత్తమా!

ఈషణత్రయఖండనా! ఈ లోకంబున కాముకీ కాముకులు కానివారలు లేరు. బ్రహ్మదేవుండు తనకూతురైన భారతితో కాపు రంబు సేయుచున్నాడు. శివుండు విష్ణుమాయచే మోహినివెంట దగిలి జగంబెల్ల కలయదిరిగె. ఇంద్రుండొక్క......కాసించి శరీరంబెల్ల పెక్కు...లంబడసె. చంద్రుడు గురుపత్నీ సంగమం బాచరించె. సూర్యుండు స్వదారాసంగమం బపేక్షించి యశ్వరూపంబు దాల్చె. బృహస్పతి పూర్ణగర్భిణితో రమించె. బుధుండప్సర స్సంగతిని పురూ

రవుం గనె. విశ్వామిత్రుండు మేనకతో విహరించె. పరాశరుండు మత్స్యగంధిని గవిసె. శాండిల్యుడు వ్రతభ్రష్టుండయ్యె. ఋశ్యశృంగుడు వేశ్యలకు లోనయ్యె. రావణ సైంధవాది క్రూరులం జెప్ప నేల? సిద్ధ విద్యాధర గరుడ కిన్నర కింపురుష గంధర్వ సుర వరజంతు జాలాదులు స్త్రీ మోహితులై విహరింపుచున్నారు. అతి నీచుం డను, బళుతుల్యుండను. అడియేనిచేష్టితంబు లనంతంబులు. ఇట్టి మాయా భ్రామికంబులం బడకుండ శుక భీష్మాంజనేయాదులు ఆచార్యగణ్యులైరి. దేవర తిరువడిఘుళ సంబంధంబుచే నడియని పవి త్రుండనైతి. మలయాచలంబున నున్న మ్రాకులన్నియు గంధయుక్తం బులయ్యె. దేవర కృపకు పాత్రుండనైతి. అడియనిదోషంబులంబాసి నిర్మలుండనైతి. నమో నమో శ్రీ శఠకోప దేశికోత్తమా!

## వెంకటేశ వచనములు

శ్రీ తిరుపతి వేంకటేశ్వరస్వామి వారి స్తుతులు — నూటముప్ప దెనిమిది రచనలుగల వచన గుచ్ఛమిది.

(1) శ్రీవేంకటగిరి దేవ! నా దేహంబు నీవు వుండెడి నిత్యనివాసంబు. నాజ్ఞాన విజ్ఞానంబులు నీ యుభయపాదంబుల దీపంబులు. నా ముక్కు చలమల యూర్పులు మీయూరు వేగంబులం బుట్టెడి యాలవట్టంబులు. నామనోరంగంబు మీకు చంద్రకావి వలువ; మీకు మ్రొక్కనెత్తిన నా రెండు చేతులును మీకు మకరతోరణంబులు. నాభక్తియే మీకు సిహాసనంబు. నా మేనం బొడమిన పులకలే మీకు గుదులు గ్రుచ్చి యర్పించిన పూలదండలు. నేను నుతించిన నుతులు అక్షరఫలంబులు. భేరిభాంకార ఘంటానినాదంబులు నా పుణ్యపరిపాకంబులు. మీకు నైవేద్య తాంబూలాదులు మదీయ నిత్యసేవాసమయ నిరీక్షణంబులు. మీ సర్వాంగంబులనలందిన తట్టుపునుంగు నాసాత్త్వికగుణంబు, మీకు ధూపదీపనైవేద్యంబులు. నీవు దేవుండవు. నే నర్చకుడను. ఈరీతి నిత్యోత్సవము నాయం దవధరించవే! శ్రీవేంకటేశ్వరా!

తుది విన్నపము :— కంసమర్దనా! నీ వాది విష్ణుండవు. మీయాత్మ

సంభవుండైన బ్రహ్మ అపరవిష్ణువు. అతనిచే సృజింపబడిన వారందరు వైష్ణవులే. సకల దేవతలు నీ అంశ సంభవులే గనుక ఆదేవతలం గొల్చినవారు నీవారే నమోనమో శ్రీవేంకటేశ్వరా!

## ముప్పదినాలుగు విన్నపములనే హృషీకేశదాసు విన్నపములు

శ్లో॥ శ్లోకసార సమాకీర్ణం గుణకల్లోల సంకులం
అరివర్గ గ్రహామీన మహో సంసార సాగరమ్
కిరీట కుణ్డలధరం పీతామ్బర సుశోభితం
దామోదరాన్వయాబ్ధీందుంహృషీకేశం నమామ్యహమ్.

శ్రీమదఖిలలోక శరణ్యులైన శ్రీనివాసుల యొక్క పంచప్రకార సంపన్నుడైన శ్రీ దామోదర లీలా హృషీకేశదాసుని రక్షించినటువంటి శ్రీగోపాలకృష్ణస్వామివారికి దివ్యసుందరమైన ముప్పదినాలుగు స్తోత్ర విన్నపములనే మణిహారం సమర్పించుచున్నాను. పంచప్రపన్నము లనగా భగవంతుని దివ్యరూపములకు అగపడుట నేత్రప్రసన్నం. వారియొక్క దివ్యవాక్యములు చెవులకు వినపడుట శ్రోత్రప్రసన్నం. వారియొక్క దివ్యరూపం స్వప్నంలో కనపడుట మనఃప్రసన్నం. వారియొక్క దివ్యరూపం మనస్సులో భావనచేసి నిలుపుట భావ ప్రసన్నం. వారియొక్క దివ్యరూపమందు మోహరూపమైన భక్తి పుట్టుట గుణప్రసన్నం. ఈ యైదు గుణముల ప్రసన్నం గలవారిని చెప్పు చున్నాను.

కాకతీయ రాజవంశావళి; అను ప్రాచీన చరిత్రగ్రంథములో ఇట్లు గ్రంథస్థము చేయబడి యున్నది :— (పుట—32) "కృష్ణమాచా ర్యులు తన మనంబున వాసుదేవు నారాధించి ఒకవచనంబు రచి యించిన మెచ్చి యేకశిలా నగరంబున 'గనకవృష్టి గురియుటయు' యిది గని ప్రతాపరుద్రుండును, ఆ పరిజనంబులున్నూ కృష్ణమాచార్యులం బూజించిన వారిని వీక్షించి కృష్ణమాచార్యులు శ్రీరంగంబున కరిగె" మహాభక్తుడు త్యాగరాజు కీర్తనలకు కూడ భగవంతుడిట్లు ప్రీతుడై

కనకవర్షము గురియించినట్లు చెప్పుకోలేదు. ఒక్క వచనరచనకు భగవంతుడిట్లు కనకవర్షము గురియించుట విశేషము.

నాటి ప్రజామోదము కొఱకు శైవ వైష్ణవ మతము లెట్లు పోటాపోటీలు పడుచుండెనో తెలిసికొనుటకు చమత్కార యుక్తమైన ఒక చిన్నకథ వ్రాయుచున్నాను. ఇది ఓరియంటల్ లైబ్రరీ గ్రంథములలో 13-4-30 గుఱుతు గల గ్రంథము 293 వ పుటనుండి ఎత్తి వ్రాయబడినది :-

## పాల్కురికి సోమనారాధ్యులు వైష్ణవుల జయించిన కథ

పాల్కురికి అనే గ్రామం యందు యిస్తురామ దేవయ్య, భార్య మహాదేవమ్మ కొమారుడైన సోమనారాధ్యులు కటకూరి పోతిదేవునివల్ల! లింగోపదేశం అయి వారి ఆజ్ఞానుసారం భక్తులైన మహేశ్వరుల సభకు వచ్చి నమస్కారం చేసి, చేతులు ముకుళించి 'నేను శివలింగా అనే వ్రతాలు మొదలైన 64 శీలములు నడిపించమని విన్నపం చేసుకొని, గుణజ్ఞుల నిరూపంనుంచి ఆ 64 శీలములు శివాగమ యుక్తంగా నడిపిస్తూ వుండగా గణపురం రాజు జగదేకమల్లు అనే రాజు స్వప్నమందు - సోమనారాధ్యులకు లింగ ముద్రాంకితమైన భూమి ఇయ్యమని చెప్పెను. అప్పుడు రాజు మహాశ్చర్యం పడినవాడై తన దేశంయందు ఆమడకు వక వూరికి లింగముద్ర అయిన భూమి యిచ్చి పాలుకురికి యందున్నూ లింగముద్ర అయిన భూమి యిచ్చెను. అప్పుడు సోమనారాధ్యులు శీలము ఆచరిస్తూ వుండినంతట ఈయన భక్తికి దాసోహం చేసేవార్త విని వకానొక దినంయందు వైష్ణవులు యిద్దరు వచ్చి పెరుగు కుత్తి-శాస్త్రులు, నెయ్యికురికి శాస్త్రుర్లము వచ్చినాము అని చెప్పి సోమనారాధ్యులకు చెప్పి పంపించినందున సోమనారాధ్యులు అనిరి గదా 'పాల్కురికి మీద పెర్గుకుర్తి వచ్చి సీ పెర్గుకుర్తిమీద నెయ్యి కురికియెక్కడ వచ్చి - సీ పెరుగుకుర్తి శాస్త్రులూ నేతికురిక్కి శాస్త్రులు, 'వీరు యిద్దరు - పాల్కురికి శాస్త్రుర్లనుంచి పుట్టిరిగదా ?' అని చెప్పి పంపించెను.

అప్పుడు పెరుగుకురికి, నెయ్యికురికి శాస్త్రుల్లవారు "ఇక్కడ వీరిని మేము గెలవలేము" అని లజ్జా బిడియములతో తమ నివాసములకు పోయినవారైరి. ఇక్కడ సోమనారాధ్యులు శీల సంపాదన ఆచరిస్తూ పాల్కురికిలో సుఖముగా ఉండిరి.

ఇక్కడ సోమనారాధ్యులను హేళనచేయుటకు, పాల్కురికి యనుట నాక్షేపించుటకు వైష్ణవ పండితులు 'పెరుగు కురికి, నేయి కురికి, నామములు పెట్టుకొని వచ్చిరి. కాని సోమనారాధ్యులు సమయోచిత జ్ఞానము కలవాడు కనుక - పాలనుండి పెరుగు - పెరుగునుండి నెయ్యి పుట్టుట సహజము కనుక - నూతనాగతులు పాలకురికినుండి పుట్టినవారే నని పలికి పరాభవించి పంపెను. పాపము వైష్ణవులు సోమనాధులను 'వెక్కిరింపబోయి వెల్లగిల బడినట్లు' పరాభవము నొంది పోవలసినవారైరి.

## నవయుగము

మొగల్ సామ్రాజ్య మంతరించినది. పీనుగనుండి కులకుల లాడుచు పురుగులు బయలుదేరినట్లు దేశములో ఎక్కడకక్కడే అధికారాన్వేషకులైన స్వార్థపరులు ఒండొరులతో పోరాడజొచ్చిరి. వర్తకమిషమీద నీదేశమున నడుగుపెట్టిన ఇంగ్లీషు, ఫ్రెంచి వాణిజ్య సంఘములు ఈ స్వార్థపరులతో జేరి రాజ్య కాంక్షతో ఘోరముగా పోర దొడగిరి. కర్ణాటక యుద్ధములు ప్లాసీమహాయుద్ధము, మైసూరు యుద్ధములు, మహారాష్ట్ర యుద్ధములు వీని యన్నింటిలో నెగ్గి జయముగొనుచు, ఇంగ్లీషువారు క్రమముగా తమ యధికారమును వృద్ధిచేసికొను చుండిరి. చిలుక సముద్రము మొదలు కన్యాకుమారివఱకు బ్రిటిష్‌వారి అధికారము వ్యాపించినది. తెనుగుసీమ చాలవఱకు ఇంగ్లీషు ప్రభుత్వము కిందకే వచ్చినది. మెకంజీ, బ్రౌన్ దొరల ఆదరాభిమానములబొంది తెనుగు భాష అభివృద్ధి పొందుచుండెను. Local Records అనే స్థానిక చరిత్రలు 62 సంపుటములలో 48 సంపుటములు తెనుగులోనే ఉన్నవి. 4 తమిళము, 2 కన్నడము, కొన్ని సంస్కృ

తము. ఈ సంపుటములలో తెనుగు బాహుళ్యమును బట్టి చెన్న రాష్ట్రములో నూటయేబదేండ్ల క్రిందట తెనుగుభాష కెంత ప్రాముఖ్య ముండెనో విశదము కాగలదు. వీని యాధారముమీదనే జిల్లా గజెటీర్లు, రాజధానీ గజెటీర్లు తయారుకాబడినవి. మెకంజీ యనంత రము బ్రౌన్ దొరగారీ దేశము వచ్చిరి. ఆయన తెనుగునకు చేసిన సేవ అమోఘము. ఇంగ్లీషునుండి తెనుగునకు; తెనుగు నుండి ఇంగ్లీషు నకు ఆయన బ్రౌణ్య నిఘంటువులు రచించెను. వీని పునర్ముద్రణ ప్రయత్నము చేయుట ముదావహము. బ్రౌణ్యముయొక్క ప్రాశస్త్య మును ఇటీవల కీ॥ శే॥ సురవరం ప్రతాపరెడ్డిగారు చక్కగా వివరించి నారు. బ్రౌణ్య మాధారముగా శబ్ద రత్నాకరము దిద్దుకొని సవరించు కోవలసిన అవసర మెంతైన కలదు.

మెకంజీ దొరగారు సేకరించిన స్థానిక చరిత్రలు నశించిపోకుండ బ్రౌనుదొరగారు దళసరి కాగితముల మీద తిరిగి వ్రాయించినారు. తమ వద్ద 'జవాబునీస్'గా పనిచేసిన ఏనుగుల వీరాసామయ్యగారిచేత కాశీ యాత్రా చరిత్ర వ్రాయించినారు. ఉత్కళాంధ్ర దేశముల సరిహద్దు లిందు చక్కగా వివరింపబడినవి. ఈ గ్రంథము నుపయోగించుకోలేక ఆంధ్రులు తమ రాష్ట్రములో చాలభాగము ఉత్కళములో చేర్చినారు. బ్రౌను దొరగారు, తెనుగునందు గల అభిమానముచేత, పెక్కండ్రు తెనుగు పండితులచేత, ఎన్నెన్నో కథలు గాథలు వ్రాయించి, ప్రక టించినారు. తాతాచార్యుల కథలనునవి బ్రౌను దొరగారి ప్రోత్సా హముచేత ఆ పండితుడు కూర్చిన కథలే. ఇపుడు వావిళ్ళవారా పుస్తకము నమ్ముచున్నారు. ఓరియంటల్ లైబ్రరీలో గల తెనుగు గ్రంథములలో సగమునకు పైగా బ్రౌను దొరగారు సేకరించినవే. తెనుగు భాషయు - తెనుగు ప్రజలును బ్రౌను దొరగారి కెంతైన ఋణపడి యున్నారని చెప్ప నొప్పును.

పంచతంత్ర కథలను సులభ వచన శైలిని తొలుత గూర్చిన పండితుడు రావిపాటి గురుమూర్తి శాస్త్రి. ఈ మధ్య గ్రామ్య గ్రాంధిక భాషావివాదము తలయెత్తకపూర్వము బహుకాలమునుంచి

ఉత్తరాంధ్రములో నేమి, దక్షిణాంధ్రములో నేమి వ్యావహారికాంధ్రములో ననేక గ్రంథములు వెలువడినవి. భారతము లక్ష్మీపతి సోమయాజులుగారు భారతమునకు వ్యావహారిక ఆంధ్రములో వ్యాఖ్యానము వ్రాసిరి. వారి వంశస్థులు భారతమువారని యింటిపేరుతో నేటికినీ ఏలూరు ప్రాంతములో ఉన్నారు. చెన్నపట్టణములో పువ్వాడ వేంకటరావుగారు దినవర్తమాని, వర్తమాన తరంగిణి మొదలగు పత్రికలను వ్యవహారిక భాషలోనే ప్రకటించుచుండిరి. క్రీ॥ శ॥ 1841-42 లో జరిగిన ఆఫ్గను యుద్ధవార్తలును, విశేషములును — వ్యావహారిక ఆంధ్ర భాషలో — వ్యాకరణ నిర్బంధములు లేకనే ప్రకటింపబడుచుండెడివి.

క్రీ॥ శ॥ 1857 లో మద్రాసు యూనివర్సిటీ నెలకొల్పబడినది. అంతకు పూర్వమునుండి ప్రసిడెన్సీ కాలేజి తెనుగు పండితుల ప్రభావము ఆంధ్ర భాషా వాఙ్మయములపై ప్రసరించుచుండెను. 1841 మొదలు 1845 వఱకు పుదూరి సీతారామశాస్త్రిగారు అచ్చట తెనుగు భాషాధ్యాపకులుగా నుండి పెద్దబాలశిక్ష రచించిరి. నాటి నుండి నేటివరకు ఈ పొత్తము తెనుగు భాష నభ్యసించువారికి తొలి దశలో నెంతో తోడుపడుచున్నది.

1845 - 1862 వఱకు పరవస్తు చిన్నయ్యసూరిగారు ఆ పదవిలో నుండి తెనుగు భాష ననుశాసించిరి. ఆ కాలములో నాయన రచించిన గ్రంథములు మూడు (1) బాల వ్యాకరణము, (2) నీతి చంద్రిక, (3) హిందూ ధర్మశాస్త్ర సంగ్రహము (అనే హిందూ లా). ఇందు బాల వ్యాకరణము హైస్కూలు బాల బాలికలకును, విద్యాప్రవీణ భాషా ప్రవీణ మొదలగు పరీక్షలకు చదువు విద్యార్థులకును — అవశ్య పఠనీయ మగుచున్నది. ఇట్లొక శతాబ్దమునకు పైగా పఠింపబడు గ్రంథము లరుదు. నీతి చంద్రిక ప్రాశస్త్యమును గూర్చి యీ దిగువ వివరముగా చర్చింపబడును. చిన్నయసూరిగారు 17 సంవత్సరములా పదవి నలంకరించిన తరువాత మఱికొన్నాళ్ళకు 1872 మొదలు 1878 వఱకు - ఆరు సంవత్సరములా పదవిలో నుండిన చదులువాడ సీతా

రామ శాస్త్రిగారు సంస్కృత నాటక కథలు సంధులు విడకొట్టి సులభముగా బోధపడునట్లు వచనమున రచించిరి. 1878 మొదలు 1900 వఱకు — ఇరువది రెండేండ్లు — కొక్కొండ వెంకటరత్నం పంతులుగారు ఆంధ్ర భాషాధ్యాపకులుగా పనిచేసిరి. పిమ్మట రావు బహద్దర్ కందుకూరి వీరేశలింగంగారి 'కుట్రచేత' వేంకటరత్నము గారు రాజమహేంద్రవరమునకు బదిలీ చేయబడిరి. కొక్కొండవారి స్థానమున కందుకూరివా రమరుకొనిరి. ఆ సంవర్భములో కొక్కొండ వారు వీరేశలింగముగారికి ఛలోక్తిగా "మీ దయవలన నాకు ప్రతి దినము గౌతమీ స్నాన ఫలము లభించిన" దని జాబు వ్రాసిరట! హాస్య ప్రియులు, సంఘ సంస్కారులునైన వీరేశలింగముగారికిని కొక్కొండ వెంకటరత్నం పంతులుగారికిని ఆ కాలములో హాస్య సల్లాపములు చమత్కారముగా జరుగుచుండెడివి. ఇవి యాలకించి ఆనాటివారు వినోదించుట పరిపాటియైనది. కొక్కొండవారు ఒక జంగము పాత్ర సృష్టించి "ఓయి ఓయి జంగమా! ఓంకార లింగమా! నాడెమైన జంగమా! వీరేశలింగమా! అని హేళనగా పలికించిరి. మరి, వీరేశలింగముగారి చేయి మాత్రము తక్కువదా? ఆయన నత్తినోటి చాకలిని సృష్టించినారు. వానిని నీపేరెవరని యడుగగా "నా పె ప్పే రాండి! కొ—క్కొండా యెంకడని" నత్తి జవాబు చెప్పి వేంకటరత్నం పంతులుగారి నెత్తిపొడిచెను. సమాన ఉద్దీలు, సమాన పండితులు నగు వీరు ఒకరినొకరు పరిహాసము చేసి కొని ఆ కాలపు వారిని అలరించుచువచ్చిరి. ఉభయులును మాతృ భాషాభిమానులై, భాషకు అఖండసేవ చేసి అమర జీవులైరి. ఆ సేవా వివరముల నీ దిగువ చూడగలము.

వీరేశలింగముగారి తరువాత 1904 మొదలు 1920 వఱకు — పదు నారు సంవత్సరముల కాలము — వావిలికొలను సుబ్బారావుగారు ప్రెసిడెన్సీ కాలేజీలో తెనుగుభాషాధ్యాపకులుగా పనిచేసి ఆర్ష సాంప్ర దాయములను పునరుద్ధారణ చేయుటకు పాటుపడిరి. ఇట్టి యుద్దండ పండితు లందరు ధన్యజీవులై భాషాసేవ చేసిరి.

## పరవస్తు చిన్నయసూరిగారు
## నీతిచంద్రిక - రచనా విశేషములు

పరవస్తు చిన్నయసూరిగారు రచించిన నీతిచంద్రిక నిజముగా నీతి చంద్రికయే. కథామిషమున బాలబాలికలకు నీతివచన సరణి కడు హృద్యముగా దెలుపుచున్నది. చక్కెర పూతపెట్టిన చేదుమందులు దేహాంతర్గతములగు, రుజలను తొలగించి ఆరోగ్యము నొసంగునట్లు - ఈ పొత్తము చదువనింపగుచు, కథలమూలముగా నీతిని బోధించి, లోకజ్ఞానము నొసంగుచు, జీవితమున సాధింపదగు కర్తవ్యముల నుపదేశము చేయుచు, చిన్ననా డెల్లవారికి నవశ్య పఠనీయమైన గ్రంథరాజ మిదియని మెచ్చుకో తగియున్నది.

పురుషకారముచేత కార్యములు సిద్ధించునుగాని రిత్తకోరికలచేత సిద్ధింపవు. దృష్టాంతము ; నిద్రించు సింహమునోరను మృగములు తమంతవచ్చి చొరవు. ఈ యర్థమునే శ్రీకృష్ణ భగవానుడు భగవద్గీతలో "ఉద్ధరేదాత్మ నాత్మానం" ఎవరిని వారే ఉద్ధరించుకోవలెనని ఎఱుగ జెప్పినాడు. ఇంగ్లండులో, Smiles దొరగారు, Self-help స్వయం సహాయమను గొప్పగ్రంథములో, వందలాది యుదాహరణములతో లోకములో సామాన్య మానవులెట్లు గొప్పసంపాదింప గలిగిరో వివరించిరి.

నన్నయ భట్టారకుడు ఆంధ్ర భారతము నారంభించుచు క॥ "తగు నిది తగదని మొదలో। వగవక సాధులకు పేదవారల కెగ్గుల్ । మొగిజేయు దుర్వినీతుల కగు ననిమిత్తాగమంబులైన భయంబుల్" లోక చరిత్ర సారము నొక్కపద్యములో నిమిడ్చి చెప్పినట్లే సూరిగారును, క॥ పరువంబు కలిమి, దొరతన। మరయమి యనునట్టి వీనియందొక డొకడే। పొరయించు ననర్థమునా। బరగినచో నాల్గు జెప్పవలయునె చెపుమా?" అని గంభీరార్థ ప్రతిపాదకమైన పద్యముతో కథ ప్రారంభించిరి.

సాధుసాంగత్యము సర్వశ్రేయములకు మూలము. వెంటనే

దృష్టాంతమును తెలుపబడినది. పూవులతో గూడిన నారకు వాసన గలిగినట్లు సజ్జనులతో డి సాహసించు మూర్ఖునకును మంచిగుణము గలుగుట సాజము. ఇటీవలి పాశ్చాత్య వైజ్ఞానికులు 'Influence of Environment' అని చెప్పుదురో — దానినే మనసూరిగారు 'సన్నికర్ష ప్రభావము' ని (32 పుటలోను, 'సన్నిధాన ప్రభావమని' (55) పుటలోను చక్కగా ముచ్చటించిరి.

ఏండ్లు మీరిన వానిని నిజముగా వృద్ధు డనరాదు. బుద్ధిమంతు నే వృద్ధు డనవలెను. నూతిలో కప్పవలె తనముక్కునకుం జక్కటి మీదదే యాకాశమనియు, తనగొందెయే లోకమనియు తెలివి తక్కువ ఆలోచలనలచే భ్రమసి ప్రమాదమునకు పాల్పడకూడదు. తమ యజ్ఞానము మూలముగా విపరీత ఫలముబొంది, అందుకు దైవప్రాతి కూల్యమె కారణమని దైవదూషణ చేయకూడదు. మానవులు సంఘీభవించి యెంతటికార్యమైన సాధింపగలరు. దృష్టాంతము: వెంటిగా నేర్పడిన గడ్డిపరకలు మదపుటేనుగును కదలకుండ కట్టివేయగలవు.

ఒకవంచకుడు లోకములోగల ప్రాణులను రెండు తెగలుగా విభజించి ఇట్లు వివరించినాడు :— "(1) మోసపుచ్చే బుద్ధిమంతులు, (2) మోసపోయే బుద్ధిహీనులు బోసినోటి పులి ఆషాడభూతి మొదటి వర్గములో చేరుదురు; హేమకంకణ లోభముచే రొంపిలోదిగి మరి లేవలేక పులివాతబడిన పాంథుడును, ఆషాడభూతికి చేచేతుల ధన సహితమైన బొంతనిచ్చిన సన్యాసియు రెండవ వర్గమునకు చెందినవారు. మొదటి వర్గమువారిని పయోముఖ విషకుంభములు నాలికతీపు లోనవిషము మనుష్యులందురు. లోకములో దుఃఖభాగులారుగురు 1 ఈర్ష్యాళువు 2 జుగుప్సావంతుడు 3 నిత్యశంకితుడు 4 నిస్సంతోషి 5 క్రోధనుడు 6 పరభాగ్యోపజీవి (Nemesis). ఎవ్వరైన చేసినకర్మ ఫల మనుభవింపక తీరదు. బుద్ధిమంతుడు లోకములో మాయికుల పట్ల మాయావియై ప్రవర్తింపవలెనేగాని ఋజుమార్గమున ప్రవర్తించగూడదు. పరులకు హానిచేయ గోరువారు తామే చెడిపోదురు.

లోకోక్తులు నీతిచంద్రికలోని చక్కని లోకోక్తులు కొన్ని చూతము:

1. తన్ను మాలిన ధర్మము మొదలు చెడ్డ బేరము.
2. మ్రానులేని దేశమున నాముదపుచెట్టే మహావృక్షము.
3. ఆడుసు త్రొక్కనేల ? కాలు కడుగనేల ?
4. మీద నన్ను పాలముంచెదరో నీటముంచెదరో — మీదే భారము.
5. పిట్ట కొంచెము కూత ఘనము.
6. ఈతడెత్తువారిచేత బిడ్డగాని యొకతెన్నున బోవువాడు గాడు.
7. మేకు పెఱికిన కోతి.
8. ఎట్టి ప్రజ్ఞావంతుడుగాని పేటికాంతర్గత రత్నమువలె — సినాలోకయోగములేక ప్రకాశింపడు.
9. తన్నుగట్ట త్రాళ్ళు తానే దెచ్చుకొన్నట్లు.
10. ఆవులించిన ప్రేవులు లెక్కడి, ఆకారముచేత భావముభావింప సమర్థుడవు.
11. కుట్టినం దేలు కుట్టుకున్నం గుమ్మరిపురుగు.
12. గోరంబోవు పని గొడ్డంటం దీర్పవలసివచ్చును.
13. వ్యవహారం బడుసునం బాతినగంబంబు తుదకేవంకకు నొఱు గునో యెఱుంగం బడదు.

జాతిరత్నముల వంటి సంస్కృతోక్తులు నందందు గలవు :—

1. సహసావిదధీత నక్రియాం
2. నీచాః కలహమిచ్ఛంతి సంధి మిచ్ఛంతి సాధవః
3. శరీరమాద్యం ఖలు ధర్మసాధనం.
4. యథారాజా తథాప్రజా.
5. జీవన్భద్రాణి పశ్యతి.

ప్రత్యక్షములా అనిదోచు స్వభావ వర్ణనలు :

సూరిగారు వర్ణించిన కథాంశములు కొన్ని సినిమా దృశ్యము లట్లు ప్రత్యక్షములా యని భ్రమగలిగించునట్టివి. ఆయావస్తురూపము

లను చిత్రకారుని లేఖిని వలెనే కట్టెదుట కాన్పింపచేయ సమర్థ ములు. పదజాలము నంతటి నేర్పుతో నేర్చి కూర్చుటలో ఆయన సిద్ధ హస్తు లనదగును. అందు కొకటి రెండు ఉదాహరణములు:

"వేటకాడు వచ్చు మార్గములో నొకజలాశయ తీరమందు ఒది కిలి నాలుగు కాళ్ళు చాచుకొని మ్రాగన్ను వెట్టి మెడయెత్తి మోర సారించి చచ్చినట్టు మెదలక పండుకొని యుండును. కాకి నీ మీద కూర్చుండి కన్నులు పొడుచుకొని తినువానివలె నభినయించుచు నటుచుండు వాడు. మృగము చచ్చిపడి యున్నదని వేటకాడు భావించును."

70 వ పుటలో యువతీ మణుల సలిలవిహారమును, తరువాత పుటలో కాకి రత్నహారము నెత్తికొనిపోవుటయు చమత్కారముగా వర్ణింప బడి నవి. "ఇక్కాకంబు పద్మరాగ ప్రభారించోళింగాంచి యామిషం బని భ్రమియించె గాబోలు. కాదు కాదు. మెడం దగిలించుకొని కులుకు లాడంబోయెడి నని నవ్వుచు, "నీ యందంబునకు హారంబొక్కటి తక్కువ యని మొగం బడ్డంబుగ సుందరంబుగం బంకించి — చేయెత్తి — జుట్టున నెటిక విఱుచుచు — చక్కని హారమమ్మ — యిప్పలుగాకి కాకి — యెక్కడ నుండి వచ్చెనో"

ఈ యాభరణము కొఱకు రాజభటులు పాముపుట్ట త్రవ్వగా బయ ల్పడిన పామును చూతము "అందలి దండశూకంబు విషానలంబు దరికొలుపుటకుం బోలె ఫూత్కారంబులు నిగిడించుచు, బరప్రాణా నిలంబులు గ్రోలుటకుంబోలె నాభీలంబుగ నాలుక లార్చుచు నిర్గ మించి, పయింబడి, కఱవం గమకించుచు, వారలు చిక్కని పెక్కు బడియలం జదియనడచి దాని మడియించిరి"

మఱియు దేవాలయము దాపు కోతి మూకను చూతము :— (48- 49 పుటలు) "అప్పుడా పరిసర తరువులందు దిరుగుచున్న కోతులు దేవాలయము దాపునకు వచ్చి ప్రాకారముల ప్రాకుచు, ప్రాంత మహీరుహంబుల మీదికి గుప్పించి దాటుచు, వ్రేలుగొమ్మలు కాళ్లతో బట్టి తలక్రిందుగా వ్రేలుచు, బెనుగొమ్మలు కరములతో

బట్టి యూచుచు విమానముల మీద గూర్చుండి వికృతముగా బరుల వీపు గీఱుకొనుచు, నిక్కుచు, బొమలెత్తి, యుఱుగొట్టి, బెదరించుచు, బండ్లిగిలించుచు, వెక్కిరించుచు, నొకటినొకటి కుఱువు మీద బండిం చుకొని మేని పేల నేఱి నోరవేసికొనుచు, గిలకిలా రావములు గావించుచు, నొండొంటితో బోరుచు, ఫలముల భక్షించుచు, మధువు లానుచు, స్వాభావిక చపల భావముతో దిరుగుచుండెను." ఇది చదివినపుడు వాల్మీకి రామాయణమునందలి సుందరకాండలో మధు వనము చేరిన కోతుల చేష్టలు జ్ఞప్తికి రాకమానవు.

ఈ వర్ష వర్ణనమును చూడదగినదే :— (38). "కన్నులు మిఱు మిట్లు కొలుపు మెఱుములతో — శ్రవణ కుహరములు విదారించు నుఱుములతో, గడవలతో ముంచి వంచినట్లు నిరంతర ధారమై మిన్ను మన్నేక మగునట్లు కారుగ్రమ్మి వర్షము గురిసెను."

## శబ్దాలంకారములు

తెనుగు భాషా వధూటి యొక్క తీరు తీయములకు అత్యంత సహకారులగుట కారణముగా నన్నయ — నాచన సోమనాథాదులీ యక్షర రమ్యతపై ప్రత్యేకముగా కన్నిడి, శబ్దాలంకారము లతి రమ్యముగా కూర్చిరి. చిన్నయసూరియు వారి మార్గము ననుసరించి మధురములైన శబ్దాలంకారముల గూర్చి శ్లాఘనీయు డయ్యెను. ఈ కూర్పులు ప్రబంధ కవుల నాటి యక్షరముల వేట గాక, విసుగు పుట్టిం పక, ఇంపు గూర్చుచుండును.

15 — విద్యా వయోవృద్ధులు.

28 — ఈ తావు తాత ముత్తాతలు సంపాదించినది కాదు.

31 — విపత్తు వచ్చినప్పుడు వితాకు.

39 — నిండిన ఇంటిలో నిమిషమైన నిలుపరాదు.

61 — కూర్పువోసి, కప్పుకొని, క్రమ్మరుచుండు.

74 — విధి విధానం బ్రపతి విధానంబు.

89 — చెనటి చేతులం జనం జనదు.

101 — నాకు వాకొన మీకు నూకొనం బోలవు.

104 — నిక్కి, వెక్కిరించి, గ్రక్కున.

110 — ముది వగ్గు బెగ్గిలి వెగ్గలంపు.

పై వాక్యములకంటె దీర్ఘతరములగు శ్రుతి సామ్య — అను ప్రాస రచనలును గలవు :

13 — సజ్జన సందర్శనము సర్వ శుభము లిచ్చి సమస్త దోషముల పోగొట్టును.

16 — పాడు పొట్టకయి యింతటి పాపము చేయుట కెవ్వాడు పాల్పడును ?

ఛేకాను ప్రాస లాటాను ప్రాస రచనలును కలవు :

23 — తామేటి మేటి.

51 — అనవద్య మగు విద్యచే, నవక్ర మగు విక్రమముచే, నిరపాయమైన యుపాయముచే నృపాలుర మెచ్చువడసిన వాని మనుగడయే మనుగడ. మలంగక తొలంగక పట్టు వదలక నట్టుగదలక యమకములును అందందు గలవు.

56 — అఖిల సత్వ శరణ్యంబగు నరణ్యంబు.

59 — అనుగ్రాహ్యుండు గాని నిగ్రాహ్యుండు గాడు.

60 — సాదరంబగు ప్రసాద మేదురంబు.

63 — దారుణంబగు ప్రవిదారుణంబు.

## అర్థాలంకారములు

రచనలను పూవుల తావుల వంటివి యర్థాలంకారములు. అందు గొన్ని క్రమాలంకారము :

1. పోగాలము దాపించినవారు దీప నిర్వాణ గంధమును, అరుంధతిని, మిత్రవాక్యమును మూర్కొనరు కనరు వినరు.

2. ఎవ్వాడు హంసములను, శుకములను, మయూరములను, శుక్ల హరిత చిత్రములు గావించె — నా యీశ్వరుడాయయి జంతువులకు దత్తదను రూప వృత్తిని గల్పించువాడు.

శృంఖలము :

27 — లోభము మోహమును, మోహము దుఃఖమును, దుఃఖము జ్వలనమువలె స్వాశ్రయము నాశమును, పుట్టించును.

శ్లేష :

62 — తమయందు గుప్తంబైన యనన్య సాధ్యంబైన యర్థంబు తమకు శుశ్రూష యొనరించి పడయంగోరిన వాడ

తపతి సంవరణోపాఖ్యానమున గల నన్నయ రచనల ననుకరించుచు చిన్నయసూరి ఆషాఢభూతి కథలో కొన్ని ఘట్టములు రచించెనని ముందు జూచియుంటిమి.

నన్నయభట్టు ఆది. 7-74 : సంవరణుడు తపతి-"అని వితర్కించుచు మదనకర్కశ మార్గణలక్షీభూతచేతస్కుండయి —

1. తదీయ గుణమయపాశబద్ధుండునుం బోలె గదల నేరక

2. తన్నివేశిత మానసుండును బోలె తన్నెరుంగక

3. తద్రూపామృత పానంబున ననిమిషత్వంబు నొందిన తన నయనంబులు దానియంద నిలిపి సంవరణుండు తపతి కిట్లనియె.

చిన్నయసూరి పుట 6 . ఆషాఢభూతి — 1. దేవశర్మ, వాక్రుచ్చు ధర్మంబులు తదేకాగ్ర హృదయుండుంబోలె నాలకించుచు

2. విలక్షుండుంబోలె దూరిత తారశ్య విస్తారితనయనుండగుచు,

3. చిరంత నాత్మీయ ధర్మసంశయ నిరాకరణచణ ప్రస్తుత ప్రకరణార్థ శ్లాఘమానుండునుంబోలె, బరివాహిత మస్తకుండగుచు

4. నిర్భరానంద వివశుండుంబోలె సబాష్ప నిమీలిత లోచనుం డగుచు.

చిన్నయసూరి 97—93 పుటలలో వర్ణించిన 'యద్భవిష్యాది మత్స్యముల వృత్తాంతము' భారతమందు తిక్కన వర్ణించిన 'దీర్ఘదర్శి మొదలగు మత్స్యముల కథను' జ్ఞప్తికి తేగలదు. రేవు బోయలు వల, ఎత్తెల, కొడమ, గట్టె, మావు లోనగు సాధనములతో వచ్చిరని వర్ణించుటచే బెస్తవాండ్ర జీవన విధానము సూక్ష్మముగా పరిశీలించి వ్రాయబడినట్లు తోచెడిని.

ఇక యుద్ధరంగము వర్ణించు పట్టున, సూరిగారు — నాచనసోము ననుసరించెనని తోపగలదు.

57. "వికలాంగంబులయి నేలంగూలిన శతాంగంబులు ఖండిత శుండా దంతకాండంబులయి కెడసి కొండల పిండు విడంబించు వేదండ తండంబులును — ముంగాళ్ళు డొక్కలు పెరిగి కూఱుమెడలు వైచి తాఱుమాఱుగం బడియున్న వారువంబులును...పొంకంబు వదలని శిరంబులును, వాలుదొరంగని కరంబులును గరంబు మెఱయ వీర శయనంబు నొందిన యోధవారంబునుం గలిగి, ఘోరంబై వివిక్తం బయిన పొలిగలని —"

ఒకొక్క పట్టున చిన్నయసూరిగారు చెప్పదలచినది సూటిగా సూక్ష్మముగా చెప్పక నన్నెచోడు నట్లు డొంకతిరుగుడుగ చెప్పుటయు గలదు. చూ. 27. "వ్రేటు దైవవశమువలనం దప్పిపోయినది. తగిలి యుండెనా యింతకు యమలోకములో బ్రాతకాంపనయి యుండనా? (చచ్చియుండు ననుటకు మారుగా వాక్యము పైవిధమున కూర్చ బడెను.)

ధనార్జనావశ్యకతను గూర్చి పెక్కు తావులు నొక్కి చెప్పబడినది. ఏమనగా దరిద్రము సర్వశూన్యము.

ఈ క్రింది నీతులు ఎన్నటికిని మఱువరానివి :—

1. నిమిత్తమువలన మృగ పక్షులును, దర్శనమువలన సజ్జనులును, భయలోభములవలన మూర్ఖులును, ద్రవత్వమువలన సర్వలోహము లును గలిసికొందురు. (21)

2. దంతములు, కేశములు, నరులు, స్థాన భ్రంశము బొంది రాణింపరు. (22)

3. సంసార విషవృక్షమునకు, సజ్జన సంగతి, కావ్యామృతరస పానము నను రెండు మంచి ఫలములు (28)

4. ప్రియవచన సహితమైన దానము, గర్వములేని జ్ఞానము, క్షమ సహిత శౌర్యము, త్యాగయుక్తమైన విత్తము, ఇవి దుర్లభ ములు. (29)

5. శిలాంతరాళమున కప్పను భరించు దయామయుడు – ఈశ్వరుడు నన్ను గాపాడడా? (28)

6. తల్లి గర్భమునుండి నేల జారగానే మాతృస్తన్యము చేపుచున్నది.

7. శరీరము క్షణభంగురము. గుణము లాకల్పాంత స్థాయువులు.

8. హేయము వినశ్వరము నైన కళేబరమునందాస్థమాని యశము సంపాదింపుము.

ఇటువంటి నీతులకు గనిదై, ఎప్పటి కేది కర్తవ్యమగునో దృష్టాంతములతో బోధించుచు, విద్యార్థులకు పరమ ప్రయోజనకారి యగుట చేత ఒక శతాబ్దమునుండి విడువక మన పాఠశాలలో ఈ గ్రంథాంశములు బోధింపబడుచున్నవి.

నీతి చంద్రిక విమర్శ ఇంతటితో చాలించి, ఉత్తరాంశముల చర్చకు గడంగుదము.

## కొక్కొండ వేంకటరత్నము పంతులు గారు

ఇప్పటికి నూటేండ్ల క్రిందట, మద్రాసు నగరమున నింగ్లీషు తెనుగు భాషల యభివృద్ధి కొఱకును, తద్వారా విద్యాభివృద్ధి కొఱకును మిక్కిలి పాటుపడి మరువరాని సేవచేసిన మహనీయులలో శ్రీ. శ్రీ ఆర్. శివశంకర పాండ్యాగారొకరు. నేడు ట్రిప్లికేన్‌లో చక్కని విద్యాసంస్థగా పనిచేయుచున్న హైస్కూలు వారికృషికి ఫలితము; వారి కీర్తికి ధ్వజస్తంభము. వారు ఆనాడే 'హిందూ శ్రేయోభివర్ధినీ సమాజమును' స్థాపించి గొప్ప పండితులచేత అప్పుడప్పుడు ఉపన్యాసము లిప్పించుచు భాషాభ్యుదయమున కపారకృషి చేసిరి. ఆ సమాజములో తెనుగున ఉపన్యాసము లిచ్చుటకు కొక్కొండ వేంకటరత్నము పంతులు గారు నియమింపబడుచుండిరి. అదిగాక వారు ఆంధ్రభాషాసంజీవని యను తెనుగు పత్రికకు సంపాదకులై ప్రకటించు చుండిరి.

ఆ పత్రికం గూర్చి అప్పటి రాజమహేంద్రవరమున ప్రొవిన్షియల్

కాలేజీలో సహాయోపాధ్యాయులైన కందుకూరి వీరేశలింగముగారు వ్రాసిన ఆమోద వచనముల నిట స్మరింతము :—

"మీ యసమాన పత్రికారత్నమ్ము కరమ్మును నాకరమ్ము నలంకరించి ఘనమ్మగు మనమ్ము వేడిమి యొక్కుమ్మడి నడిపి కడుంగడు సంతసంబు వొడమించుచున్న యది. అంతకంత కొకవింత చెన్ను వహించి కాంచగాంచ కన్నులపండువు సేయుచు జెవిం జొనుప జొనుప జెవులకు మివుల జవులునించి యింపుసొంపును నినుమడింపు చున్నది. అంతియగాక, తన మధురమును జవిజూపి నా నాలుక తుప్పెల్ల డుల్లం జేసినది. వేయేల! నలువయు విలునకు నలవిగాని దానిపోడిమి గొనియాడ నీడు గా డన నావంటి వాడా? యింక గొండాడగలవాడు?"

## ప్రిన్సు ఆఫ్ వేల్సుయాత్రా చరిత్ర

క్రీ॥ శ॥ 1857 సంవత్సరములో 'సిపాయీల పితూరీ' యనబడిన తొలి స్వతంత్ర సమరములో బ్రిటిష్‌వారు గెలుపొందిన తరువాత ఈస్టిండియా కంపెనీ అధికార మంతరించినది. భారత దేశము బ్రిటిష్ సామ్రాజ్యాంతర్భాగమై విక్టోరియా మహారాజ్ఞి పాలనకు లోనైనది. మరి ఇరువదేండ్లకు ఆమె పెద్దకొడుకు ఎడ్వర్డు ప్రిన్సు ఆఫ్ వేల్సు బిరుదాంకితుడగు యువరాజు ఈ దేశమును సందర్శించి వివిధ ప్రాంతములను వివరముగా చూచుచు యాత్ర సల్పెను. హిందూ దేశమున గల వివిధ భాషలలో నీ యాత్రా చరిత్రను వర్ణించు నుత్తమ గ్రంథమునకు 'క్రౌను పెర్ ఫ్యూమరీ కంపెని' వారు నూరు బంగారు గిన్ని కాసులు బహుమాన మిత్తుమని ప్రకటించిరి. శివశంకర పాండ్యాగారు వెంకటరత్నం పంతులుగారిని చాల ప్రోత్సహించి ఈ యాత్రా చరిత్ర తెనుగున రచింపుమని గట్టిగా హెచ్చరించిరి. వారి ప్రోద్బల ప్రోత్సాహములకు లొంగి పంతులుగారు పాండ్యాగారి యభీష్టము నెరవేర్చి తెనుగున యాత్రా చరిత్ర రచించి పోటీకి పంపిరి.

పోటీకి మొత్తముమీద నూటయేబది పుస్తకములు వచ్చినవి.

అవి, హిందూ దేశ భాష లిరువదై దింటిలో రచింపబడిన చక్కటి గ్రంథములు. పరీక్షకులు వానిలో నాల్గింటి నేర్చి తీసిరి. అందులో సత్యుత్తమమైనదాని నిర్ణయించుటకు మరొకసారి జాగ్రత్తగా చదివి వాడి వడబోసిరి. ఈ రెండవ వడపోతలో మూడు పొత్తములు దిగజారిపోగా మన తెనుగు పంతులుగారి తెనుగు గ్రంథ మొకటే నిలిచి బహుమానార్హమైన గ్రంథ మదొక్కటే నని ఏకగ్రీవముగా నిర్ణయింప బడినది. కొక్కొండ పంతులుగారికి నూరు బంగారు గిన్నీ కాసులు బహుమానము వచ్చు టొకటేగాక తెనుగు భాషకు సామ్రాజ్య గ్రంథ పోటీలో ప్రథమ బహుమానము లభించుట నాలుగైదు కోట్ల ఆంధ్రు లందరును సంతోషించవలసిన జాతీయ విజయ విషయము. ఇందునుగూర్చి యూరపు ఖండపు విమర్శక శిఖామణి యొకరిట్లు వ్రాసిరి:—

"An eminent European Critic said :— "This is an elaborately philosophical composition - with profuse allusions to the ancient laws, manners and customs of Hindusthan ; mastery of Telugu and sanskrit ; excellent literary power and intellectual skill"

"ప్రాచీన హైందవ ధర్మములను, ఆచార వ్యవహార సాంప్రదాయముల జాడలను, విపులముగా తెలియబలుకుచు, తత్త్వార్థ మూలకమైన యీ రచన సంస్కృతాంధ్ర భాషలం దపార పాండిత్యగరిమ ప్రదర్శించుచు, నిరుపమాన సాహిత్య వైదుష్య విశేషము, ప్రౌఢ వివేకము, అసదృశ మేధాసంపత్తులతో నలరారుచున్నది."

శ్రీనాథు డే యభిమానముతో "దేశ భాషలందు తెనుగు లెస్స" అని ప్రవచించెనో, శ్రీకృష్ణదేవరాయ లే భక్తితో నది భగవద్వాక్య మని కీర్తి చేకూర్చెనో — ఆ వాక్యము నిరాధారమైన గర్వోక్తి కాదు; పరమ సత్యము — కేవల యదార్థమని — బ్రిటిష్ సామ్రాజ్యాంతర్గత భాషా గ్రంథ పోటీలో — కొక్కొండ వేంకటరత్న శర్మగారు తెనుగు భాషామతల్లికి శాశ్వత యశస్సు చేకూర్చినారు.

నిజ మిట్లుండగా సంస్కృత పండితు లొకమూల ఆంధ్ర భాషా

మయం కావ్య మహోమయ భూషణమ్మ"ని నిరసించుచుండ — మరొక మూల తెనుగు జాతికిని, భాషకును, "రెండును దెలియని గిరీశం"వంటి దౌర్భాగ్యుల కారుకూతల మూలముగా (Inferiority complex) నీచ స్థానము ప్రాప్త మగుచుండ — తెనుగు తనము గోల్పోయి, గాలి నరసయ్యవంటి యుద్దండ పండితులు నిర్వీర్యులై సంస్కృత చర్మము గప్పుగొని "ప్రభంజన అహోబల" నామములు పెట్టుకొని లోకములో మసులాడుట తెనుగుతల్లి యొక్క దౌర్భాగ్య మనవలెను. సింహపు పిల్లవంటి తెనుగు తల్లికి గాడిద తోలు కప్పబడినది. తెనుగులు ఓండ్రపెట్టి, మురియుచు, మోదులు బడుచున్నారు. ఈ స్థితిలో కొక్కొండ వేంకటరత్నం పంతులుగారు తెనుగు భాషయొక్క శక్తి స్వభావసిద్ధమైన సామర్థ్య మిట్టిదని తెనుగులకును, లోకమునకును — ప్రదర్శించి తెనుగు తల్లిని గద్దె యెక్కించి, తోటివారిలో గౌరవము చేకూర్చి తల్లి ఋణము తీర్చు కొని ధన్యులైనారు. ఇటుపైన తెనుగువారు తమకు తామే ఆరోపించుకొన్న నీచత్వమును తోలగ ద్రోసికొని, పైకిలేచి, ఉన్నతి బొంది తెనుగున మేటి కావ్యములు రచించిన పక్షమున బెంగాలీ భాషకు టాగూరు జగత్ప్రఖ్యాతి చేకూర్చినట్లు ఆంధ్ర సోదర సోదరీమ తల్లులు తెనుగునకు కూడ విశ్వ విఖ్యాతి తేగలరని నా విశ్వాసము.

కొక్కొండ వేంకటరత్న శర్మగారి ప్రిన్సు ఆఫ్ వేల్సు యాత్రా చరిత్రనుండి మచ్చుతునకలు :—

(6) థేమ్సు నది వర్ణనము :

"అందు మందాకిని చందంబున నందంబైన థేమ్సు నది గలదు. అద్ది తద్దేశస్థుల యేక వర్ణోదీర్ణతం దెలుపుననగ దెలుపై, తద్వైక మత్యంబునకుం గురువన నేకముఖంబై, వారి యాశయంబున కొజ్జ యనం బాత్ర వైశాల్యంబు గలిగి, వారియొక్క నిత్యోద్యమంబు నకుం బ్రద్యోతకంబుగ నెపుడును నెడపక ప్రవహించు చుండును. అట్లయ్యు బ్రవాహ ఘోష మంతగా లేక, కడు మందరవము గాక

వారి మిత హిత భాషత్వమునకు గుఱుతుగ నలతి యయిన యలల
మ్రోత కలిగియుండును ..."

(2) యువరాజుగారు ఎక్కివచ్చిన యుద్ధనౌక వర్ణనము

"ఆ యుద్ధ ధూమ నౌక మిక్కిలి ప్రసిద్ధికెక్కినది. ఆ యది విరివి
చేతను, బలిమిచేతను, దేలుచున్న నగరని పొగడబడియెడి. అయ్యది
తెల్లరంగుచే బూయబడి కడు నందముగా నుండుటచేత దంత
మయంబో యన్నట్టు కనుపట్టు. కాబట్టియే యద్ది యుద్యద్దినకర కర
వికసితమ్మయిన నెత్తమ్మి వితమ్మన నగపడు. అది పొడుపుకొండ
నెక్కి నిక్కు చుక్కల తేనిం గనుంగొని, మోము విప్పు దనర్ప
నొప్పు నుత్పలంబు విధంబునం బొడసూపు. మఱికఱివేల్పుగయి
నంటని వలమురి యొఱపు జూపు. కల్పావసానకాలోద్వేలాభీల
మహాంభోధిం బరిభ్రమించిన మార్కండేయుం దలపు గొలుపు. దాని
గాన, దన పుట్టిన మనికిపట్టగుటచే జౌదంతియో నిక్కు వీనుల
జిక్కియో, మిక్కిలి మక్కువ నీ రీతిన్మెఱుఱూపున వరుణాలయ
మ్మునం గ్రుమ్మరు నని నెమ్మనమ్మున నిమ్ముగా నూహింపనగు. అంతకా
కొంత యాలోచించి యాలోచించిన సంద్రమను నాకసంబునం
బొలుచు పూర్ణచంద్రబింబం బనందోచు. అందువలన దుగ్ధాబ్ధిమధనకథ
జ్ఞప్తికి వచ్చు. అంతకుబయి చింతించుచో గూపకాంచితత చేతను,
శ్వేత వరాహావతార స్మృతిగలిగెడి. అటుపిమ్మట నూహకుత్సహింపం
బద్మగర్భుండు నిజావిర్భావ సంభావితాంభోరుహంబు నా రూపం
బునం బారావారంబున బొందుపఱచి యునిచి తన్నామక కల్పంబును
స్మరియింపుచు, నా స్ఫురించు సిరి కిరవయి కమలాసన కమల మనం
గన్నుల పండువు నొనరించు. మఱి నిరుపమానేక నియామక నియ
మిత జననిబిడంబును, బహుళ గుణ వృత్తుకోపలక్షితంబును, దారు
గృహ సౌధ వీధీ విరాజితంబును, సమస్త వస్తు సంపూర్ణ వర్ణనీయం
బగుటచే, విధి విరచితమైన యపూర్వ జలధి చర దుర్గమే యని
చెప్పనొప్పు. తత్సమృద్ధిం దలంప జగత్సంభార సంభృతంబై సాం

యాత్రికా యిత సప్తర్షిమను సమారూఢంబైన యా యాదర్శ యాన పాత్రంబా యని సంశయం బావాదిల్లు. కొన్ని చిన్న కలములతో, బడవలతో దోనెలతో దెప్పలతో నెప్పుడుం గూడికొని చెలఁగాడు చుండుటచే దిమితిమింగిలాది నానా మీన నికాయానుగమ్యమానం బైన యమ్మహా మత్స్యంబో యన్నట్టు చూపట్టు. ఆ పగిదిం దిలకింప నాధునిక వైజ్ఞానిక ప్రవీణ హస్త వినిర్మిత 'జంగమ సేతువను' నూహ పుట్టు. అట్టులవుటవలన నల నిర్మిత సనాతన స్థావర సేతువు 'కపిబల కష్టైక హేతువే' యని స్పష్టమగు. బహుదూరము పోనేల ? తుదకది పడమటి దొర, దన రాజ్యమెల్ల గలయదిరిగి, పరికించుట కెంచి, యలవరించు కొనినట్టి 'కడలి యరదమా' యనినట్టు కనిపట్టు. ఈ పెట్టున నట్టేల ? పట్టిచూడ నది యట్టిదే కదా ?"

ఇందు పంతులుగారు ప్రకటించిన వైదుష్య సంస్కృతులును భావనాశక్తియు నద్భుతములై, ఐరోపా విమర్శకుని యభిప్రాయము సరియైనదే యని తోపకమానదు. పంతులుగారి ప్రతిభను గూర్చి మనమిక్కడ ప్రశంసించ వలసిన ముఖ్యవిశేష మొకటి కలదు.

ఆనాటి పండిత బృందము సంస్కృత పారావారమున మునుగుచు తేలుచు ఈదులాడుచుండిరి. సంస్కృతపండితులకే సన్మానము, సభలలో గౌరవము. తెనుగుపండితులెంతటివారికైన గౌరవ మర్యాదలు లేకుండెను. "వెధవ తెనుగుకు ఉత్పత్తి వ్యుత్పత్తు లేమిటిరా' యని గీర్వాణ పండితులు గీర్వాణముతో తెనుగునీసడించి తిట్టిపోసిన దినములవి. సంస్కృతమును గౌరవించినందుకు మాకును సంతోషమే; కాని తెనుగును దూషించి యీసడించినందుకు మాత్రము విచారము. పరవస్తు రంగాచార్యులు గారిని 1887 లో ప్రభుత్వము "మహామహోపాధ్యాయ" బిరుదిచ్చి గౌరవించినది. ఎల్లవిధముల నాయుద్దండ పండితులా గౌరవము నకు తగినవా రగుట యావద్భారత దేశము వారికా బిరుదు లభించినందుకు గర్వించి జోహారు లొనరించినది. పండిత పామరులందరు నేకగ్రీవముగా వారి నభినందించిరి. బాగున్నది. కాని నాలుగు కోట్ల మంది జనులు మాటలాడుచున్న తెనుగేమి

పాపము చేసికొన్నది? తెనుగు పండితు లొకరి కొకరు వ్రాసుకొను జాబులలో కూడ సంస్కృతమేనా? ఉత్తరములుకూడ పద్యములలో నేనా వ్రాసికొనుట? సంస్కృతము గొప్ప భాషయే; అది చదువు కొనినవారు పూజ్యులే; అట్లని యీ బంగారుకత్తితో తెనుగులు కుత్తుక గోసుకొనెదరా? అని మా ప్రశ్న. పూజా పురస్కారములు అవలంబనలేక తెనుగు నశించవలెనా? చెన్నపట్టణము ప్రెసిడెన్సీ కాలేజిలోను, రాజమహేంద్రవరము గవర్నమెంటు ఆర్ట్సుకాలేజిలోను ముప్పదేండ్లు ఆంధ్రాధ్యాపకులుగా నుండి ప్రశస్తముగా తెనుగు తల్లిని సేవించిన ఉద్దండ పండితులు కొక్కొండవారికి 1907 లో మహా మహోపాధ్యాయ బిరుదమిచ్చి ప్రభుత్వము గౌరవించెను. సంస్కృతముతో తెనుగునకును సమాన గౌరవప్రపత్తులు ఒసంగ బడినవని సన్మాన సభలో పంతులుగారు ఉగ్గడించిరి. నాటినుండి తెనుగు కూడ స్వకీయ సంస్కృతి గలిగి, సన్మానార్హమైన ప్రత్యేక భాషగా నంగీకరింప బడుట చరిత్రాత్మకమైన గౌరవము. ఈ గౌరవమును నిలుపుకొనుట మన తెలుగు విద్వాంసుల ముఖ్యకర్తవ్యమని విన్న వించి ఉత్తరాంశముల చర్చింప బోదము.

## క్రీ॥ శ॥ 1907 సంవత్సరము - చరిత్ర ప్రాముఖ్యత

ఉద్దండకవియు, పండితప్రకాండులునైన ఆంధ్రశ్రీ కొక్కొండ వేంకటరత్నం పంతులు గారికి సంస్కృత పండితులకు వలెనే మహా మహోపాధ్యాయ బిరుదముతో తత్సమానగౌరవ ప్రతిష్ఠలు లభ్యమైన 1907 క్రైస్తవాబ్దము ఏదృష్టితో చూచినను చరిత్రాత్మకమగు ముఖ్యవత్సరమని వక్కాణింప నగును.

పాశ్చాత్య విద్యావ్యాప్తితో స్వతంత్రేచ్ఛ ప్రబలు చున్న భారతీయులకు ఆ సంవత్సరము అనేక విధములైన నూతన భావములతో నూతన చైతన్యమును పెంపొందించినది.

1905 వ సంవత్సరములో పిచ్చుకవంటి జపాను దేశము దిగ్గజము వంటి రష్యాదేశముతో పోరి రష్యనుల నోడించి ప్రచండ విజయము

గొనుటతో విష్యాఖండనివాసులైన ప్రాచ్యుల కందరకు అద్భుత మొదగూర్చి స్వతంత్రేచ్ఛను బహువిధముల పెంపొంద జేసెను. ఎవరెన్ని విధముల వారించినను వినక గవర్నరు జనరలు కర్జన్ దొర బంగాళా దేశమును విభజించుటతో ప్రచండమైన రాజకీయాందోళన ప్రారంభమై స్వరాజ్య వాంఛ ఉద్రేకము చెందు చుండెను. భారత భీష్ముడు దాదాభాయి నవురోజీ 1906 లో కలకత్తాలో జరిగిన నేషనల్ కాంగ్రెస్ మహాసభకు అధ్యక్షుడై భారత దేశాభ్యుదయమునకు స్వరాజ్యమొక్కటే సాధనమని మేఘగంభీర భాషణములతో గర్జించి తెలిపెను. అమ్మహా ఘోషము దేశము దశదిశల ప్రతిధ్వనించెను. పంజాబులో లాలా లజపతిరాయియు, మహారాష్ట్రమున తిలకుగారును— 'స్వరాజ్యము మా జన్మహక్కని' చాట జొచ్చిరి. ఆంధ్రమున, హరిసర్వోత్తమరావుగారు స్వరాజ్య పత్రికను స్థాపించి శంఖారావము గావించిరి. బిపినచంద్రపాలుగారు తెనుగునాట సంచారముచేసి స్వరాజ్యము కొఱకు పాటు పడుడని పొలికేకలు పెట్టివెళ్ళిరి. అది రాజకీయ వాతావరణము.

మత దృష్ట్యా — శ్రీ రామకృష్ణ పరమహంసగారి శిష్యరత్నము స్వామి వివేకానందులు 1893లో షికాగోలో జరిగిన సర్వమత సభ కరిగి, హిందూమత ప్రాశస్త్యమునుగూర్చి అద్భుతోపన్యాసము లిచ్చి, పాశ్చాత్యులకు హిందూమతమునం దభిమానము గలిగించెను. నాటి నుండి పడమటి విద్వాంసులకు - ఎమర్సన్ లోనగు మహామహులకు భగవద్గీతాది భారతీయుల గ్రంథములందు గౌరవము పెంపొందు చున్నది.

సారస్వత దృష్ట్యా — క్రొత్తక్రొత్త పత్రికలు, గ్రంథమాలికలు స్థాపింప బడుచువచ్చెను. 1902 లో బందరులో కృష్ణాపత్రిక కృషి ప్రారంభించి సర్వతోముఖముగ నాంధ్రుల సేవ జేయ నుపక్రమించినది. 1904 లో మారేపల్లి రామచంద్రశాస్త్రిగారు విశాఖ పట్టణములో శ్రీకలాభిలాషిక కావ్యమాల స్థాపించి అనేక గ్రంథముల ప్రకటింప జొచ్చిరి. తెనుగు దేశములో స్థాపింపబడిన తొలిగ్రంథమాల అదియే.

పిమ్మట 1906—7 లో కొమఱ్ఱాజు లక్ష్మణరావుగారు, గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు, రావిచెట్టు రంగారావుగారు ముగ్గురు ఉత్సాహవంతులైన యువకులు — హైదరాబాదు రెసిడెన్సీ బజారులో విజ్ఞాన చంద్రికా గ్రంథమాల స్థాపించి విజ్ఞాన ప్రచారమునకు నడుములు బిగించిరి. తోడనే బందరులో ఆంధ్ర భాషాభివర్ధినీ సంఘమును స్థాపింపబడెను. ఆవెనుక ననేక ప్రదేశములలో పెక్కు గ్రంథమాలలు స్థాపింపబడి, భాషాభ్యుదయమునకు ఓపినకొలది పాటు పడినవి; కొన్ని ఇంకను పాటు పడుచున్నవి. అందు ప్రకటింపబడిన గ్రంథములను ఓపినంతవఱకు సిదిగువ విమర్శింప యత్నింతము.

ఆంధ్ర వచన వాఙ్మయము ఒక మహావృక్షము. అది బహు ముఖముల వ్యాపించి, పెక్కులగు శాఖోపశాఖలతో పెరిగి పెం పొంది ఉన్నతి నొందు చున్నది. వానినన్నిటి నిట పూర్తిగా వివరించుట నా తరము కాదు. అయినను భక్తపోతనగారు చెప్పినట్లు "విబుధజనుల వలన విన్నంత గన్నంత తెలియవచ్చినంత ఓపిక గలంత" మట్టుకు సంగ్రహముగా వ్రాయ యత్నింతును.

ఆంధ్రవచన వాఙ్మయ వృక్షముయొక్క శాఖలలో నెల్ల ముఖ్యమైనది మత గ్రంథశాఖ. కేవల శృంగార ప్రధానమైన ప్రబంధములలో తప్ప ఇంతవఱకు వివరింపబడిన వాఙ్మయ మంతయు నన్నయ మొదలు చిన్నయ వఱకు మత ప్రాధాన్యముగల వాఙ్మయమే యనవచ్చును. వివేకానందులు అమెరికా ఖండమునందును ఇతర ప్రదేశములందును ఇంగ్లీషులో ఇచ్చిన ఉపన్యాసములు తెనుగులోని కనువదింప బడినది. మతాభిమానులచే శుక బ్రహ్మకైవల్యము బ్రహ్మజ్ఞానసారము లోనగు మతగ్రంథములు ప్రకటింప బడినవి. అర్థతాత్పర్యములతో ఉపనిషత్తులు తెనుగు వచన రూపమున వెలువడినవి. రామాయణ భారత భాగవతాదులు హిందూ మత గ్రంథములు గానే పరిగణింప బడుచు ఆ శాఖకే చెందిన వగుచున్నవి.

డొంకాడ సుగోపీనాధకవి యను భక్తుడు, వచన విచిత్ర రామాయణము రచించెను. దాని వ్రాతప్రతియేగాక ముద్రిత ప్రతిగూడ పుస్తకముల రిజిష్ట్రారు వారి కార్యస్థానమున నాకు లభించినది. అది చదివి చూడగా నాకు విచిత్రమైన విశేషమొకటి కనబడినది. అదే మనగా డార్విన్ (Darwin) అను నాంగ్ల ప్రకృతిశాస్త్రవేత్త గొప్ప పరిణామవాది (Evolutionist) పెక్కు విధములైన పరిణామములను పొంది పొంది సృష్టి యిప్పటి స్థితికి వచ్చినదని యతని వాదము. కొత్త జాతులనుండి క్రమ పరిణామమును పొంది, మానవు లుద్భవించి రని యతని దృఢాభిప్రాయము. అందుకు వ్యతిరేకముగా విచిత్ర రామాయణమునందు మనుష్యబాలురు కోతులుగా మారిపోయి రనియు, ఒక మానవ కన్యక కడుపున కోతి జన్మించెననియు నందు దెలిపెను. ఆ విశేషము మా పాఠకులకు వినిపించి వినోదము గూర్పనెంచి ఇట వ్రాయుచున్నాను.

ఈ గ్రంథము 1892 లో ముద్రింప బడినది. అందలి 38 - 39 పుటలలోగల వాలి, సుగ్రీవ, ఆంజనేయుల జన్మ వృత్తాంతము విననగును.

"అది అహల్యయను నామంబుగల గౌతమముని పత్ని. అత్యంత సుందరాకారి; గావున నమ్మునిపుంగవుండు కుటీరంబు వదలి పోయిన దాని ప్రాణంబు లతనితో గొనిపోవు; గృహంబునకు వచ్చి యక్కళేబరంబున జీవంబు ప్రవేశింపజేయు; నివ్విధంబునం బ్రవర్తింపుచుండ నహల్యకు నొక్క కన్నియగలిగె; నంత సూర్యుండును, దేవేంద్రుడును, నహల్యను మోహించి సమయంబు గానక చింతింపుచుండ, కృశాంగులై, యొక్క సమయంబున కపటులై ఋషి కుటీర సమీపమున కుక్కుటములవలె గూయ ప్రభాతంబయ్యెనని విచారించి యహల్య ప్రాణంబుగొని, శవంబుకడ కూతుం గావలియునిచి స్నానంబున కరిగిన, శక్రాదిత్యులు క్రమంబున నొక రొక్కరు నహల్య శరీరంబున బ్రవేశించి రమించి జనిరి; ఆ యాదిత్యు తేజంబు సోకి అహల్య సమీపంబున నున్న పుత్రికకు నయనంబులు గానరాక యుండె. ఋషిపుంగవుండు ప్రభాతంబైన షట్కర్మంబుల దీర్చుకొని, కుటీరం

బునకు వచ్చి, యప్పటివలె నహల్యకు జీవంబిచ్చి ప్రవర్తింపు చున్నంత నయ్యహల్యకు గర్భంబు నిలిచె; నవమాసంబులకు బలసమన్వితులగు నిరువురు పుత్రులు ఉద్భవించిరి. బాలురు వర్ధమాను లగుచుండ, నొక్కనాడు అహల్యాజాని ఇరువురు పుత్రుల నెత్తుకొని, కూతురి కరంబు బట్టుకొని, సముద్ర తీరంబున జనె, నంత సూర్య తప్తంబైన యిసుము బాలిక పాదంబులకు సోక, బాలిక దుఃఖించి, క్రోధంబున జనకున కిట్లనియె "నీ వితర పుత్రులను చంకనిడి నీవలన జన్మించిన పుత్రికను నన్ను సూర్యతప్తంబైన ఇసుకను నడిపించె" దనిన ఋషి పుంగవుండు ఆశ్చర్యంబై సముద్ర తీరంబునకుం జని ఈ యిరువురి నెత్తుకొని "ఈ పుత్రులు నావలన జన్మించిన నత్యంత సుందరాకారు లయ్యెదరు లేకున్న మర్కటంబు లయ్యెద" రని సముద్రంబున వైచిన, వారు మర్కటంబులైరి. ఈ క్రమం బంతయు తన యోగంబున నెఱింగి గౌతముండు శక్రాదిత్యులపై కోపించి సూర్యునకు శరీరంబున నండం బులు గల్గునట్లును, దేవేంద్రునికి దేహంబున ... లు గలుగు నట్లును ఇవ్విధంబున నిరువురకు శాపంబులిచ్చె. అంత దేవేంద్రుండును, సూర్యుండును ప్రతీకారంబు వేడిన శక్రునకు శరీరంబున నున్నవి వేయి నేత్రంబు లట్లును సూర్యునకు వేయి కిరణంబు లట్లును ఇతరుల కగపడు నట్లు ఋషిసింహుం డానతిచ్చి యంత నిలువక అహల్యంజూచి నీవు స్వైరిణివై పుత్రుల జననంబు నొందించితివని నా పుత్రిక జెప్పినది. పరీక్షకు సముద్రంబున వైచిన మర్కటంబు లైరన నంతయు నహల్య విని కోపించి పుత్రికతో నిట్లనె "నేను శవంబునై యున్నదాన నే నేరు ప్రయోజనంబు జేసిన గోచరంబు గావున నీవు నా పుత్రికవై యుండియు జనకునితో కొండెము చెప్పి నా పుత్రులను మర్కటంబుల గావించితివి గావున నీవు కన్యవై యుండగానే నీగర్భంబున మర్కటంబు పుట్టు గాక" యని శాపంబిచ్చె; నబ్బాలిక భయభ్రాంతయై వినయంబున విమోచనం బడుగ రుద్రవీర్యంబున వనచరుండు బుట్టు. తదనంతరంబున నీవు వైకుంఠంబున కేగెద వనియె; నంత ఋషిపుంగవుం డహల్య యందు కోపించి "నా పుత్రిక నాతో జెప్పినందున నీవు నీ పుత్రిక యని

విచారింపక వంచించితివి; నీకింత కాఠిన్యంబు పాడమె గావున నీవు పాషాణంబవై పడియుండుమని శాపంబిచ్చె. నంత నహల్య వినయంబున వేడుకోగా రఘురాముండు నా గృహంబునకు వచ్చునాడు నీపాషాణ శరీరముపై నడచిన, నాతని పాద రజంబు సోకి పవిత్రవై స్వర్గలోకం బున కొన్ని దినంబు లుండి నన్నుగూడెదవు" అని యానతిచ్చెను.

గౌతముని పుత్రిక అంజని యనియు ఆమె కన్యయై యుండగానే రుద్రప్రసాదమున పుత్రుడు కలిగెననియు ఆ పుత్రుడు ఆంజనేయుడనియు నొక కథ. జాంబవదాదులతో హనుమంతుడు చెప్పికొనినట్లు కిష్కింధాకాండమున వర్ణింపబడిన కథ కిది భిన్నము; కాని చదువుటకు చమత్కారముగా నున్నది.

## మతగ్రంథ శాఖ — సమాప్తి

### కర్మానుభవము

ఎవరేమి చేసినను ఆ పని యొక్క ఫలితము ననుభవించవలెను, అనుభవించి తీరవలెను. ఇది హిందూమత సిద్ధాంతముల కెల్ల మూలమైనది. ఈశ్వరుడు భిక్షుకుడగుటకు, ఇంద్రుడు సహస్రాక్షు డగుటకు, అహల్య పాషాణమై బహుకాల మడవిలో పడియుండుటకు ఇత్యాది దురవస్థల కన్నిటికిని స్వకర్మమే కారణము. ఇహలోకమున నెవరు చేసిన పాప ఫలితములను, మరణానంతరమున వారు అనుభవించవలెను. బౌద్ధ క్రైస్తవ మతము లందును పాపకర్మానుభవ సిద్ధాంతము కలదు. క్రైస్తవులా విచారణ దినమును 'తీర్పుదినము' అందురు. ఇహమున నే పాపము చేసిన మరణానంతరమున నే శిక్షను అనుభవించ వలెనో వివరించు గ్రంథము గరుడ పురాణము. సంస్కృతమున వ్యాసకృత గరుడ పురాణము నుండి దీనిని తెనిగించిన వారు నే. వెంకటరామశర్మ గారు. ఈగ్రంథము కీ॥ శ॥ 1884 లో ప్రకటింప బడినది. "హిందూ మత గ్రంథశాఖా వాఙ్మయమున కీ గరుడ పురాణము తుది వాక్యము వంటిది. అని మాత్రము వాకొని యీ శాఖాసారస్వత చర్చ ముగింతును.

మతగ్రంథ శాఖగాక ఇంక ననేక శాఖోపశాఖలుగా తెనుగు వచన రచన పెంపొందెనని. మనవి చేసితిని. అందు ముఖ్యములైనవి కొన్ని :— 1 పత్రిక శాఖ 2 వచననాటకశాఖ 3 ఉపన్యాసశాఖ 4 కథాశాఖ 5 యాత్రాచరిత్రలు 6 నవలలు 7 జీవచరిత్రలు 8 దేశ చరిత్రలు 9 ప్రకృతిశాస్త్రములు 10 ఇతరశాఖలు 11 గ్రంథవిమర్శ నలు. వాదప్రతివాదములు.

## 1 పత్రిక శాఖ

అచ్చుపద్ధతి కనిపెట్టి ఐదువందల సంవత్సరములైనది. అయినను ఇతరదేశములలో వలె భరతఖండమున ముద్రణము అభివృద్ధి పొందలేదు. ఈ దేశములో మహమ్మదీయ ప్రభువులకు గ్రంథములకు విశేషవ్యాప్తి కలగని పద్ధతిని నకళ్ళు వ్రాయించి వానిని తమవద్ద రహస్యముగా నుంచుకొనుటయందే యభిమతము. ఇంగ్లీషువారీ దేశమునకు వచ్చిన పిమ్మట క్రైస్తవ మిషనరీలు వివిధ దేశభాషలలో గ్రంథ ముద్రణము నారంభించిరి. చెన్నపట్టణములో పువ్వాడ వేంకట రావుగారు 'వర్తమాన తరంగిణి' యను దిపపత్రికను తొలుత స్థాపించిరి. పత్రిక వ్యవహారిక ఆంధ్ర భాషలోనే నడుపబడు చుండెను. నూట ఇరువదేండ్ల క్రిందట జరిగిన ఆఫ్ఘను యుద్ధ వివరములనందు చక్కగా చూడనగును. ఆనాటి పత్రికల ప్రతులు నేటికిని ఓరియంటల్ లైబ్రరీలో చూడవచ్చును.

తరువాత బయలు వెడలిన పత్రికలు అసంఖ్యాకము లన వలెను. ఉత్సాహమాత్ర సంపన్నులు, ఉద్రిక్తస్వభావులు నగు ఆంధ్ర జనులు తెనుగునాటగల ప్రతి ముఖ్యపట్టణము నందును కొన్ని పల్లెలలోను గూడ వారపత్రికలు, పక్షపత్రికలు, మాసపత్రికలను నెలకొల్పి ప్రకటించిరి. అంతను, స్వరాజ్యోద్యమము తలయెత్తి స్వాతంత్రేచ్ఛ ప్రబలమగు కొలది, పత్రికల సంఖ్యకూడ వృద్ధికాజొచ్చినది. కాని ఈపత్రికలలో చాలవఱకు "బుబ్బలో పుట్టి మఘులో మాడినవే." అందు గొన్నింటిని మాత్రము ఈదిగువ పేర్కొనెదను.

చెన్నపురి : దినవర్తమాని, ఆంధ్రభాషా సంజీవని, తత్త్వబోధిని, ఆంధ్రప్రకాశిక, శశిరేఖ, త్రిలింగ, సూర్యాలోకము, సుజనరంజని, ఆంధ్ర దినపత్రిక, వారపత్రికలు, భారతి, సాహిత్యపరిషత్పత్రిక ఇత్యాదులు.

నెల్లూరు : భవాని, అముద్రిత గ్రంథచింతామణి పూండ్ల రామకృష్ణయ్యగారు.

బళ్ళారి : విజ్ఞాన వర్ధిని; సన్మార్గబోధిని, శ్రీయక్షిణి.

గుంటూరు : దినపత్రిక – దేశాభిమాని.

తెనాలి : ధర్మప్రకాశిక.

బెజవాడ : స్వరాజ్య, కృష్ణావృత్తాంతిని, విజయవాణి.

ఏలూరు : దేశోపకారి, జ్ఞానోదయ, మంజువాణి, ఇండస్ట్రీ, దేవదత్తము, ముముక్షువు.

పెనుగొండ : కృషి

బందరు : స్వధర్మప్రకాశిని, జ్ఞానోదయ, బుధవిధేయ, శారద, పురుషార్థప్రదాయిని, భైరవి, కృష్ణాపత్రిక.

దేశాభిమాన పూరితములై, జాతీయ జీవన పునరుద్ధరణ హేతువులై కృష్ణా పత్రిక వ్యాసములు తెనుగు తల్లికి మఱువరాని సేవ చేసినవి. ఇందలి వ్యాస పరంపర ప్రభావ ఫలితముగా కాకినాడలో మల్లాది సత్యలింగము నాయకరుగారి ధర్మములు వృత్తి విద్యాలయములు స్థాపింపబడెనట. కృష్ణారావుగారి శైలి ఇంగ్లీషు వాక్యములకు "తలకు తల, తోకకు తోక" రకము అనువాదము గాక తెనుగున నాలోచించి, తెనుగు వారి కొఱకు జాతీయమైన జాను తెగున రచింపబడుట ఇందలి విశేషము. ఈనాటి తెనుగు పత్రికలు ఈ పద్ధతి నవలంబింప వలసిన అవసర మెంతో గలదు.

రాజమహేంద్రవరము:- వివేకవర్ధని, సునీతి, కాంగ్రెస్, ఆకాశవాణి, గోదావరి విద్యా ప్రబోధిని, ఆంధ్రకేసరి, దేశమాత, గోదావరి.

స్వదేశోద్యమ ప్రారంభదశలో, చిలుకూరి వీరభద్రరావుగారి యాధిపత్యమున వెడలి నన్నాళ్ళు, 'ఆంధ్రకేసరి' కూడ బాలగంగాధర

తిలకుగారి మహారాష్ట్ర కేసరివలెనే నిర్భయముగా జాతీయమైన శైలిలో దివ్యమైన వ్యాసములు ప్రకటించి గొప్ప దేశసేవ చేసెను. పిమ్మట చిలకమర్తి లక్ష్మీనృసింహముగారి సంపాదకత్వమున వెడలిన 'దేశ మాత' వారపత్రిక కూడ అట్లే దేశసేవ చేసెను.

విశాఖపట్టణము :— సాహిత్య పత్రిక.

విజయనగరము :— భారతమాత.

శ్రీకాకుళము :— వివేకవల్లి, మురళి.

కాకినాడ :— సుధీరంజని, రాజయోగి, వాణిజ్య, అనసూయ, సరస్వతి.

అనకాపల్లి :— సుశీల.

ఎలమంచిలి :— దివ్యజ్ఞాన సమాజము తరుపున తారక సందేశము, పరోపకారి.

గుడివాడ :— బుద్ధి ప్రదాయిని.

బరంపురం :— ఆంధ్రవాణి.

ఈ దిగువ పత్రికల పేర్లు గ్రంథములలో కానవచ్చుచున్నవి. అవి యెప్పుడు ఎక్కడ ఎవరివలన ప్రకటింపబడెనో తెలియరాలేదు.

1. సామ్రాజ్య ప్రదాయిని, 2. బాలసరస్వతి, 3. రాజహంస, 4. చంద్రిక, 5. వైఖానస పత్రిక, 6. సౌందర్యవల్లి, 7. బాల భారతి, 8. కృషీవల.

ఇంక నెన్నో పత్రికలు వెలసినవి; వెలయుచున్నవి; వెలయ గలవు. ఈనాడు తెనుగునాట నంతను వ్యాప్తిగలవి, ఆంధ్రప్రభ దినపత్రిక, వారపత్రిక; ఆంధ్రపత్రిక దినపత్రిక, వారపత్రిక, భారతి.

ఇందు ఆంధ్ర ప్రభ గుజరాతీ, రామనాథ గోయెంకగారి యాజమాన్యమున ప్రకటిత మగుచున్నది. ఆంధ్ర పత్రిక, భారతి, దేశోద్ధారక నాగేశ్వరరావుగారిచే స్థాపింపబడినవి. సుమారేబది సంవత్సరముల నుండి ఏటేటా సంవత్సరాది సంచికలు ప్రకటింపబడు చున్నవి. వీని మూలముగా తెనుగుదేశమున జరిగిన సర్వతోముఖమైన అభివృద్ధి ఇంతని విలువ నిర్ణయింపరానిది.

సర్వతోముఖముగా ఆంధ్రాభ్యుదయమునే అభిలషించి, నేనొక్క విన్నపము చేయుచున్నాను. ఇది సామాన్యముగా పత్రికాధిపతు లందరకును, ఆంధ్ర పత్రికాధిపతులకు ముఖ్యముగాను చేతులు మోడ్చి చేయు విజ్ఞాపనము :

లోకములో ఉత్సాహవంతునకు ధనము ఉండదు. ధనవంతులకు తెనుగు భాషా సేవ చేయుటకు ఉత్సాహము ఉండదు. రెండును గల, దేశోద్ధారక నాగేశ్వరరావు పంతులుగారి ఆంధ్ర పత్రిక వంటి పత్రికలు ఆంధ్ర భాషా సాంప్రదాయములను, జాతీయతను విస్మరించి, కాలప్రవాహముతో పాటు ఇంగ్లీషులో నాలోచించి, నిర్జీవమైన తెనుగులో వాక్యములు వ్రాయు రచయితల కాశ్రయ మగుట మిక్కిలి సంతాపకరము. ఇంగ్లీషులో Our Daily, Weekly and Monthly publications అను వాక్యము ఎదుట నుంచుకొని "మా దిన వార మరియు మాస పత్రికలు" అని ముద్రించి ప్రకటించుట ఎంత శోచనీయము? తలకు తల, తోకకు తోక, మక్కీకి మక్కీ తెనుగుచేత లేనా మనము అభిలషించ వలసినది? వాక్యమునందు కనబడు అనర్థ అశ్లీలముల గమనించ నక్కరలేదా? దేశోద్ధారకులు దేహము చాలించి లింగైక్యము పొందువఱకు 'దిన వార' పత్రిక లనెడి అమంగళ, అశ్లీల వాక్యము ప్రకటితమగుచుండెను. కీ॥ శే॥ దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారు Non-Co-operation పదమును సహాయ నిరాకరణ మని తెనిఁగించుట నాక్షేపించి "ఇది ఆంధ్ర పత్రిక తలకు తల, తోకకు తోక, తెనుగని నిరసించి, ప్రభుత్వ వైముఖ్యమే యీ 'నాన్ కో ఆపరేష' నని సభలలో ఉపన్యసించెడివారు. Indian అను మాట గలచోట భారత అనియు, 'and' అనుచోట 'మరియు' అని సందర్భము పాటింపక, సాంప్రదాయ విరుద్ధముగా వ్రాయవలదని విన్నపము. అట్టి వ్రాతలు బైబిల్-తెనుగు, గజెట్-తెనుగు, ప్రకటన తెనుగు అగునుగాని తెనుగునాటి తెనుగు కాజాలదు. తెనుగు జాతీయతను, సాంప్రదాయములను నిలిపి, పోషించు బాధ్యత పత్రికా రచయితలపై అధికముగా గలదు. భాషాంతరీకరణము తెనుగు ప్రజ

కొంటకను విషయము మరువక రచయితలను "తెనుగు సాంప్రదాయానుసారముగా తెనుగు వాక్యముల రచింపుడు" అని వేడుకొని ఉత్తరాంశము చర్చింపబోదము.

ఇటీవల ఆంధ్ర ప్రదేశమున క్రొత్తగా చేర్పబడిన తెలింగాణా ప్రాంతమంతయు తెనుగు ప్రాంతమే. ఆంధ్ర భాగవత కర్త భక్త శిఖామణి బమ్మెఱ పోతరాజుగారు తెలింగాణపు కవియేగదా? నేడు వరంగల్ అని చెప్పబడు పట్టణము ఓరుగల్లు. సంస్కృతీకరణమునకు లోనై ఓరుగల్లు 'ఏకశిలా నగర'మైనది. ఆ దేశమంతయు గోల్కొండ రాజ్యములో భాగమై యుండెను. అక్కన, మాదనలు గోల్కొండ నవాబునగ్గర మంత్రులు. భద్రాచల రామదాసు వారి మేనల్లుడని ఐతిహ్యము. హైదరాబాదు, సికంద్రాబాదు, వరంగల్లు ప్రాంతములలో చాలమంది కవులు, గ్రంధకర్తలు, పత్రికాధిపతులు నున్నారు. ఈ పత్రికలలో శ్రీ నరోత్తమ రెడ్డిగారి యాజమాన్యమున వెడలుచున్న గోల్కొండ పత్రిక చాల ముఖ్యమైన దిన పత్రిక. నవీనముగా నేర్పడిన అఖిలాంధ్ర సాహిత్య సమ్మేళన మహాసభవారు, తెనుగు భాషా సాంప్రదాయములను, జాతీయమైన జాను తెనుగును రక్షించి, పోషింప బాధ్యత వహింప వలసి యుండును.

## 2 వచన నాటక శాఖ

తెనుగులో అసలు నాటకములే లేవు. పిమ్మట సంస్కృత నాటకముల ననుసరించి బళ్లారి ధర్మవరం కృష్ణమాచార్యులుగారు చిత్రనళీయమును, తిరుపతి వేంకట కవులు పాండవోద్యోగాది భారత నాటక కథలను రచించిరి. వీరేశలింగముగారు సత్య హరిశ్చంద్ర నాటకమును, చిలకమర్తి లక్ష్మీనరసింహంగారు ప్రసన్న యాదవ, గయోపాఖ్యాన, పారిజాతాపహరణ, పార్వతీ పరిణయాది నాటకములను రచించిరి. అందులో నీచ పాత్రల చేత వచనవాక్యములు కొలదిగా పలికించుచు వచ్చిరి. వేదము వేంకటరాయ శాస్త్రిగారు ప్రతాప రుద్రీయములో చాకలి పేరిగాని చేత గ్రామ్యోక్తులు పలికించి, శ్రోతల రంజింపచేసిరి.

ఇవే మన కానాడుండిన వచన నాటకములు. పిమ్మట వీరేశలింగము గారు దక్షిణ గోగ్రహణ నాటకమును వచనములో రచించిరి. 'పెద్దయ్యగారి పెళ్ళి' మొదలగునవి సాంఘిక నాటకములు. అంతే గాక ఆనాటి సంఘమును చిత్రించుచు పంతులుగారే పెక్కు ప్రహసనముల రచించిరి. అవి హాస్యరస ప్రధానములై ద్రష్టలను శ్రోతలను మిగుల రంజింప జేయగలవు. అందు మచ్చు తునకల గొన్నింటి నీ దిగువ సందర్శింతము. వీరేశలింగముగారీ ప్రహసనములలో శుద్ధ గ్రామ్యమునే పల్కించిరి. చిలకమర్తివా రట్లుగాక మందపాల, వజ్రకంఠాది నీచ పాత్రలచే గూడ గ్రాంథికాంధ్రమును పలికించిరి. వీరేశలింగము గారివలె చిలకమర్తివారు గూడ నీచ పాత్రలచే గ్రామ్య భాష పల్కించిన, చాకలి పేరిగాని మాటల వలెనే, వారి నాటకము లధిక ప్రజారంజకముగా నుండి యుండును.

పిమ్మట చిలకమర్తివారు గూడ తమ 'మనోరమ' మాస పత్రికలో కనక శునక ప్రహసన, కైలాస దూతాది చిత్రప్రహసనము లనేకము ప్రకటించి పాఠకుల నలరించు చుండిరి.

చిలకమర్తివారికి ముందే పిఠాపురమున పానుగంటి లక్ష్మీనరసింహారావుగారు కొన్ని వచన నాటకముల గూర్చిరి. వారి తరువాత హాస్య బ్రహ్మ బిరుదాంకితులు శ్రీ భమిడిపాటి కామేశ్వరరావుగారు మోలియేర్ అను ఫ్రెంచి నాటకకర్త విధానముల నవగాహము చేసికొని తెనుగు సంఘమునకు సరిపడునట్లు "బాగు బాగు", "కచటతపలు" మొదలగు నాటకములను, ప్రహసనములను పెక్కింటి గూర్చిరి. వారి పాత్రలలో "పర్వతాలు, పానకాలు" "బాగు బాగు" లోనగు వారు తెనుగు దేశములో అందరను నవ్వింప సమర్థులైరి.

హాస్యరస ప్రధానములై, ప్రజారంజకములై, ప్రజామోదము బడయగల చక్కని వచన నాటకములు గురజాడవారి కన్యాశుల్క నాటకము వంటివి తెనుగునాట పెక్కు వెలయ నలసి యున్నవి. విజయనగరం మహారాజా శ్రీ ఆనందగజపతి మహారాజావారు, దారుణమైన సంఘ దౌర్జన్యము, కన్యాశుల్కమును మాన్పించుటకు

బద్ధ కంకణులైరి. వారి కొలువు కొలుచుచు వారి కత్యంత ప్రీతిపాత్రు లైన అప్పారావుగారు కన్యాశుల్క పిశాచమును రూపుమాపుటకు అరువదేండ్ల క్రిందట మొదట నీ నాటకమును రచించెను. మరి పండ్రెండేళ్ళకు 1909 లో మొదట నీ నాటకమును సవరించి కొన్ని భాగములు క్రొత్తగా చేర్చి ప్రకటించినారు. దానితో సంఘమునకు వేరుపురుగువంటి కన్యాశుల్క పద్ధతి అంతరించినది. సాహిత్యమును నేర్పుగా ప్రయోగించినచో సాధింపరాని సంఘ ప్రయోజనము ఉండ బోదని సంఘ సేవకులకు ధైర్యము కలిగినది. కన్యాశుల్క నాటకము ఈ మధ్య సినిమా తెఱకు కూడ ఎక్కినది.

కాని ఇపుడంతకంటె ప్రచండమైన వరశుల్క పిశాచము నేడు ఆంధ్ర సంఘమును బట్టి పీడించు చున్నది. ఆడపిల్లకు పెళ్ళి కావలె నన్నచో వందలుకాదు కట్నములు వేలు, లక్షల కెగ బ్రాకుచు న్నవి వరశుల్క నాటకము లేకపోలేదు. గాని అది ఎట్టుచీమ కుట్టిన మాత్రపు పని యైన చేయలేక పోయినది. వేయిమంది ఆనంద గజ పతులు, లక్షమంది అప్పారావులు ఏకమై పనిచేసినను వరశుల్కమును మాన్పగలరా ? అని దేశము మీదను సంఘము మీదను సవాలై యున్నది. గిరీశముల సంఖ్య పెచ్చుపెరిగి పోయినది. ఎంత మంది సౌజన్యారావు లైన నేమి చేయగలరు ? అను నతి దారుణసమస్య సంఘము నెదుర్కొన్నది. ఎటు తేలునో ! ఏమగునో ?

వీరేశలింగముగారి బలాత్కార గాన వినోద ప్రహసనము

హృదయ విదారకమైన దారుణ సమస్య హృదయమును వేధించు నపుడు వినోదకరమైన ప్రహసనము చదివి గుండె తేలిక చేసికొనుట శ్రేయస్కరము. వీరేశలింగముగారి 'బలాత్కార గాన వినోద ప్రహ సనము'తో కాస్తసేపు కాలక్షేపము చేసికొందము.

మైసూరు సంగీత విద్వాన్ విశ్వపతిశాస్త్రిగారు రాజమహేంద్ర వరము వస్తున్నట్టు విని సంగీతరావు అనే శ్రీమంతుడు గోదావరి పడ వల రేవుకు వెళ్ళి ఆ విద్వాంసుని పట్టుకొని తీసుకొని రమ్మని తన

బంట్రోతుల నిద్దరను రేవుకు పంపిస్తాడు. వొడ్డె దేశపు వడ్రంగి విస్సప్ప పాత్రుడనే వాడు కరువుకు నిలవలేక గోదావరి తీరాన వడ్రపు పని చేసి "పెట్టెలు బేడలు" తయారుచేసి అమ్ముకొని జీవనం చేతామని పడవల రేవులో దిగుతాడు. పేరు సామ్యమును బట్టి ఈ వడ్రంగి సంగీత విద్వాంసు డనుకొని బంట్రోతులు వానిని పట్టుకొని, పోనీక, విరిచి కట్టి బండిలో ఎక్కించి హుటాహుటిగా ఇంటికి తోలుకొని వచ్చి సంగీతరావు ఎదుట పెడుతారు.

అతడీ వడ్రంగిని శంకరాభరణరాగం ఆలాపన చెయ్య మంటాడు. సంగీతరావు దొంగల నాయకుడనీ తన చంకలో ఆభరణం దాచుకున్నట్టు ఆచూకీ తీసి అది లాగుకొనుటకు ప్రయత్నిస్తున్నాడనీ పాత్రుడు భయ పడతాడు. సంగీత ప్రియుడు సంగీత ధోరణిలో ఆఠాణా, హుసేని, జంపె, రూపకం అని తొందర పెట్టగా ఆఠాణా అంటే ఎనిమిదణాలు హుసేన్‌సాయిబు తన్ని లాక్కుంటాడు ఇవ్వకపోతే చంపేసయినా రూపాయిలు లాక్కుంటాడు గాని మానడు అని వడ్రంగి బెగులుతూ ఉంటాడు. ఒకరిమాట ఒకరు అర్థం చేసుకోలేక ఉభయులు కంగారు పడుతూ ఉంటారు. సంగీతం పంతులు శ్రుతి కావాలా? అంటే నాకు సుత్తి అక్కరలేదు బాడితతో పని చేసుకుంటాను, అంటాడు వడ్రంగి. బాడిత అంటే దక్షిణ దేశపు గాయకులు వాడుక చేసే వాద్యం అనుకుంటాడు సంగీతరావు. ప్రహసనం అంతా ఈ ధోరణిలో నడచి చదివినా స్టేజిమీద చూచినా చాలా వినోదకరంగా ఉంటుంది.

## ఉలాయశాస్త్రి ప్రహసనము

ఉద్దండ సంస్కృత పండితుడు ఒకా నొక శాస్త్రిగారికి కరణము గారింట్లో భోజన మమరినది. భోజన సమయంలో ఆయనకు గట్టి గేదె పెరుగు వడ్డించారు. ఆయన కమ్మటి గేదె పెరుగు కలుపుకొని అన్నం తింటూ ఈ కరణంగారికి మంచి బఱ్ఱెలపాడి ఉన్నది. ఎన్ని బఱ్ఱె లని అడుగుదా మనుకున్నాడు. గేదె, బఱ్ఱె అంటే తెలిసి పోతుంది. అలా తెలియ రాకుండా ఏదో మారుమూల సంస్కృతపదం ఉపయో

గించి తన పాండిత్యం ప్రకటించుకోవా లనిపించింది. మహిష మన్నా ఇట్టే తెలిసిపోతుంది. ఏ పదం వేతామా అని అమరం నెమరుకి తెచ్చుకొని 'లులాయో మహిషో' అని ఉన్నది గనుక ఆ శబ్దం ప్రయోగింతా మని మీరు మంచి లులాయాల్ని సంపాదించి నట్టున్నారే అని కరణం గారితో అనేసరికి శాస్త్రుర్లుగారు వ్యాసఘట్టం వేశాడు. లులాయం అంటే ఏమిటని అడిగితే అప్రతిష్ట. అర్ఘామాయి ఈయన అటక వేపు చూస్తున్నాడు. అటక మీద గుమ్మడి పళ్ళు ఉన్నవి. వాటినే ఈయన లులాయా లన్నాడు అనుకొని "అవునండి కూరకి తెప్పించాను" అన్నాడు. ఆ మాట వినేసరికి శాస్త్రుర్లుగారు పిడుగు పడ్డట్టు అదిరిపడి నా రాయణ గొడ్డు మాంసం తినే వాడింట్లో విస్తరేసుకు తిన్నానని రోత భరించలేక ఉత్తరాపోశనం అయినా పట్టకుండా లేచిపోతాడు. 'పెరుగు అన్నం పారేకయ్యా' అన్నా వినిపించుకోకుండా లేచిపోయాడు. ఇంటికి వెళ్ళి భార్యతో ఏకాంతంగా కరణం గొడ్డుమాంసం తింటాడుసుమీ అని చెప్పాడు. ఆవిడ దాసీదానితోటీ దాసీది మరొకరితోటీ, మరొకరు మరొకరితోటీ గ్రామం అంతా అల్లుకు పోయింది. కరణం గొడ్డుమాంసం తినేవాడని ఊళ్ళో ప్రకటించి తన కప్రతిష్ట కలిగించాడని ఆయన శాస్త్రుర్లు మీద పరువు నష్టపు కేసు పెట్టాడు. ఆ కేసు విచారణలో ఈ క్రింది విశేషాలు తెలియ వచ్చినవి.

మేజస్ట్రీటు :- అంత పెద్దమాట యెందుకు వుపయోగించినా వయ్యా? మనం మాట్లాడు కోవడం వకరి మాట అర్థం వకరికి తెలియ డానికా? మరి యెందుకైనానా ?

శాస్త్రి :- మాది పండిత సాంప్రదాయం గనుక మా పాండిత్యం కనపడ డానికి కాస్త మారుమూల మాట ప్రయోగించి నానండి. పామరులు వుపయోగించే సామాన్యపు మాటలే మేమూ వుపయోగిస్తే మా పాండిత్యమూ మా ఆధిక్యమూ యేమిటండి ?"

మేజ :- "ఏదీ ఆ మాట ? లులాయమా ? నాకు చూస్తే నీవే బుద్ధి లేని లులాయం లాగు కనపడుతూ వున్నావే ! శాస్త్రి అనడం కంటె

నిన్ను లులాయ శాస్త్రీ అనడం బాగా వుండేటట్టు కనపడుతూ వున్నది" అన్నారు.

ఒక ప్లీడరు :- "లులాయశాస్త్రి అంటే అర్థం యేమి టండి ?"

మరొక :- "దున్నపోతు శాస్త్రి"

మేజ :- "నీవు చూపిన పాండిత్యానికి తగిన బిరుదు పేరు నీకు శాశ్వతంగా లభించింది...దురుద్దేశం కనపడ నందున కేసు కొట్టివేసి నాము. ఇకముందు నీవు యెప్పుడూ యిటువంటి పెద్ద మాటలు వుపయోగించబోకు"...

పై ప్రహసనము తెనుగులో వచన రచన ఎట్లుండవలె నను విషయములో వీరేశలింగముగారి మనస్సులో కలిగిన పరివర్తనకు ఫలితము. ఆ పరివర్తనను గూర్చి, తమ స్వీయచరిత్రలో ఇట్లు వ్రాసినారు:

"భాషవలని ప్రయోజన మేమి ?" జనులు తమ యభిప్రాయము లొండొరులకు దెలుపుకొనుట. భాషలోని గ్రంథముల వలన ప్రయోజనము ? తమ భావములను దూరమున నున్నవారికిని, రాబోవు తరముల వారికిని సులభముగా దెల్పుట. అట్టి సౌలభ్యము 'విగ్రహము' వంటి గ్రంథముల వలన కలుగునా ? కలుగదు. అందలి పదముల యొక్కయు వాక్యముల యొక్కయు నర్థమును దెలిసికొనుటకయి, సామాన్య జ్ఞానము గలవారికి నిఘంటువుల యొక్కయు పండితుల యొక్కయు సాయము కావలెను. ఇంత కష్టపడి అర్థము గ్రహింప గలిగినను వారందు క్రొత్తగా నేర్చుకొన్న దేమి ? సులభ వచన రూపమున నున్న పంచతంత్రములో నున్న దాని కంటె దీనిలో విశేష మేమి ? ఏమియు లేదు.

"అట్లయినచో గ్రంథము లెట్లుండ వలెను ? అందఱకు దెలియునట్లు సులభముగా నుండవలెను" అని నాలో నే నాలోచించుకొని, ముందు వ్రాసెడి పుస్తకములను విగ్రహమువలె క్లిష్టము గాక సుగమములుగా నుండునట్లు వ్రాయ నిశ్చయించుకొని, నా యభిప్రాయము నాలోనే యుంచుకొనక పత్రికా ముఖమున దెలిపితిని. పండితులు నాతో నేకీభవింపక యట్లుచేసినచో భాషయొక్క గౌరవమే పోవు ననియు,

బోసినోటివాడు బొక్కవలసిన పేలపిండివలె నిస్సారముగానుండుననియు, పేలవముగా నుండుటచేత రసికులైనవారి కట్టి వ్రాతలు రుచింపక చప్పిడి పాకమువలె నగ్రాహ్యముగా నుండు ననియు నిరసించుచు, పరిహసించుచు నానావిధముల నెకసక్కము లాడ జొచ్చిరి.

ఈ విషయమునుగూర్చి ఈ దిగువ 'నవల శాఖ'ను గూర్చిన చర్చలో వీరేశలింగముగారి రాజశేఖర చరిత్రను చదువునపుడు మరి కొన్ని సంగతులు తెలిసికొందము.

ఈ వచన నాటక, ప్రహసన శాఖల చర్చ ముగింపకపూర్వము తంజాపురి మధుర ప్రాంతముల వెలసిన తెలుగు వచన రచన నాటకము లను గూర్చి ప్రశంసింప వలసి యున్నది.

దక్షిణాంధ్రమున గూడ నాటకములు వెలసినవి. అందును పాత్రలచే తెనుగు వచన వాక్యములు పలికింప బడినవి. అవి చిలక మర్తివారి 'ప్రసన్న యాదవ' నాటకాదులలో వలె శుద్ధ గ్రాంధికములు గావు.

దక్షిణాంధ్ర కవయిత్రి రంగాజమ్మ రచించిన "మన్నారు దాస విలాస" నాటకములో పెండ్లిరంగములో వైదిక బ్రాహ్మణ శాఖకు చెందిన తిమ్మావధుల శేషమ్మ మొదలగు పేరంటాండ్ర సంభాష ణలు, గురజాడవారి కన్యాశుల్కములో అగ్నిహోత్రావధాన్లు భార్య వెంకమ్మను జ్ఞప్తికి తేగలవు. ఆవాక్యములటువంటి శుద్ధగ్రామ్యములో కూర్చబడినవి.

పై యుదాహరణము స్థాలీపులాక న్యాయమున నివ్వబడినది. దక్షి ణాంధ్ర వాఙ్మయము నుండి మనము గ్రహించవలసిన విశేషము లిం కను చాలగాగలవు. ఆంధ్ర వాఙ్మయ వృక్షశాఖలు ఎంత దూరము, ఎన్ని విధముల వ్యాపించినను అవన్నియు నొక్క చెట్టు కొమ్మలే యనుటకు సందేహము లేదు. దక్షిణాంధ్ర సీమలో వ్యాపించి, పెరిగి పెంపొందిన ఆంధ్రవాఙ్మయ మంతయు ఉత్తరాంధ్రులకు ప్రయాసము లేకుండ లభింప జేయుటకు ఆంధ్రప్రదేశ ప్రభుత్వమును, ఆంధ్ర యూనివర్సిటీ, వెంకటేశ్వర యూనివర్సిటీ, ఉస్మానియా యూనివర్సిటీ

వారును సంకల్పించి పనిచేయుట అత్యవసర మని విన్నవించి ఈ ప్రకరణము ముగించి ఉత్తరాంశముల ప్రశంసకు పోదము.

బ్రహ్మశ్రీ శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రిగారు 'ప్రబుద్ధాంధ్ర' పత్రిక లోను స్వతంత్రగ్రంథములు గాను ప్రకటించిన కంట్రాక్టు నాటకములు సంఘస్థితిని చిత్రించు నాటక, ప్రహసనములను మాఱచి పోకూడదు.

## 3. వ్యాస, ఉపన్యాసశాఖ

భాషా సేవకులగు వ్యాస రచయితలు తమ భావములను పత్రికలలో వ్యాసముల రూపమునను ప్రత్యేక గ్రంథ రూపమునను ప్రకటించుచుందురు. వారపత్రికలలో పక్షపత్రికలలో మాసపత్రికలలో సంవత్సరాది సంచికలలో ప్రత్యేక సంచికలలో ముఖ్యముగా చదువ దగినవి ఈ వ్యాసములే. దినపత్రికలలో కూడ వ్యాసములు అరుదుగా నుండును. ఇట్టి వివిధ వ్యాసముల మూలముగానే సారస్వతాభివృద్ధియు సంఘ సంస్కరణలును దేశాభ్యుదయమును సాధింప నగును.

రచయితల మనోగతాభిప్రాయములు వ్యాసరూపమున వెలయించుట సుకరము, సులభము; సదుపాయము, ప్రయోజనకరము. నేర్పుగా రచించిన వ్యాసములచేత సాధింప రాని ప్రయోజనము ఉండబోదు. ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రికలో కూచి నరసింహముగారు, వేటూరి ప్రభాకరశాస్త్రిగారు లోనగు పండిత ప్రకాండులు రచించిన వ్యాసములు భాషకు శాశ్వతములైన అలంకారముల వంటివి.

రెండువందల ఏండ్ల క్రిందట ఇంగ్లండు దేశములో ఎడిసన్ అను విద్వత్కవి యానాటి సంఘములో తల యెత్తుచున్న దురాచారములను కఠినముగా గాక హాస్య రస గర్భితములగు మంద మందమృదూక్తులతో నెత్తిచూపి సంస్కరింపదలచి Spectator అను పేరుగల పత్రికను స్థాపించి ప్రకటింప జొచ్చెను. Spectator అనగా చూచువాడు. ద్రష్ట, సాక్షియని యర్థము. పిఠాపురములో పానుగంటి లక్ష్మీనరసింహారావుగారు ఎడిసన్ పద్ధతినే యనుసరించి 'సాక్షి' యను పత్రికను స్థాపించి హాస్యరసగర్భితములగు మంద మృదూక్తులతో సంమో

ద్ధరణము నభిలషించి పనిచేయ సాగెను. వారి 'సాక్షి'లో వివిధ, విష యములను గురించి చక్కని వ్యాసములు వెలువడి పాఠకుల నలరింప జొచ్చెను. సాక్షి రచనలు ఆరేడు సంపుటములకు పెరిగినవి. అందు మృదువాక్యములతో లలిత రీతిని హాస్య ప్రధానముగా ఆంధ్ర సంఘస్థితి విమర్శింప బడినది.

'సాక్షికి' ప్రత్యేక సంఘ మున్నది. సంఘ కార్యస్థానము సత్యపుర మున తపాలాఫీసున కెదుటనే ఉన్నది. అందు వాణీదాసు, జంఘాల శాస్త్రి, బొజ్జయ్యశెట్టి మొదలగు సభ్యు లున్నారు.

లక్ష్మీదేవికి చేతిలో (పుష్పము) తామరఉన్నది. బ్రహ్మ దేవుడు కమలాసనుడు కాబట్టి అతని పృష్ఠభాగమున తామరగలదు. మరి సాక్షి సంఘసభ్యుడు బొజ్జయశెట్టిగారికి వంటినిండా తామరే, ఓయేనుగు తామర.

జంఘాలశాస్త్రి సంఘము తరపున మహోపన్యాసకుడు. సాక్షిలో చాలవఱకు "జంఘాలశాస్త్రి ఇట్లు పలికె" నని అతని యుపన్యాసములే గ్రంథస్థము కావింప బడినవి.

రాజమహేంద్రవరమున ప్రభుత్వ కళాశాలలో ఆంధ్రోపన్యాసకు లుగా పనిచేసిన వడ్డాది సుబ్బారాయ కవిగారు సంగ్రహ నామ మపే క్షించి వ. సు. రాయ కవియని వ్రాసుకొను చుండెను. నేడు యూని వర్సిటీలు 'వర్సిటీ'లగు చున్నవికదా ? అందు తప్పేమి గలదు ? అయి నను హాస్యప్రియులగు పానుగంటివారు పచ్చిపులుసు సుబ్బి శెట్టిగారి షష్టిపూర్తి ఉత్సవ ప్రదర్శన సందర్భములో ప. సు. శెట్టిగారని సహే ళనగా వ్రాసి పాఠకుల నవ్వించిరి.

పరమ ఛాందసుడైన యొక వైదిక బ్రాహ్మణుడు విద్యాభ్యాస నిమి త్తము దూరదేశముపోయి కొంతకాలము వఱకు తిరిగి రాలేదు. అతడు గతించినాడని నిశ్చయించి యీ చేదస్తుడు పాపమా పుణ్యస్త్రీ మరదలును బట్టి నిర్బంధ వితంతువుం జేయించి బలాత్కార వపనము గావించెను. మరికొన్నాళ్ళకు తోడియల్లుడు వచ్చి తన యిల్లా లిని చూచుకొని అపూర్వమైన తన యదృష్టమున కద్భుత పడెను.

తా బ్రతికి యుండగానే తనభార్య ముండమోసి యకేశయైన వైభవము కన్నులార చూచుకొను నదృష్ట మితనికొక్కనికే కలిగెను. "విభూది పండు చాటున కుంకుమభరిణ", "నెత్తికి ముసుగు, కాళ్ళకు పసుపు" నను నిటువంటి మాటలు వ్యంగ్యముగా నను చుండెను. పిచ్చివాని వేష ముతో కొంతకాలమిట్లు గడపి, నిజమెఱిగించి, భార్యను మరల ఐదువం జేయించి ఆమెతో సుఖముగా కాపురము చేసెను. ఇటువంటి వినోద వ్యాసములు, కథలు, విమర్శనలు పెక్కురచించి పానుగంటివారు భాషా సేవ చేసిరి. గ్రామ్య గ్రాంథిక భాషా వివాద సందర్భములో మరొక మారు పానుగంటి వారిని చూతము.

రచయితలు ఏకాంతముగా నొకచోట కూర్చుండి వ్యాసములు వ్రాయవచ్చును. ఆ విషయములే వందలు వేల సంఖ్యలలో తోడి మాన వులు సమావేశమై సభకూడినపుడు ఆ సభికుల యెదుట నావిషయ ములు వారి కాహ్లాదమగు రీతిని తెలియబల్కినపుడు అది ఉపన్యాసమని పించుకొనును. ప్రాచీన కాలములో గ్రీసు దేశములో డెమాస్థెనీస్ అను మహావక్త గంభీరోపన్యాస మిచ్చునపుడు శ్రోతలు ఆ వాగ్ధాటికి చిత్ర ప్రతిమలై వినెడివారట! సముద్రతీరమున నాత డుపన్యసిం చెనా సముద్రపు హోరు అతని వాగ్ఝరిలో మునిగిపోయి వినరాకుం డెడిదట? అలాగే ప్రాచీన రోముదేశములో 'సిసిరో' అను మహా వక్త ప్రఖ్యాతు డయ్యెను. బంగాళా దేశములో సురేంద్రనాధ బెనర్జీ గొప్ప వక్త అనియు, మహారాష్ట్రమున తిలకు గొప్ప వక్త అనియు, ప్రసిద్ధి. ఆంధ్రులలో రఘుపతి వేంకటరత్నంనాయుడుగారు మూడు గంటల సేపు ఒక్క బిగిని 'లెక్చరు' ఇవ్వగలిగే వారట! నిజము చేత ఇంగ్లీషు వక్తృత్వమునకు కృషిచేసినట్లు మన ఆంధ్రులు తెనుగు వక్తృత్వమునకు కృషి చేయలేదు. స్వరాజ్యోద్యమము బయ ల్వెడలిన తరువాత మన ఆంధ్రులలో కొందరు వక్తలు బైటకు రాదొడగిరి. అట్టివారిలో భోగరాజు పట్టాభిసీతారామయ్యగారు, ముట్నూరు కృష్ణారావుగారు, చెఱుకువాడ నరసింహం పంతులుగారు, యఱ్ఱమిల్లి జగన్న శాస్త్రిగారు, కేశవరపు కామరాజుగారు లోనగు

రాజకీయ వేత్తలు మంచి వక్తలని పేరుబడిరి. రాజకీయముగా గాకున్నను వేద, శాస్త్ర, పురాణాది విషయములను గూర్చి విశాఖ పట్టణ వాస్తవ్యులు ప్రభల లక్ష్మీనరసింహం పంతులుగారు గొప్ప వక్తలని దేశమంతటను ప్రసిద్ధి నొందిరి. తెనుగు ప్రజ, తెనుగున నుప న్యాసము లిచ్చుటకు కృషిచేయలేదు. చేయవలసిన అవసరము గూడ స్వరాజ్య ప్రాప్తితో అంతరించినది. మన తెనుగు దేశములో ఆంగ్ల మానస పుత్రులసంఖ్య పెచ్చుపెరిగి మితిమీరుచున్నది. అమ్మ, నాన్న, అప్ప, అన్న, చెల్లి, తమ్ముడు మొదలగు మాటలు కూడ మఱచి పోయిరి. మదరు, ఫాదరు, బ్రదరు, సిస్టరు మొదలైన ఇంగ్లీషు పదములు వాని స్థానము నాక్రమించినవి. అసలు తెనుగు అంతరించి గిరీశము తెనుగు అంతట అలుము కొనుచున్నది. భవిష్యత్తు? ఏమో!

## 4. కథలు

కథలను గూర్చి ఈ వఱకు కొంత ప్రస్తావించి యుంటిని. దైవ ప్రేరితము, ప్రకృతి సిద్ధము నైన శృంగారానుబంధ మహిమచే, స్త్రీ పురుషులు పరస్పరానురక్తు లగునట్లే సమస్తమానవులు కథా శ్రవణాసక్తు లగుట సహజమని యొక గ్రంథకర్త నుడివి యున్నాడు. తేనెకు మాధుర్యము వలెనే, కథలను గూడ ఒకానొక తీపి ఆశ్ర యించి యున్నది. మాటలర్థము చేసికొనగల పిల్లలుకూడ విస్ఫారిత నేత్రములతో చెవి యొరబెట్టుకొని అత్యంతాసక్తితో కథలు విను చుందురు. పాండవ కౌరవ విభేదములకు కారణమైన "గోత్ర కలహ మేల బుట్టె?" యని వ్యాసుని పృచ్ఛచేసి అతని నియోగమున భారత కథ చెప్పవచ్చిన వైశంపాయనునిచే జనమేజయుడు శ్రవణాశక్తిచే తనే భారతమును వినెను. శౌనకాదులు సూతుడు చెప్పగా కథల తీపి రుచి చూచుట చేతనే 18 పురాణములు వినిరి. నరవాహన దత్తునకు చిన్నకథలు మొదలు పెద్ద కథల వఱకు గోముఖుని వలన వినవలెనను నభిలాష; ఎడారుల క్రుమ్మరు బిడారు వర్తకులు అరబ్బులు, యవన యామినీ వినోద కథలు వినవలె నను సంకల్పము; కాంటర్బరీ

కథలు వ్రాసరు కవి ఒక కథాగుచ్ఛముగా కూర్చ నభీష్టము గలిగి నట్లే కాశీ మజిలీ కథల ద్వారా ఆంధ్రుల నలరింప వలెనని మధిర సుబ్బన్న దీక్షితులగారికి అభీష్టము కలిగెను. చిరకాలము నుండి తరతరములుగా నాంధ్ర జనులు చెప్పుకొనుచు వచ్చిన కథలను సలక్షణమైన ఆంధ్ర భాషలో పెక్కుసంపుటములు ప్రకటించి మన కందరకును మధిర సుబ్బన్న దీక్షితులుగారు వందనీయు లగుచున్నారు. వారు వ్రాసినది మనోరంజకమగు సులభశైలి. అదియు జాతీయమై, నీతి, బోధకమై మనోజ్ఞమై, సర్వాంగసుందరమై అలరారు చున్నది. పీఠికలో వారిట్లు సెలవిచ్చిరి: "మనము ఐహికాముష్మికముల విషయమై ప్రతి దినము కృషి చేయవలసి యున్నది. అందుకు జ్ఞాన బోధకములగు గ్రంథ ములే సాధనములు. అట్టి గ్రంథములు చదువుటకు పెక్కండ్రకుత్సా హము కలిగి యుండదు. వినోదములగు కథలు చదువు కొనుటకు ఎట్టి వారికి నభిలాష యుండక మానదు. ఈ కాశీమజిలీలు కేవలము వినో దార్థముగా కాలక్షేపము చేయువారికే. ఇందలి నీతులు. జ్ఞాన బోధయు విమర్శించిన పరమార్థ బోధకములై యున్నవని చదువరు లకు తెల్లము కాకమానదు. కావున యోగులకు, జోగులకు కూడ నీ కథలు శ్రోతవ్యములు...

"ఉ॥ పండితులైన మెచ్చవలె, పామరకోటికినైన నింపుగా
నుండవలెన్, ప్రబంధము నయోక్తుల నిర్వ్యవకర్త హితంబుగా
కుండిన తత్ప్రబంధ మది యొక్కప్రబంధమె ? సాధుపాలకా
ఖండ సుఖప్రదం బగుటగా ఫలమా? కవితా ప్రసక్తిన్"

అను యదార్థము గ్రహించి దీక్షితులుగారు గ్రంథము ననుకూలముగా వ్రాసియున్నారు. వీనిం జదివి యెల్లవారు నానందించుచున్నారు.

## తెనుగు నాట కథలు :

తెనుగునాట వెలసిన కథలను నాలుగువర్గములుగా విభజింపనగును.

౧. సంస్కృత మూలములు

౨. మహమ్మదీయమూలకములు

3. ఇంగ్లీషు మూలకములు

౪. జన పరంపరాగతములు నానా బాబతుల కథ.

ఇందొకటొకటే సంగ్రహముగా పరిశీలింతము -

౧. సంస్కృత మూలముల నుండి గై కొనబడిన కథలు:

1. దశకుమారచరిత్రము: కేతన రచించిన చంపువు కాక కేవల ఆంధ్రవచన గ్రంథముగా ఎనమచింతల సంజీవరాయ కవిగారును, వేదము వెంకటరాయ శాస్త్రిగారును తెనిగించిరి. సంస్కృత సాంప్రదాయములతోనిండి క్లిష్టరచనలు గలవగుటచేత వీనికి విశేషవ్యాప్తి కలుగలేదు.

2. కాదంబరి: బాణకృతమగు కాదంబరికూడ ఆనాడు తెనిగింపబడినది. ఇటీవల ఆంధ్రప్రభ కార్యాలయములో పనిచేయుచున్న విద్వాన్ విశ్వముగారు కాదంబరిని తెనిగించి వారప్రభ పత్రికలో ప్రకటించిరి.

3. ఆంధ్ర ఆదివారపత్రికలో శ్రీనివాస శిరోమణిగారు వాల్మీకమును వచనముగా తెనిగించిరి. అంతకు పూర్వము ఆనందముద్రణాలయమువారు తంజనగరం తేవప్పెరుమాళ్ళయ్యగారి చేతను దేవరాజసుధీ పండితుని చేతను వచనముగా రచింపించి బొమ్మలతో ముద్రింపించి చాల సంపుటముల క్రింద ప్రకటించిరి. యథాతథముగ తెనిగింపబడినను అవి సజీవములై తెనుగు సాంప్రదాయముల పాటించుచు ధారాశుద్ధి కలవి కాకపోయెను.

4. హితోపదేశమునుండి పలువురు గ్రంథకర్తలు పంచ తంత్ర కథలను తెనుగున వ్రాసిరి. రావిపాటి గురుమూర్తి శాస్త్రిగారు, కొక్కొండ వెంకటరత్నశర్మగారు, పరవస్తు చిన్నయసూరిగారు, కందుకూరి వీరేశలింగంపంతులుగారు - వీరందరు పంచతంత్ర కథలను తెనిగించిన వారే. కొక్కొండవారు కందుకూరివారు సంధి, విగ్రహములను కఠిన పాషాణ శైలిలో వ్రాసిరి.

5. శుకసప్తతి కథలు సంస్కృత మూలము గలవే.

6. విక్రమాంకదేవ చరిత్రము తిరుపతి వేంకట కవులచే తెనిగింప బడినది,

7. కథాసరిత్సాగరము సంస్కృత సాంప్రదాయములతో 'తెనిగించిరి.'

8. కాకినాడలో సరస్వతీ పత్రికాధి పతులు రాజతరంగిణి నాంధ్రీకరించిరి.

9. వసురాయ కవిగారు భారతమును వచనముగా వ్రాసిరి.

10. భాగవతుల రామమూర్తిశాస్త్రిగారు విక్రమార్క చరిత్రమును రచించిరి.

సంస్కృత నాటకకథలను గైకొని తెనుగువచనమున చదలవాడ సుందరరామ శాస్త్రులుగారు కూర్చిరి. ముద్రారాక్షసము, వేణీసంహారము, రత్నావళి, మాళవికాగ్నిమిత్రము, మాలతీ మాధవము, నాగానందము మృచ్ఛకటిక లోనగున వన్నియు నీ వర్గమునకు చెందినవే.

౨. మహమ్మదీయ గ్రంథములనుండి గైకొనబడిన కథలు:

1. Arabian Nights అను యవనయామినీ వినోదములు
2. పార్సీ వినోద కథలు
3. చారుదర్వేషు కథలు
4. హాతింతాయి కథలు
5. ఢిల్లీపాదుషా కథలు

6. సాహసిక కథార్ణవమున కొన్నికథలు మహమ్మదీయ మూలములనుండి గైకొనబడినవే.

తెలంగాణా ప్రాంతమున పరంపరాగతముగా వచ్చు చున్న కథలను కీ॥ శే॥ శ్రీ సురవరం ప్రతాపరెడ్డిగారు చక్కని కథల రూపమున ప్రకటించినారు. ఇంకను ప్రకటన కావలసిన పరంపరాగత వాఙ్మయము వారు విశేషముగా ప్రోగు చేసినారు. అదియంతయు ప్రాకట్యమునకు తెచ్చుట అత్యవసరము. వీరబల వినోదములు నిందు చేరవలసినవే. వీరబలుడు ఆంధ్రుడు. అతని అసలు

నామము మహేశ్వరుడు. వీరబలుడనునది అతని బిరుద నామము. నిరుపమానమైన సమయస్ఫూర్తి, అద్భుతమైన హాస్య రసము సాటిలేని చమత్కార ప్రసంగము గల మహానుభావులు లోకములో ముగ్గురే కనబడుచున్నారు. అందొకడు ఈసపు. ఆగ్నేయ గ్రీసు వాయవ్య ఆసియా ప్రాంతముల వాడు. రెండవవాడు ఆంధ్ర తెనాలి రామకృష్ణుడు. మూడవవాడు ఆంధ్ర మహేశ్వర నామకుడగు రాజావీరబల్ బిరుదాంకితుడు. అక్బరు పాదుషా వీరబలుని చూడకుండ ఒక గడియసేపైన నుండలేకపోయెడివాడట! గోల్కొండ నవాబుల కథలును ఈ వర్గమున జేరునవే.

3. ఇంగ్లీషు గ్రంథముల నుండి తెనిగింప బడిన కథలు :

Lamb ద్వార వ్రాసిన షేక్స్పియర్ నాటక కథలను వీరేశలింగముగారు ఉచితరీతిని తెనుగులో వ్రాసిరి. వెన్నెలకంటి సుందర రామశర్మగారు Merchant of Venice ను సుశీలయను పేరుతో తెనుగున రచించిరి. Hamlet ను వీరవర్మయని ప్రతీతుడు, కల్యాణి నామములతో మరికొన్ని కథలను రచయితలు తెనుగున వెలయించిరి. ప్రాచీన గ్రీసు దేశపు పురాణ కథలు, తాతలనాటి పాత కథలు, ట్రాయి పట్టణ కథలు, యవన సుందరి కథ ఇత్యాదు లీ వర్గములోనివే. ఇటీవలి వార పత్రికలలో ఇంగ్లీషు మూలములనుండి పెక్కు కథలు తెనిగింప బడుచున్నవి.

4. నానా బాబతుల కథలు :

వీరేశలింగముగారి నీతి కథా మంజరి, తేకుమళ్ళ రాజగోపాల రావుగారు రచించిన తెనాలి రాముని కథలు, మర్యాద రామన్న కథలు, తిమ్మరుసు కథలు, చిలకపాటి వేంకట రామానుజ శర్మగారి చమత్కార కథా కల్లోలిని; చిలకమర్తివారి వినోదములు (Tit-bits) మంగు వేంకట రంగనాథరావుగారి వినోద కథలు, బులుసు పాపయ్యశాస్త్రిగారు వ్రాసిన బాచిగాని కథలు, దేశమాతలో ప్రకటింపబడిన భారత నీతి కథలు, ముడియం సీతారామారావుగారి భారత కథలు, సీతావనవాసము మొదలగు పురాణ కథలు, విజయనగర

రాజుల కథలు, రేచుక్క పగటిచుక్కలను దొంగల కథలు, మదన కామరాజు కథలు, భేతాళ పంచ వింశతి, ద్వాత్రింశత్సాలభంజి కల కథలు, పలుకని పద్మావతి యను మౌనధారిణి కథ; పండ్రెండు గురు రాజుల కథలు, ముప్పది యిద్దరు మంత్రుల కథలు, కథావీధి పత్రిక కథలు, చిత్తూరు రాజుల కథలు, బుద్ధుని జాతక కథలు చాల కాలమునుండి 'చందమామ' యను తెనుగు మాస పత్రికలో బొమ్మలతో కూడ చక్కనికథలు ప్రకటింప బడుచున్నవి. ఇందు కొన్ని పౌరాణికములు భారత భాగవతాదులలో గల కథలు. మరి కొన్ని జన పరంపరాగతములు, నలుగురు మంత్రుల కథ. బట్టివిక్రమార్కుల కథలు, పండ్రెండుగురు మంత్రుల కథలు, దక్కను పూర్వకథలు, పప్పాకం అనంతాచార్యులుగారి మంజువాణీ విజయము, బయ్యాపునేడి జోగయ్యగారి సుశీల, మంజువాణి వారి నిజమగు కాశీమజిలీలు.

## 5. యాత్రా చరిత్రము

"దేశాటనం పండిత మిత్ర తా చ." "ఏయే దేశములన్ చరించితిరి" ప్రవరుడు. భాగ:– "ఏ వర్తనంబున నింతకాలము మీరు సంచరించితి రయ్య జగతిలోన?" 'మిమ్ము పొడగని భాషించు మేలె చాలు!'

పరమేశ్వరుని జగద్రూప విలాసములలో కొంతవఱకైన కనులార చూడ వేడుక కలిగి మహనీయములగు పర్వత సీమలను, సర్వాంగ సుందరములగు నదీ నదములను, ప్రకృతి రమణీయములగు లోయలను, వివిధ జనాకీర్ణములగు జనపదములను కనులార చూచి యానందించువారై ధనవ్యయ శరీరాయాసములకు లక్ష్యపెట్టక దేశాటనము చేయ గోరువారు అన్ని కాలములందును, లోకమంతటను, ఎందరెందరో ఉందురు. అట్టివారి యనుభవ వివరములే సారస్వతములో యాత్రా చరిత్ర లగుచున్నవి. యాత్రల మూలముగా లోకజ్ఞాన మభివృద్ధి చెందినట్లు మరి దేనివలనను వృద్ధి కాదని వక్కాణింప నగును.

అర్జును తీర్థయాత్ర పాండవుల తీర్థయాత్రలు మొదలుగా సాహిత్య ప్రయోజనముగల పుణ్యక్షేత్ర సందర్శనములను గురించి ఈవఱకు

కొంత ప్రసంగించితిని. బ్రౌను దొరగారి ప్రేరేపణ చేత ఏనుగుల వీరా స్వామయ్యగారు రచించిన కాశీయాత్రా చరిత్ర రాజకీయము గాను, చారిత్రకము గాను చాల విలువగల సాహిత్యగ్రంథ మనదగును. పరవస్తు చిన్నయసూరిగారి సమకాలికుడైన కోలా శేషాచల కవి గారు నీలగిరి యాత్రా చరిత్ర చక్కగా రచించిరి. వేటూరి ప్రభాకర శాస్త్రిగారు ఈ గ్రంథమును ప్రశంసించిరి. అల్లూరి లక్ష్మీనర సింహంగారి పురుషోత్తమ చరిత్ర యాత్రా పరమైనదే. వెంకటేశ్వ రయ్య విరచితమైన గంగాసేతు యాత్రా ప్రకరణము అట్టిదే. బొబ్బిలి మహారాజా వారితో కూడ మండపాక పార్వతీశ్వర శాస్త్రిగారు చేసిన దక్షిణయాత్రల వివరణము సాహిత్య సౌరభము వెదజల్లు చక్కని గ్రంథము. మున్నంగి లక్ష్మీనరసింహ శర్మగారి శ్రీశైల యాత్ర చరిత్ర గమనార్హము. ఇంగ్లీషు 'గలివరు' యాత్రలు తెనిగింప బడినవి.

పవిత్రమైన హిందూదేశములో గల పుణ్యక్షేత్రముల సందర్శించి భక్తులు జన్మము పావనము చేసికొనుటకు ప్రభుత్వమువారు కొన్ని సౌకర్యములతో చౌకటిక్కెట్లు అమ్ముచున్నారు. మరికొందరు గడ సరులు తమ యాజమాన్యమున స్పెషలురైలు బళ్ళకు ప్రభుత్వ ముతో కంట్రాక్టుచేసి, యాత్రికులవద్ద డబ్బు వసూలుచేసి భక్తులచేత పుణ్యతీర్థ "దర్శనం" చేయించు చున్నారు. గుంటూరులో గ్రంథ ప్రకాశకు లొకరు మనదేశములో సందర్శింప వలసిన పుణ్య క్షేత్రములు ఉత్తర దక్షిణ హిందూస్థానముల గల సమస్త క్షేత్రము లను, వాని విశేషములను పుస్తక రూపమున ప్రకటించినారు. ఆ గ్రంథమొక సూచిక (Directory) వలె నగపడునే గాని సాహిత్య ప్రయోజనము కలదానివలె నగపడదు. సాహిత్య సౌరభ సహిత మైన వివరములతో చక్కని యాత్రార్థ ప్రకాశిక ప్రకటించుట అత్యవసరమే గాక పరమ ప్రయోజనకారి కాగలదు. గజస్నానము, ఏనుగు నీటిలో మునిగినను దాని యొడలి మురికి పోదు. కాకుల వలెను, ఏనుగుల వలెను తీర్థములలో మునిగి కొంత మాత్రము చేత

లాభము లేదు. ఆస్తికులై భగవంతుని యందు భక్తి విశ్వాసము గలిగి తీర్థ ప్రాశస్త్యమును గుబాళింపగల సౌరభోపేతములైన రచనలు అపేక్షణీయములు.

## 6. నవలలు

సంస్కృతములో "నవలా" శబ్ద మున్నది. ఇంగ్లీషులో 'Novel' 'నోవెల్' శబ్ద మున్నది. ఆమాటకు 'అపూర్వము, అద్భుతము, ఆశ్చర్యము' ను నర్థము కలదు. అద్భుతకథా సంవిధానము చేత పింగళి సూరన్న రచించిన కళాపూర్ణోదయమే తెనుగు భాషలో వెలసిన మొదటి నవల యన దగియున్నది. అయితే కేవల వచన రూపమున వెలసిన ఆఖ్యాయికలనే నవల లను చున్నారు. ఆదృష్టితో చూచినపుడు వీరేశలింగముగారి రాజశేఖర చరిత్రయే మొదటి తెనుగు నవల అనదగి యున్నది. ఆ గ్రంథము రచింప బడుటకు పూర్వము కొంత కథ నడిచినది. పాఠకు లా కథ తెలిసి కొనుట ముఖ్యము.

వీరేశలింగముగారు రచించిన 'విగ్రహాము'ను చూచి మిగుల ప్రీతులై సమర్థి రంగయ్య శెట్టిగారు* వారికొక జాబు వ్రాసిరి. "తెనుగులో నొక స్వయంకల్పిత మైన వచన ప్రబంధమును వ్రాయు

---

* సమర్థి రంగయ్య శెట్టిగారు ఆంధ్రులు. మద్రాసు క్రిస్టియన్ కాలేజిలో గణిత శాస్త్రాధ్యాపకులు. అయినను వారు తెనుగు భాషమీద మంచి ఆదరము, అభిమానము గల పండితులు. మద్రాసు యూనివర్సిటీ తెనుగు పరీక్షల బోర్డునకు వారు చిరకాలము అధ్యక్షులుగా నుండిరి. B. A. విద్యార్థు లెవరైన అయనను సందర్శించి "English, Optionl subjects లో pass కాగలను కాని, తెనుగు సందేహం అండి; తమరు కటాక్షించి నన్ను ఒడ్డునవేసి రక్షించాలి" అని పరితాపం తరం అభ్యర్థులు వేడుకొనినచో "ఏమయ్యా! స్వభాష కదా? నిర్లక్ష్యము చేయ వచ్చునా?" అని మందలించి, ఉల్లసమాడి, సెంబరడిగి తెలిసికొని, నోటు చేసికొని ఆ యభ్యర్థి తెనుగులో తప్పిపోకుండ ఉపకారము చేసెడి వారని, వాడుక. ఆ విధముగా రంగయ్యశెట్టిగారి కృపకు పాత్రులై పట్టభద్రులు కాగలిగినవారికి రంగయ్యశెట్టి గ్రాడ్యుయేట్లని పరిహాసనామ ముండెడిది. తెనుగు రానివా రనేకు లిట్లాగాడు B. A. డిగ్రీ పొందుచుండిరి.

టకు మీరు పూనుకోలేరా" అని అందులో వారు కందుకూరి వారికి సూచన చేసిరి. అందుపైని 'కం. వీ.' గారు ఇంగ్లీషులో Goldsmith రచించిన Vicar of Wakefield గ్రంథమును పోలి, తెనుగు సాంఘిక జీవనమును చక్కగా చిత్రింప గలట్లు రాజశేఖర చరిత్ర రచించిరి. ఆ నవల తెనుగువారందఱచే గొనియాడబడుటయేగాక ఇంగ్లీషు భాష లోనికిని మరికొన్ని యితర భాషల లోనికిని తర్జుమా చేయబడి నది. లండను టైమ్సు పత్రిక కూడ దీనిని శ్లాఘించుచు ప్రత్యేక వ్యాసము వ్రాసెను. రాజశేఖర చరిత్ర శైలిని గూర్చి 'Hindu' హిందూ పత్రికాధిపతు లపుడు వ్రాసిన విమర్శనము, ఈ వ్యాసము నకు మిగుల నుపయుక్తముగా నుండగల దని తలచి దాని నిట వివ రించు చున్నాము. (చూ. కం. వీ. లింగముగారి స్వీయచరిత్ర రెండవ భాగము. పుట 150) :—

"మంచివియు, నుపయుక్తము లైనవియు నైన పుస్తకముల విష యమున దేశభాషా వాఙ్మయము వంధ్యముగా నున్నదనియు, ఉన్న కొన్ని పుస్తకములును, సాధారణ సామర్థ్యము గల చదువరులకు నెంతమాత్రమును మనోహరముగా నుండనంతటి యతి కృత్రిమ కఠిన శైలియందు ఉండుటచేత పాఠక సామాన్యమునకు సుగ్రాహ్యములు కాకున్నవనియు ఇంతవఱకు మొఱ్ఱయయి యున్నది. ముఖ్యముగా తెలుగు భాషయందు గనుపట్టు పట పటాయమాన పదాటోప బలి పీఠము ముందు, భావములను బలిపెట్టెడి యీ లోపము కొంత వఱకు పాఠశాల పుస్తక సమాజము ('School Book and Literature Society') ప్రకటించిన పుస్తకముల వలన తొలగింప బడు చున్నది. కాని ఈ గ్రంథ ములు వేఱు కొనకు తప్పుదారిని పట్టుచున్నవని భయపడు చున్నాము. సౌలభ్యముకొఱ కవి వ్యాకరణముయొక్క ప్రాథమిక నియమములనే యుల్లంఘించుచు కొన్ని సమయము లందు భాషయొక్క స్వభావ ధర్మములనే అతిక్రమించు చున్నవి. పారితోషికమును సంపా దించు కొనుటకై సమాజము యొక్క కృత్రిమ కాల్పనిక శైలి ననుస రింప వలసిన వారైన సమర్థులైన పండితుల చేతనే వ్రాయబడిన వైనను

ఈ గ్రంథములు నవకల్పనా విహీనములై బలమైన శైలి లేనివై నిస్తేజముగాను, నిస్సారముగాను, నిర్జీవముగాను గన్పట్టు చున్నవి. ఉత్తమమైన మధ్యమ పంథ ప్రామాణిక గ్రంథములలో గానబడుచు, గతించిన యాంధ్ర భాషా సంజీవనీ విలేఖకునిచేత ననుదిన వ్యవహారమునకు సహితము తీసికొని రాబడిన కఠిన కృత్రిమ శైలికిని, దేశభాషా సాహిత్య సంఘము వారి వివిధ భాషాంతరీకృత గ్రంథముల లోని నియమ శూన్య నిర్జీవ శైలికిని నడుమగా నెందేని యుండునని మేము భావింపు చున్నాము. ఈ కడపటివి శైలియందును, పాకము నందును సామాన్య స్థితిని మించినవి కానందున సత్కావ్యకోటిలో పరిగణింప బడుట కర్హములైనవి కాకపోయినను సర్వకళాశాలా పఠనీయ పుస్తకావళిలో నడుగిడినందుకు మేము చింతించు చున్నాము. కాబట్టి కందుకూరి వీరేశలింగము పంతులుగారి రెంటికిని నడుమ 'సమ్మోదప్రదమైన క్రొత్తత్రోవ త్రొక్కినందుకు మేము సంతోషించు చున్నాము.' కఠినము, క్లేశప్రదమును గాకసంస్కారహీనమును, గ్రామ్యమును గాక, ఈయన శైలి జాతీయముగా మనోహరముగా నున్నది. దేశభాషా సాహిత్య సమాజము వారి గ్రంథములలో వెదకినను కానరాని ధార ఈయన గ్రంథమునం దున్నది. రాజశేఖర చరిత్ర గ్రంథకర్త, తన విషయముతో పరిచితుడై, తన పరిసరములను విషయమునకు తగినట్టుగా మార్చునట్టి నైపుణ్యము గలవాడు...... కీర్తికాములైన యనేకాంధ్ర గ్రంథకర్తల వలె ఇంగ్లీషు పేరులను, మాటలను అట్లే యుంచుటలో స్వాభావిక యోగ్యత కలదని ఆంధ్రప్రాయముగా తలచు వాడు గాడు. నీతిచంద్రిక, విగ్రహ గ్రంథకర్త తన పూర్వ సాహచర్యములను పూర్తిగా విడనాడి తెనుగు వాఙ్మయము నందు సంపూర్ణ నూతన మార్గము నవలంబింప గలుగునని మేము తలంచి యుండలేదు. తెలుగు వాఙ్మయము యొక్క చరిత్ర యందు రాజశేఖర చరిత్ర నూతన శకము నేర్పఱుచు చున్నదని మేము చక్కగా చెప్పవచ్చును."

నిశ్చయముగా ఆంధ్ర వచన వాఙ్మయమందు రాజశేఖర చరిత్ర

నవలా శక మనెడి నూతన శకము నేర్పఱచినది. తెనుగులో పద్య కావ్యములు వలసినన్ని యున్నందునను, అందులో శృంగార ప్రబంధముల వలన కలుగు మేలుకంటె కీడే ఎక్కువగా కలుగుచున్నందునను పంతులుగారటుపై ఆంధ్ర ప్రజా సమ్మత మైన వచన కావ్య రచనకే తమ జీవితమును ధారవోసిరి. భాషా వాఙ్మయములలో నింత ప్రాముఖ్యమైన మార్పు వచ్చుటకు కారణము వీరేశలింగము గారి వివేకమేనని చెప్పనొప్పును. లులాయ శాస్త్రి ప్రహసన విమర్శ సందర్భమున వారు చక్కగా వక్కాణించిన వాక్యము లక్కడ ఉదాహరించి యుంటిని.

రాజశేఖర చరిత్ర ప్రకటనానంతరము, ఆంధ్ర భీష్మ బిరుదాంకితులగు న్యాపతి సుబ్బారావు పంతులుగారు చింతామణీ పత్రికను స్థాపించుటేగాక నవలా రచనను ప్రోత్సహింప పోటీలు పెట్టి బహుమానము లిచ్చుచు వచ్చిరి. ఈ పోటీల మూలముగా ఆంధ్రజాతి యదృష్టముచేత చిలకమర్తి లక్ష్మీనృసింహముగారి సారస్వత ప్రతిభ బహిర్గతమయి మిక్కిలి పరిమళించినది.

వారు మొదట అల్లాఉద్దీన్ ఖిల్జినాటి రాజపుత్ర చరిత్ర సంబంధమైన హేమలతను రచించిరి. పిమ్మట మహారాష్ట్ర చరిత్రాత్మక మైన అహల్యాబాయి నవల రచించిరి. ఈ రెండును తెనుగు నాట కూర్పబడిన చరిత్రాత్మకమైన నవలలో మొదటివి. వీని రచనతో చిలకమర్తి వారికి "Andhra Scott" అను బిరుదము లభించినది. ఖండవిల్లి రామచంద్రుడు టిప్పు సుల్తాను నాటి చరిత్రాత్మక నవల, లక్ష్మీ సుందర విజయమును రచించెను.

లక్ష్మీనరసింహముగారు కేవల చరిత్రాత్మక నవలలనే గాక సాంఘిక నవలలను కూడ రచించిరి. రామచంద్రవిజయ మానాటి కోనసీమ అమలాపుర ప్రాంతములలో సంఘ జీవనమును అద్దమువలె ప్రతిబింబింప జేసినది. వరకట్నముల వలన సంఘమునకు కలుగుచున్న అనర్థములను 'రాజరత్నము' చక్కగా చూపగల్గినది. సౌందర్య తిలక, జరాసంధ వధ కథతో సంబంధముగల పౌరాణిక నవల.

శ్రీ రమేశచంద్ర దత్తుగారు రచించిన Lake of Palms అను నింగ్లీషు నవలను చిలకమర్తివారు 'సుధా శరశ్చంద్రము' ను పేరుతో ఆంధ్రమున ననువదించిరి.

బంగాళా దేశమున బంకించంద్ర చాటర్జీగారు రచించిన 'ప్రఫుల్ల ముఖి' అను దేవీ చౌధురాణిని కె. భాస్కరరావుగారాంధ్రాభిమానముతో చక్కగా తెనిగించెను. అది మొదలు శరత్‌బాబుగారి బంగాళా నవలలు తెనుగులోనికి బాహాటముగా రాజొచ్చినవి. వాటినిగూర్చి ఇపుడే మరల ప్రశంసింతము.

ప్రఫుల్లముఖి తెనిగింపబడిన కాలములోనే విజ్ఞాన చంద్రికా మండలి కార్యస్థానము హైదరాబాదునుండి చెన్నపురికి మార్చబడినది. మండలివారు చరిత్రాత్మక నవలలు మాత్రమే ప్రకటింప నుద్యమించిరి. అందు వేలాల సుబ్బారావుగారి 'రాణీసంయుక్త' మొదటిది. మహమ్మద్ ఘోరీ ప్రచండ సైన్యముతో హిందూస్థానముపై దండెత్తి రాగా పృథ్వీరాజును, అతని సతీమణి రాణీసంయుక్తయు, తురుష్కులతో ఘోరముగా పోరి వీరస్వర్గము నందిన భయంకర చరిత్ర, ఈ నవలలో వర్ణితము. తరువాత భోగరాజు నారాయణ మూర్తిగారు 'విమలాదేవి' రచించిరి. ఔరంగజేబు రాజకుమారి విమలాదేవిని చేకొనిపోన యత్నింపగా రాజసింహు డడ్డుపడి, విమలను రక్షించి, ఔరంగజేబును పరాజితుం జేసిన కథ ఇందు వర్ణింపబడినది.

విజ్ఞాన చంద్రికా మండలి స్థాపింపబడిన కొలది కాలములోనే బందరులో ఆంధ్ర భాషాభివర్ధిని స్థాపింపబడెను. శివాజీ కాలమునాటి చరిత్ర ప్రభావతి యను నవలలో వర్ణితము. బందరు గ్రంథమాల వారే దానిని ప్రకటించిరి.

అంతలో నిడదవోలులో వేంకట పార్వతీశ్వర కవులు మరొక గ్రంథమాల స్థాపించి, వసుమతీ వసంతము వంటి స్వతంత్ర నవలలను, దుర్గేశనందిని, నీలాంబరి వంటి భాషాంతరీకృత నవలలను ప్రకటింప జొచ్చిరి. అదే ఆంధ్రప్రచారిణీ గ్రంథమాల.

నీలాంబరి అపరాధ పరిశోధక నవల. సంఘములో ఘోర హత్యలను, దారుణములైన చోరీ, బందేటు నేరములను చేయుచు, జాడ తెలియకుండ పరారి యగుచుండు ఘోరాపరాధులను పట్టుటకు తెలివితేటల నుపయోగించి, కూపీలు తీసి, జాడల వెతకి పట్టుకొనుటకు బుద్ధిసూక్ష్మత గల పరిశోధకులు గావలెను. బంగాళములో 'అరిందము' పట్టుకొనిన నేరములు చక్కని పరిశోధక నవలలుగా ప్రకటితమగు చున్నవి. ప్రజల అభిరుచులను బట్టి ఈనాడు ఆంధ్ర వార పత్రిక వారు బహుమతులిచ్చి పోటీ బెట్టి అపరాధ పరిశోధక నవలలను ప్రకటించు చున్నారు.

ఆ సమయముననే కొంతకాలము రాజమహేంద్రవరములో ఆంధ్ర ప్రచారిణీ గ్రంథమాలకు ఆధ్వర్యము వహించిన శ్రీ అద్దేపల్లి లక్ష్మణస్వామినాయుడుగారు, స్వతంత్రముగ "సరస్వతీ గ్రంథమండలి" యను పేర నొక గ్రంథమాలను స్థాపించిరి. ఆ గ్రంథమండలి నింత వరకును నిర్విఘ్నముగ నడిపించుచును బహు గ్రంథముల బ్రకటించు చున్నారు.

విజ్ఞాన చంద్రికా మండలివారి నవలల పోటీల మూలముగా "విజయ నగర సామ్రాజ్యము" ను దుగ్గిరాల రాఘవచంద్రయ్య చౌదరిగారును, 'రాయచూరు యుద్ధము' ను కేతవరపు వేంకటశాస్త్రిగారును, 'అస్తమయము'ను భోగరాజు నారాయణమూర్తిగారును, 'పాతళ భైరవి' ని ఎ. వి. నరసింహము పంతులుగారును రచించిరి. కేతవరపువారు 'మదాలస' 'తారాబాయి' అను మరిరెండు నవలలను కూడ రచించిరి. పిఠాపురమున చెలికాని లచ్చారావుగారు కృష్ణరాయలనాటి చరిత్ర దెలుపు 'ప్రభాతము'ను నవలను ప్రకటించిరి.

బరంపురమున 'వేగుజుక్క' గ్రంథమాల వారిచే ప్రకటింపబడిన 'సగుణ' యను నవల మహారాష్ట్ర రాజ్య వినాశమును, బ్రిటిష్ రాజ్య స్థాపనమును గూర్చిన చరిత్రాత్మక మగు నవల. మూడు సంపుటములలో 752 పేజీలు గల యుద్గ్రంథముగా ప్రకటింప బడినది. ఆ నవల యొక్క ప్రాశస్త్యమును గూర్చి గ్రంథమాల సంపాదకు లిట్లు వ్రాసిరి:

"పేజీల సంఖ్య యటుండ గ్రంథ బాహుళ్యమును, కథా కల్పనా విస్తారమును పాత్ర గుంభనమును ఎంచిచూడ నింత పెద్ద గ్రంథ మాంధ్రభాషలో నిదివఱకు ప్రచురింప బడినటుల గానరాదు."

గ్రంథ మాలికలు ప్రకటించినవిగాక ఆంధ్రయూనివర్శిటీ వారును పోటీలు పెట్టి బహుమాన స్పర్థ పెంచి చరిత్రాత్మక నవలల రచింపించు చున్నారు, భువన విజయము, రుద్రమదేవి, తంజావూరిపతనము మొదలగు నవలలు చరిత్రాత్మకములు; ఆంధ్రయూనివర్శిటీ ప్రకటితములు.

చరిత్ర పారము లేనిది. మేధా సంపన్నులైన కుశలుర చేతిలో కథా కల్పన మెంత హృద్యముగా నైన సాగవచ్చును. చరిత్రాత్మక నవలల రచనలకు అనంతమగు నవకాశము లున్నవి. నన్నయభట్టు కాలము నాటి నవలగా ఈ మధ్య 'నారాయణభట్టు' రచింపబడినది. ఆంధ్ర యూనివర్సిటీవారు పాతికేండ్ల క్రిందట సాంఘిక నవలల పోటీ పెట్టగా అడవి బాపిరాజుగారు "నారాయణరావు"ను విశ్వనాథ సత్యనారాయణగారు "వేయి పడగల"ను రచించి బహుమతు లందుకొనిరి. ఈ వ్యాస కర్త "మీ నవలకు నారాయణరావు" అని ఎందుకు పేరు పెట్టినారని బాపిరాజుగారి నడుగగా "తెనుగు దేశములో ఏపేరు కంటెను 'నారాయణ' నా మమునకు వ్యాప్తి ఎక్కువ ఉన్నది. చూడండి సత్యనారాయణ, సూర్యనారాయణ, వెంకటనారాయణ, భావనారాయణ, భగవన్నారాయణ, యజ్ఞనారాయణ అను నిట్టి చేర్పులతో నారాయణ నామ వ్యాప్తియే అత్యధికము గనుక నా నవలకు, 'నారాయణరావు' అని నామకరణము చేసినా నన్నారు. "వివిధ విషయములను కూర్చి వ్రాసిన వ్యాస పరంపర నొక కొలికికి తెచ్చి ముడివేసి, 'వేయిపడగల' ని పేరు పెట్టితి" నన్నారు విశ్వనాథ వారు. అదిగాక వారు "మా బాబు" మొదలగు ననేక నవలల రచించినారు.

"తెనుగులో హాస్యరస ప్రధానమైన నవలలు లేవ" ని వేమూరి విశ్వనాథ శర్మగారిని ప్రోత్సహించగా చిలకమర్తివారు, 'గణపతి' ని

రచించిరి. ఈ గణపతి చదివి కడుపుబ్బ నవ్వనివారు తెనుగునాట ఉండరు. వారే రచించిన కర్పూర మంజరిలో కుటిలుడగు తమ్ముడు, తన అన్నగారైన హేమచంద్రుని చంపించి రాజ్య మాక్రమించి అన్నబిడ్డలను గూడ హింసింప యత్నింపగా ఆ ప్రయత్నము సాగనీయక హేమచంద్రుని పుత్రికామణి ప్రతిభావతి కర్పూరమంజరి యడ్డుపడి, పినతండ్రిని భగ్నమనోరథుంజేసి శిక్షించిన ధీరవనిత. ఆ సాధ్వీమణి చరిత్ర చిలకమర్తి వారు రెండు సంపుటములుగా ప్రకటించిరి.

## భాషాంతరీకృత నవలలు

తెనుగు వారు స్వతంత్రముగా తెనుగున రచించిన నవలల సంఖ్య అత్యల్పము. బంగాళ, ఆంగ్ల, కర్ణాట, పరాసు, రష్యన్ భాషల నవలల నుండి తెనిగింప బడిన పెక్కు గ్రంథము లిపుడు తెనుగునాట వ్యాప్తి గనుచున్నవి. బెంగాలీ భాషనుండి బంకిం చంద్ర చాటర్జీ గారి నవలలే గాక శరత్ బాబుగారి యనువాదములు దేశీ కవితా మండలి వారు చక్కగా తెనిగించి ప్రకటించు చున్నారు. తెనుగు నాటి యువతీ యువకులు విరాజ్ బాహూ, శేషి మొదలగు నవలల నత్యాసక్తితో చదువుచున్నారు.

రష్యా దేశ విప్లవమునకు ముఖ్యకారణము టాల్‌స్టాయి గారి కథలు, నవలలును. శ్రీ ముద్దా విశ్వనాథముగారు అందలి కథలను చక్కగా నేర్చి తెనుగు సంఘ జీవనమున నప్పునట్లు తెనుగు వారి కింపగు రీతిని టాల్‌స్టాయి గ్రంథ సారమును వ్రాసి అందిచ్చిరి. అన్య భాషల నుండి ఇట్లాంధ్రీకృతములగు గ్రంథముల ప్రకటన ఆంధ్రాభ్యుదయమునకు అత్యవసరము.

ఆంధ్రుల కుత్సాహము అత్యధికము. అందధిక సంఖ్యాకులు "తమరు వ్రాయుచున్నది తెనుగుప్రజకోస" మను సంగతి మరచి ముక్కకు ముక్క అర్థముగా తెనుగు వ్రాసి రసహీనము నిర్జీవము లైన పద్ధతిని తెనిగించుచున్నారు. దేశములు, జాతులు, భాషలు, సంఘజీవన పద్ధతులు, ఆచార వ్యవహారములు మొదలగునవి చాల

భేదముగా నుండుటచేతను ఈ భేదములను, వివరములను సరిగా గ్రహించి ఆమోదించ గలంతటి సంస్కృతి సామర్థ్యములు సామాన్యముగా తెనుగు ప్రజలలో తక్కువగా నుండుటచేతను Ivanhoe- Les Miserables, David Copper Field మొదలగు పడమటి గ్రంథకర్తల నవలలు " అల్లాటప్పు పద్ధతిని ఎత్తర దొత్తరగా ఏభ్యరాసులుగా " తెనిగింప బూనుట ప్రయోజన శూన్యమగునని నా విజ్ఞప్తి. వీరేశలింగము గారు Vicar of wake Field ను మొదట యథా శథముగ తర్జుమా చేయనెంచి, అనుభవము వలన నయ్యది మిథ్యా మనోరథమని లెస్సగా తెలిసికొని ఆ ప్రయత్నము మాని, తెనుగు సంఘ పరిస్థితుల కనుకూలముగా కథను నప్పించి రాజశేఖర చరిత్రమును సకల ప్రమోదకరముగా రచింప గల్గిరను గుణపాఠము మఱువ కూడదని యీ విజాతి నవలల నాంధ్రీకరింప నెంచు మా ఆంధ్ర సోదర సోదరీమణులను హెచ్చరించు చున్నాను. బంకించంద్రుడు చిన్ననాడు పాశ్చాత్య నవలలను విశేషముగా చదివి అవి పెంపొందిన క్రమము నవగాహనము చేసికొని పద్ధతులను చక్కగా జీర్ణించుకొని అవి తన బంగాళా దేశపు సంఘ పద్ధతుల కనుకూలముగ క్రమమున నవలా రచన సాగించెనుగాని Ivanhoe, Talisman, Kenil - woth, Bride of Lammer moor - మొదలగు నవలలను మక్కీకి మక్కీ ముక్కకు ముక్క పద్ధతిని బెంగాలీ భాషలోనికి చచ్చు తర్జుమా చేయలేదు. తల్లాప్రగడ సూర్యనారాయణ రావుగారి మాధవీ కంకణము; రామశాస్త్రిగారి చంద్రగుప్త; పంద్రంగి రామారావుగారి సుహృల్లత; నరసింహారావుగారి అరవింద; కిలాభివర్ధిని వారి ఖిధునాను రాగము చదువతగినవి.

వినుగు పుట్టించకుండ వినోదము చెడకుండ కథా భాగమును నడుపుచు, ప్రకృతి సౌందర్యముగల సీమలను, సంఘజీవనమును యదార్థముగా చిత్రించుచు సాంఘికాభ్యుదయమున కవశ్యములైన సమస్త విషయములను చర్చించుచు మేధా భేద్యములైన జీవ సమస్యలకు ఉచిత విధమున నుత్తరముల సూచించి సాధించు మార్గముల

స్ఫురింప జేయుచు మానవశ్రేయోభి వృద్ధులకు నూతన సందేశ ములఁ గొని తెచ్చుచు వ్రాయబడిన కళారత్నములు నిజమైన నవల లగును గాని, ఇపుడు నవల లను పేరుతో దేశవ్యాప్త మగుచున్న చెత్త నిజమైన నవలల వర్గమునకు చేరతగదు.

తెనుగు దేశమున నవలాకారు లని ప్రశంసింప తగిన ముఖ్యులు ఇద్దరే. వీరేశలింగముగారు, లక్ష్మీనరసింహముగారు. వీరేశలింగము గారి శైలిని గురించి ఇంతకు ముందు హిందూ పత్రికలో ప్రకటింపబడిన విమర్శ పంతులుగారే తెనిగించి స్వీయ చరిత్రలో వ్రాసికొనిరి. అది ఇంతకు పూర్వమే ఈవ్యాసములో ఎత్తి వ్రాసితిని.

ఇక లక్ష్మీనృసింహము గారి శైలిని గూర్చి సంగ్రహముగా ప్రశంసింతము.

పదసంపత్తి: లక్ష్మీనరసింహముగారు ఆంధ్ర దేశములో మంచి పండిత కుటుంబములో జన్మించిరి. శుక్రనీతి సారము తెనిగించి ప్రసిద్ధి నొందిన పురాణపండ మల్లయ్యశాస్త్రి గారు నరసింహము గారి మేన మామగారు. కాబట్టి వారికి ఆంధ్ర గీర్వాణపద సంపత్తి సమృద్ధిగా కలదు. ఇంగ్లీషులో వీరు F. A. చదివిరి. మూఁడు భాషలలో పండితులు.

వాక్యరచనాక్రమము: చెప్పదలచిన యంశము వాక్యారంభము నందు ముందుగా చెప్పివేయక, వాక్యాంతము వఱకు మఱుగున నుంచి అప్పుడు చెప్పుదురు. రచనయందీ మర్మముండుటచేత ముందేమి జరుగునో యని పాఠకుల మనస్సు లాతురముతో, తహతహతో శ్రద్ధగా చదువుకొనుచు పోవును గాని, లక్ష్యము వేఱొక దిక్కునకు మఱలుట కవకాశము చిక్కదు. చదివిన అర్థము కాకుండ నడ్డపడు కఠిన పదము లుండవు; అన్వయక్లిష్టములైన దీర్ఘ వాక్యములును వారి రచనలోనుండవు. వాక్యముల నిడివి కథాంశ నిర్వాహణమునకు అనుకూలముగా నుండును. చదువునపుడు విసుగు జనింపదు. పాఠకుల మనస్సుల నాకర్షించి నిలిపిపట్టి తమ వశమున నుంచుకొని, ఇచ్చ వచ్చినరీతి నాడించి యాపగల శక్తి వారికి

గలదు. ప్రతి పేరాయి వెనుకటి యంశములకును, ముందు చెప్పబోవు నంశములకును సంబంధము చక్కగా, కథా వివరణము మనోహరముగా సాగుచుండును.

అలంకారములు: చక్కని సౌరభమును వెదజల్లు ఉపమాన, రూపక, ఉత్ప్రేక్షాద్యలంకారములు ప్రతి పుటలో నెలకొని యుండును. శబ్దాలంకార బాహుళ్యమును గూర్చి నన్నయాదులవలె ప్రత్యేకముగా కన్నిడి కూర్చక పోయినను తెనుగు భాష వీరి చేతులో లలితమై మృదు మధుర రసభావ భరితమై, ముద్దు లొలుకు చుండును. వారి గ్రంథములు చదువు కొలది పాఠకుల మనము లానంద తరంగముల నిండి యుండును.

శైలియొక్క విశేషములు: విమర్శకులు, ప్రతి గ్రంథమును, మృదుమధుర శైలిలో రచింపబడెనందురుగాని, అది యర్థములేని పరి పాటి మాట. ఆ వాక్యము లక్ష్మీనరసింహముగారి పట్ల అక్షరాలా సార్థకమైన సత్యము. మృదుమధుర శైలి చిలకమర్తివారి సొమ్ము. వారి పుస్తకములు చదువుట నిజముగా ద్రాక్షఫలముల తినుటే. భావ వ్యక్తీకరణమున న్యూనాధిక దోషములు లేని శైలిలోనే వారి గ్రంథరచన సాగినది. అందాయన నిపుణులు, కుశలురు. పదములసొంపు, రచనా విన్నాణము చూడగా వారు భాషకు యజమానులుగాని సేవకులు గారనిపించును. స్వకపోల కల్పిత గ్రంథములలోనేగాక, భాషాంతరీకృతములందును, వారిరచన సజీవమై, సందర్భానుసారముగా గంభీరమై, జాలిగొల్పునదై, హాస్య ప్రపూరితమై, ధారాశుద్ధి, యథోచిత మార్దవము, ఘనతగలదై సకలజన మనోరంజకముగా ప్రవహించుచుండును.

మరొక్క విశేషము. పెక్కుదుఃఖములను గూర్చి చదివి, మనస్సు వ్యాకులముగా నున్నప్పుడు, పాఠకులను ఫక్కున నవ్వింపగల శక్తి వీరికి గలదు. 'హేమలత'లో మహమ్మదీయులకు, రాజపుత్ర యోధు లకు ఘోరయుద్ధము జరిగి, ప్రతాపసింగు శరీరమంతటను జల్లెడవలె తూట్లుపడెనని, తుదకతడు చనిపోయెనని వర్ణించుచు, చిదానంద యోగి

దివిటీలతో తురకయోధుల గడ్డములు గాల్చె ననియు; 'అహల్యాబాయి'లో కృష్ణపంతును నమ్మించి గండాభిల్లు చాటుగా తీసికొనిపోయి, ముక్కుకోసి తగిలివేసె ననియు; తురక భటు లొక యోగిని పట్టుకొని, నోట గుడ్డలు క్రుక్కి, బాధించి 'చావు ముండ కొడక' యని యమునలో నెత్తివైచిరనియు; 'ప్రసన్న యాదవము'లో మునులు బ్రతికియుండియు రక్కసులచేత భూమిమీద 'నరక బాధ' పడిరని దీనమైన తమ దురవస్థ చెప్పుకొనుచు "చింతబరికెలతో వెన్ను చెండినారు, నారగోచులు దిగలాగి నవ్విరనియు" వర్ణించి నవ్వింతురు.

ఆనంద వాణిలో ప్రకటితమైన "పతన సామ్రాజ్యము" చిన్న నవలిక. చిల్లరిగె స్వరాజ్య లక్ష్మి, భాషా ప్రవీణగారిచే రచింప బడినది. విజయనగర సామ్రాజ్య పతనమునకును, తాళికోట మహాయుద్ధ ములో ఆంధ్రజాతియొక్క ఘోర పరాజయమునకును నిజమైన కారణము లిందు సంగ్రహముగాను సప్రమాణముగాను వివరింపబడినవని ప్రశంసింప బడినది. మన చరిత్రాంశములలో నొకొక్కదానిం గైకొని అది యట్లు సంభవించుటకు సరియైన చరిత్ర హేతువులు నిరూపించుచు, నిట్టి నవలికలు రచించుటయందు చరిత్రాభిమానముగల ఆంధ్ర విదుషీ మణులు కృషిసల్పుట దేశాభ్యుదయమునకును, ఔన్నత్యమునకును కారణము కాగలదని విన్నవించెదను. పెద్ద పెద్ద విషయములను తీసి కొని పరిశ్రమ లోపముచేతను, సాధన సామగ్రి అమరకను, రమణీయ ములగు చరిత్రాత్మక రచనలను జారవిడుచుటకంటె చిన్న పరిధిలో నిముడగల చిన్న చిన్న అంశములనే గైకొని, చక్కని పరిశ్రమ చేసి, మంచి నవలలను, నవలికలను రచించుట మన దేశాభ్యుదయమునకు సర్వవిధముల తోడుపడగలదు. మనకు ఉన్న గ్రంథములను చరిత్ర జ్ఞాన సంపాదన దృష్టితో చదవవలెను. లేకున్న [illegible] బుస్సీనుండి 'బూచి' శబ్దము జనించిన దనునట్లే తప్పుడు చరిత్రలు, అప భ్రంశపు వాదములు బయలువెడలి మనకెంతో హానిచేయక మానవు

## 7. దేశ చరిత్రలు

భరతభూమికి చరిత్ర అసలు లేదను నపప్రథ వ్యాప్తి నొందినది. కాని అది వట్టి నిరాధారమైన ప్రసంగము. మన వేద, పురాణ, ఇతిహాసములు చక్కని చరిత్రగ్రంథములు. రాజవంశ, వంశానుచరితములు పురాణమునకు ముఖ్యాంగములు. ఒకప్పుడు రోము దేశములో కృత్రిమ కల్పనలతో దొంగచరిత్ర రచింపబడెను. అది సాటిగా మన పురాణము లన్నియు నభూత కల్పనలుగాని విశ్వాస పాత్రములా గావని పడమటి పండితులు సొడ్డువేసిరి. ఆ వ్రాతలు సత్యములు కావు; నిరాధారములు. ఈ సృష్టి జరిగి ఆరువేల సంవత్సరములు మాత్రమే అయినదనెడి తప్పు లెక్కనుబట్టి పడమటి పండితులు చరిత్ర కాలముల కిట్టించి, దిగదీసిరి. విజ్ఞాన దృష్ట్యా ఇది ఘోరమైన అపచారము; చరిత్ర దృష్ట్యా క్షమింపరాని యపరాధము. బైబిలేమి వ్రాసినను విజ్ఞాన సాక్ష్య దృష్టిని పరిశీలింపగా, భూగోళపు వయస్సు రెండు వందల కోట్ల సంవత్సరములకు తక్కువ కాదని సర్ జేమ్సు జీన్సు మొదలగు సత్యాన్వేషకులగు క్రైస్తవ వైజ్ఞానికోత్తములే నిర్ధారణ చేసియున్నారు. ఇది ఉరమర లెక్క. మన పంచాంగ కర్తలు "సృష్ట్యాది గత సౌరాబ్దాః 195 కోట్ల 58 లక్షల 85 వేల 58 సంవత్సరములని" సరిగా తెగవేసి చెప్పుచున్నారు. ఈ దృష్టిలో పరిశీలించి చూచినచో పురాణకాలములు అభూత కల్పనలు కావు. సత్యములని తేటపడగలదు. పాశ్చాత్యులు సంకుచిత దృష్టితో వ్రాసిన నిరాధారపు వ్రాతల మూలముగా చరిత్ర సత్యములు తారుమారైనవి. బెంట్లీ యనువాడు శ్రీకృష్ణుడు క్రీస్తు శకము 7 వ శతాబ్దము నాటివాడని వ్రాసెను. అప్పటికి చీనానుండి యువాన్ చాంగ్ వచ్చి మన దేశమున పర్యటించుచుండెను. 'దండి' వర్ణించినట్లు అప్పుడు ఆంధ్రనాథుడైన చాళుక్య జయసింహ సర్వసిద్ధి తూర్పుతీర దేశము నేలినట్లు తామ్రశాసనము లున్నవి. కాబట్టి పాశ్చాత్యుల ఊహాగానములను, అవివేకపు వ్రాతలను, నమ్మి వాని నాధారము చేసికొని చరిత్ర

గ్రంథములు వ్రాయబూనుట అవివేకము; హాస్యాస్పదము. మన ప్రెసిడెంటు రాజేంద్రప్రసాదుగారి యధ్యక్షతను భారత దేశ చరిత్రను తయారు చేయుటకు ఒక సంఘమేర్పడుట శుభావహమే; కాని వీరిలో నెందరు పూర్వ పాశ్చాత్య వాసనల త్యజించి, సత్యార్థులై మూల గ్రంథములను ఓపికతో చదివి, పరిశ్రమించి, నిజమైన దేశచరిత్ర వ్రాయగలరో చూడవలసి యున్నది. బంగాళమున రమేశ చంద్రదత్తు, యదునాథసర్కార్, సునీతికుమార్ చటర్జీ మొదలగు సత్యప్రియులు, ఉద్దండ పండితులు పరిశ్రమించి పనిచేసిరి; చేయుచున్నారు; చేయగలరు.

తెనుగు దేశమున చరిత్రకారులని చెప్పఁకోతగిన మహాపురుషులు ముగ్వురే కనబడుచున్నారు.

(1) చిలుకూరి వీరభద్రరావుగారు. వీరు ఆంధ్రుల చరిత్ర మూడు సంపుటములుగా ప్రకటించిరి. అంతకుముందు జీర్ణకర్ణాటక రాజ్య చరిత్ర, తిమ్మరుసు చరిత్ర మొదలగు చరిత్ర గ్రంథములు పెక్కింటి రచించి ధన్యులైరి. వీరికి చరిత్ర చతురాననులను సమంజస మగు బిరుదు ఒసంగబడెను.

(2) రెండవవారు కొమఱ్ఱాజు వేంకటలక్ష్మణరావు పంతులు గారు. వీరు విజ్ఞానచంద్రికా మండలి స్థాపకులలో నొకరు. బహుభాషా కోవిదులు. చరిత్రాభిమానులు. రమేశచంద్రదత్తుగారు రచించిన హిందూదేశ చరిత్రము, హిందూ సంస్కృతివంటి ఉత్తమ గ్రంథము లాంధ్రములో నుండుట అత్యవసరమని భావించి, నాలుగు సంపుటములలో సమగ్రము, సప్రమాణమునైన చరిత్రగ్రంథము వ్రాయ నుద్యమించిరి. అందు (1) హిందూ మహాయుగము. (2) మహమ్మదీయ యుగము నను రెండు సంపుటములు మాత్రము ప్రకటించిరి. ఇవి రెండును నిరుపమానములైన చరిత్ర గ్రంథములు. అందు హిందూ మహాయుగములో తిక్కన ప్రతిభను గూర్చి వారు వ్రాసిన వాక్యములు ఆంధ్రులు సువర్ణాక్షరములతో లిఖించి యుంచుకోవలసినవి. వాని సారము నిట సంగ్రహముగా వ్రాయ యత్నింతును. "వ్యాస కృత భారతము ఒక బంగారు రాశి. తిక్కన అందునుండి తనకు

కావలసినంత బంగారము తీసికొని, చక్కని నగిషీలతో నిరుపమాన మైన సువర్ణ కమలమును తయారుచేసెను. ఆ కమలమే ఆంధ్ర భారతము. ఆందా పనివాడు ప్రదర్శించిన నిర్మాణ నైపుణి, కళా కుశలత్వమును చక్కగా గ్రహించి, శ్లాఘించి, ప్రమోదము నొందుటే ఆంధ్ర నాణెకాండ్ర ధర్మము.''

మహమ్మదీయ మహాయుగములో - భారతీయులు, తురుష్కులకు సులభముగా లొంగిపోక అభిమన్యునివలె ముక్కున నూపిరిగలంత వఱకు ఘోరముగా పోరి, పరాజితులైరని నిరూపించుచు వచ్చిరి. తుదకు వారు హిందూ ముసల్మానుల కుభయులకు నిచ్చిన సందేశము నట్టిదే. "ఔరంగజేబు హిందువుల హింసించెను. అళియరామరాజు తురుష్కుల హింసించె నని ప్రాత పగలు త్రవ్వుకొనుచు, తగవు లాడుకోక అయినదేమో అయినది. విశాల భరతఖండములో హిందూ ముసల్మాను లిటుపై సోదర భావముతో నైకమత్యమున శాంతముగా జీవించుట మంచిది'' అను బంగారు వాక్యమును మన ఇండియన్ రిపబ్లిక్ ప్రభుత్వము గౌరవించి, పక్షపాతము లేకుండ, ఉభయులను రెండునేత్రము లట్లు చూచుకొని పరిపాలించుచుండుట ఎల్లరకు ముదావహము.

మహారాష్ట్ర మహాయుగమను మూడవ సంపుటము ప్రకటింపబడి నట్లు కానరాదు. నాల్గవది యగు బ్రిటిష్ మహాయుగమును ఇటీవల శ్రీ మానికొండ సత్యనారాయణగారు వ్రాసి ప్రకటించిరి.

లక్ష్మణరావుగారి యనంతరము అసంఖ్య చరిత్ర విషయములు బయల్పడినవి; బయల్పడుచున్నవి. వాని నన్నింటిని క్రోడీకరించి సమగ్రము, సప్రమాణము నైన, హిందూదేశ చరిత్రమును తెనుగున వ్రాయవలసిన భారము శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మగారి భుజము లపై నున్నది. లక్ష్మణరావుగారి చరిత్ర శాలువ, విజ్ఞాన సర్వస్వ శాలువ, తనకు తానై వచ్చి శర్మగారి శరీరముపై వ్రాలి ఆశ్రయించినది.

(3) మన తెనుగు దేశమున చెప్పుకోతగిన మూడవ చరిత్ర కారులు శ్రీ శర్మగారే. తెనుగుదేశమున నెక్కడ నే తామ్రశాస

నము బయల్పడినను, అది వెతుకు కొనుచు శర్మగారి పాదములకడ వ్రాలవలసినదే. ఆంధ్రజాతియొక్క సంపూర్ణ విశ్వాసమునకు వారు పాత్రులగుట ముదావహము. వారికి మూడు భాషలలో పాండిత్యము, అపార పద సంపత్తి, దివ్యమై, మృదుమధురమైన శైలి, చక్కని రచనా కౌశలము అన్నియు కలవు; పెక్కు చారిత్రక వ్యాసములు, గ్రంథములు రచించి ఈసరికే ధన్యులైనారు. వివిధ పరీక్షలకు చదువు విద్యార్థుల కవి పాఠ్య గ్రంథములుగా నిర్ణయింపబడుచున్నవి. తెనుగు నాట చరిత్ర గ్రంథ లోపమును తీర్చుటకు అన్నివిధములచేత వారే అర్హులు; సమర్థులును.

చిలుకూరి వీరభద్రరావుగారు పని ప్రారంభింపకపూర్వము తెనుగు దేశములో చరిత్ర గ్రంథములు కొన్ని వెలసినవి. వానినిగూర్చి సంగ్రహముగా ఈ దిగువ ప్రశంసింతము. ఈ గ్రంథములు మద్రాసు ఓరియంటల్ లైబ్రరీలో ఉన్నవి.

1. కాకతీయ రాజవంశావళి

2. వేమారెడ్ల చరిత్రము.

3. తంజావూరువారి చరిత్రము. ఇది అరవదేశమందలి ఆంధ్ర రాజుల ప్రాభవమును వర్ణించు వచన గ్రంథము. కర్త యెవరో తెలియదు. తంజాపురిలో నెలకొని, ఆంధ్ర ద్రవిడ దేశముల బాలించి, సాహసౌదార్య విద్వద్గుణములలో ప్రసిద్ధిగాంచిన యాంధ్ర రాజుల చరిత్రము. దీనిని సంస్కరించి 48 పుటలకు వ్రాసిన భూమికతో వేటూరు ప్రభాకర శాస్త్రిగారు 1914 లో ముద్రించి ప్రకటించిరి.

4. కళ్ళజాతి చరిత్ర. ఈ జాతివారు తంజావూరు మధుర ప్రాంతములలో కాపులుగా కనబడుచున్నారు.

5. సింహాళ విజయమనే సింహాళ కైఫీయత్.

6. ఆం. సా. పరిషత్ లైబ్రరీలో రాయ వాచకము గలదు. కర్త: ఏకామ్రనాథుడు.

7. రాయ వాచకమువంటి వాచకముకూడ ఒకటి కలదు. వీని నుండి ఆ పరిషత్పత్రిక మచ్చులు ప్రకటించినది.

8. ఓరియంటల్ లైబ్రరీలోనే రాజా నిశ్శంక బహద్దర్ వారిచే రచింపబడిన కొండ జమీందార్ల చరిత్ర గలదు. 1871 లో ముద్రితమైనది. ప్రతి, పుస్తకముల రిజిష్ట్రారు వారి లైబ్రరీలో నున్నది. పురాణ రాజవంశములతో ఈ జమీందార్ల కుటుంబములకు గల సంబంధమిందు తెలుపబడినది.

Todd దొర ఇంగ్లీషులో రచించిన Rajasthan ను, చిలకమర్తి వారు 'రాజస్థాన కథావళి' యను పేర తెనిగించిరి. చాణక్య తంత్రమును, అర్థశాస్త్రమును కొండూరు కుమారస్వామిగారు ప్రకటించిరి. సరస్వతీ పత్రికాధిపతులు కల్హణ పండితుని రాజ తరంగిణిని తెనిగించిరి. లక్ష్మణరావుగారి శివాజీ చరిత్రను తొలుత సరస్వతి పత్రికయే ప్రకటించినది. పిమ్మట రమణాచార్యులుగారు కాశ్మీరదేశ చరిత్రను రచించిరి. కొలచలమ శ్రీనివాసరావుగారు "ఆర్యులు, వారి నాగరికతాధి నివేశనము"లును రచించి, ఋగ్వేదము 15 వేల సంవత్సరముల క్రిందట రచింపబడినట్లు జోతిశ్శాస్త్ర సాక్ష్యముతో నిరూపించిరి. వేదభూమి గూడ అట్టి చరిత్ర గ్రంథమే.

దుగ్గిరాల రామమూర్తిగారు Mill's Liberty గ్రంథమును స్వాతంత్ర్య దర్శనమను పేరుతో తెనిగించిరి.

బందరులో ఆంధ్ర భాషాభివర్ధనివారు (1) చీనాదేశ చరిత్ర, (2) అశోక చక్రవర్తి చరిత్ర, (3) సిక్కుల చరిత్ర, (4) మహారాష్ట్రుల చరిత్ర ప్రకటించిరి. కనకరాజుగారు ఆంగ్ల రాజ్య నిర్మాణ తంత్రమును, వల్లూరి సూర్యనారాయణరావుగారు ఆంగ్ల రాజ్యాంగ తంత్రమును రచించిరి.

ఇటువంటి సారస్వత వాహినులు - కుల్యలు - కొండగెడ్డలు - ఏళ్ళు - సెలయేళ్ళు - ఉపనదులు - నదీనదములు - పెక్కులు కాల గతి ననుసరించి ప్రవహించి భారతీయుల స్వాతంత్ర్యేచ్ఛను పెంపొందచేసి స్వరాజ్య సమరోన్ముఖుల గావించి, శాంతియుద్ధమే చేయించి స్వతంత్ర లాభము నొసంగినవి. చరిత్ర జ్ఞానమును గురించి ఇదివరకేమిజరిగినను జగిగినదికాని, ఇటుపై మన విద్యాజనము కేవల

పాశ్చాత్త్యుల పక్షపాతపు వ్రాతలపై నాధారపడక వేద, పురాణ, ఇతిహాస గ్రంథములను స్వయముగా, స్వతంత్రముగా పఠించి యదార్థ చరిత్ర రచనకు ఉపక్రమింపవలెనని విజ్ఞప్తి.

ఇంగ్లీషు భాషలో గిబ్బన్ మహాశయుడు గంభీరము, నిరుపమానము నైన దివ్యశైలిలో 'రోమను సామ్రాజ్య క్షయ, పతనములను' గూర్చి యద్భుత చరిత్ర రచించి అమరజీవి యయ్యెను. భారత చరిత్రలో ప్రాచీన హైందవ సామ్రాజ్యములు గాక గజనీ, ఘోరీలు మొదలు లోడీ వంశమువఱకు తురుష్క సామ్రాజ్యము; ఓరుగల్లులో ప్రతాప రుద్రుని కాకతి సామ్రాజ్యము; బాబర్ మొదలు ఔరంగజేబు వరకు మొగల్ సామ్రాజ్యము, ఆ మధ్యనే విజయనగర సామ్రాజ్యము; శివాజీ మొదలు రెండవ బాజీరావువఱకు మహారాష్ట్ర సామ్రాజ్యము మన కన్నులయెదుటనే రవి యస్తమింపని బ్రిటిష్ సామ్రాజ్యము ఇట్టివనేకముగా కాలగర్భమున పుట్టి, పెరిగి, విజృంభించి పైకి లేచిలేచి, ఫెడీమని విరిగి, కూలిపోయినవి. చరిత్రాభిమానులైన ఆంధ్ర విద్వజ్జ నులు ఇందొక్కొక్క ఘట్టమును చేకొని పరిశ్రమించి 'గిబ్బన్ దొర' వలెనే అమరములైన చరిత్ర గ్రంథములు రచించి, దేశమాతను సేవించి చిరకీర్తి గైకొందురు గాక! మన ఆంధ్ర సారస్వతమును, లక్ష్మణరావుగారి వలె చరిత్ర దృష్టితో జాగ్రత్తగా పఠించి పరిశీలిం చుట ఈ ప్రయత్నమునకు మొదటి మెట్టని విన్నవించి చరిత్ర చర్చ ముగించి ఉత్తరాంశము నందుకొందము.

## 8. జీవచరిత్రలు

"గీ॥ తొల్లి చన్న మహాత్ముల త్రోవ దెలిసి,
తప్పకుండ మెలగువారు తత్త్వఘనులు."

పరహిత 'స్వార్థరహిత మూలములగు సుకృత శీలములచే భూషితు లగు మహాపురుషులు, లోకాభ్యుదయమునకై నిరంతరము పాటుపడి విజ్ఞానాభివృద్ధి గావించుచు మార్గదర్శకులై, చిరస్మరణీయులై అమర

జీవులు అగుచుందురు. ఏ ధర్మాచరణముచే వారు మహాత్ము లని గౌరవింపబడుచున్నారో, ఏవిధముగా వారట్టి యుత్కృష్ట పురుషులు కాగలిగిరో తెలిసికొని, వారి మార్గము ననుసరించుట తరువాతి తరములవారి కత్యవసరము. అనగా తమ పూర్వుల అనుభవజన్య జ్ఞాన వివరములను తెలిసికొనుట ప్రతి మానవుని విద్యా జీవితములకు అత్యవసరము. పశ్చిమ ఖండమున గ్రీసు, రోము మొదలగు దేశములలో నుద్భవించి ప్రసిద్ధులైన చరిత్ర పురుషుల జీవచరిత్రలను 'ప్లూటార్క్' (Plutarch) అను మహనీయుడు రచించెను. ప్రపంచ ప్రఖ్యాతములైన గ్రంథ శతములలో నిదియొకటి. దీనిం బూర్తిగా తెనుగులోని కనువదించుకొనుట అత్యవసరము.

మన పూర్వులు ఉత్కృష్ట పురుషుల జీవిత చరిత్రలను ప్రత్యేక గ్రంథములుగా రచించినట్లు కానరాదు. ఆంగ్ల సారస్వత సంపర్కమైన పిమ్మటనే తెనుగున జీవ చరిత్ర రచన ప్రారంభమైనది. విక్టోరియా మహారాణి జీవితమును మొదట రచించి వీరేశలింగము గారే జీవ చరిత్ర శాఖ రచనకు తెనుగున మార్గదర్శకు లైరి. స్త్రీల కొఱకే ఈ గ్రంథము ఉద్దేశింపబడినది. చిలకమర్తి లక్ష్మీనరసింహము గారు ఎంతో చక్కగా చెప్పినట్లు —

చ॥ చదువన్నేర్తురు పూరుషుల్వలెనె శాస్త్రంబుల్ పఠింపించుచో
నదుమన్నేర్తురు శత్రుసేనల ధనుర్వాణ్యప్రపారము ల్నేర్చుచో
నుదితోత్సాహముతోడ నేలగలరీ యుర్విన్ బ్రతిష్ఠించుచో
ముదితల్నేర్వఁగరాని విద్య గలదే ముద్దార నేర్పించినన్.

రత్న అను పద్య మున కీ జీవితచరిత్ర చక్కని ఉదాహరణ.

తరువాతి జీవ చరిత్ర గ్రంథము కూడ ఉత్తమ స్త్రీ రత్నముల చరిత్రే మాల అగుట ముదావహము. దీని రచయిత సౌ॥ భండారు అచ్చమాంబగారు. ఈ విదుషీమణి లక్ష్మణరావు పంతులుగారి సోదరి. ఆమె "అబలా సచ్చరిత్ర రత్నమాల" అను పేరుతో 105 గురు నారీమణుల జీవ చరిత్రల మాలికను రచించి, అమ్మగారు

ఆంధ్ర స్త్రీలోకమునకు మహోపకారము చేసిరి. ఇందులో నున్న విమలా దేవి చరిత్రమునే పెంచి భోగరాజు నారాయణమూర్తిగారు ఆ పేరు గల నవలను రచించి విజ్ఞాన చంద్రికా గ్రంథమాలలో చేర్చి ప్రకటించిరి.

లక్ష్మణరావుగారు బాల్యమందే శివాజీ చరిత్ర రచించి 'సరస్వతి' పత్రికలో ప్రకటించిరి. పిమ్మట చిలకమర్తివా రందుకొని మన దేశములో సుప్రసిద్ధులగు మహాపురుషుల జీవ చరిత్రలను మూడు సంపుటములుగా ప్రకటించిరి. విజ్ఞాన మండలివారు 'అబ్రహాము లింకను' 'చంద్రగుప్త చక్రవర్తి' చరిత్రల ప్రకటించిరి. బందరు వారు అశోకుని చరిత్ర, వివేకానంద జీవితము, రాజా రామమోహనరాయుల చరిత్ర మొదలగునవి ప్రకటించిరి. Carlyle దొరగారి Hero worship ననుసరించి 'వీరపూజ' వెలసినది. ఇది మహాపురుషుల జీవ చరిత్రయే. లక్ష్మీనరసింహముగారి 'సిద్ధార్థ చరిత్ర' మహానుభావుడగు గౌతమ బుద్ధుని జీవ చరిత్రయే.

జీవ చరిత్ర మనగా ఒక వ్యక్తి జన్మతిథి, జన్మస్థలము, జననీజనకులు, సంబంధీకులు, వృత్తి ఉద్యోగములు, మరణము మాత్రము గల కథ గాదు. స్వార్థపరుడై, స్వోదర పోషణము చేసికొనుచు, కాకియై కడదాక బ్రతుకవచ్చు - అట్టి జంతువుల గొడవలెందుకు ? జాగ్రత్తగా రచింపబడిన జీవచరిత్రలో ఒకానొక వ్యక్తిపై పూర్వుల సంస్కృతి యొక్క ప్రభావ మెట్టిది ? "పూర్వుల విజ్ఞానము వాని నెట్టివానిగా తయారుచేసినది ? ఆ వ్యక్తి సాధించిన ఘనకార్యము లేమి ? తన జీవిత మూలముగా లోకమునకు ఆతడిచ్చిన సందేశమేమి ? ఆ వ్యక్తివలన లోకమునకు కలిగిన ప్రయోజనమేమి ?" అను నిట్టి ప్రశ్నలకు సదుత్తరము లాతని చరిత్రవలన తెల్లము గావలెను. ఆవిధముగా ప్రశస్తమైన - నిజమగు జీవచరిత్ర యగు ; కాకున్న ప్రయోజన శూన్యమగు. ఒక్క దృష్టాంతము చూతము. స్కాట్లండు దేశములో బర్న్సు (Burns) అను కవివతంసుడు జన్మించి, పెక్కు గ్రంథములు రచించి దేహము చాలించెను. అతని జీవితమునుగూర్చి అయిదు

చరిత్రలు వెలువడెను. వానితో తృప్తుడు గాక కార్లైల్ మహాశయుడు, తత్త్వదృష్ట్యా 'బర్న్సు' జీవిత చరిత్ర అరవ గ్రంథము వ్రాసెను.

మానవత్వములో పరిపూర్ణత లేదు ; ఉండదు ; ఏవో లోపములు లేని మనుజు లుండరు. లోపము లుండునుగాక ! ఉన్నను, వానిని మన్నించి - అయ్యో ! మనవంటివాడే - మన తోడి మానవుడేకదా ! అని మనము వానియెడ జాలిగొని, సహృదయులమై ఉండవలెనని బర్న్సు కవి మానవకోటికి సందేశ మిచ్చెను :—

"A man is a man for all that; for a' that; and for a' that;"
ఇటువంటి సౌహార్ద్రిముతో మానవ జీవితమును విమర్శించి జీవ చరిత్రల రచింపవలసి యుండును.

తోడి జంతువుల పశుత్వము విడిచి మానవుడు ఒక్క దూకున నీనాటి నాగరకస్థితికి రాలేదు. క్రమ క్రమముగా నాగరకుడై ఇప్పటి యున్నత స్థితికి రాగలిగెను. ఇందుకు సాయభూతులై, చక్కని యూహాపోహలతోను, తెలివితేటలతోను, పరిశ్రమించి, అగ్నిని వశము చేసికొని, యుక్తులు, పై యుక్తులతో యంత్రజాలము నిర్మించి, ప్రకృతి మర్మముల గ్రహించి అసంఖ్య గ్రంథముల ప్రకటించు చున్నాడు. చీమలు, దోమలకంటె కడుంగడు సూక్ష్మములగు క్రిమి కీటకములు మొదలు బ్రహ్మాండ పరిమాణము గల ఖగోళ సంచారుల వఱకు, సృష్టినంతను పరిశీలించి, విషువకే పనిచేయుచున్నాడు.

ఈ దివ్య పరిణామములో ప్రతి ఘట్టమునందు, ప్రతి పట్టున, ప్రతి అంకమునందు పలువురు పరిశోధకులు పూనికతో పనిచేసి వారి వారి యాశయముల సాధించుచు పై మెట్టుకు పోగలుగుచున్నారు. మానవ కోటి అభ్యుదయోన్నతుల కొఱకిట్లు పరిశ్రమించిన ప్రకృతి పరిశోధకుల జీవ చరిత్ర లన్నియు ఆ విజ్ఞానశాఖాభిమానులకు అవశ్య పఠనీయములు. వైజ్ఞానికులు గాని సాధారణులకు గూడ అవి పాఠ యోగ్యములే.

ఈ పరిశోధక బృందమువారు ఒక దేశమువారు కారు ; ఒక

కాలమువారును గారు. ఆయా కాలముల నొకొక్క దేశములో నొకొక్క మేధావి, ఒకొక్క ప్రజ్ఞాశాలి ఒకొక్క యుద్యమము సాధించి మానవజాతి యొక్క విజ్ఞానాభివృద్ధికి కారకులైరి. వారందరి జీవిత చరిత్రలు మనకు పఠనీయములే. అట్టి మహనీయుల జీవిత విశేషముల గూర్చి దెల్పు గ్రంథములు ఆంధ్ర దేశములో చాల తక్కువ. ఆంధ్రావలీ సమాజమువారీ లోపము నొకింతవరకు నివారింప బూని నేటి విజ్ఞాన సౌధమునకు మూలస్తంభము లనదగు తొమ్మండు గురు వైజ్ఞానికుల జీవితచరిత్రలు 'మహామేధావు'లను పేర ప్రకటించిరి. వార పత్రికలలోను, మాస పత్రికలలోను మరికొందరు ప్రకృతి శాస్త్రాభిమానులు మరికొందరి చరిత్రలు సంగ్రహముగా వ్రాసిరి. భౌతిక శాస్త్రము (Physics), ధాతుశాస్త్రము (Chemistry), వృక్షశాస్త్రము (Botany', శరీరశాస్త్రము (Physiology), జంతు శాస్త్రము (Zoology), జీవశాస్త్రము (Biology), పరిణామ శాస్త్రము (Evolution) మొదలగు విజ్ఞాన శాస్త్రకారుల జీవితముల గురించియు, ఖగోళ పరిశోధకులం గూర్చియు వందలకొలది జీవిత చరిత్రలు తెనుగులో ప్రకటించవలసి యున్నవి. మరికొందరు సాహస విక్రమాఢ్యు లనదగినవారు ఉన్నారు. వారు హాయిగా తిని, చల్లని ఇంటిపట్టున సుఖముగా సతీసుతులతో గార్హస్థ్య జీవనము చేయుటతో తృప్తినొందక భూగోళముమీద క్రొత్త క్రొత్త ప్రదేశములను, దేశములను వెదకి కనుగొందమనియు, అంధకార బంధురమగు ఆఫ్రికా ఖండపు లోపలిభాగములను పర్యటింతుమనియు, బహు శీతోపేతము లగు భూగోళపు ఉత్తర, దక్షిణ ధ్రువములను, కాంతిక ధ్రువములను అన్వేషింప నరిగి అనేకులు ప్రాణముల గోల్పోయిరి. అయినను వెలి పెట్టక పట్టుదలతో పనిచేసి "నిశ్చితార్థంబు వదలరు నిపుణ మతులు" అని భర్తృహరి చెప్పినట్లు సఫల మనోరథులైరి. మరి కొందరు మహోన్నతములైన హిమాలయ పర్వతశిఖరముల నెక్కి వినోదించుచున్నారు. వారి ధైర్య స్థైర్యములు, సమయస్ఫూర్తి శ్లాఘ్యమగు సుపజ్ఞ ఇవన్నియు ప్రశంసార్హములు. వీనింగూర్చిన

వివరములతో ఉత్తమ గ్రంథములు మనవారు చదువవలసియున్నది. అట్లు చదివినగాని బృహత్కథనాటి ప్రాచీనాంధ్రుల ధైర్య, శౌర్య, సాహసములు స్ఫురణకు రావు; అలవడవు. ఆంధ్రాభ్యుదయము గోరువారు ఇట్టి గ్రంథముల వందలకొలది పఠించుట అత్యవసరము.

ఈ జీవచరిత్రలలో 'స్వీయ చరిత్ర' లనునవి చాల ముఖ్యమైనవి. పై వారొకరు-మరొకరి జీవచరిత్ర వ్రాయుచుండుట సామాన్యము. స్వీయ చరిత్రలు ఎవరి జీవచరిత్రలు వారే వ్రాసికొను ఆత్మకథలు. అందులో తప్పులు, పొరపాట్లు, దొసగులు దొర్లుట కవకాశములుండవు.

తెనుగులో స్వీయచరిత్ర రచనకు దారితీసినవారు వీరేశలింగము గారే. వారి స్వీయ చరిత్రము అనేకవిధములచేత అద్భుతమైన గ్రంథము. వీరేశలింగముగారి తరువాత వారి శిష్యవర్గములో ముఖ్యు లనదగు చిలకమర్తి లక్ష్మీనరసింహముగారును స్వీయ చరిత్ర వ్రాసిరి. అటుపిమ్మట ఆంధ్ర కేసరి టంగుటూరి ప్రకాశం పంతులు గారును స్వీయ చరిత్ర వ్రాసి గణ్యులైరి చిలకమర్తివారి స్వీయ చరిత్రకు ముందే వల్లూరి సూర్యనారాయణరావుగారును 'సూర్య నారాయణీయ'మను పేరు పెట్టి, తమ ఆత్మకథ వ్రాసుకొనిరి. రావు గారి ఔదార్యము నిరుపమానమైనది, వారు ఇంచుమించు లక్ష రూపాయిలు మూలధనము బ్యాంకు డిబెంచర్లు రూపమున నిలవజేసి, ఆంధ్రాభ్యుదయము చేకూర్చగల గ్రంథ ప్రకటన కేర్పాటుచేసినారు. ఈ గ్రంథములు ఆంధ్ర గ్రంథాలయములకు ఉచితముగా నందజేయు చున్నారు. ఇప్పటికీ ధర్మకర్తలు, పదహారు గ్రంథములు ప్రకటించి తెనుగు తల్లిని సేవించిరి.

వల్లూరి సూర్యనారాయణరావుగారి వంటి ఉదార హృదయులగు ఆంధ్రులు దేశ క్షేమముకొఱకు ఉత్తమ గ్రంథ ప్రకటనకు తోడ్పడె దరు గాక !

## 9. ప్రకృతి శాస్త్ర గ్రంథములు (Scientific Literature)

ప్రాచీనకాలములో భరత ఖండమునందు సత్యప్రియులగు వేద ఋషు లనేకులు, ప్రకృతి పరిశోధనమును చక్కగా సాగించిరి;

విజ్ఞానాంశములను అనేకముగా వారు వేదశాస్త్ర పురాణాదులలో గ్రంథస్థము గావించియుండిరి. మనమందరము ననుదినము జూచు సూర్యరశ్మి మన కన్నులకు తెల్లగా కనబడినను నిజమునకది ఏడు రంగుల సంపుటి యని సూర్యుడు "సప్త రశ్మయః" అని వారు వేదములలో పలుతావులందు వర్ణించిరి. ఈ యేడు రంగులను ఇంద్ర ధనుస్సులో మనము ప్రత్యక్షముగా చూతుము. సూర్యుని రథము నకు కట్టబడిన ఏడు గుఱ్ఱము లీ రంగులే; వీనినే అలంకార భాషలో సూర్యుని రథాశ్వము లనిరి. ఆ కారణముచేతనే సూర్యునకు 'సప్తాశ్వుడు, సప్త సప్తి' మొదలగు నామములు పెట్టబడినవి.

విశేషించి, ఈ సూర్యకిరణములు సూటిగా పోక "ఊర్మయః" అనగా సముద్రపు కెరటములవలె అంతటను వ్యాపించుచుండునని కూడ 'వేదము' స్పష్టముగా తెలుపుచున్నది. ఋగ్వేదములో I. 50-4 మంత్రములో "తరణిర్ విశ్వదర్శి" అను మంత్రములో నీ సూర్యకిరణములకు కల గంభీర వేగము విశ్వములో మరి దేనికిని లేదని యానాడే వారు ఖండించి చెప్పిరి. పై వేద మంత్రమునకు వ్యాఖ్య వ్రాయుచు విద్యారణ్యులు సరిగా వెలుగు వేగ నిర్ణయము తెలిపిరి. ఆ వేగ వివరములు నన్నయభట్టు, శ్రీనాథుడు, బమ్మెర పోతరాజుగారు, మల్లికార్జున భట్టు, ఆదిత్య హృదయ వ్యాఖ్యాతలు మొదలుగా పలువురు తెలిపిరి. వెలుగు వేగనిర్ణయ విషయము తెనుగు కవులకు "కొట్టిన పిండి" యని ప్రవచించెదను. వీరిచ్చిన వెలుగు వేగ సంఖ్య ఈనాటి పాశ్చాత్యుల సంఖ్యతో సరిపోవుట ఆశ్చర్యకరము. పైని వ్రాసిన తెనుగు కవులందరును ఈ సంఖ్యను తెనుగు వచనములో రచించుట గమనార్హము.

జలము ఒక మూల పదార్థము (Element) కాదు. విభిన్నము లైన రెండు వాయువుల 'విద్యుత్ సమ్మేళనము'చే నేర్పడినదని తైత్తిరీయోపనిషత్తు ఘోషించుచున్నది.

అయితేనేమి? భారతీయుల దురదృష్టవశమున స్వతంత్రము గోల్పోయి శాంతి అవలంబనము లేక మన ప్రాచీన విజ్ఞానము మూల

బడి, త్రుప్పు పట్టి వికసింపలేదు. వేదకాలమునాటి వారికి తెలిసిన ప్రకృతి సత్యము లనేకముగా నిటీవల పాశ్చాత్య పరిశోధకులు స్వతంత్రముగా మరల కనుగొనిరి. ఉత్సాహ ప్రోత్సాహములతో ప్రజావలంబన బడసి, ఆ పరిశోధకులు వారు కనుగొన్న విషయము లను బహుముఖముల పెంపొందించుకొనుచున్నారు. ప్రజాహితమై హృద్యమైన భాషలో ఆ దేశముల వైజ్ఞానికులు ఉత్తమ గ్రంథముల రచించి, సాహిత్య రంగము నాక్రమించుకొనగల్గుచున్నారు. డార్విన్, స్పెన్సర్, హాగ్స్లీ, టిండల్ ప్రముఖులు ప్రకృతి శాస్త్రముల పరి పక్వ స్థితికి తెచ్చి, ప్రజామోదకరముగ సాహిత్య రంగమున ప్రవేశము కొనగల్గుట ముదావహము. భారతీయుల కనుసరణీయము.

సంస్కృత భాషా సంపర్కమును, ఆ భాషయందు మన విద్వాంసు లకు గల పక్షపాతమును కొన్ని విధములచేత ఉపకార కారణమైనను మరికొన్ని విధములచేత అపకారమైనదను శుద్ధ సత్యమును మన ప్రాజ్ఞులికనైన గ్రహించుట అత్యవసరమైనదని ఇచట ఖండితముగా చెప్పక తీరదు. ఇట్లనుటకు హేతువులీ క్రింద చూతము:

ఇంగ్లీషు గ్రంథములలో గల ప్రకృతి శాస్త్ర విషయములు, తెనుగు పాఠకుల ప్రయోజనము నిమిత్తము, తెనుగున వ్రాయవలసిన అవసరము గలదని, అందరు నొప్పుకొందురు. అయితే ఇంగ్లీషు సాంకేతిక పదములను తెనుగున వ్రాయుటెట్లు? అనునది క్లిష్ట సమస్య అయినది. ఇంగ్లీషు భాషలో గల ప్రతి పదమునకును సమానార్థకము లైన సంస్కృత పదములను కల్పించవలె నని వీరేశలింగముగారు పట్టుబట్టి స్వీయ చరిత్రము వ్రాసిరి. అందులో Police ను రక్షకభటు డనియును, Magistrate ను దండవిధాయి యనియు, Appeal ను ఉపర్యభియోగమనియు సంస్కృతీకరించి రచించిరి. ఇంక ననేక నంగ్ల పదముల నిట్లే వారు సంస్కృతీకరించిరి. స్వీయ చరిత్ర రచించి ఏబది సంవత్సరము లైనది. నాటినుండి నేటివరకు - నాలుగుకోట్ల నుంది తెనుగు ప్రజలలో - ఒకరైన వారు కల్పించిన పదములు వాడు చున్నారా? అని నా సవాలు. పోలీసు, మేస్ట్రీటు, అపీలు పదములు

ప్రజల మనస్సుల కెక్కినవి. అందరి నోటినుండి వినబడుచున్నవి. ఈ కల్పిత పదముల వల్ల వీరేశలింగముగారికి ఏమిలాభము కలిగినది? ప్రజల కేమి సదుపాయము చేకూరినది? అని నేను గట్టిగా ప్రశ్న చేయుచున్నాను. కందుకూరివారు ఈ పద్ధతిని శాస్త్రీయ పదములకు కూడ వర్తింపచేసిరి. విజ్ఞాన చంద్రికా మండలి సంపాదకులు – లక్ష్మణ రావుగారును, ఆంధ్ర యూనివర్సిటీ వైస్-ఛాన్సెలర్ రామలింగా రెడ్డి గారును, యూనివర్సిటీ తరఫున సాంకేతిక పదముల గూర్పు నేర్పఱచిన సంఘ సభ్యులు, జయంతి రామయ్య పంతులుగారును అందరు నొకేవిధమున 'పప్పులో కాలువైచి'రని వ్రాయుటకు సంతాప మగు చున్నది. వీరేశలింగముగారు జ్యోతిశ్శాస్త్రమును (Astronomy), శరీర శాస్త్రము (Physiology) ని రచించిరి. పంద్రెండు రాసులను గూర్చి వ్రాయుచు వారు మేషం = మేక అని వ్రాసిరి. మేషము 'మేక కాదు' గొఱ్ఱె పొట్టేలు. మేకకు, గొఱ్ఱె పొట్టేలుకు భేదము ప్రతి పల్లెటూరి కుఱ్ఱవానికి తెలిసినదే. Capricorn అనగా మేక, అజము. అజవీధి కూడ పురాణ ప్రసిద్ధము. మేక మకరమైనదనియు, ఆ మకరమే గజేంద్రుని పీడించినదనియు భాగవత పురాణము ఖండించి తెలుపుచున్నది. వీరేశలింగముగారికి పురాణ మనగానే చిందులు త్రొక్కునంతటి కోపము కలుగుటయు, అంతటి పండితుడు, మేకకు పొట్టేలుకు భేదము తెలియక, మేషమనగా మేక యని తెనింగించుటయు తెనుగు జాతి దౌర్భాగ్యము. లక్ష్మణరావుగారు Oxygen ను ఆమ్లజని యని తెసగించిరి. అదియును శుద్ధ తప్పే; ఆమ్లము లన్నిటిలో ఆక్సిజను లేదు; ఉండదు. Carbon-di-Oxide ను కర్బనద్వ్యామ్లజనిత మనుట విద్యార్థుల శిరములపై దుడ్డెత్తివైచునంతటి బాధాకరము. ఇక రామలింగారెడ్డిగారు – ఆంధ్ర యూనివర్సిటీవారి పోటీలో గెల్చి బహుమానార్హుడని ప్రకటింపబడిన గ్రంథకర్త – Air-pressure అనుటకు 'గాలి పోటు'ను పదము వాడెను. అది విని రెడ్డిగారు – "పోటా? పోటన్నారా? మరొక మంచి సంస్కృత పద మేదైన ఎంచివేయలేక పోయినారా?" అని ప్రశ్నించెను. "ఏమండి?

పోటు – రెండక్షరముల తెనుగు మాట. ఇంగ్లీషు "ప్రెషరు" అర్థమును చక్కగా సూచింపగలదు. చూడండి! కత్తిపోటు, కలముపోటు, రోకటి పోటు, సముద్రపు పోటు, బ్రాహ్మణుల తద్దినములలో దర్భపోటు ఈ పోట్లన్నియు Pressure అర్థమును తెలుపుటలేదా? రెండక్షరముల తెనుగు 'పోటు'ను తీసివైచి సంస్కృత పదమును వేయలేను; వేయను. క్షమించండి" అనెను. కారణమేమైతేనేమి? ఆ గ్రంథము మాత్రము బైటపడలేదు. నేటికీ ప్రకటింపబడలేదు.

ఇక జయంతి రామయ్య పంతులుగారి ముచ్చట చూతము. ఆయన బి.ఎ., బి.ఎల్. పరీక్షలు ప్యాసయి ప్రెసిడెన్సీ మేజస్ట్రీటు 'ఉద్యోగం చెలాయించారు.' సైన్సు పుస్తకాలలో ఇంగ్లీషు పద ప్రయోగం చేసినవారిని నరికివైచునంతటి సంస్కృత పక్షపాతి. "రాజమహేంద్రవరంనుంచి తమరు చెన్నపట్టణం చేరుకోవలెను. ఇంగ్లీషు పదం ప్రయోగించక మీ ప్రయాణమును వర్ణింపు"డనగా ఆయన యిట్లు సెలవిచ్చినారు. "నివాస గృహంబు నెదుట రాజమార్గమున నశ్వశకటంబు నధిరోహించి (వారు రోడ్డు అనరు; జటకా బండి అనరు) అయోమార్గస్థానంబు జేరి (రైలు స్టేషను అనరు) ప్రయాణపు చీటింగొని (టికట్ అనరు," ఈ వరుసను ఎవరు ఎంత కాలము నేడు మాటలాడగలరు? ఇక వారి మోటారు ముచ్చట మరియు వినోదకరము "చూచారూ! ఈ మోటారన్నది ధూమ శకటమూ కాదు; జంతు శకటమూ కాదు. కాబట్టి కారును నిర్ధూమ, నిర్జంతు శకటము అనదగును" అని సెలవిచ్చిరి. "మరి బస్సును ఏమనవలెను?" "నిర్ధూమ నిర్జంతు మహాశకటము" "లారీనో?" "నిర్ధూమ నిర్జంత్వతిశకటము."

ఈ పద కల్పనము, దీర్ఘ సమాస ధాటి, ఇవి యెవరికొరకు? ఎందుకొరకు? అని నేను సవాల్ చేయుచున్నాను. సంస్కృత పక్షపాతులైన దేశాభిమానులందరును విజ్ఞాన మభివృద్ధి నొందకుండ అడ్డకట్లు వేయువారేగాని, దానిని సుగమము, సుకరము చేయువారు లేరు. ఆక్సిజనును అమ్లజని యనవలెనో, ప్రాణవాయువనవలెనో తేల

లేదు. Oxygen ప్రాణవాయువైన Oxidation ప్రాణీకరణ మగునా? Reduction కూనీ యగునా? సమానార్థకములైన దేశభాషా పదములు లేనపుడు ఇంగ్లీషు పదముల నట్లే వాడినచో నేమి ప్రమాదము? ఏమి కొంప మునుగును? మూడు యూనివర్సిటీలు ఆంధ్రప్రదేశ ప్రభుత్వము, ఎన్నాళ్లు ఎన్నివిధముల యత్నించినను, తెనుగు ప్రజల నోళ్ళ నుండి "రైలు, స్టేషను, టిక్కట్టు. కారు, బస్సు, లారీ, నోటీసు, అపీలు" మొదలగు నింగ్లీషుపదజాలమును వెడలగొట్ట గలరా? లేరు; లేరనుట సిద్ధము. ఈనాడు మన జీవితము (1) సంస్కృత వాఙ్మయము (2) తెనుగు వాఙ్మయము (3) ఇంగ్లీషు వాఙ్మయము (4) హిందీ భాష (5) ఉర్దు భాష వీని కన్నింటికి గురియై, వీని ప్రభావమునకు లోబడుచున్నది. ఈ భాషా పదములలో నిజమై, అర్థవంతమై, అల్పాక్షరయుతమై, నిరాక్షేపణీయమై, మిక్కిలి ప్రయోజనకారులగు పదముల నేరి శాస్త్రీయ పరిభాష నేర్పరుచుకొని అందులో వైజ్ఞానిక గ్రథములను రచింపవలెను. అవసరమైనపుడు అన్యభాషాపద ప్రయోగము ఆక్షేపణీయము గాదు. అప్పకవి మొదలగువారు వ్యవహార హాని సంభవింపకుండ రక్షించుకొనుటకు అన్యభాషాపద ప్రయోగము సంగీకరించిరి. మనమేర్చుకొను పదజాలము ముఖ్యముగా అర్థవంతమై, అల్పాక్షరయుక్తము కావలెను. భాషాభిమానులును, విద్యాధికారులును ఇంతవఱకు సంస్కృత పక్షపాత దోషముచేత నేలవిడిచి సాముజేసిరి. ఫలితము దేశములో విజ్ఞానాభివృద్ధి లేదు. ఎదుగు-బొదుగు లేక 50 ఏండ్ల క్రిందట ఎట్లు న్నామో నేడు నట్లే యున్నాము. విజ్ఞాన చంద్రికవారి సైన్సు గ్రంథములు, ఇంగ్లీషు రానివారికి బోధపడవు; ఇంగ్లీషు వచ్చినవారికి వాని యవసరము లేదు. ఈ యేబదేండ్ల యనుభవమును మనస్సున నాటించుకొని ప్రత్యేకముగా నొక భాషమీద అభిమానము విడచి అల్పాక్షరయుక్తము, అర్థవంతము నైన పదము ఇంగ్లీషైనను సరియే వాడుక చేసికొని, త్వరగా వైజ్ఞానిక గ్రంథములను తెనుగులో వెలయించుకొని పురోభివృద్ధి గనుచు, ఆంధ్రాభ్యుదయము సాధించవలెను. ఎల్లకాల మింగ్లీషు దాసులమై ఇంగ్లీషు చదువుచు,

జీవితకాలములో విశేష భాగ మింగ్లీషు పఠనమందే గడపవలెనా ? కంబళిని మనమెప్పటికి వదల్చుకోలేమా ?

వీరేశలింగముగారు శాస్త్రీయ గ్రంథములు రచించిన తరువాత ఆచంట వేంకటరావుగారను సాంఖ్యాయన శర్మగారు 'రహస్య దర్పణము' రచించిరి. అందులో వారు క్రిమి కీటకాది సూక్ష్మజీవుల జీవన క్రమము, అవి చేయు నద్భుత కార్యములు, నానాజాతుల జీవుల స్వభావములు, తరుగుల్మలతాదుల విచిత్ర చర్యలను, సులభ శైలిలో చక్కగా వివరించిరి. విషయము క్రొత్తది; పరిభాష ఏర్పడలేదు; అయినను, వారి భాష, ఎరువు తెచ్చుకొనినట్లు గాక సజీవము, రసవంతము నై ముదావహముగా నున్నది. శర్మగారు విశాఖపట్టణములో కొంతకాలము—'కల్పలత' యను పత్రికను నడపినారు.

రెంటాల వెంకటసుబ్బరావుగారి 'మర్మ శాస్త్రము' రమణీయమైన శాస్త్రగ్రంథము. ఇందు జననమర్మములు, బాలపోషణ మర్మములు, ఆయుర్వృద్ధి మర్మములు, దాంపత్యమర్మములు, సంభోగమర్మములు, మనోమర్మములు నను నా రధ్యాయములు గలవు. అందరును చదువవలసిన చక్కని గ్రంథము. విజ్ఞాన చంద్రికా మండలివారు పదార్థ విజ్ఞాన, రసాయన, భౌతిక భూగోళాది శాస్త్రముల ననేకము ప్రకటించిరి. తొట్టివైద్యమును గురించి, 'లూయి కునేహ్నె' గారు రచించిన ఇంగ్లీషుగ్రంథము తెనిగించగా అందు విశ్వాసముగలవా రనేకులు ఆస్నానములు చేయుచున్నారు.

విజ్ఞాన చంద్రికా మండలివారి సంకల్పము మంచిదే. అయినను వారి పద్ధతి "Rigging themselves up in imagined equivalents"—పాశ్చాత్య గ్రంథకారుల సాంకేతిక పదములకు సమానార్థకములైన పదజాలము కల్పించుకున్నామని చంకలు గ్రుద్దుకొనుచున్నారు"గాని, వారి శ్రమ యంతయు 'నిరర్థక ప్రయాసమ'ని తేలినది. తెనాలిలో నొక గ్రంథప్రకాశకు లొక విశ్వకోశమును పెక్కు సంపుటములలో ప్రకటించిరి. ఆంధ్రప్రభుత్వము వారి యాజమాన్యమున మద్రాసు యూనివర్సిటీ సెనేటు బిల్డింగ్సులో విజ్ఞాన సమితివారును విజ్ఞాన సర్వస్వమును ప్రకటించుచున్నారు. వాని ప్రయోజనము భవిష్యత్తు నిర్ణయింపగలదు.

## 10. వాద ప్రతివాద మూలకమగు వాఙ్మయము, విమర్శనలు

## (Controversial Literature ; and Literary Criticism.)

ఒకరు ఔనన్నది మరొకరు కాదని యాక్షేపించుట ; అందుపై దుమ్ము రేపి, వాదప్రతివాదములు, రాద్ధాంత సిద్ధాంతములు గావించుకొనుట మన దేశములో పరిపాటి యైనది. అట్టి వివాదాంశములను మూడింటిని మాత్రమిట నుదాహరింతును.

(1) నన్నెచోడకవి కాలనిర్ణయము (2) పోతరాజు నివాసస్థానము (3) గ్రామ్య గ్రాంథిక భాషా వివాదము. ఇందు మొదటిది నన్నెచోడకవి కాల నిర్ణయ వివాదము. దీనినే ముందిచ్చట చర్చింతము.

### 1. నన్నెచోడకవి కాల నిర్ణయము

నన్నెచోడుని కుమారసంభవము 1909 లో తొలిసారి ముద్రితమయ్యెను; గ్రంథ సంపాదకులైన మానవల్లి రామకృష్ణకవిగారు నన్నెచోడుడు నన్నయకు ఒక శతాబ్దము ముందువాడనిరి. రావు బహద్దర్ వీరేశలింగముగారు, కొమర్రాజు లక్ష్మణరావుగారు, జయంతి రామయ్యపంతులుగారు కవిగారి వాదము నంగీకరింపక చోడుడు నన్నయ్య తరువాత వాడనిరి. తెనుగు కవులు, పండితులు రెండు తెగలైరి. నడకుదుటి వీరరాజుగారు, వెంపరాల సుబ్రహ్మణ్యముగారు ప్రభృతులు రామకృష్ణకవిగారి పక్షము నవలంబించిరి. ఈ వివాదము మన దేశములో నలుబదైదు సంవత్సరములు రేగినది. తుదకు శ్రీ దేవరకొండ వెంకటకృష్ణారెడ్డిగారు ఉభయులు సమకాలీనులే నని, గ్రంథములో గల గూఢార్థ పద్యముల వివరించి, విశ్వాసార్హములగు నితర యుపపత్తులను చూపించిరి. ఈమధ్య భారతిలో ప్రకటింపబడిన డేగలమూడి శాసనము ఈ నిర్ణయమునకు ఉపబలముగా నున్నది. వీనితో నీ వివాదము చల్లారినది.

### 2. బమ్మెర పోతరాజుగారు ఓరుగల్లువారా ? ఒంటిమిట్టవారా ?

ఈ వివాదము నన్నెచోడునికాలమట్లు దీర్ఘకాలము సాగలేదు. వెంటనే చల్లారినది. శ్రీమద్రామాయణమును వాల్మీకమునుండి, యథామూలముగా, నిర్వచనముగా తెనిగించిన వావిలికొలను సుబ్బా

రావుగారు ఆ గ్రంథమును ఒంటిమిట్ట కోదండరామస్వామివారి కంకితము చేసి సాపత్యముకొఱకు, బమ్మెఱ పోతరాజుగారు కూడ ఆ కోదండ రామమూర్తివలననే భాగవతాంధ్రీకరణకు నియోగింప బడిరని వ్యాసము వ్రాసి 1919 ఆంధ్ర పత్రిక సంవత్సరాది సంచికకు పంపిరి. కవుల చరిత్ర ద్వితీయ భాగమును సవరించి పెంచి వ్రాయ దలచి చెన్నపట్టణమున కరుదెంచియున్న వీరేశలింగముగారు ప్రతి వ్యాసము వ్రాసి, ప్రూఫులు దిద్దియిచ్చి, అప్పటికే దారుణమైన ఇన్‌ఫ్లూయంజాతో బాధపడుచున్నవారై ఆ శ్రమకు తట్టుకోలేక ఆ రాత్రియే మరణించిరి. తరువాత ఈ వివాద మరల తలయెత్తలేదు.

3. గ్రామ్య — గ్రాంథిక భాషా వివాదము :

గ్రామ్య గ్రాంథిక భాషా వివాదము మన దేశములో తల యెత్తక పూర్వము, బహుకాలమునుండి కఠిన గ్రంథముల అంశములు, కథలు లోనగునవి సామాన్య ప్రజకు సులభముగా బోధపడుటకును, వినోదకల్పన నిమిత్తమును వ్యావహారిక భాషలో రచింపబడిన గ్రంథ ములు మన తెనుగుదేశమునం దంతటను వెలయుచుండెను. దక్షి ణాంధ్రదేశమునందు నాయక యుగములో ఈ గ్రంథములు విశేష ముగా వెడలినవి. ఉత్తరాంధ్రదేశములో కూడ అనేక మతగ్రంథ ములు, వాని యర్థతాత్పర్యములు లోనగునవి వ్యావహారిక భాష లోనే రచింపబడినవి. భారతము లక్ష్మీపతి సోమయాజులుగారి భారత వ్యాఖ్యానమంతయు వ్యావహారిక ఆంధ్రమునందే కూర్పబడి నది. క్రీ॥ శ॥ 1850 ప్రాంతమువఱకు పరవస్తు చిన్నయ్యసూరిగారు మద్రాసు ప్రెసిడెన్సీ కాలేజీలో ఆంధ్ర పండితులుగా ప్రవేశించుదాక దిన పత్రికలు, వార పత్రికలు, మాస పత్రిక లన్నియు వ్యావహారిక ఆంధ్రమందే నడుపబడెడివి. సూరిగారు బాలవ్యాకరణము, నీతి చంద్రిక ప్రకటించువఱకు వ్యవహారికాంధ్రము 'నిరాటంకముగా' వ్యాప్తిలో నుండెను. కాని నాటినుండి మాత్రము స్కూళ్లు, కాలేజీలు మొదలగు విద్యాస్థానములనే గాక, పత్రికాకార్యస్థానముల కూడ నాక్రమించుకొని, వ్యావహారిక భాషకు తావు లేకుండచేసినది.

క్రీ॥ శ॥ 1909 ప్రాంతములో గురజాడవారు తమ కన్యాశుల్క నాటకమును సవరించి పునర్ముద్రణము గావించిరి. గిడుగు రామమూర్తి

గారు, శ్రీనివాస అయ్యంగారు, యేట్సు దొరగారు, సెట్టి లక్ష్మీ నరసింహముగారు మొదలగు సంస్కర్తలందరు ఏకమై అటుపై విద్యాబోధయు, ఆంధ్రమున వచన రచనయు పరవస్తు వారి కృత్రిమ, కల్పనాశైలిలోగాక వ్యవహారిక ఆంధ్రములోనే జరుగవలెనని పట్టు బట్టిరి. వ్యావహారిక ఆంధ్రమునకు Modern Telugu క్రొత్త తెలుగని పేరు పెట్టిరి. చినికి చినికి గాలివాన మద్రాసు యూనివర్సిటీలో కమిటీలు ఎత్తులు, పైఎత్తులు చాల గొడవలు పెరిగినవి. తుదకు వేదం వేంకటరాయశాస్త్రి, లక్ష్మణరావు, గురజాడ అప్పారావుగార్లు సబ్ కమిటీగా నేర్పడిరి. "క్రొత్త తెలుగంటే ఏఁవిటో" గ్రామ్యవాదులకే స్పష్టము కాలేదు. శాస్త్రిగారు, లక్ష్మణరావుగారు ఏకమైరి. అప్పారావుగారు ఒక్కరై పోయిరి. తుదకు 'క్రొత్త తెలుగనేది ఏమో స్పష్టము కాలేదని' యూనివర్సిటీవారు గ్రామ్య వాదుల వాదము నిరాకరించిరి. ఆ దినములలో బుర్రా శేషగిరిరావు గారు విమర్శాదర్శ ప్రకటింపగా ఆ గ్రంథముపై పానుగంటివారు ప్రతి విమర్శ ప్రకటించిరి. పానుగంటివారి విమర్శనా చాతురికి దృష్టాంతముగా అందు కొన్ని వాక్యముల నుదహరింతును :

"గ్రామ్య భాష వాలకము — గుఱ్ఱము గాదు, గాడిద కాదు, దిక్కుమాలిన కంచరగాడిద వాలకము. నోటిలో సిగరెట్టు, నెత్తి మీద శతకోపము" ఏమంటే "వ్యావహారిక భాష అన్నది . కేవలమూ సంభాషణ కాదు; దానికి దగ్గరగా వుంటుంది. వ్రాసే విషయమును పట్టి, కావ్యభాషలో ప్రయోగములు యెక్కువగా దూరి, వొకప్పుడు వ్యావహారిక భాష కావ్యభాషను పోలవచ్చును; మరొకప్పుడు సంభాషణ భాషవలె కావచ్చును" అని శేషగిరిరావుగారు గ్రామ్యభాషయొక్క నిజమైన సాంప్రదాయమును సెలవిచ్చినారు. "వెనుకనుండి చూచిన సాహెబు, ముందునుండి చూచిన నాతాని" "ముండా ముత్తైదువ కాని క్రొత్త భాష."

ముందు మాట :— Foreword అనే ఇంగ్లీషు మాటకు తలకు తల తోకకు తోకగా నుద్భవించినది; కాని నిత్య వ్యవహారములో

"ముందు మాట" అంటే—భవిష్యత్తున జరిగించవలసిన కార్యక్రమం అనే అర్థంలో వాడుక చేస్తారు. నిష్ప్రయోజనములగు ఇట్టి పదములను మక్కీకి మక్కీగా, విపరీతార్థముల నిచ్చునట్లు ఆంధ్రీకరించి భాషలో చేర్పవలదని మా మనవి. కొన్ని మచ్చులు చూడతగును:

"Solve the riddle of Life" = "జీవ సమస్యను విడకొట్టుట."

"Opinion from the Chair" = "కుర్చీనుండి బయలుదేరిన అభిప్రాయము" కుర్చీనుండి అభిప్రాయములు బయలుదేరవు—నల్లులు కావలసినన్ని బయలుదేరగలవు.

"I second you" = "నేను ద్వితీయించుచున్నాను."

"Function of the Ear" = చెవి చేయు 'పని'. ఈ మాటను ఒక దాసీమనిషి, ఒక క్షౌరకుడు చమత్కారముగా ఆక్షేపించిరి: "(1) సెవుకూడా పనిచేస్తదా? ఏంజేస్తది? కసు వూడుస్తదా? కల్లాపు సల్లుద్దా? అని ప్రశ్న చేసినది; (2) సెవుకూడా మాలాగ, మంగలోళ్ల పని సేస్తదా? ఏటో పాణం లేని పెట్టె పాడుతది, సెవుకు మాటలు, మరలు తగిలిస్తె గెడ్డాలు గీసి, బుఱ్ఱలు గొరిగేస్త దేమో? తెల్లోడి మాయ, ఎంవయినా సేయించగల్డు."

కాబట్టి Newman మహాశయుడు చెప్పినట్లు—ఒకరి మనోగతాభిప్రాయమును చక్కగా విశదముచేయగలుగుట, మానవులు చేయగల పనులన్నిటిలోను కష్టాతి కష్టమైన పని. ఒక భాషాపదములలోనే ఇంత కష్టమున్నపుడు ఇంగ్లీషులో ఆలోచించి, ఇంగ్లీషు మాటలను తలకు తల తోకకు తోకగా తెనిగించి, తెనుగు సాంప్రదాయమునకు విరుద్ధముగా వ్రాయకూడదని విన్నపము. తెనుగు తల్లి పిల్లలమైన మనము ఆ తల్లి భాషయొక్క పారిశుధ్యమును, సాంప్రదాయములను సంరక్షించి సేవించుటకు పాటుపడి ఆమెను గద్దె నెక్కింప యత్నము చేయవలెను. అంతేగాని—"తేగలు నములుటకు మడికట్టవలెనా? తెనుగు భాషకు సాంప్రదాయము చూడవలెనా?" అని యీసడించుట భాషాద్రోహమని విన్నవించి, ముగించుచున్నాను.

# అనుబంధము

"ఆంధ్ర కవితా గౌరవజన మనోహారి నన్నయసూరిం" గూర్చియు, నాతని వచన రచనా విశేషములం గూర్చియు, నీవఱకే కొంతప్రస్తావించి యుంటిని. ఇక, 'హరి హర పదారవింద వందనాభిలాషి' తిక్కన మనీషింగూర్చి యించుక ప్రశంసింపవలసియున్నది.

నన్నయభట్టారకుడు, జగద్ధితమును, కవీంద్రుల మెప్పును నభిలషించి, 'ఇతరుల నక్షర రమ్యత'తో బ్రీతులం జేయనెంచి; భారతము నాంధ్రీకరించెను. కాని అందు మూడు కృతులు మాత్రమైన పూర్తి గాకుండనే ఆ మహితాత్ముడు స్వర్గ ప్రాప్తుడయ్యెను. ఆంధ్ర భారతీకరణము, అసంపూర్ణముగానే, సుమారు రెండు శతాబ్దము లుండి పోయినది.

తిక్కన సోమయాజి బాల్యమాదిగా కావ్యరసమును గొనియాడు చుండిన శేముషీ ధురంధరుడు. జనుల కారాధ్యమగు పారాశర్యకృత పంచమవేదముయొక్క గౌరవ ప్రాశస్త్యముల నూహించి తెనుగు బాసలో నిర్మించుటకు తిక్కన — ఉత్సహించెను; అట్లు తెనింగించుట భవ్యపురుషార్థ తరుపక్వఫలము. ఆ దివ్య కావ్యమునకు — కృతిపతిత్వ మర్థించువాడై — తిక్కనకు ఇష్టదైవమైన హరిహరనాథుడు స్వప్న సాక్షాత్కార మనుగ్రహించెను. భయ భక్తి సంభ్రమములతో పునః పునః ప్రణామము లాచరించి, తిక్కన "జన్మాంతర దుఃఖములు తొలగజేసి సుఖాత్ముఁ జేయుము" అని యా దేవ దేవుని వరమర్థించెను; 'జనన మరణాది సంసార దుఃఖములకు నగపడకుండ నిమ్మైన దెసవుగను వెలుగు నీకిచ్చితి'నని వరమిచ్చి హరిహరనాథు డంతర్హితుడయ్యెను.

పిమ్మట తిక్కన మేల్కాంచి తన స్వప్న వృత్తాంతమును తలచి తలచి, తరచి తరచి మననము చేసికొనెను. విడువక ఎంతో ప్రొద్దిట్లు జిజ్ఞాస చేయగా, చేయగా ఆ మహనీయుని మనో వీధిని ఆంధ్రజాతి స్వరూపము గోచరించెను. భగవంతుడు తిక్కనకు, మహోత్తరమగు

కవితా సామర్థ్యము ననుగ్రహించినాడు. ఆ శక్తి సామర్థ్యములను స్వజాతి యగు నాంధ్రావళి నుద్ధరించుటకే వినియోగించి, ఆంధ్రులను సమోన్మాదభరితాంతః కరణులను జేయగలుగుటే తన జన్మయొక్క పరమ ప్రయోజనమని తిక్కనకు స్పష్టమయ్యెను. తలపోసి చూడగా భారత పుణ్య ప్రబంధమును, హరిహరనాథ దేవతా సన్నిధానమున 'తెనుగున ప్రశంసించుట' ఒక ఆరాధన విశేషమని గూడ తెల్లమై అతని సంకల్పము మిక్కిలి దృఢపడెను. బంగారములో రత్నము పొదిగినట్లు ఆంధ్రీకృత భారతము ఆంధ్ర జనాభ్యర్చితమై నిరుపమాన శోభతో ప్రకాశింపగలదు. అట్టి యుత్తమ కావ్యమును రచించుట చేత తిక్కన జన్మ ధన్యమై ఆతని పుట్టువు కృతార్థతంబొరసి పుణ్య చరిత్రుడు కాగలడను మహోత్సాహము పొంగి, పొరలి యతనిని పరిప్లావితుని గావించెను.

అనంతర మా మహాకవి — 'సాత్యవతేయ సంస్మృతి శ్రీ విభవా స్పదంబైన చిత్తముతో 'మహాకవిత్వ దీక్షావిధి నొంది, నిర్వచన రచనా బింకము సడలించి, పరిత్యజించి పద్యగద్యాత్మక మగు చంపువు రూపమున తిక్కయజ్వ 'ఆంధ్రావలి మోదముం బొరయునట్లు' భారతమును తెనిగించెను.

తిక్కన రచించిన భారతములో — మూడింట నొకపాలు వచన రచన గలదు. నన్నయవలె సంస్కృత పదములను, సంస్కృత మర్యాదలను, సంస్కృత సాంప్రదాయములను తిక్కన తాను రచించిన భారతములో ప్రయోగించలేదు. తన తెనుగుతనమునే వీలగు నంతవఱకు ప్రకటించెను సర్వసామాన్యమైన దేశకాలములనెడి సంస్కృత ద్వంద్వ సమాసము కూడ వాడుట కిష్టపడక (విరాట 4—221) లో "నేల ప్రొద్దెఱింగి" అని వాడినాడు. ఇందు 'నేల'అను తెనుగుపదమునకు దేశమనియు ప్రొద్దనగా కాలమనియు అర్థము. ఇట్లు అచ్చ తెనుగు పదముల నేరి వీలగు తావులలో ప్రయోగించుట యందే తిక్కనకు మిక్కిలి కన్ను. తిక్కన రచనలు నన్నయ వాక్యము లంత మృదులములు గావు; నాచనసోముని యంత మధురములు

గావు; పోతన వాక్యములంత సంతస గలవి కావు; శ్రీనాథుని వాని యంత పటువులు గావు; కాని, వాని యన్నిటికంటె గుత్తమైన బిగి గలిగి, అర్థసుభగములై, భావోద్దీపకములై, రసానుభవసామ్రాజ్య మును విజృంభింప జేయుచుండును. సమాస ధాటిగాని, పటుపదా టోపముగాని లేక సర్వసామాన్య పదములనే వాడి చట్రాతినుండి సలి లముల నుత్పాదింపగలట్టి అసాధారణ ప్రజ్ఞకలవాడు తిక్కన. అందుకు రెండు ఉదాహరణములు మాత్రము దిగువ నిత్తును :-

(1) జూదమున నోడిన పాండవులు, అరణ్యవాసము నజ్ఞాతవాస మును ముగించి, సంధికుత్సహించి శ్రీకృష్ణునిచేతనే రాయబార మంపిరి. దుర్యోధనుడు ఈషణ్మాత్రము చలింపక "వాడి సూది మొన మోపిన యంత నేల యైనను పాండవుల కివ్వనుగాక ఇవ్వను. చేతనైనపని చేసుకోండి పొండి" అని నిరాకరించినాడు. గత్యంతరము గానక పాండవులు యుద్ధసన్నాహములు గావించుకొని, కురుక్షేత్రము నకు వెడలుచు, ప్రయాణ భేరి సరవంబంచిరి. అమ్మహాధ్వనికి కారణ మగు ఘోర భాంకారమునకు నిలకడ దక్కి లోకమంతయు నెట్లు సంక్షోభించెనో సామాన్యమగు తెనుగుపదములతో తిక్కన అద్భుత ముగా వర్ణించినాడు. చూ. ఉద్యోగ 4-116 :-

(1) బీరెండ తాకునకు బీటలువారి పచ్చిగోడలు పగులునట్లు దిక్కులు పగిలినవి.

(2) కాగి కళపెళ మరుగు యెసరుల పోలిక సప్త సముద్రములు తిరగబడినవి.

(3) గాలివాన వేళ నావకెత్తిన తెరచాప విధమున మిన్నంతయు బూరటిల్లినది.

(4) వజ్రపాత భీతిచేత వణకుచు గోలున నేడ్చు చందమున కుల పర్వతములు గడ గడ లాడిపోయినవి.

(5) భూమండల మంతయు కుమ్మరసారెలాగున గిర గిర తిరిగి పోయినది.

(6) సర్వ భూతములు నిశ్చేష్టితములై ప్రమాస్పడి నిలిచినవి.

మట్టిగోడలు, మొసళ్ళు, తెరచాపలు, కుమ్మర సారె మొదలగు సర్వసామాన్య పదములనే రచనలో వాడి మహాద్భుత రసోత్పత్తి కలుగచేయుట మన తిక్కన కవిబ్రహ్మకే చెల్లినది.

నేనివ్వదలచిన రెండవ ఉదాహరణము భారతములోని శల్య పర్వమందున్నది. చూ. శల్య 2-328. తొడలు విరిగి పడిన దుర్యోధనుడు శ్రీకృష్ణు నాక్షేపించి, పాండవుల దుర్ణయంబునకు కారకుడవు నీవేనని నిందించి యడ్డమైన మాటలాడెను. అందుకు ప్రత్యుత్తరముగా శ్రీకృష్ణుడిచ్చిన సమాధానము వక్తృత్వ సామర్థ్యమున సాటిలేని మహోపన్యాస మనదగియున్నది. దాని నిట వ్రాయుచున్నాను.

"కపట శూర, సుచరితదూరా" అని దుర్యోధనుండు దూఱెను.

శల్య. 2-328: అనిన విని యచ్యుతుండు అతని సనలోకించి నీవు బాలుని భీముని బాములం గఱిపించియు, విషంబిడియు, నీటం ద్రోచియుం బలుమాఱుం జంప దెగితివి; గొంతియు గొడుకు లేవురును నిద్రించు సమయంబున జతుగృహంబు దహించితివి; ధర్మోత్తర చరిత్రుండగు నజాత శత్రుసంపదలఁ గపట ద్యూతంబున నపహరించి తంతదనివింబోక, యాజ్ఞసేని, నేకవస్త్ర, రజస్వలం గొలువులోపల భంగపెట్టి తాప్రోద్ధ నిన్ను నిట్టి దురవస్థకుఁ దేరం దగియుండ నట్లు వోయి, సమయంబు నడిపి, చేసిన సకల దుష్కృతంబులు సహించిన యిప్పాండవాగ్రజుండు వనుప, నేను బుడమి పాలడుగ వచ్చిన నీ నేరమైతి; నీ నేరమి నిట్లైతి; భవదీయంబగు లోభంబునం, బాపనిశ్చయంబున, మదంబున, శాంత చిత్తులగు శాంతనవ ద్రోణులకుం బ్రాణహాని వాటిల్లె; వినుము, ద్రుపదుని తపోయజ్ఞ ప్రభావంబుల, నదియ పనిగా జనియించిన, శిఖండి ధృష్టద్యుమ్నులా భీష్మగురుల మరణంబులకుం గారణంబులు గాక తక్కుదురే? పెక్కండ్రతోడం బోరి డస్సిన సాత్యకిం జంపువాఁడైన భూరిశ్రవుం జంపకుందుమే? యనేక ప్రౌఢ యోదు లొక్కరుని, బాలు సౌభద్రుం జదివి గుంపినం బూనిన పూన్కి, నిఖిలోపాయంబుల

నెఱపక పుణ్యాత్మురాలైన పాంచాలి నరణ్యంబునం బరిభవించిన పాపాత్ముని సైంధవుని బ్రదికి పోవిడిచి, యర్జునుం డగ్నిం బ్రవేశించునే? యిన్నిత్రిపురుల చరిత్రంబులు నిర్మలంబులు; ఘోషయాత్ర నిన్ను గంధర్వులు పట్టుకొని పోవునప్పుడు నీవారెల్లం బాఱిన, నర్జునుండు నిన్ను విడిపించుట యెఱుంగవే? గాంగేయ, కుంభజ, కర్ణా, శ్వత్థామ, కృపు లుద్దామ సమగ్ర సైన్యంబులతోడ నడవ నీవు విరటుని గోవులం బట్టికొని పోవుచోట మీరందఱు దన సమ్మోహనాస్త్రంబున మూర్ఛితులైన సమయంబున నర్జునుండు నిన్నుంగాచుట యెఱుంగ రాదే? నీ వాపాదించిన పాపంబులకెల్ల మూలంబైన కర్ణునరదంబు ధరణిం గ్రుంగిన గవ్వడి వాని నేయకేల కాచికొనియుండు? నుండె నేనియు భూసుర శాపంబున నట్టైన రథంబునకు నిష్కృతి గలుగునే? కావున నన్నిచు నమయించుట నముచితంబు. యుధిష్ఠిరుండు శల్యుం దెగటార్చిన తెఱంగొప్పు; నొప్పదని యుగ్గడింపక మేలునేసితి. పాండు నందనులు పుట్టినంతనుండి నేడు దుదిగా నీయెడ ధర్మ విరోధంబాచరింపగు; కురుకులంబునకు గుద్దలిగొని, దుర్ద్యూతంబు నీవ తొడరితి, దాన నింతలుపుట్టె; పవన తనయుండు పట్టిన ప్రతిన యెఱుం గవె? గద నూరుభంగంబు నేయుదు నని పలికి – పిడికిటం బొడుచునే? యవి యెల్లను వృథా జల్పంబులు; ఊరకుండుము.’’ అని శ్రీకృష్ణుడు అసలు విషయములలో దుర్యోధనుని నోరు మూసి నిరుత్తరుం జేసినాడు.

గవర్నరుజనరల్ వారన్–హేస్టింగ్సు లంచగొండి దురాశా పరుడునై ప్రజల దోచుకొని అయోధ్య బేగముల నతి క్రూరముగ హింసించెనను నీ మొదలగు ఘోర నేరముల నారోపించి పార్లమెంటు మహాసభలో మహావక్త లాయర్ బర్కు బ్రహ్మాండమైన ఉపన్యా సము గావించుట చరిత్ర ప్రసిద్ధము. అది యెల్ల వమ్మైనది కాని దుర్యోధనునంతటి మహాపాపి లేడు ఉండబోడని శ్రీకృష్ణుని మహో పన్యాసము మన సారస్వతములో శాశ్వతముగా నిలిచి ఉండ

తిక్కకవిబ్రహ్మకుగల ఉపన్యాస సామర్థ్యము రసపుష్టిగల రచనల కూర్చు శక్తికంటె మనము తెలిసికోవలసిన ముఖ్యవిషయము మరొకటి గలదు. అదేమనగా ఆంధ్ర ప్రజానీకము ప్రత్యేక వ్యక్తిత్వము గల గొప్పజాతి యను జాతీయ భావమును గ్రహించి ప్రపంచించిన మహనీయుడు 'మొట్టమొదటి ఆంధ్ర జాతీయ కవి' తిక్కన సోమయాజి విరాటపర్వ పీఠిక హరిహర నాథుని స్వప్న సాక్షాత్కార వృత్తాంతము షష్ఠ్యంతములు జాగ్రతగా పఠించినచో పై వాక్యార్థము తేటపడగలదు. ఈక్రింది లోకోక్తుల గమనింపుడు : (1) మానవసేవయే మాధవసేవ (2) తపస్సనగా ప్రజలకు దూరముగా నిర్జన వనములో ముక్కు మూసికొని తావళములు త్రిప్పుచు జపములు చేయుటకాదు. "స్వకర్మణా మభ్యర్చ్య సిద్ధం విందతి మానవః" అని గీత విధించుచున్నది. ప్రజాహితములు లోకోపకార శీలములగు కార్యములాచరించి మానవసేవ చేయుటే కర్తవ్యము అదే తపస్సు. పాశ్చాత్య కవులుగూడ ఆ భావమునే ఇట్లు వ్యక్తము చేసిరి. "Let thy great deeds be thy Prayer to thy God." "Voice of the People is the Voice of God" ప్రజా వాక్యమే దైవ వాక్యము. దీనినే లాటిన్ భాషలో Voice of the People is the Voice of God అనే అర్థము వచ్చునట్లు — Vox populi - vox Dei అందురు. ఒకజాతి ప్రజలంతరును ఒక యంత్రములో మరలవంటివారు. గడియారములో ఎన్నో చక్రములు, మరలు చూడగలము. అందులో ఏది చేయవలసిన పని దానిదే; ఏది పని చేయకున్నను గడియార వ్యవహారము కుంటువడును. అట్లే జాతిలో వ్యక్తులును; ఎవరు నిర్వహించవలసిన కార్యభారము వారు వహించి, ఎవరి విధి వారు నిర్వర్తించ వలసినదే; నిర్వర్తించి తీరవలసినదే. ఇంగ్లండు దేశపు సమస్త నౌకాబలమునకు అధ్యక్షుడై మాతృదేశమునకు విజయ పరంపరలు చేకూర్చిన Nelson మహాశయుడు చనిపోవుచు - స్వదేశీయులకిచ్చిన అంత్య సందేశము. ఆయర్థమునే వ్యక్తము చేయుచున్నది: England expects every man to do his duty. ఆంధ్రాభ్యుదయము చేకూర్చుటకు

ఒకడు మహాకవియై చక్కని కావ్యములు రచింపగలడు; మరొకడు మహాశిల్పియై రాతికి ప్రాణము బోసినట్లు అజంతె నాగార్జున కొండలలోగల శిల్పమువంటి శిల్పము గూర్చవచ్చును; ఇంకొకడు త్యాగరాజు, నారాయణ తీర్థులవలె, మహా గాయకుడై భగవంతుని, తెనుగుతల్లిని సేవింపగలడు. శ్రీ ద్వారం వేంకటస్వామి నాయుడుగారు ఆంధ్ర దేశపు గాయక శిఖామణి యని ఖ్యాతి గాంచిరి కదా? అట్లే శ్రీ స్థానం నరసింహారావుగారు నాటక రంగమున స్త్రీ పాత్ర నిర్వహణమున నిరుపమానులని కీర్తి గడించుకొనినారు గదా? దేశోద్ధారక నాగేశ్వరరావుగారు అమృతాంజనముతో మానవుల శిరోవేదన మాన్పుటయేగాక మూడు పత్రికల స్థాపించి ఆంధ్రులలో మేధావంతుల ప్రతిభను ప్రకటించుటకు అవకాశముల కల్పించినారు. విదేశములకు బోయి కష్టపడి ధనమార్జించి మల్లాది సత్యలింగంనాయకరుగారు వంటి ధర్మపరులు పేదలపాలిట కల్పతరువు విద్యార్థులపాలిట చింతామణియై విద్యాశాలలు, ధర్మ సంస్థలు స్థాపించవచ్చును. ఇట్లే ఆంధ్రులై పుట్టినవారందరును తమ శక్తిమేరకు ఆంధ్రాభ్యుదయమునకు తోడు పడుచు నాంధ్రమాతను సేవించగలరు. అయితే స్వార్థమునకును జాతీయ భావ, దేశాభిమానములకును చీకటికి వెలుగున కున్నంత తేడా కలదు. అనగా అవి పరస్పర విరోధ భావములు. స్వార్థము గల చోట దేశాభిమాన ముండదు. దేశాభిమానికి స్వార్థము ఉండదు. శివాజి, గాంధి మొదలగువారు స్వార్థ మెఱుగని దేశాభిమానులు. వారిని చరిత్ర కీర్తించును. స్వార్థపరులు కాకులై బ్రతికి, ఊరును పేరును లేక చత్తురు. త్యాగు లమరజీవులు. పొట్టి శ్రీరాములుగారు ప్రత్యేక ఆంధ్రరాష్ట్రముకొఱకు ప్రాణత్యాగము చేసి శాశ్వత యశస్సునార్జించుకొనినారు. స్వార్థపరులగు లోక ద్రోహులు, దైవద్రోహులును అగుట సిద్ధము. "లోక ద్రోహులు నాకు ద్రోహులు సుమీ, లోక ప్రియుల్ నా ప్రియుల్" అని శ్రీకృష్ణుడే ప్రవచించెను.

కాబట్టి, ఆంధ్రులు "స్వార్థపరులై కాకి బ్రతుకు బ్రతుకుచు దేశ ద్రోహులు, జాతి ద్రోహులు, లోకద్రోహులు కాకూడదు; స్వార్థ రహి

తులై స్వధర్మము నిర్వహించుకొనుచు ఆంధ్రజాతి యందభిమానము గల్గి స్వజాతి అభ్యుదయము కోరి, ఆ జాతి స్వరూపుడగు భగవంతుని శక్తివంచన చేయక సేవించి ధన్యజీవులు కావలెను" అని తిక్కన కవిబ్రహ్మ ఆంధ్రజాతికి అమర సందేశము నొసగి, భారత పంచమవేద మును రసవత్తరముగా నాంధ్రీకరించినాడు.

మోక్షముకొఱకు మనము భగవంతుని ప్రత్యేకము అర్థించుట అనవసరము. ఏమనగా, లోకములో ఎవ్వరైన, స్వదేహ పోషణార్థము వంట చేసికొందురుగాని, బొగ్గులకొఱకు ప్రత్యేకముగా ఎవరును వంట చేయరు. స్వార్థ రహితమైన దేశసేవ ఈ వంటవంటిది. సంటకు ఫలములు రెండు. ఒకటి కడుపునిండ తిండి; రెండవది బొగ్గులు. మోక్షమీ బొగ్గులవంటిదే. వంటచేసినపుడు అప్రయత్నముగా (By-product) బొగ్గులు ఏర్పడక మానవు. స్వార్థ రహితముగా మానవ సేవ చేసినపుడు మోక్ష ప్రాప్తి సిద్ధించక మానదు. అందుకు, ప్రత్యేక ప్రయత్నము అవసరములేదు; లేదని నిరూపించుటకే "నేనిచ్చిని వెలుగులో చూచుకొమ్మ"ని తిక్కనకు సూచించి హరి హరనాథు డంతర్హితుడయ్యెను. "Do your duty properly; Duty to your Nation and Moksham will follow as a by product as a matter of Course. No special effort or boon is necessary for the attaiment of Moksha. I give you Light Divine to understand it" అని యీ సందేశ వృత్తాంతము నింగ్లీషులో ఆంగ్ల మానవ పుత్రుల నిమిత్తము వ్రాయవచ్చును. ఈ విషయ బోధకములగు మరికొన్ని వాక్యములతో ఈ వ్యాసము పూర్తి కాగలదు.

తిక్కన యజ్వ వచన రచనల మచ్చు జూచితిమి గనుక నీ దిగువ శంభుదాసుని హరివంశమునుండి రెండు వచన రచనలను; బమ్మెరవారి భాగవతమునుండి గంగావతరణ వచనమును; తెనాలి రామకృష్ణుని పాండురంగ మహాత్మ్యమునుండి ఆతని పదగుంభన సూచకములైన వచనములను; మహా ప్రతిభాశాలి, కళాపూర్ణోదయ కర్త వచన మాధుర్యమును తగుమాత్రము రుచి చూచి ఈ వ్యాసమును సమాప్తి చేయగలను.

శంభుదాసుని హరివంశమునుండి ఎత్తివ్రాసినది. ఈ 'యావుల మంద' కన్నులకు కట్టినట్లెట్లు చక్కగా వర్ణింపబడినదో పాఠకులు చూడగలరు: హరివంశము : పూర్వభాగము ఐదవ ఆశ్వాసము :

"... ప్రమోదంబున వేకువం బోకుమేసినచ్చి రోమంథన వదనం బుల విహితశయనలై సుఖయించు కదుపులలోన వేరైన పేరు పేరం బిలువం బంచతిల్లుచు, నుల్లసిత హుంకారంబులగు వదనంబులతో నున్ముఖలగు తల్లులకు నభిముఖంబులై, హర్ష ప్రతినినదంబులు వొదలం బొదులనుండి యొండొంటిం దాటుకొని కలియు బాలవత్సంబుల యుత్సవ సంచారంబుల వలనను, వెదయావుల వెనుకందగిలి, యొండొంటిం జేరనీక బలియు అంకెలం బొదివి కాలు ద్రవ్వి క్రోడాడుచుఁ బొగరు మిగిలి కఱకెక్కిన మెడలును, వలుద మూపురంబులును, వెడద వీఁపులును దోరంపు గంగడోళ్లునునై క్రాలు వృషభంబుల దర్ప వికారంబులు..."

"తల్లి చనుబాలు గ్రుక్కెడు, తక్కినవి పుట్టెడు ఒక్కటే"

డిటో. ఆరవ ఆశ్వాసము భాండీర వట వర్ణనము :

"ఒక్కనాడు యమునా పర్యంత కాంతారంబునం జరియించువా డొకర నతిమాత్ర విస్తారోదారంబును, నతిశయోన్నతి విస్ఫారంబును, ననంక్లిష్ట దర్శోదయాభిరామంబు, నపరిభావ్యస్థేమంబునై, వేదం బునుంబోలె ననేక శాఖావలంబి ద్విజగణ సేవ్యంబును, జలధరంబునుం బోలె గగనచ్ఛాదనాభోగంబును, శైలంబునుంబోలె బహు పాదప పరివేష్టితంబును, గృహస్థధర్మంబునుంబోలె నిరంతర శ్రాంత జన సమాశ్రయణీయంబును...విష్ణు వక్షస్థలంబునుంబోలె వనమాలా పరి వృతంబును...నగుచు....సర్వాశ్చర్యనిధానంబైన భాండీరాభిధానం బైన వటనాయకంబుగని—"

భాగవతము, నవమస్కంధము, పరమేశ్వర జటానిర్గత గంగా ప్రవాహ మహిమ : 230

ఇట్లమ్మహానది పురారాతి జటాజూట రంధ్రంబుల వలన దిగంబడి నిరర్గళ ప్రవాహంబై నేలకు జల్లించి నెఱసి నిండి పెల్లు వెల్లిగొని పెచ్చు పెరిగి విచ్చలవిడిం, గ్రేపువెంబడి నుఱక క్రేళ్ళుఱుకు మఱక

ప్రాయంపు గామధేనువు చందంబున- ముందఱికి నిగుడుచు, ముద్దు జందురుతోడి నెయ్యంబున గ్రయ్యనడరి చొప్పుదప్పక సాగి చను దెంచు సుధార్ణవంబు కైనడి బెంపుగలిగి .. వెలి యేనుగు తొండంబుల ననుకరించి పఱచు వఱద మొగంబులును వఱద మొగంబుల పిఱుంద నందంద క్రందుకొని, పొడచూపి తొలంగు బాలశారదా కుంభంబు లకు నగ్గలంబైన బుగ్గలును బుగ్గల సంగడంబునం బారిజాత కుసుమ స్తబకంబుల చెలువంబులందెగడు వెలి నురువులును వెలి నురువుల చెంగటనర్థోన్మీలిత కహ్లార తరుకిసలయంబులం గెలిగొను సుళ్ళును సుళ్ళకెలంకుల ధవళ జలధర రేఖాకారంబుల బాగు మెచ్చని నిఱుగ యేఱులును నేఱులం గలసి బిట్టు మిట్టించి మీఁది కెగయు దురిత భంగంబులైన భంగంబులును భంగంబుల కొనల ఛిన్న భిన్నంబులై కుప్పించి యుప్పరం బెగసి, i ముత్తియంపు సరుల వడుపున ii మల్లికాదామంబుల తెఱంగున iii కహ్లార ఖండ కదంబంబుల చెలువంబున iv నిందు శకలంబుల తేజంబున v తారకా నికరంబుల పొలుపున మెఱయుచు ముక్తికన్యావశీకరంబులైన శీకరంబులును గలిగి,... విష్ణు పదంబుముట్టి, సుమనో వికాస ప్రధానంబై ప్రధాన పర్వంబు పొలుపున నేకచక్ర బక భీమ మహాభంగ సుభద్రార్జున చరిత్రాభిరామంబై రామచిత్తంబు మెలపునం దనవారిలో జొచ్చిన దోషాచరుల కభయ ప్రదాన చరణంబై... కుమార చరిత్రంబు తేవను గ్రౌంచ ప్రముఖ విజయంబై... శమన దండంబుజాడ నిమ్నో న్నత సమవృత్తంబై వృత్త శాస్త్రంబు వడువున వడిగలిగి గణిత శాస్త్రంబు కొలదిని ఘన (cube) ఘనమూల (cuberoot) వర్గ (square) వర్గమూల సంకలిత భిన్న మిశ్ర ప్రకీర్ణ ఖాత భీష్మంబై భీష్మ పర్వంబు పెంపున ననేక భగవద్గీతంబై ... గ్రహశాస్త్రంబు పరిపాటిని గర్కట మీన మిథున మకరరాశి సుందరంబై ... దశరథ తనయు బొమ ముడి చాడ్పున సింధు గర్వ ప్రభంజనంబై ప్రభంజన తనయు గద పెట్టు మాడ్కిని సమీపగత దుశ్శాసన దుర్మద నివారకంబై ... విశ్వంభరుని శంఖంబు రూపున దక్షిణావర్తో త్తరంబై యుత్తరా

వివాహంబు చందంబున ప్రముదిత నరంబై నరసింహు నఖరంబుల భాతి నాశ్రిత ప్రహ్లాద గురు విభవ ప్రధానంబై దానకాండంబుసిరిం గామ ధేను కల్పలతా ద్యభినవంబై నవసూతికా కుచంబు పేర్మిని నిరంతర పయోవర్ధనంబై ధనదు నిలయంబు తూనికను సంభృత మకర పద్మ మహాపద్మ కచ్ఛపంబై ... సత్పవిత్ర మనోభిరామంబై ... హర తాండవంబు మేర నుల్లసితానిమిషంబై ... వామన చరణ రేఖను బలివంశవ్యపనయంబై నయశాస్త్రంబు మార్గంబున సామ భేద మాయోపాయ చతురంబై చతురాననాండంబుభావంబున నపరిమిత భువన జంతుజాల సేవ్యమానంబై మానిని యన లోతు సూపక, గరిత యన నడిచప్పుడు సేయక ముగుదయన బయలుపడక ప్రమదయన గయ్యంబారుచు బతివ్రతయన నిట్టట్టు జనక తల్లియన నెవ్వియైన లోగొనుచు దైవంబన భక్త మనోరథంబు లిచ్చుచు నంతకంతకుం గుఱిగడచి యవాఙ్మానస గోచరంబై ప్రవహించి.''*

## తెనాలి రామకృష్ణుడు

పాండురంగ మహాత్మ్యము వసుచరిత్ర తరువాత కొలదికాలము నకు రచింపబడిన కావ్యము. తెనాలి రామకృష్ణకవి సంస్కృతము నుండి తెనుగు గ్రంథములను, తెనుగునుండి సంస్కృత గ్రంథములను అవలీలగా పరివర్తన చేయగల సమర్థుడు. కావ్యధారలందు ఘనుడు; ఆశుకవిత్వమున మేటి; నానార్థములతో శైవ, వైష్ణవ పురాణముల

* మన 'తెలంగాణ' సీమను పునీతంజేసి పుణ్యభూమిం గావించిన మహనీయుడు. శ్రీరామచంద్రు నాస్థాన కవీశ్వరుడు బమ్మెఱ పోతరాజు గారి దివ్యవచన రచనలలో నిది యొకటి. ఇందలి శ్రుతిసామ్య, వృత్త్యనుప్రాస యమక ముక్తపద గ్రస్తాది శబ్దాలంకారములను, చమత్కార శ్లేషోపమ సౌరభ సంవాసితములగు నర్థాలంకార విశేషములును ప్రశంసనీయములు. అందును తుదిభాగములో స్త్రీభేద విశేషములగు మానిని, గరిత, ముగుద, ప్రమద, పతివ్రత, తల్లి మొదలగు పదముల నాశ్రయించి యున్న సూక్ష్మతర భేదముల విశదీకరించుచు ఆయా స్త్రీల లక్షణము లన్నియు గంగా తరంగిణీ ప్రవాహ గతులలో నెటు దర్శనీయములయ్యెనో వివరించిన విధానము మిక్కిలి రమణీయముగా నున్నది.

నుపన్యసింపగల చతురుడు. యాజ్ఞవల్క్య అగ్రశాఖా కోకిలము. ఈ సుకవి పదగుంభనమును, పద్యముల హారువును ప్రశస్తములని ప్రసిద్ధి గనినవి. తిక్కన సోమయాజికిని, నాచన సోమనాథునికిని హరిహర నాథు డిష్టదైవ మయినట్లే, భర్తృహరికి శివకేశవు లుభయుల యందును ఇంచుమించు సమాన భక్తి ప్రతిపత్తు లున్నట్లే, తెనాలి వారికి శివునందును, విష్ణునందును కూడ అపార భక్తి తాత్పర్యములు గలవాడు. "నటనోద్భటుడైన మహా నటుని జటాజూట మురలినం దొరగు మరుత్కటక నది" తుంగభద్ర. మృడుడు "పంచక్షరీ గుహాహార్యక్షు, భగు, విరూపాక్షు, నక్షధ్వజు, దాక్షాయణీవిభు, వళక్ష మయూఖరేఖా మకుటు" డని వర్ణింపబడినాడు. ఈశ్వర పుత్రుడగు కుమారస్వామి ఆశ్రితార్తి హారుడు; దీనజన మందారుడు; కృపా విశాలుడు; ముంగిట పెన్నిధానము; భుక్తి ముక్తి కరుడు; అసాదంబగు తదీయ ప్రసాదంబు పడయవలసినది ఏలయన నది సమస్త శ్రేయోదాయకము. అట్టి ప్రభావముగల స్కంద దేవుని పేర స్కాందంబను మహా పురాణంబు రచింపబడియె. అందు సర్వాతిశాయియైన దేవోత్తముని సమస్త తీర్థమకుటమని ప్రశంసకు అర్హమైన తీర్థరాజమును, భోగాప వర్గదాయి యగు సత్యోత్తమ క్షేత్రమును నెఱింగింప వేడెదనని కుమారుడు శివు నర్థించెను. అంతకు ముందే గౌరీదేవియు, కుంభసంభవుడు, అగస్త్యుడును అదే ప్రశ్న శివు నడిగియుండిరి. అట్టిది పండరీక్షేత్ర మొక్కటియేనని శర్వుడా క్షేత్ర మహిమ గౌరికి, నగస్త్య కుమారులకు నుపన్యసింప దొడగె. అదియే పాండురంగమహాత్మ్య కావ్యముగా తెనాలి రామకృష్ణుడు తెనిగించెను.

పాండురంగ క్షేత్రమున పుండరీకుడను పుణ్యుడును, అతని తలి దండ్రులును నివసించుచుండిరి; తలి దండ్రు లతి వృద్ధులు, శిథిల బుద్ధులు నగు జనయిత్రీ జనయితల గని ముని నడచుచు నడుగులకు మడుగు లొడ్డుచు, నడుగు నెడ 'బులి జున్నెనియుం' దెచ్చి యిచ్చుచు నిచ్చగ్రొత్త యగు మచ్చికం గచ్చువదలక గోము మెఱసి, మోమున

గాయలంగా నోపుచు, గాలోచితంబులగు నోములు నోమించుచు న ద్ధరా మర నందనుండు జగదభినందితుండై యుండి వెండియు.” 2-25.

పుండరీకుఁడు క్షేత్రమూర్తి, తీర్థమూర్తి, మూర్తిమూర్తుల యందలి యర్చాభాగంబు లెఱింగి యర్చించుచుండెను.

3. 124. నిగమశర్మ - “కొడుకు చెడు నడవడికి నడలు కడలింపం బడి సుడివడియెడు తల్లిదండ్రుల వ్యథ.

4. 16. దవదహనంబు “కురు మహీవిభుండునుం బోలె స్వగోత్ర నిర్భేదన నిపుణుండు” 142. పతివ్రత, సుశీల “తాళి విభుండు గట్టిన మొదల్ పతి దేవత యా సుశీల పెన్గోలతనంబునన్ మగడు కొట్టిన దిట్టిన రట్టు చేసినం దాళి”

149. ఆమె భర్త వట్టి కక్కుఱితి మనిషి - “శాకాయ లవణాయవా; ధూళిః పరగృహాదపి” అనునంతటి పరాన్నభుక్కు.

158. మాయా మాణవకుడు విష్ణు భగవానుడు: “నా తోడం గూడియాడు వడుగులు బడుగులయ్యును, వడిచెడక, కడక మెఱసి.” 166. తైర్థికులు పెళుచులండ్రు. 179. కుహనా వటుడు తిన్నిన పిండివంటలు: “సజ్జన వితరణంబుల గతి సుహిత భాజన నిహితం బులును, అనురక్త వధూ హృదయంబునుంబోలె నతి స్నేహ బిచ్ఛిలం బులు, నుపవనంబుల యుపమ సురభిష్టంబులు నైన పిష్టవికారంబుల నిర్వికారుండై భూసుర కుమారుండు నిరవశేషంబుగా నాహరించి” న మాయా బాలకుని భోజన పరాక్రమమునకా పతివ్రత వెఱగంది, “నా భవబంధంబు లూడ్చనున్న నారాయణమూర్తియో” యని శంకించినది. 183. “శ్రియమిచ్ఛేద్ధుతాశనాత్” అనగా అగ్ని దేవుని మూలముగానే ఐశ్వర్యము అభిలషించవలసినది. 189. ఇట్లా సుశీల పెట్టిన దంతయు తిని, తృప్తుడై “అమ్మా! నీ విందు నెదుట శబరి విందు, ద్రౌపది విందును రుచింపవు” అని శ్లాఘించెను.

4. 237. చిలుక వృత్తాంతము: “ఈ చందంబునఁ గందర్ప స్యందనంబు వినిందితుండన మంద మంద ప్రచారంబును, మలిమ్లుచుం డన దుర్గమ ప్రవేశ నిపుణంబు...దనుజ గృహీత జనకజ యన

రామానుచరణ సముచితంబును...నై, బరవధూపయోధరంబు పగిది బట్టరాక, నీతివిదు హృదయంబు గతి దూరదర్శన యోగ్యంబై... నడితెక్క గ్రిక్కిఱించుచు నొక్కయెడం గాలువాడిచి ముక్కున నక్కంఠహార తరళంబు నొక్కుచు జిక్కం జిక్క, నిక్కడ నిక్కడ, నక్కయక్క యని చేటికానికరంబు - పొలసిన బులుగెఱింగి మెఱుంగు మెఱసి తొలంగిన తెఱంగున డాయవచ్చినట్టుల మాయంబగు మాయ లేటి పాటి బోవం బోవ దూరంబగుచు నుండు నెండమావుల మాడ్కి దివి యనటించి...ప్రచుర రయంబున ఖచరపుర ప్రాసాదంబులు మోవం బూపున నెగసి తిరిగి పెఱతెరువునం బఱతెంచి పాండురంగా యతనంబు మధ్యరంగంబు సొచ్చి యచ్చట నిచ్చం దన యిచ్చనుండు దండియంబుపై వ్రాల నిచ్చట"

4. 278. చింతలన్నియు ప్రమోదు సేయని వారికి నెఱుకకు నేయూరి కేది తెరువు.

5. 166: సౌఖ్యవంతుని జీవనము:

"పరిణీతయగు నింతి ప్రతికూలకాదేని
తనయుండు తనయాజ్ఞ దాటడేని
నిజ సహోదరులు వినీతులై మనిరేని
కోడ లోరుపు దక్క గొణగదేని
కూశు రీలువునందు గొడవ చూపదయేని
ఋణమను పాతకం బెనయదేని
తేజోగరిమ పరాధీనత జెడదేని
నిందాంధకారంబు నెఱయదేని

న్యాయమున మొల్లములు పెల్లుడాయునేని
యతిథి సంతర్పణం బింట నమరునేని
సముచితాచారమును గొనసాగునేని
కలదె గృహమేధి ధర్మంబుకంటె మేలు."

5. 192. హోమధేనువు : "అతిస్నిగ్ధ . వర్ణ ముగ్ధాకృతియు, జతురపద విన్యాస ధన్యాసికయు నైన కవికవితయుంబోలె నున్న హోమధేనువునకు పథశ్రమంబు నోసరించుచు "

పాండురంగమహాత్మ్య కృతిపతి విరూరి వేదాద్రి మంత్రి.

179. "పరనారీ సహోదరుండయ్యు నితర సముపార్జిత వధూ వల్లభుడు" నని వర్ణింపబడియె. ఇందు ఇతరయనగా శత్రువులచేత, సముపార్జిత = సంపాదింపబడిన జయలక్ష్మి యనెడి స్త్రీ ప్రియురాలుగా గలవాడు అని యర్థము. ఇటువంటి హరువు, పదగుంభనము గల శైలిలో, శివకేశవ ప్రీతి పురస్సరముగా పాండురంగ క్షేత్ర మహాత్మ్యము రచించి, తెనాలి రామకృష్ణకవి తెనుగు సరస్వతిని సేవించి ధన్యుడయ్యెను.

## పింగళి సూరనార్యుడు - కళా పూర్ణోదయము

తెనుగు సారస్వతములో కవిశబ్ద వాచ్యులు ముగ్గురే కలరు. వా రెవ్వరంటేని! 1 తిక్కన 2 వేమన 3 ఈ పింగళి సూరన అని కట్టమంచివారి అభిప్రాయము. సూరనకు ముందు కాలమున పాల్కురికి సోమనాథాది కవులు బసవ పురాణాదులు రచించి వీరశైవమును ప్రోత్సహించిరి. మరికొందరు వీరవైష్ణవులు శివప్రశంస నిషేధించి కేవల విష్ణు మహాత్మ్యమును బోధింపగల గ్రంథములనే రచించిరి. శివకేశవుల నిద్దరిని పూజించి ఆరాధించువారు భర్తృహరి కాలము నుండి మన వాఙ్మయములో కనబడుచున్నారు. తిక్కన మనీషి హరిహర పదారవింద వందనాభిలాషి. నాచన సోమనాథుడు నట్టివాడే. తరువాతివారు కేవల హరిహరనాథునే గాకున్నను కొన్ని చోట్ల శివుని, మరికొన్ని చోట్ల కేశవుని ప్రశంసించి ఉభయుల యందును తమకుగల భక్తి ప్రపత్తులను వెల్లడించిరి. పాండురంగ మహాత్మ్యము పరమశివుడే పార్వతికి; బాహులేయుడు కుమార స్వామికి తెలిపిన విష్ణుక్షేత్ర మహాత్మ్యము. వీరశైవ వీరవైష్ణవ మతముల సమన్వయమునకు ఈ పద్ధతి సర్వ జనాదరణీయము, సర్వో

తక్కువ్తమునైన సమాధాన పద్ధతి. పింగళి సూరన్న గూడ శివకేశవుల నుభయులను నిష్పక్షపాతముగా పూజించిన ధన్యుడు. అతడు రచించిన ప్రభావతీప్రద్యుమ్న, రాఘవపాండవీయములు రెండును శివస్తుతితో కావ్యప్రారంభము గావించి తన లాలాటేక్షణ భక్తి శీలతను వెల్లడించుకొన్నాడు; కళాపూర్ణోదయములో విష్ణునకే అగ్రార్చన మిచ్చి, విష్ణుస్తుతితో కావ్యమును పూర్తి చేసినాడు. కళా పూర్ణోదయము నంకితము పుచ్చుకొనిన నంద్యాల కృష్ణభూపతి వైష్ణవ సాంప్రదాయము లోనివాడు.

కళాపూర్ణోదయము ఆంధ్ర భారతము వలె సంస్కృత మూలము నకు తెనుగుచేత కాదు; మను చరిత్రమువలె కథాబీజమును మరొక పురాణమునుండి గ్రహించి, దానిని పెంచి ప్రబంధము చేసినది కూడ కాదు. కేవల కవి కల్పితమైన స్వతంత్ర గ్రంథము. ఇందు కవియొక్క అసాధారణ ప్రతిభ, భావనాశక్తి, సందర్భశుద్ధి, పాత్రోచిత రచన మొదలగు సద్గుణములు చక్కగా వ్యక్తము చేయబడినవి. దోషములు కూడ లేకపోలేదు కాని, గుణాధిక్యము నెదుట దోషములు మాటు మణుగు చున్నవి. అతని భావనాశక్తికి తగిన భాషాశక్తి కూడ అతనికి కలదు. సూరనకు గల కల్పనా సామర్థ్యము తిక్కనకు తప్ప మరొక కవికి తెనుగు సారస్వతమున లేదు. శబ్దాలంకారములు అవ శ్యము అనుష్ఠేయము లని సూరన్న భావము. శ్లేషము, అంత్యప్రాస, యమకము, సంస్కృతాంధ్ర భాషాద్వయ – అనులోమ విలోమ శ్లేష చిత్రములు ఇందు కలవు. ఇందలి శైలి ప్రావీణ్యము వాచాతీతము. రాఘవపాండవీయ రచనా నంతరము శ్లేష నంతగా వాడలేదు. శ్లేష రచన యందున్న శక్తికి తగిన రక్తి కవికి లేకపోయె నేమోయని కళాపూర్ణోదయము చదివిన తరువాత తోచగలదు. ఇందలి సరస్వతీ చతుర్ముఖ విలాసము వంటి ఘట్టము ఆంధ్ర వాఙ్మయములో లేదు.

1–10 నంద్యాల కృష్ణభూవిభుని సభావర్ణనము నన్నయ వర్ణించిన రాజరాజసభను జ్ఞప్తికి తెచ్చుచున్నది. మణికంధరుని తపోవనము అహింసా జీవనమును పరిపక్వ స్థితికి తెచ్చిన కణ్వాశ్రమమును జ్ఞప్తికి

తెచ్చుచున్నది. సూరన్న యమక సహితమైన సీసములో సీవర్ణనము కూర్చినాడు.

ఇటీవల వైజ్ఞానికులు పడమట నవీనముగా సాధించిన దూరదర్శన దూరశ్రవణములను ఆనాటి నిత్య జీవనమున నుండినట్లు భావించి కావ్యము రచించుట అద్భుతావహము.

కావేరీ తీరమున "మిక్కుటంబగు వెక్కువ నుక్కుమిగులు జక్కవల చక్కదనంబును వెక్కిరించు చున్నట్లున్న... కనత్కనక కలశంబుల తోడ ద్రావిడ యువతీ వితతులు...

3. 277. బిక్కటిల్లుచు వ్రక్కలింప నొక్కరొక్కరి మిక్కుటపు విక్రమంబున పెక్కువ లెక్కగొనని యక్కజపు బేరుక్కున మిక్కిలి...

డిటో డిటో నొడ్డారించుచు గడ్డుటుకనీక యడ్డంబుగా నొడ్డుకొని యెదు...

5. 20. పురోవర్తి శాఖా సమాసంజిత సమంజస రత్న పంజరంబున నున్న నన్నుం జూచి.

6. 171. ఇట్టి విచిత్ర కవిత మీ మతులకు నిపుడు దోచునా ? – ఆంధ్ర గీర్వాణ భాషాశ్లేషా వైచిత్రి ?

6. 224. బొన్నలకు మూగుచు బొండు మల్లెలకు నేగుచు, సంపెంగలకు డాయుచు, జాతి కుడుంగంబుల రోయుచు, మల్లెలకు నిగుడుచు మరువంబులకు మగుడుచు.

7. 69. సర్వ సర్వంసహా జనజనిత జయ జయ శబ్దంబులు.

8. 111. ఖంగు ఖంగున నొండొంటిం దాకుచు దడబడు బెడిదంపు టడిదంబుల వెడలు మిణుగురుల వలనను, సాటోపంబులైన యీటెపోటులచేత గాటంపు పెల్లున జిల్లు చిల్లున వెడలు నుల్కల జ్వాలా మాలికల.

8. 125. యుద్ధరంగము ... చిందర వందరలగు నరదంబులు జినిగిన కేతువులు, జీకాకుపడు రథికులు, జదిసిన సారథులు, ద్రుంగిన యేనుంగులును, దునిసిపడిన మావంతులును, తుత్తుములైన యంకు

శంబులు, తునకలైన పరిస్తోమంబులు, పొలిసిన యశ్వంబులు, పొరలెడి రాతులును.

9. 254. కళాపూర్ణుండు తదాదిగా సత్యాదరంబున విష్ణుసేవ గావింపుచు ధర్మమార్గంబున రాజ్య పరిపాలనంబు సేయుచుండె.

## వ్యాస సమాప్త వాక్యములు

### జాతీయత

"I this infer,
That many things, having full reference,
To one consent, may work contrariously.
As many arrows loosed several ways
Come to one mark; as many ways meet in one town,
As many fresh streams meet in one sea,
As many lines close in the dials centre;
So many a thousand actions once a float
End in one purpose and be all well borne
Without defeat.

Shakespeare – King Henry V.
Act I. Sc ii, Le. 204.13.

ఆంగ్ల మహాకవి షేక్స్పియర్ శౌర్యఘనుడు కార్య శూరుడు నైన పంచమ హెన్రీ రాజ నాటకమున సందర్భోచితముగా కూర్చి చేర్చిన బంగారు వాక్యములు సర్వదా సంభావింప వలసినవి. ఈ పట్టున మనము ముఖ్యముగా స్మరింప తగినవి; కావున ఇక్కడ ఎత్తి వ్రాసినాను వాని యర్థమును ఈ దిగువ వ్రాయు చున్నాను.

విలుకాడు ఎక్కడ నిలిచి బాణ ప్రయోగము చేసినను సూటిగా వచ్చి ఆ బాణము, లక్ష్యమునకే తగులును; నదులు ఎక్కడ పుట్టి ఎలా గెలాగ ప్రవహించినను తుదకు సముద్రమును చేరుకొని అందులో కలిసి పోవు చున్నవి. పెక్కు రేఖలు గడియార ముఖ మధ్యమున ఐక్యత గనుచున్నవి. ఎక్కడి రోడ్లైనను పురమధ్యమునకే దారితీసి అక్కడ నొండొంటితో కలయుచున్నవి.

అదే విధముగా మన ఆంధ్ర వాఙ్మయ వృక్ష శాఖలు పెక్కు త్రోవలబోయి బహు ముఖముల వ్యాపించినను వాని లక్ష్యము వాంఛితము ఆంధ్రాభ్యుదయ మొక్కటే.

బృహత్కథా కాలమునాడు — నాగార్జున యుగము ప్రబలిననాడు — విజయనగర వైభవ ముల్లసిల్లిననాడు — ఆంధ్రజాతి ఆశయము ఉత్సాహముతో పొంగి పొరలినది. తెనుగు చాకళ్ళు గూడ పండువెన్నెలలో కుక్కిమంచముమీద దర్జాగా పండుకొని:

"కొండవీడు మందేరా! కొండపల్లి మందేరా!

కాదని యెవ్వడు వాదుకువస్తే, కటకందాకా మందేరా!"

అని కూను రాగములు తీసిన గొప్ప యుగమది!

తాళికోటలో దెబ్బ తినినను తంజాపురిలో తలయెత్తి మన్ననల నందినది ఆంధ్ర జాతీయత!

చరిత్ర జ్ఞాన శూన్యతచేత—తొంటి ప్రాభవమును మఱచిపోయినది; స్వ స్వరూపమును విస్మరించు కొన్నది; తనకెన్నడులేని నీచత్వమును తనకు తానే ఆరోపించుకొని గిరీశోక్తులకు గురియై తోటివారికి లోకువయై అంగచ్ఛేదమునకు పాల్పడి — నానావిధముల క్షీణించుచున్నది. కాని చింత చచ్చినను పులుపు చావలేదు. సామ్రాజ్య భాషా సారస్వత పోటీ పరీక్షలో కొక్కొండవారు — తెనుగుభాషయు, తెనుగు ప్రజలును ఉత్తమస్థాయిలోవారుగాని సామాన్యులు గా రని ఋజువు పర్చి తెనుగుతల్లి పరువుమర్యాదలు నిలిపినారు. పాలగుమ్మి పద్మరాజు గారును ప్రపంచ కథల పోటీలో ఆంధ్రుల గౌరవము కాపాడిరి.

పొట్టి శ్రీరాములుగారు ఆంధ్రజాతి అభ్యుదయము కొఱకును ప్రత్యేకాంధ్రరాష్ట్రము కొఱకును ప్రాణ త్యాగముచేసి ప్రత్యేక రాష్ట్రము సంపాదించినారు; పూర్వాంధ్ర పశ్చిమాంధ్రము లేకమై ఆంధ్ర ప్రదేశ మేర్పడినది. ఆంధ్రజాతివా రందరి మనస్సాక్కలై చక్కని కృషి సలిపిన పక్షమున నాంధ్రు లే విషయము సందును తోటి వారికి తీసిపోరు; సరేగదా మార్గదర్శకులు కూడ కాగలరని చరిత్ర తెలుపుచున్నది. మన తెనుగుతల్లిచేసిన తపః ఫలము కవిబ్రహ్మ

ఆంధ్రజాతీయకవి తిక్కన సోమయాజిగారి శాసనమును భక్తితో పాలించుచు నిటుపై తెనుగు వారందరును స్వార్థము విడిచి అందరి మనసొక్కటై చనగ ఆంధ్ర జాతియొక్క సమ్మోదాభ్యుదయములనే అభిలషించి, శక్తి వంచన చేయక ఎల్లవారు ఓపినకొలది పాటుపడిన పక్షమున తోడివారి మన్ననల నందుకొనుచు మన తెనుగుతల్లి గౌరవముగా గద్దెనెక్కి, సుఖాసీనురాలు కాదగు సుదినము త్వరలో ఆసన్నము కాగలదు.

ఈ వ్యాసము తెనుగు వచన రచనా దశాపరిణామమును గూర్చి తెలుపును; గావున నందునుగూర్చి కొలది వాక్యము లుగ్గడించి ఈ వ్యాసము ముగింతును.

బాల్యమున మాటలాడ నేర్చినది మొదలు ఆమరణాంతము ఆంధ్రజాతి స్త్రీలు, పురుషులు, బాలులు, వృద్ధులు యావన్మంది మాటలాడునది వచనమే. అందు కొందఱు హృద్యముగా కవనము చెప్పగల వారున్నారు. భరత ఖండమున తెనుగు మాటలాడు వారు నాలుగు కోట్లకు పైగా నున్నారు. అందు కవి శబ్ద వాచ్యులు. వేయింటి కొక రుందు రేమో! మన కెల్లవారికి కవులు పూజ్యులు. వారి కందరికి నా నమోవాకములు. పద్య కావ్యము మహారాజుల యింటి విందు భోజనము వంటిది. అది ఎల్లవారికిననుదినము లభింపదు. మన నిత్య వ్యవహారములో 'తదన్నతద్రస' పద్ధతిని తెనుగు వచనమునే వాడు కోక తప్పదు. ఈ వ్యాసము నందిచ్చిన యుదాహరణముల వలన దివ్య కవితా పరిమళ మిళితములైన వచన రచనలు తెనుగు సార స్వతములో చాల గలవని తేటపడగలదు.

వచన రచనకూడ ఒకకళ; బహు కష్టసాధ్యమైన కళ. దానిని సాధించుట సులభముకాదు. కవితా సామర్థ్యమునకు వచన రచన గీటురాయివంటిది. ఆ రహస్య మెఱుగనివారు కొందఱు అజ్ఞానము చేత వచన రచనలను నిరసింతురు. వచన నిరసన అవివేక కృత్యమని అనుభవము నిరూపించుచున్నది. బాల్యమున తిక్కన వచనము రచింపనని బిఱ్ఱబిగిసి కూర్చొని నిర్వచనోత్తర రామాయణము

రచించినను పెద్దవాడై సోమయాజియై మహా కవిత్వ దీక్షావిధి నొందె. భారతము తెనిగించునపుడు నిర్వచన నియమమును త్యజించి అందు మూడింట నొకపాలు వచనమే రచించెను. రావు బహద్దర్ కందుకూరి వీరేశలింగముగారు పెక్కు భంగుల యౌవనోత్సాహముతో నుయ్యాల లూగినను అనుభవము వలన వివేకోదయమై అటుపిమ్మట తన జీవితమును వచన రచనకే అంకిత మిచ్చెను.

ఈనాడు చక్కని రచనా సామర్థ్య మలవర్చుకొని 'స్వచ్ఛము జాతీయము నైన' తెనుగులో నుత్తమ గ్రంథములు వ్రాయగల దక్షులు వేలకొలదిగా వలసి యున్నారు. పాశ్చాత్య వాఙ్మయములలో బహు శాఖలలో వెలసిన ఉత్తమ గ్రంథముల సారమంతయు తెనుగుప్రజ చదువుకొని బోధపర్చుకొని సంతోషించగల విధమున తెనుగున రచించవలసి యున్నది. ప్రకృతి శాస్త్ర విషయిక విజ్ఞానము తెంపు లేకుండ పెరుగుచున్నది. తెనుగు జాతిలో ప్రపంచ గౌరవము నంద గలిగిన కవిగాని విజ్ఞాన వేత్తగాని ఈమధ్య నేటివఱ కొక్కడైన తల యెత్తలేదు. అందుకు ప్రధాన కారణము మనజాతి అధమస్థితిలో పడియున్నదను భ్రాంతి (False idea of a sense of inferiority complex). ఆ భ్రాంతి మూలముగా జనించిన అవివేకము అజ్ఞానము వీని ఫలితమైన ప్రయత్నలోపము. సోదర సోదరీమణులారా! అల్పుల మని జంకరాదు. గడ్డిపఱకలు పెంటిగా నేర్పడి మదగజమును కదల కుండ కట్టివేయగలవు. సముద్రము — నీటిబిందువులే-ఎవరి సామర్థ్యము మేరకు వారు స్వార్థము విడిచి పనిచేయ గడగినచో తిక్కనార్యుని వలెనే మీరు తరించి జాతిని తరింపజేయగలరు. మీ యుద్యమమును ఎల్లదేడు ఆశీర్వదించి మీకును మీ ఆంధ్రజాతికిని అభ్యుదయపరంపర ననుగ్రహించుగాక!

మేలు!